ఇక్కడ భూమి కృంగిపోయిన కందకాలతోను, చిన్న చిన్న మట్టి దిబ్బలతోను, చెదురుగా అక్కడక్కడ పెరిగిన పొదలతోను కూడిఉన్నది. కాని ఆ స్త్రీ ఆ కందకాలనుగాని, ఆ దిబ్బలనుగాని, పొదలకు కాసిన పండ్లనుగాని చూడటంలేదు. చిందరవందరగా యినుపముక్కలు, గుడ్డ పేలికలు, వాటి మధ్య కొన్ని నల్లని ఆకారాలు పడిఉన్నచోటికి ఆమెదృష్టి పోయింది.

రెండడుగులు ముందుకివేసి ఆమె మోకరిల్లింది. 'అదుగో అతని శవం!! [illegible]ారుగా వెల్లికిలబడిఉన్నది. నల్లరాతితో చెక్కినట్టుగా ఉన్నది అత[illegible]ఖము. అతని ముఖంలోని ప్రతివంపు తెలిసిన ఆమెకు-ఇప్పుడు ఆ విడి[illegible]న పెదవులు, మూతబడిన కండ్లు, చెదరిపోయిన ముక్కు క్రొత్తగా కనిపిస్తున్నాయి. తలలో ఒకవైపులోతైన రంధ్రము, దానిచుట్టు యెర్రగా తోరణంలాగ రక్తమూ కనిపిస్తున్నాయి.

ఆ గాయంతో బాధపడి బాధపడి, ప్రాణాలు విడిచిఉంటాడని ఆమెకు తెలుసు. ఆ నీచులు అతని గుడ్డలు ఊడదీసుకుపోతుండగా అతడింకా ప్రాణాలు విడిచేఉండడు. చావుకంటే భయంకరమైన ఆ హంతకులే అతని శవాన్ని అట్టి ఘోరస్థితికి తెచ్చారు. యుద్ధం జరిగినరోజు - అతడు చనిపోయినరోజు - నల్లటి పొగమంచు కురిసి వాళ్ళందరి శరీరాలను నల్లరాళ్ళకుమల్లె మార్చివేసింది. ఆ రోజు వారి శరీరాలమీది వస్తువులేమీ తీయటానికి అవకాశం లేదు. అయినా అతని వస్తువులన్నీ దొంగిలింపబడ్డాయి. అతని పెద్దకోటు, బూట్లు, లాగు, మేజోళ్ళు బలవంతంగా ఆ శరీరంనుండి విడదీశారు....

ఆ తీవ్రమైన చలికి ఒక పాదం చిట్లిపోయి మాంసము వేలాడుతున్నది—

నెమ్మదిగా ఆమె చేతితో శవంయొక్క భుజాన్ని తాకింది. అది కఠినంగా రాయిలాగఉంది.

"అయ్యో, బిడ్డా!...."

ఆమె యేడవలేకపోయింది. కండ్లు పొడి ఆరిపోయినై. ముఖం నల్లరాయిగా మారిపోయి - తలలో తుపాకిగుండు రంధ్రంపడి - కాళ్లపగిలి మాంసపుముక్కలు వేళ్లాడుతూ, పడిఉన్నాడు ఆమె ముద్దుబిడ్డడు! దుఃఖమంతా ఆమెకు గొంతుకలోనే పూడుకుపోయింది.

అతని నల్లని తలవెంట్రుకల్లోచేరిన మంచుని నెమ్మదిగాదులిపింది. కాని నుదుటిమీద ఉన్న అతని తలవెంట్రుకలను తాకటానికి భయపడ్డది. అతని గాయందగ్గర రక్తంతో గట్టిగాఅంటుకొనిఉన్నాయా తలవెంట్రుకలు.

ఇక్కడికి వచ్చిన ప్రతిసారి ఆ కురులనుండి మంచును దులపాలనుకుంటుంది. కాని అట్లా చేయలేకపోతుంది. అవి కదిపితే ఆ గాయంరేగి, ఆ శవానికిగూడా బాధ కలుగుతుందేమో అనుకుంటుంది !—

"నా చిట్టితండ్రీ...."

అతని నల్లని బరువైన రెప్పలువిప్పి తనవైపు చూస్తాడన్నట్టు అప్రయత్నంగా అన్నది.

కదలికలేకుండా ఆ ముఖంపైన తన చూపు నిల్పి మోకరిల్లి ఉండిపోయిందామె. తీవ్రమైన చలిగాని, మోకాళ్ళ తిమ్మిరులుగాని ఆమెకు స్ఫురించనేలేదు. చూస్తూనే ఉన్నది.

రెక్కలు రెపరెపలాడించుకుంటూ ఒక మాలకాకి వచ్చి అక్కడికి దరిదాపునఉన్న ఒక పొదదగ్గర వాలింది. రక్తసిక్తమై పడిఉన్న గుడ్డల వైపు యేదో ఆలోచిస్తున్నట్టు కొంతతడవుచూచి, నెమ్మదిగా ముక్కుతో ఆ గుడ్డలను తాకింది. చలికి ఆ గుడ్డలు రాయిలాగ కఠినంగామారిఉండటం చేత సన్నని శబ్దమయింది.

కొడుకు ముఖంలోకిచూస్తూ తన్నుతాను మరిచిఉన్న ఆమె మేలుకున్నది.

"ఇస్స్....స్స్...."

మంచు ముద్ద ఒకటితీసి కాకిమీదికి విసిరింది. కాని ఒక గంతువేసి నెమ్మదిగా యెగిరి ఒక కొమ్మమీదికి చేరుకున్నది. ఆమె లేచి, మళ్ళీ కొంతసేపు కొడుకుముఖంలోకి తనివిదీర చూచుకొని వచ్చినదారినే యేటివొడ్డుకి వెళ్ళిపోయింది.

మంచు చిట్లిఉన్నచోట యేటిలో కావడి నింపుకొని, ఆ భారంతో ముందుకి వంగుతూ, దిబ్బయెక్కింది. ప్రొద్దుబాగాయెక్కినా, యింకా మంచు దట్టంగా కురుస్తూనేఉన్నది.

ఇంటిముందు కాపలాకాస్తున్న సైనికుడు చలికి వొణికిపోతూ, అటూ, ఇటూ గస్తీ తిరుగుతున్నాడు. కొంకర్లు తిరిగిపోతున్న చేతులను వెచ్చ చేసుకోటానికి ఒకదానికొకటి రుద్దుకుంటున్నాడు. చినిగిన బూట్లలోంచి చలిదూరి పాదాలనుగూడా కొరుకుతున్నది. ఆ వచ్చే స్త్రీ 'ఫెడోసి

యాక్రావ్‌చుక్ ' అని, అతనికి బాగా తెలిసినప్పటికీ పరీక్షగా చూచి మరీ లోపలికి పోనిచ్చాడు. అక్కడక్కడ లేచే ..... సియా ' లోపలికి వెళ్ళిపోయి తలుపు బిగించుకున్నది. "ఎక్కడికి ... యింత సేపు? నన్నిలా వదిలేసి వెళ్ళిపోతావా?" అని కోపంతో ... గొంతు ఒకటి వినిపించింది.

'ఫెడోసియా ' జవాబివ్వలేదు. తనవ్యథను వెలిబుచ్చే జవాబు పైకి రాకుండా పెదవులు బిగించుకున్నది. పొయ్యిదగ్గరికిపోయి దానిమీద ఉన్న కుండలో నీళ్లు దిమ్మరించి ఆరిపోతున్న మంటను యెగవేసింది.

"దాహంగా ఉంది, ఇన్ని మంచినీళ్ళు తెచ్చిపెట్టు"

"బాల్చీలో కావలసినన్ని నీళ్లున్నాయి. కావలంటే నీవుకూ తాగవచ్చు" అని కటువుగా జవాబుచెప్పింది 'ఫెడోసియా.'

"ఉండు, ఆయనరానీ.........నీ పని పట్టిస్తా........" అని కోపం పట్టలేక అన్నది ఆ రెండవ స్త్రీ.

'ఫెడోసియా ' తనలో అనుకున్నది 'ఆయనట! ... మగడు దొరికాడు....కానీ —'

పొయ్యిలో పుల్లలు యెగవేస్తూ కూర్చున్నది 'ఫెడోసియా.' తాను యేకాకి అయిపోయినందుకు విచారించసాగింది. గ్రామంలో మూడు వందల గడపవరకున్నది. ఒక్కొక్కయింటికి ఒక్కొక్కరైనా యుద్ధానికి వెళ్ళిపోయిఉంటారు. వాళ్ళందరిలో తనకొడుకు మాత్రం సమీపంలో, యేటిఒడ్డున జర్మన్లు నిరాకరించుటచే సమాధికూడా చేయకుండా పడిఉన్నాడు. నెలరోజులకుపైగా ఆ శవం అక్కడ పడిఉంది. చలికి శిలగామారి, పాదాలు విచ్చి మాంసపు ముక్కలు వ్రేలాడుతున్న స్థితికివచ్చింది. ఆ శవంతోపాటు ఇంకా అనేకశవాలు పడిఉన్నమాటనిజమే. కాని అందులో ఆ గ్రామస్థుల బిడ్డలుగాని, అన్నదమ్ములుగాని, భర్తలుగా లేరు. తన కొడుకు ఒక్కడే తన స్వగ్రామమైన ఆ ఊళ్లో, శవసంస్కారానికిగూడా దిక్కులేక యేటివొడ్డున పడిఉంటూ, వాడిమీద కాకులు వాలి పొడుస్తుంటే చూడవలసిన దురదృష్టం తనకేపట్టింది. కాని అన్నిటికంటేగూడా ఆ జర్మను ఆఫీసరు తన ఉంపుడుగత్తెతో పాటు తన యింటనే నివాసం యేర్పరచుకోటం, తనను మరింత యేడ్పించటానికా అన్నట్లున్నది. ఆ ఉంపుడుగత్తె పరదేశస్థురాలైతే ఆమెను యింతబాధ అనుపించేది కాదేమో! కాని అది తన దేశస్థురాలై ఉండికూడా ... దేశానికి తన

"వెఱ్ఱిదానా, సెలవు పుచ్చుకోటానికి యిదాసమయం? ఇప్పుడు నిన్ను ఒంటరిగా జర్మనీకి పంపినప్పటికి అక్కడమాత్రం యేంచేస్తావు చెప్పు? ఇక్కడే ఇట్లా ఉండటం యిష్టం, లేదానీకు?"

ఆమె జవాబు చెప్పలేదు. పక్కమీదనుంచి లేచి దుస్తులు వేసుకొన సాగింది. కర్ట్ వెర్నర్ మంచంమీదినుంచిలేచి ప్రక్కనున్న కుర్చీలో కూలబడి 'పుస్సీ' వైపుచూస్తూ కూర్చున్నాడు. ఆమె అంటే 'కర్ట్ వెర్నర్' కి నిజంగా యిష్టమే. లేకుంటే ఆమెను మూడునెలల పాటు దగ్గర ఉంచు కోగలడా! ఇంతకుముందు తన అనుభవంలోకి వచ్చిన స్త్రీలకంటే ఆమెలో ప్రత్యేకత కనిపిస్తున్నది. అంతేగాక ఇక్కడి స్త్రీలందరికంటే యీామెలో చాలా భేదం ఉన్నది.

"అన్నట్టు, 'పుస్సీ.' ఇక్కడి పంతులమ్మ నీఅక్కనటగదూ?"

'పుస్సీ' నిలువునా నీరైపోయింది. కొద్దిసేపాగి తలఒకప్రక్కకు వంచి 'కర్ట్' వైపు నాజూకుగా చూచింది. ఈచూపే అతనిని తనవైపు ఆకర్షిస్తుందని ఆమెకు బాగాతెలుసు.

ఆమె సన్నని వ్రేళ్ళు కురులను చెవులవెనక్కి తీసుకున్నాయి. ఆమె చెవుల పైభాగం సన్నగాఉంది. జంతువు చెవుల్లాగ తమాషాగా ఉన్నాయి. పళ్లగూడాముక్కోణంగా ఉన్నాయనిపించింది 'కర్ట్ వెర్నర్'కి.

"అయితే కావచ్చు—దానికేం?"

కురులమీద ఆమె వ్రేళ్ళు ఆడుతుంటే, ఆరంగు వేసినగోళ్ళు రక్తసిక్తమైన పులిగోళ్ళలాగ మెరుస్తున్నాయి.

"అవును, ఆవిడ నాఅక్క కావచ్చును. అంతమాత్రంచేత యిప్పుడేమొచ్చింది?"

"మీఅక్కకి మేమంటే కిట్టదుగదూ?"

'పుస్సీ' కండ్లల్లో అనుమానం స్ఫురిస్తున్నది.

"అయితే మాఅక్కమీదగూడా కన్ను వేశారేమిటి?"

వికృతంగా నవ్వాడతడు.

"ఓహోహో! యేమన్నావు? దానిమొహానికితోడు దానిమీద కన్ను వేయటంగూడానా? పెద్దపర్వతంలాగ దాని శరీరమూ అదీనూ........" అంటూ ఆగిపోయాడు. తనభార్యలాగ ఉంటుందనబోయి గుర్తుకి తెచ్చుకొని చటుక్కున ఆగిపోయాడు.

ఈ మాటలు వింటూ 'పుస్సీ' తన అందమైన శరీరాన్ని చూచుకుని మురిసిపోయింది.

"అవును—అది లావుగానే ఉంటుంది"

"నీకు యీప్రాంతంలోనే అక్కగూడా ఉన్నదన్నసంగతి యింత వరకు చెప్పావుగావేం ?"

"ఎందుకూ చెప్పటం ? అది యిక్కడ ఉంటుంటే నేనెక్కడో ఉంటుండేదానిని. సాధారణంగా కలుసుకోటంగూడా జరిగేదికాదు. అసలు దానికీ నాకూ చాలాభేదం ఉంది...."

"భేదం అంటే?"

'పుస్సీ' ఆలోచిస్తూ తలదువ్వుకుంటూనే ఉన్నది. చెవికి తగిలించిన లోలకులలోని యిమిటేషన్ వజ్రం కళ్ళు చెదిరేటట్టు మెరుస్తుంది.

"మురికి వెధవలందరికీ యేమిటేమిటో చెప్పుకుంటూ తిరుగుతుంటుంది. యెప్పుడూ దానికదేగోల"

"అంటే బోల్షివిక్ పార్టీసభ్యురాలన్నమాట"

"ఏమో—ఏమిఏడుపో; అదంతా నాకేమి తెలుస్తుందిగనుక ? అసలింతకూ దానివిషయం యిన్నిప్రశ్నలెందుకూ ? అదంటే అసహ్యం అని ఒకప్రక్కన అంటూనే ఉంటిరి?—"

"ఏదో, ఊరికే అడిగాను. అంతేగాని దాన్ని మోహించికాదులే-" ఈమాటల్లోని అంతరార్థం 'పుస్సీ' గ్రహించలేదు.

'కర్ట్' జేబులోనుంచి ఒకపొట్లం తీసి 'పుస్సీ'కి అందిస్తూఅన్నాడు- "ఇదుగో ఈచాక్లెట్ యిద్దామనివచ్చి, అసలు సంగతే మరిచిపోయాను. ఇకవెళ్ళిపోవాలి. ఇవ్వాళ తొందర పన్లు అనేకం ఉన్నాయి. అయినా తొందరగా తిరిగి రావటానికి ప్రయత్నిస్తాలే"

'పుస్సీ' ముఖం చిట్లించుకున్నది.

"మళ్ళీ నన్ను ఒంటరిగా విడిచి వెళ్ళిపోతారన్నమాట. ఇంతకూ యీపాడుయుద్ధం యెప్పటికీ ముగిసేది?"

"త్వరలోనే పూర్తవుతుందిలే"

"ఏమో, యెప్పటికో. మీకేం తేలిగ్గా అనేస్తారు" అని నిస్పృహతో అన్నది 'పుస్సీ'. చాక్లెట్ పైనున్న కాగితంతీసి కోరలలాంటి ఆమె పళ్ళతో దానిని కొరికి తినసారంభించింది.

"నేవచ్చేదాకా గ్రామసోవియట్‌తో కాలంగడుపుతుంటాను-మధ్యాహ్నం తినుబండారాలేమైనా పంపిస్తారే. సరే, వస్తా...."

అని 'పుస్సీ'ని ముద్దుపెట్టుకుని బయటికి వెళ్ళిపోయాడు. బయట కాపలా సైనికుడు చలికి వణుకిపోతూ అటూ, యిటూ పచార్లుచేస్తున్నాడు. ఇంటినుండి బయటికివచ్చి వెళ్ళిపోతున్న ఆఫీసరునిచూచి 'అటెన్షన్'లో నిలబడ్డాడు. ఇంతకు మునుపు గ్రామసోవియట్ కార్యాలయంగా ఉండి, ఇప్పుడు జర్మను సైనిక కార్యాలయంగా మారిన ఇంటివైపుకి 'కర్ట్' వెళ్ళిపోయాడు. కార్యాలయంలోఉన్న జర్మను సైనికులు తమ ఆఫీసర్ను చూడగానే నిలచి శాల్యూట్ చేశారు. కాని 'కర్ట్' అదంతా గమనించనట్టు నిర్లక్ష్యంగా ఊరుకుని - "దానిని లోపలికి తీసుకురండి" అని చెబుతూ తన ఆఫీసుగదిలోకి వెళ్ళిపోయాడు.

కుర్చీమీద కూలబడి ఒక ఆవులింతతీశాడు. 'పుస్సీ' అదృష్టవంతురాలనుకున్నాడు. హాయిగా యిష్టంవచ్చినంతసేపు పడుకుంటుంది. తాను ప్రొద్దు పొడవకమునుపే లేచి పనిలో పడాలి. దినమంతా వొళ్లు వల్లగొట్టుకుని పనిచేసినా, ఆపనికి యెప్పటికీ తరుగేఉండదు!

గొఱ్ఱెతోళ్ల కోటువేసుకున్న ఒక స్త్రీని సైనికులు లోపలికి తీసుకువచ్చారు. 'కర్ట్' ఆమెవైపు తీవ్రంగా చూచి అన్నాడు:

"ఇదేనా?"

"అవునండీ!"

ఆమె భారంగా, టేబిలుముందు నిలుచున్నది. కప్పుకున్న శాలువాలోంచి కణతలదగ్గర తెల్లవెంట్రుకలు నెరిసినట్లు కనిపిస్తున్నది. మోటువారిన ముఖాన్నిబట్టి ఆమె రైతువర్గానికి చెందిన స్త్రీ అయివుంటుందనిపిస్తున్నది.

"నీపేరు?"

"ఒలెనా కోస్టియుక్"

చేతివ్రేళ్ళమధ్య పెన్సిలు తిప్పుతూ 'కర్ట్' ఆమెవైపు చూడసాగాడు. నిశ్చలమైన ఆమె కళ్ళు, ముఖంలోని ఆ ధీర చూస్తుంటే ఆమె చాలా పట్టుదలగల మనిషనిపిస్తుంది.

"నీవు గెరిల్లాలతో కలిసి తిరుగుతున్నావా?"

ఆమె భయపడినట్లుగాని, తొట్రుపడుతున్నట్లుగాని కనపడలేదు. నిశ్చలంగా ఆఫీసరుమీద చూపులు నిగిడ్చి అన్నది:

"ఔను. గెరిల్లాలతో తిరుగుతుండేదాన్ని"

"ఆఁ! అవునా?" – ఇంత ధైర్యంగాను సులభంగాను ఆమె ఒప్పుకోటం చూచి అతనికి ఆశ్చర్యం వేసింది. కాగితాలమీద యేవో పిచ్చిగీతలు గీస్తున్నాడు.

"మళ్ళీ గ్రామానికి తిరిగి వచ్చేశావేం? ఏంపనిమీద విన్నిక్కడికి పంపించారు?"

"నన్నెవ్వరూ పంపలేదు. నా అవసరంమీదనే వచ్చాను"

"ఓహో, అలాగునా? ఏమిటాపని?"

ఈసారి ఆమె జవాబివ్వలేదు. మిలమిలలాడే తన నల్లని కళ్ళతో జీవంలేని ఆఫీసరు కళ్ళల్లోకి తదేకదృష్టితో చూస్తున్నది.

"చెప్పవేం?"

ఆమె మౌనంగా ఉండిపోయింది.

"చెప్పు - ఇంతకాలము గెరిల్లాదళంతో, తిరుగుతూఉండినదానవు హఠాత్తుగా గ్రామానికి తిరిగివచ్చేశావు. మీ దొంగలముఠాలో క్రమశిక్షణ అంటూ లేదా? ఎందుకు తిరిగి వచ్చేశావో చక్కగా చెప్పేసెయ్యి"

"నాఅంతట నేనే వచ్చేశాను. ఇక నక్కడ ఉండటానికి వీలు లేకపోయి వచ్చేశాను...."

"ఎందుకు వీలుపడలేదు? అక్కడి పరిస్థితులు అధ్వాన్న మయ్యాయా? మొన్నటి సంఘర్షణలో మీ నాయకుడు చచ్చిపోయాడా, యేం? మీదళం అంతా చెదిరిపోయిందనుకుంటాను?"

"మాదళంసంగతి నాకు తెలియదు. నేనుమాత్రం వచ్చేశాను."

"ఏమంత అగత్యంవచ్చింది?"

ఆమె పెదవులు యేదో చెప్పబోతున్నట్టు కదిలినై.

"ఈ గెరిల్లాలసంగతంతా వట్టి బూటకమని నీకీపాటికి తెలిసిపోయి ఉంటుంది. వాళ్ళు వట్టి బందిపోట్లు, హంతకులు. అందువల్లనే వాళ్ళను వదిలి వచ్చేసి ఉంటావు.

ఆమె తలపంకిస్తూ అన్నది - "కాదు. ఇక నేను ఉండటానికి వీల్లేకపోయింది."

"ఎందువల్ల?"

ముందు కొద్దిగా శంకించి, అతిప్రయత్నంమీద ఇలా అనగల్గింది - "పురుడు పోసుకోటానికి వచ్చాను."

"ఏమిటీ?" - అని ఆశ్చర్యంతో అడిగాడు 'కర్ట్'

"నా బిడ్డను కనటానికి వచ్చాను!"

"అదాసంగతి!" - అని నవ్వసాగాడు. ఆవెకిలినవ్వు ఆమెకు వణుకుపుట్టించింది.

"చలివెయ్యటంలేదులే; అంత చక్కగా చలిమంట మండుతుంటే. కప్పుకుంటావెందుకు? ఆ శాలువాతీసి పారయ్యి"

ఆమె మారుమాటాడకుండా ఆ బరువైన శాలువాతీసి కుర్చీపైన పడేసింది.

"ఆ కోటుగూడా తీసెయ్యి"

ఆమె కొద్దిసేపు సంకోచించింది. తర్వాత కోటుగూడా తీసివేసింది. ఆఫీసరు ఆమెను పరీక్షగా చూచాడు. అవును! నిజంగా ఆమె నెలలు నిండిన మనిషే!

ఆమె ఆయాసంగా శ్వాసవిడుస్తున్నది. నిలబడటం ఆమెకు కష్టంగా ఉన్నది గ్రహించే, అతడు ఇంకా ఆమెను ప్రశ్నలు వేస్తూ ఆవిధంగా కాలయాపన చేస్తున్నాడు.

తనకు సంబంధించిన ప్రశ్నలన్నింటికి జవాబులు చెప్పింది. తనకు వివాహమయింది. పెనిమిటి యుద్ధంలో చచ్చిపోయాడట. విప్లవానికి పూర్వం ఒక ఫ్యాక్టరీమందుదగ్గర ఊడిగంచేస్తూవచ్చింది. విప్లవంతర్వాత ఒక సమిష్టి వ్యవసాయక్షేత్రంలో పనిచేయసాగింది. ఈమధ్య గెరిల్లాదళం నిర్మింపబడగానే అందులో చేరింది. ఇంతకాలమూ, తనస్థితి గెరిల్లాదళంలో యెవరికీ తెలియనివ్వకుండా ఉంచింది. నెలలు నిండిన తర్వాత నడవటం గూడా కష్టమైపోవటంచేత తిరిగి గ్రామానికి వచ్చేసింది - ప్రసవించటానికి.

"సరే బిడ్డను కనటానికి వచ్చావుగదూ? - పోయినవారం ఆ వంతెన ను పేల్చేసింది నువ్వేనా?"

"అవును"

"ఎవరు సహాయంచేశారు?"

"ఎవ్వరూ చేయలేదు. నేనొక్కదాన్నే చేశాను."

"అదంతా అబద్ధం. మాకాసంగతంతా తెలుసులే; మర్యాదగా అన్నిసంగతులూ చెప్పేశావంటే బాగుంటుంది.

"నేనొక్కదాన్నేచేశాను".

"సరే - మీదళం యెక్కడున్నదో చెప్పు"

ఆమె జవాబివ్వలేదు. నిశ్శబ్దంగా జర్మను ఆఫీసరు ముఖంలోకి చూస్తూ నించున్నది. మళ్ళీ అదేకథ. మొండివాలకం - ప్రశ్నలకు జవాబు లేదు. ఎన్ని ప్రయత్నాలుచేసినా లాభం శూన్యం. సాధారణంగా యింత మట్టుకు తనయెదుట విచారణలోకి వచ్చినవారు మొదటినుంచీ మాట్లాడటమో లేక మొదటినుంచీ మౌనం వహించటమో చేసేవారు. ఈమనిషి విషయంలో ఆమె మొట్టమొదట సులభంగా జవాబులు చెప్పటంచూచి, అన్నిసంగతులూ చెప్పేస్తుందనుకున్నాడు. కాని తన స్వంతవిషయాలను గురించితప్ప ఇతరవిషయాలగురించి ఒక్క అక్షరంకూడా బయటికి రానివ్వటంలేదు. ప్రారంభంలో ఆమెముఖం చూస్తూనే పట్టుదలగల మనిషని అనుమానపడ్డాడు. ఆభావమే చివరికి స్థిరమయింది.

"పోనీ, నువ్వెక్కడ్నుంచి యీగ్రామానికి వచ్చేవోచెప్పు"

మౌనం. బల్లమీద పెన్సిలుతో కొట్టి గద్దించి చూచాడు. కాని లాభంలేకపోయింది విసుగుపుట్టింది; అక్కడినుంచి లేచిపోవాలనిపించింది. ఇంటికిపోయి హాయిగా 'పుస్సీ' తో కాలంగడిపితే యెంత బాగుంటుంది అనుకున్నాడు. కాని తనను అనేకవిధాల అవస్థలు పెడుతున్న ఆగెరిల్లాదళానికి సంబంధించిన విషయాలు, ఈ ఖైదీతో చెప్పించి తీరాలని పట్టుదలగాఉన్నది.

"ఏం? చెప్పవేమి? మీ గెరిల్లాదళం నాయకుడిపేరు 'కర్లీ'గదూ? అసలుపేరు అదికాదటగా?"

మళ్ళీ మౌనమే! ఆమె బాగా అలసిపోయిఉన్నదని గ్రహించాడు. ముఖమంతా చెమటలుకారుతుండటం కనిపిస్తున్నది.

"మాట్లాడతావా, లేదా?"

చివరికి అతనే అలసిపోయాడు. ఆపాడుపని వదిలేసి ఇంటికి వెళ్ళిపోవాలని బుద్ధిపుట్టింది. 'పుస్సీ' ఇంకా పక్కమీదనుంచి లేచిందో, లేకపోతే తాను లేనుగదా అని మళ్ళా ముసుగుతన్ని పడుకుందో?

* * * *

'పుస్సీ' నిద్రపోవడంలేదు. అలంకరించుకుంటూ చాలసేపు గడిపింది. మరికొంతసేపు అద్దంలో తన అందం చూచుకుంటూ మురిసిపోతూ కూర్చున్నది. అటుతర్వాత గ్రామఫోను పెట్టుకుంది. కాని విన్న పాటలే యెంతసేపు వినటం? ఎవరితోనో మాట్లాడాలనిపించింది. కాని యెవరితో మాట్లాడటం?

వంటగదిలోకివెళ్ళి ఇన్ని మంచినీళ్లు త్రాగింది. 'ఫెదోసియా' ఒకచోట కూర్చొని బంగాళదుంపలు తరుగుతుంది. ఆమె అలా తరుగు తుంటే ముక్కలు ముందున్న బుట్టలోకిపడ్డం చూస్తూ, కిటికీ అంచున కూర్చున్నది 'పుస్సీ'.

"బంగాళదుంపలు చాలా చిన్నవిగా ఉన్నాయే -"

ఫెదోసియ జవాబివ్వకుండా ఊరుకున్నది.

"ఇక్కడ దొరికేవన్నీ ఇలానే చిన్నవిగా ఉంటాయా?"

ఫెదోసియా ఈసారిగూడా జవాబివ్వలేదు.

"మాటాడితేనే నోటిముత్యాలు రాలిపోతాయా?"

ఫెదోసియా తలపైకెత్తి ద్వేషంతో, నిర్లక్ష్యంగా 'పుస్సీ' ముఖంలోకి చూచింది. మళ్ళీ తలవాల్చి తనపనిలో మునిగిపోయింది.

"ఎందుకట్లా నన్ను జంతువుని చూచినట్టు చూస్తావు? ఒక్కరూ నాతో మాట్లాడరే? ఈబ్రతుక్కంటే చస్తేమేలు" అని 'పుస్సీ' విచారంతో అన్నది.

"......................"

"నీకు నేనేమైనా ద్రోహంచేశానా చెప్పు?"

'ఫెదోసియా' 'పుస్సీ' మీదికి ఒక తీవ్రమైన చూపు విసిరింది. అంతే - జవాబుమాత్రం లేదు.

"ఒక్కదాన్నే యిలా కూర్చుని రోజులు గడుపుతున్నాను. 'కర్ట్' నూటికి, కోటికి ఒక్కసారి యిల్లావచ్చి తొంగిచూచి వెళ్ళిపోతాడు. ఒక్కరైనా పలుకరించేవారులేరు. బయటికి వెళదామన్నా చలి చంపేసే టట్టున్నది. ఇలా కూర్చుంటే నాకు పిచ్చెత్తేట్టున్నది—"

ఎదుటినుంచి జవాబువస్తుందేమోనని చూచింది.

"మాటాడవేం? నేను దయ్యాన్నా, భూతాన్నా?"

ఈమాటలువిని 'ఫెదోసియా' తలపైకెత్తింది.

"అంతకంటేకూడా భయంకరమైనదానివి, చివరికి కుక్కకన్నా నీచమైనచావు చస్తావులే."

'పుస్సీ' ఉలిక్కిపడి నోరు వెళ్ళబెట్టి చూస్తున్నది. 'ఫెదోసియా' ఈవిధంగా అంటుందని యెన్నడూ అనుకోలేదు. ఏమిచేయనూ తోచలేదు. కొద్దిగా కూడదీసుకుని అన్నది—

"ఏమిటీ గందరగోళం? చెప్పు! నన్నేమిచెయ్యమన్నావు? తిండికి మాడి చావమంటావా? ఈ జర్మన్లిక యెప్పటికీ ఇక్కడే ఉండి పోక మానరు. నాబాగు నేను చూచుకోకపోతే యెట్లాచెప్పు? నాభర్త 'సిర్యోషా' యీపాటికెప్పుడో యుద్ధంలో చచ్చిపోయి ఉంటాడు. ఈ 'కర్ట్' మాత్రం చెడ్డవాడా? ఇక్కడ యిక యెంతోకాలం ఉండ బోనులే. కొద్దిరోజుల్లోనే నన్ను తన స్వగ్రామానికి తీసుకువెళ్తాడు. అక్కడ జీవితం హాయిగా ఉంటుంది. ఇక్కడ యేంసుఖం అనుభవించానుగనుక? అందమైన ఆభరణాలా, యేమైనానా— ?"

"అవును, అవును; అంతేలే. మీ అక్క, పంతులమ్మ యెంత మంచిదో, నీవు - నీ పేరు చెప్పటానికిగూడా అసహ్యం వేస్తున్నది - అంతటి అధమురాలివి! నీ 'కర్ట్' యెక్కడికో తీసుకుపోతాడని ఆశ పడుతున్నావుగాబోలు, చివరికి నిన్ను కుక్కని తన్నినట్టుగాతన్ని తరిమేసి వెళ్ళిపోతాడు.... తొందరపడకు. హాయిగా నీ జర్మను ప్రియుడితో నాపరుపు మీద పడుకుని కులుకుతో యెల్లప్పుడూ ఉందామనుకున్నావుగాబోలు? మీ యిద్దరిపని త్వరలోనే తేలుతుంది. మా సైనికులువచ్చి మీ పని పడ్తారులే...."

'పుస్సీ' విలువునా వణికిపోయింది. ఒక్కొక్కమాట కొరడా దెబ్బలాగ తగిలింది. కోపంతో కంఠం కంపిస్తుండగా యిలా అరిచింది - "సరేలే! అగు! నువ్వు నీళ్లు తేవడానికి పోయి అంత ఆలశ్యం యెందుకు చేస్తావో 'కర్ట్'కి చెప్పక మానను! ఎక్కడికి పోతున్నదీ అతడు రాగానే చెప్పితీరుతాను."

'ఫెదోసియా' ఒక్క గంతులో లేచింది. తరిగిన బంగాళదుంప లన్నీ చెల్లాచెదరైపోయినాయి. కత్తి కొంతదూరంలో పడిపోయింది. 'పుస్సీ' మీదికి దూకుతున్నట్టుగా ఆమె మీదికి వంగింది. 'పుస్సీ' వెల వెల బోతూ వెనుకకితగ్గి చూస్తున్నది.

"నీకెట్లా తెలుసునే, నేనెక్కడికెళ్ళేదీను?"

ఇంటిముందు కాపలా సైనికుడున్నాడని గుర్తుకువచ్చి 'పుస్సీ' ధైర్యం తెచ్చుకున్నది.

"తెలుసుకోదలుచుకుంటే, నాకు అన్నీ తెలుస్తాయి."

"ఓసీ, పిశాచీ!...."

'ఫెడోసియా' కి 'పుస్సీ' గొంతు నులిపెయ్యాలన్నంత కోపం వచ్చింది. కాని తన ఉద్రేకాన్ని సంబాళించుకున్నది. అదీగాక అటువంటి నీచురాలిని తాకటమంటే ఆమెకు అసహ్యంవేసింది. కోపంకొద్దీ కాండ్రించి ఉమ్మివేసి మళ్ళీ తన మామూలుచోటికిపోయి కూర్చుని బంగాళ దుంపలు తరగటం ప్రారంభించింది.

'పుస్సీ' 'ఫెడోసియా' వైపు తల ఒక్కసారి యెగురవేసి గ్రామఫోను పెట్టుకోటానికి తన గదిలోకి వెళ్ళిపోయింది. మొట్టమొదట హాస్యపుపాట యేదైనా పెట్టాలనుకుంది. కాని కోపంతో ఒళ్లు మసిలిపోతున్నది. చేతికందిన రికార్డు యేదో ఒకటి తీసి గ్రామఫోనుమీద వేసింది. గ్రామఫోనులో విషాదగీతం ఆలాపన వినబడసాగింది.

'ఫెడోసియా' బంగాళదుంపలు తరుగుతూనే కూర్చున్నది. 'ఐతే, ఈ నీచురాలికి అంతా తెలిసిపోయిందన్నమాట! ఆ జర్మనువెధవకి గూడా చెప్పితీరుతుంది. ఇంతవరకూ పామువిషం నోట్లో భద్రపరుచుకున్నట్టు యీ విషయాన్ని తనలో దాస్తూవచ్చింది. కాని నామీద పగతీర్చుకోటానికి ఆ విషాన్నిప్పుడు ప్రయోగిస్తుంది. తన జర్మను మగడికి చెబుతుంది అని ఆలోచించుకుంటున్నది.

హృదయాన్ని కంపింపజేస్తూ గ్రామఫోనులో విషాదగీతం వినిపిస్తున్నది....

ఇకనేమిచేయటం? జర్మనువాడికీవిషయం తెలిస్తే ఊరుకోడు. అక్కడ యుద్ధంచేస్తూ చనిపోయిన యెర్రసైనికులకు అంత్యక్రియలు జరుపగూడదన్న శిలాశాసనం ఇంకా అమల్లోఉన్నది. ఆ చచ్చిపోయిన వారినక్కడే ఆస్థితిలోఉంచి - వారి శరీరాలమీది గుడ్డలు కూడా ఊడబెరికి గ్రామస్థులందరికి ఒక గుణపాఠం నేర్పాలనుకున్నారు. మొదట్లో గ్రామస్థులు ఆయోధుల శవాలను సమాధిచేయటానికి ప్రయత్నించారు. కాని ఆప్రాంతంమీద జర్మన్లు ఉంచిన నిఘావల్ల అది సాగలేదు. 'పాస్టుక్' అనే యువకుడు ఒక రాత్రప్పుడు పారపుచ్చుకుని రహస్యంగా అక్కడికి వెళ్ళాడు. కాని ఆరాత్రి మొదలు అతడుగూడా తక్కినవారితో పాటు, హృదయంనిండా తుపాకిగుండ్ల రంధ్రాలుపడి ఎండకు యెండుతూ, మంచుకి తడుస్తూ ఉన్నాడు. అందువల్ల ప్రజలు ఆపరిస్థితిలో యేమీచేయలేకపోయారు.

కాని అక్కడ చచ్చిపడిఉన్నవారిలో ఆ గ్రామస్థుల ఆత్మబంధువు లెవ్వరూ లేరు. దురదృష్టవంతురాలైన 'ఫెడోసియా' ముద్దుబిడ్డడు 'వాస్యా' మాత్రమే ఉన్నాడు. 'వాస్యా' ఉన్న సైనికదళం తలవని తలంపుగా తమ గ్రామంగుండా పోతుండటం తటస్థించింది. అతనిని చూచి విస్మయానందాలతో స్థంభించిపోయింది 'ఫెడోసియా'. తల్లిని చూచి 'వాస్యా' కిలకిలనవ్వాడు. కాని అదీ యెంతసేపని? ఒక్క త్రుటికాలం. చీకటిపడుతూనే జర్మనుసైన్యం యేమరపాటున వచ్చి చుట్టు ముట్టేసింది. వారిమధ్య చిక్కుకొనిపోయి ఊపిరున్నంతవరకు వీరోచితంగా పోరాడి ఆయేటివొడ్డున ప్రాణాలు విడిచినవారిలో 'వ్యాస్యా' ఒకడు.

అదేరోజు అతని శవాన్ని 'ఫెడోసియా' కనుక్కున్నది. ఆమె హృదయమే తిన్నగా అతని శవందగ్గరికి తీసుకుపోయింది. కాని అప్పటికే అతడు ప్రాణాలు విడవటమూ, జర్మనులు అతని వంటిమీద దుస్తులన్నీ ఊడదీసుకుపోవటమూ జరిగింది।

అదిమొదలు యీ నెలరోజులు ఆమె అక్కడికి వెళ్తూనే ఉన్నది. తన కొడుకు శరీరం మంచులో శిలారూపంలోకి రావటమూ, కాలు చిట్లిపోయి మాంసపు ముక్కలు వేళ్ళాడుతుండటమూ తన కండ్లయెదుట జరగటం చూస్తూనే ఉన్నది. నీళ్ళు తేవటానికి వెళ్ళినప్పుడల్లా - ఒక్కొక సారి రోజుకి రెండుసార్లుగూడా - తన బిడ్డను చూడటానికి అలవాటుపడిపోయింది. కాని యిప్పుడు?.... ఇకముందు యేమిజరుగుతుందో!....

గ్రామఫోనులో యింకా విషాదగీతం వినిపిస్తూనే ఉన్నది.

ఇక జర్మనుఆఫీసరు ఇది ఎట్లాగూసాగనివ్వడు. చూస్తూఊరుకోడు. 'ఫెడోసియా'కు తన విషయమై తనకేమి భయంలేదు. కాని యెంతసేపూ తన కొడుకువిషయమే ఆమె ఆలోచన. ఇకనుండి ఆ శవాన్నయినా చూచుకునే భాగ్యం ఉండదుగాబోలు. ఇది జర్మన్లకు తెలిస్తే తన కొడుకు శవాన్ని తీసుకుపోయి, ఊరూ, పేరూ లేకుండా యెక్కడపారేస్తారో! ఇంకా ఆ శవానికి యెన్ని ఘోరహింసలు పెడతారో!!....

గ్రామఫోను పాటను ఆమె సహించలేకుండా ఉన్నది.

'షసీన్స' పిచ్చెత్తినట్టు పదేపదే అదేఅదే పాట మోగిస్తున్నది. 'ఫెడోసియా' కోపంకొద్దీ బంగాళదుంపలు తరుగుతున్న కత్తి చేతిలో

ఉండగానే పిడికిలి బిగించింది. కాని వేళ్ళు తెగినట్టు ఆమెకు గుర్తులేదు. కొద్దిసేపటికి వేళ్ళమీద రక్తం చూచుకుని, గుడ్డతో తుడుచుకున్నది.

గ్రామఫోనుమాత్రం రోదన చేస్తూనే ఉన్నది.

ఇకముందు యేమిచెయ్యాలా అని 'ఫెడోసియా' మనస్సు మధన పడసాగింది. తన కొడుక్కి యేదో ఘోరమైన విపత్తు రానున్నదనిపించింది. చావుకంటే భయంకరమైన ఆ విపత్తునుండి తన 'వాస్యా'ను రక్షించకపోతే యెట్లా? కాని యేవిధంగా రక్షించటం?....

ఇప్పుడున్న స్థలంనుంచి ఆ శవాన్ని తొలగించటం అసంభవమని ఆమెకు తెలుసు. కాని శిలగా మారిపోయిన ఆ శరీరాన్ని యెక్కడికి దీసుకుపోవాలన్నా సాధ్యపడేపనా? ఆ హంతకులదృష్టి పడకుండా శవాన్ని దాయటం యెలా?....

ఇంకా గ్రామఫోను పాడుతూనే ఉన్నది.

ఆ జర్మను పశువులు తన 'వాస్యా' శరీరాన్ని తాకుతారు. బూట్లతో తంతారు. 'కర్ట్ వెర్నర్' ఇదంతా చూస్తూ నవ్వుతూ నించుంటాడు! 'ఫెడోసియా' యివన్నీ తలుచుకుని భరించలేకపోతున్నది. తరుగుతున్న బంగాళదుంపలసంగతీ, ఆరిపోతున్న పొయ్యిసంగతీ - అన్నీ మరిచిపోయి, శూన్యంలోకి చూస్తూ కూర్చుండిపోయింది.

ఇంతవరకు తన హృదయానికి తగిలిన గాయాలకంటే యెక్కువ మరేమీ ఉండబోదనుకున్నది 'ఫెడోసియా'. కాని అది వట్టి భ్రమ అయిపోయింది. అంతులేని కష్టపరంపరలు ముంచుకొస్తున్నాయి. ప్రజల ప్రశాంత జీవనంలో క్రమ్ముకున్న కారుమబ్బు ప్రళయవర్షాన్ని కురిపించబోతున్నది.

ఇంతకూ, ఆ నీచురాలికి తనవిషయం యెలా తెలిసిఉంటుంది? ఎవరు చెప్పుంటారు?

ఎన్నెన్నో భావాలు మనోవీధిలో సంచరిస్తున్నాయి. పంతులమ్మ చెప్పిఉంటుందా? లేదు; ఆమె అలా యెప్పటికీ చెప్పదు. మరెవరు చెప్పిఉంటారు?

మొత్తానికీవిషయం గ్రామస్తులందరికీ తెలిసిందే. కాని అందరూ నమ్మకస్తులే. అయినా 'పుస్సీ' బయటికైనా రాదాయె. వచ్చినా గ్రామస్థుల్లో ఒక్క మానవమాత్రుడైనా ఆమెతో మాట్లాడడు. ఐతే ఆమెకెట్లా

తెలిసిందీవిషయం? దుఃఖంతో కృంగిపోతున్న మాతృ హృదయానికి ద్రోహం యెవరుచేసిఉంటారు? తన 'వాస్యా'ను - తన ముద్దుబిడ్డడైన 'వాస్యా'ను జర్మన్ల కప్పగిస్తున్న ఆ నీచులెవరు?

చివరికి గ్రామఫోను కొద్దిసేపు గీపెట్టి ఆగిపోయింది. 'పుస్సీ' చలికోటు వేసుకొని తయారయింది. కోటు కొద్దిగా వదులయింది. 'కర్ట్' గ్రామస్థుల్లో యెవరివంటిమీద ఉండగానో అది ఊడదీయించి తెచ్చి 'పుస్సీ'కి యిచ్చాడు. అది వేసుకుంటే ఆమెకు వెచ్చగా హాయనిపించింది.

'పుస్సీ' బయటికి వెళ్ళి చూచింది. చల్లనిగాలి వీస్తున్నది. ప్రదేశమంతా మంచుతోనిండిపోయి, సూర్యునికాంతిలో జిగజిగమెరుస్తూ కండ్లకు బాధకలిగిస్తున్నది. ఏమైనా నీడలుపడినచోట్లమాత్రం నీలంగా కనిపిస్తున్నది. గ్రామంఉన్న యెత్తుప్రదేశంనుంచి చూస్తుంటే చుట్టుపట్ల ఉన్న బయళ్ళన్నీ తెల్లని దుప్పటి కప్పినట్లుగా ఉన్నాయి. భూమ్యాకాశాలను మంచు తన గుప్పిట్లో పట్టుకుని నలిపేస్తున్నదా అనిపిస్తున్నది. 'పుస్సీ' దృష్టి గ్రామంలోని వీధుల్లోకి మళ్ళింది. అక్కడక్కడ జర్మను సైనికులుమాత్రం పన్లుచేసుకుంటూ కనిపిస్తున్నారు. గ్రామం నడుమఉన్న చర్చిదగ్గర మరఫిరంగులు, వాటిదగ్గర సైనికులు ఆ తెల్లని మంచులో నల్లగా కనబడుతున్నారు. కాని గ్రామస్థు లెవ్వరూ కనబడటంలేదు. 'కర్ట్'ని అతని కార్యాలయంలో కలుసుకోటానికి 'పుస్సీ' నెమ్మదిగా బయలుదేరింది.

గ్రామానికి మధ్యఉన్న ఖాళీస్థలంలో ఉరికంబం - భూమిలో పాతిన రెండు గెడలూ వాటిని రెండింటినీ కలుపుతూ మరొక వాసం - నిలచి ఉన్నది. దానిమధ్య ఒక శవం వేళ్ళాడుతున్నది. ఆ గ్రామంమీద 'కర్ట్' యొక్క అధికారాన్ని సూచించే ఆ చిహ్నాన్ని చూచీ చూడనట్టుగానే దాటిపోయింది 'పుస్సీ'. ఆమెకు ఆ దృశ్యాలన్నీ అలవాటైపోయినాయి. నెలరోజులక్రితం తాను 'కర్ట్'తో పాటు ఉండటానికి యిక్కడికి వచ్చినది మొదలు ఆమె ఆ ఉరికంబంనుంచి వ్రేళ్ళాడుతున్న కుఱ్ఱవాడిని చూస్తూనే ఉన్నది. ఇప్పుడాశవం చలికి బిగుసుకుపోయి ఒక పెద్ద మొద్దులాగ ఉరికంబాన్నుంచి వ్రేళ్ళాడుతున్నది.

స్మశానవాటికలాగ ఉన్న ఆ వీధులవెంట నడుచుకుపోతున్నదామె. పాదాలక్రింద మంచు గాజుపగిలినశబ్దంచేస్తు పోతున్నది. అక్కడక్కడ మాత్రం యిండ్లపైన పొగకనిపిస్తున్నది. ఆ యిండ్లు జర్మను సైనికులు

నివాసం యేర్పరచుకున్నవయి ఉండాలి. తక్కిన యిండ్లల్లో వంటలే లేనట్టున్నది. అసలు వంటచేయటానికి మనుష్యులే లేరేమో, కొన్నిట్లో....

ఒక యింటి తలుపు తెరిచి యెవరో బయటికి తొంగిచూచారు. కాని 'పుస్సీ'ని చూడటంతోటే దభాలున తలుపువేసేసుకున్నారు. గ్రామస్థులంతా ఆమెను చూస్తే కుష్ఠురోగిని చూచినట్టుగా తొలగిపోతారు. బజారులో ఆమె కనబడిందంటే పిల్లలు యిండ్లకు పారిపోతారు. 'పోతే పోనీ వెధవలు. ఎవరు లెక్కచేస్తారు? తిండికీగుడ్డకీ లేక చస్తారులే, పందులు. నామట్టుకు నేను హాయిగా ఉంటాను. నాకు కావలసినవన్నీ 'కర్ట్' తెచ్చిపెడుతుంటాడు. కొద్దిరోజులు పోతే 'కర్ట్'తో పాటు దివ్యంగా జర్మనీ చేరుకుంటుంటాను. తెలివితక్కువకుంకలు కాకపోతే, యెర్రసైనికులు యెప్పుడోవస్తారని ఆశలుపెట్టుకు గూర్చుంటారా? వారి ఆశలన్నీ నిరాశలు కాకుండా ఉంటాయా? జర్మన్లు యేవిధంగా జయంపొందక మానరో, అంగ్లేల్లు జర్మన్లకు పూర్తిగా సహాయంచేయకపోతే యేవిధంగా మనం నాశనం కావలసివస్తుందో అంతా నాకు సచ్చుజెప్పాడు 'కర్ట్.' కాని యీ రైతుపీనుగులకు అవన్నీ తలకెక్కవుగా. ఇంకా ఆ యెర్రసైనికుల కోసం యెదురుచూస్తున్నారు. వాళ్లెట్లాపోతేమాత్రం నాకేం? నాకు గడవకపోతుందా? వాళ్ళందరికంటే యిప్పుడు నేనే హాయిగా బ్రతుకుతున్నాను' అని ఆలోచించుకుంటూ నడుస్తున్నది 'పుస్సీ'.

కాళ్ళక్రింద మంచు కరకరలాడుతున్నది. మంచు వెదజల్లుతున్న వెలుతురుకి కళ్లు జిగేలుమంటున్నాయి. అబ్బ! ఈ పాడుచలిగాలి యెన్ని రోజులుంటుందో?

గుమ్మందగ్గిర కాపలా సైనికుడు ఆమెను నిరాటంకంగా లోపలికి పోనిచ్చాడు. 'కర్ట్' ఉన్న గది తలుపుమీద ఒకసారి తట్టి, జవాబు రాకముందే, చొరవచేసుకుని తలుపు నెట్టుకు లోపలికివెళ్ళింది. లోపల ఉన్న సైనికులంతా గాభరాపడిపోయారు.

"ఏమిటీ, సంగతి?" - అని 'కర్ట్' అడిగాడు.

"అబ్బే, యేమీలేదు. మీరు లేకపోతే యేమీ తోచక యిట్లా వచ్చేశాను." అని జవాబిచ్చి టేబిలుముందు నిలబడి ఉన్న స్త్రీ వైపు చూడసాగింది. తలవెంట్రుకలు నెరిసిపోతూ మధ్య వయస్సుగల ఆ స్త్రీ కడుపుతో ఉన్నట్టు స్పష్టంగా కనిపిస్తున్నది. ప్రక్కకు వెళ్ళి 'పుస్సీ' కుర్చీ మీద కూర్చున్నది.

"ఇంకా చాలాసేపౌతుందా?" - అని 'కర్ట్' ని అడిగింది.

"ఇంతకుముందే చెప్పలేదూ?.... ఎంత తొందరపనిమీద ఉంటున్నానో కనబడటంలేదూ?" అని కొద్దిగా కోపంతో అని, మళ్ళీ ఆమె దగ్గరకు జరిగి "ఎన్నిసార్లు నిన్నిక్కడికి రావద్దని చెప్పాను? వినుపించుకోవుగదా! ఎంతపనిలోఉన్నానో చూడు.... పని పూర్తికాగానే ఇంటికి రాకమానానా?...."

చిన్నపిల్లలాగ గారాబం చూపెట్టసాగింది 'పుస్సీ'.

"నాకు విసుగెత్తిపోతున్నది. పోనీ మధ్యాహ్నం భోజనానికైనా రారు. ఈ ముసిల్దానితో నువ్వేమాట్లాడాలా? ఇంతమందున్నారు; వాళ్లెవ్వరూ చూచుకోలేరా?"

"అలా వీల్లేదు. ఈముసిల్ది గెరిల్లాదళంలోవి మనిషని తెలుసునా?"

'పుస్సీ' నిశ్చేష్టురాలై పోయింది.

"ఏమిటీ, గెరిల్లాదళపుమనిషా! చూస్తుంటే యీ క్షణంలోనో, మరుక్షణంలోనో కనేటట్టున్నది!"

"సరేలే; ఇక యింటికి వెళ్ళు. కొద్దిసేపట్లోనే వచ్చేస్తాను.

గారాబంతో అతనివైపుచూస్తూ - "కొద్దిసేపు యిక్కడే ఉంటాను. ఏం? నేనుండకూడదా?" అన్నది 'పుస్సీ'.

"సరే, నీకిష్టముంటే ఉండు. కాని నీకు కాలం యిక్కడైనా సరదాగా గడవదు" అని సమ్మతించాడు 'కర్ట్'.

'పుస్సీ' తన కోటు బొత్తాములు విప్పి విశాలంగా కూర్చున్నది. టేబిలుముందు నిల్చున్న ఆ స్త్రీ వైపు తన కళ్లు వప్పజెప్పి చూస్తున్నది. ఆమె గెరిల్లాదళం మనిషని తలుచుకుంటుంటే 'పుస్సీ'కి నవ్వొచ్చింది. 'కర్ట్' తానెవ్వరికీ జడవనని యెన్నిగొప్పలు చెప్పుకున్నప్పటికి, గెరిల్లాలంటే హడలిపోతాడు. అయితే 'కర్ట్' ని భయపెట్టే వ్యక్తులుగూడా ఉన్నారన్నమాట. ఈవిషయం తలుచుకుంటే 'పుస్సీ'కి యేదో అర్థం కాని తృప్తికలిగింది.

గెరిల్లాసైనికులు యిట్లాఉంటారని 'పుస్సీ' యెన్నడూ అనుకోలేదు. రాక్షసుల్లా భయంకరంగా పొడుగాటి జుట్లతోను, పెద్ద పెద్ద గడ్డాలతోను ఉండి, గొడ్డళ్ళు చేతుల్లోపుచ్చుకుని ప్రపంచాన్నంతటినీ గడగడలాడించేస్తున్న ఆచలికిగూడా లెక్కచేయకుండా, అడవుల్లో తిరుగుతుంటారని అనుకున్నది. కాని యీ మనిషి సర్వసాధారణంగా -

'ఫెదోసియా' విధంగానే ఉన్నది. అందులోను నిండు గర్భవతి! అబ్బే, అంత పొట్టవేసుకుని యెంత అసహ్యంగా ఉంది. 'పుస్సీ' తన సన్నని దేహాన్ని చూచుకుని మురిసిపోయింది. గ్రామఫోను మ్రోగించుకుంటూ, 'కర్ట్' తో పాటు యీ సన్నని శరీరంతో నాట్యమాడుతుంటే యెంత హాయిగాఉంటుంది!....

'కర్ట్' చాలా విసుగుతో ప్రశ్నలువేస్తున్నాడు. ఆరైతు స్త్రీ జవాబు లిస్తున్నది. మొదట్లో ఆ సంభాషణను 'పుస్సీ' వింటూ వచ్చింది. కాని 'కర్ట్' అన్నట్టు త్వరలోనే విసుగుపుట్టింది. 'కర్ట్' ఆ స్త్రీని ఒకేరకమైన ప్రశ్నలు పదేపదే వేస్తుంటే, ఆమెకూడా యిచ్చిన జవాబులే మళ్ళీ మళ్ళీ వల్లిస్తుండటం చూస్తుంటే 'పుస్సీ' కి యేమీ అర్ధంకావటంలేదు - వట్టి తెలివితక్కువతనంగా కనిపిస్తున్నది.

ఆ స్త్రీ - 'ఓలెనా' - బాగా అలసిపోయింది. కండ్లు చీకట్లు క్రమ్మ నారంభించాయి. నలువైపులనుంచి చుట్టుముట్టుతున్న పొగమంచులో ఉక్కిరిబిక్కిరౌతున్నది. టేబిలుమీది కాగితాలు, తనను ప్రశ్నలువేస్తున్న ఆఫీసరు మసకమసకగా కనిపిస్తున్నారు. ముఖంనిండా పోసిన చెమట కంపరమెత్తిస్తున్నది. చేతులు ఉక్కువాటిమాదిరిగా బరువెక్కిపోయినై, కాళ్లు అమితంగా పీకటంప్రారంభించాయి. ఒకటికాదు,రెండుకాదు. మూడు గంటలకుపైగా ఆవిధంగా నిలచిఉండటంచేత కాళ్ళు బాగా వాచిపోయినై. కాలం యెంతయిందోగూడా ఆమెకు తెలియటంలేదు.

శరీరంలోని నరాలన్నీ తెగిపోతున్నట్టవుతున్నది. వీటన్నిటికంటే గూడా తనముందు కూర్చున్న ఆ నీచురాలు - 'పుస్సీ' - ని చూడటం మరీ దుర్భరంగా ఉన్నది, 'ఓలెనా' కి. ఆమెకు 'పుస్సీ' సంగతంతా తెలుసు. 'కర్ట్' కొల్లగొట్టుకువచ్చిన చలికోటుధరించి, ఇమిటేషన్ వజ్రాలు పొదిగిన లోలకులు ధరించి కులుకుతూ అక్కడ కూర్చున్న 'పుస్సీ' ని చూస్తుంటే 'ఓలెనా' కు వొళ్లుమండిపోతున్నది. శరీరంలో సత్తువలేక క్రిందపడిపోయేటట్టున్నదామెస్థితి. కాని ఆ నీచురాలు - జర్మను ఆఫీసరుకి తన శరీరాన్నమ్ముకుని తన ప్రజలకు ద్రోహంచేస్తున్న, ఆ యధమురాలు - ముందు తాను శక్తిహీనురాలై పడిపోదలుచుకోలేదు. తనలోనున్న శక్తినంతాకూడదీసుకుని, నిలబడటానికి ప్రయత్నిస్తున్నది....

'పుస్సీ' తనలోతాను నవ్వుకుంటున్నది. కాని 'ఓలెనా' కు 'కర్ట్' కు మధ్య జరుగుతున్న సంభాషణలుమాత్రం ఆమె మనస్సు

కెక్కటంలేదు. గ్రామంలోని ప్రజలందరు 'కర్ట్' యొక్క సాయుధులైన సైనికుల కాపలాతో అతనివద్దకు లాక్కురాబడుతుంటే, తానొక్కర్తే - గ్రామానికంతా తానొక్కర్తే - యేలాంటి ఆటంకమూ లేకుండా స్వేచ్ఛగా విహరించగలుగుతున్నందుకు గర్వపడసాగింది. వాళ్ళంతా అతన్నిచూచి భయపడటం ఆమెకు సంతృప్తికరంగా ఉన్నది. తనకు మాత్రం ఏమీ భయంలేదు; తానెంత గారాబంచేసినా 'కర్ట్' కోపగించుకోడు. పైగా తాను అతని ముద్దులమిఠారి అని తనను బుజ్జగిస్తాడు ! —

"నువ్వు తల్లివికాబోతున్నావు తెలుసా ?" - అన్నాడు 'కర్ట్'. ఈ మాటలు ఓలెనాకు సముద్రమధ్యంలో మునిగిపోతుండగా తెప్ప దొరికినట్టనుపించినై.

అవును, తాను తల్లికాబోతున్నది! మనోబలం సడలిపోయి, యే అగాధంలోకో జారిపోతున్నట్టుగాఉన్న ఆమెకు యీవిషయాన్ని గుర్తుకి తెచ్చి యెంతో మేలుచేసినట్టు 'కర్ట్' కలలోనైనా అనుకోని ఉండడు. నిస్సారమైన ఆమె జీవితంలో యేదో ఆశాంకురంకలిగింది !

"నీవు తల్లివి కాబోతున్నావు."

'ఓలెనా' యిప్పుడు తన గర్భంలోఉన్న బిడ్డనుగురించి ఆలోచించటంలేదు. తనను 'అమ్మా' అని పిలుస్తూఉండిన ఆ అడవులమధ్య యుద్ధంచేస్తున్న గెరిల్లాయోధులు ఆమె తలంపుకి వచ్చారు. ఆ గెరిల్లా దళంలో అందరికంటే ఆమె పెద్దది. తాను వంతెన పేల్చివేయటంలోను, మరికొన్ని యితరవిషయాలలోను పనిచేసినప్పటికి తనయొక్క ముఖ్యమైన పని అదికాదని ఆమె అనుకునేది. గెరిల్లాయోధులకు గుడ్డలుతకటం, గుడ్డలు కుట్టిపెట్టటం, వంటవండటం, వారికి తగిలిన గాయాలకు కట్లు కట్టటం, వారివద్ద రాత్రింబగళ్లు కూర్చుని ఉపచారాలు చేయటం మొదలగు పన్లు - మాతృదేవికి సహజమైన పనులన్నీ తన విద్యుక్తధర్మంగా నిర్వర్తిస్తుండేది. అందువల్లనే వాళ్ళందరూ 'అమ్మా' అని ఆప్యాయంగా పిలుస్తుండేవారు.

"నీవు అమ్మవు...."

అని అడవులలోని ఆయోధులు అంటున్నట్లనిపించింది. వాళ్ళందరి జీవితాలు తన ఒక్కమాటమీద ఆధారపడిఉన్నాయి. తన విద్యుక్తధర్మాన్ని నెరవేర్చమని యెవరో హెచ్చరిస్తున్నట్లనిపించింది.

"మీదళం యెక్కడ దాక్కున్నదో చెప్పు ?"

'ఓలెనా' కు ఆ అడవిప్రాంతంలోని ప్రతి కోన తేటతెల్లంగా తెలుసును. తన మనోవీధిలో అంత తేటతెల్లంగా అగుపడుతున్న ఆ ప్రాంతాలను జర్మను ఆఫీరు యెక్కడ కనిపెట్టేస్తాడో అన్నట్టు ఆమె భయపడింది. అందువల్ల ఆ తలంపును పారదోలి ఇతరవిషయం యేదైనా ఆలోచించటానికి ప్రయత్నిస్తున్నది. కాని ఆ అడవి, అందులోని తమ రహస్య ప్రదేశాలు, వికసితవదనాలతో ఆ పదహారుగురు గెరిల్లాయోధులు, ఉంగరాలజుట్టుతో వారి నాయకుడు, మొదలగువాటిమీదతప్ప ఆమె మనస్సు అన్యధా నిలవటంలేదు. ఆ పదహారుగురుయోధులు, వారితల్లి, ఆమె మనోఫలకంనుండి తొలిగిపోవటంలేదు. అవును ! ఆ పదహారుగురు గెరిల్లాలు, వీరవరులైన తన ముద్దుబిడ్డలు.

"దళంసంగతి నాకుతెలియదు. వాళ్ళెక్కడికి వెళ్ళిపోయిందీ నాకు తెలియదు."

'కర్ట్' కోపంపట్టలేక బలంకొద్దీ బల్లమీద గుద్దాడు నాలుగు గంటలబట్టి ప్రయత్నిస్తున్నప్పటికి ఒక్కటంటే ఒక్కసంగతైనా ఆపాడు ముండనుంచి తెలుసుకోలేకపోయాననుకున్నాడు. టేబిలుమీద కాగితాలన్నీ తీసి డ్రాయరులో తోసేశాడు.

"ఎవరక్కడ ?"

తక్షణమే ఒక సైనికుడు వచ్చి నిలుచున్నాడు.

"దీనిని తీసుకుపోయి, ఆ కొట్లో తగలెయ్యి." అని సైనికుడితో చెప్పి, 'ఓలెనా' వంక తిరిగి మళ్ళీ అన్నాడు. "చలికైనా నీ తల తిరిగి నోటికివస్తుందేమో ఆలోచించుకో. నీమతం యెప్పుడు మార్చుకుంటే అప్పుడు కాపలామనిషికి చెప్పు." వాడు నాకు వెంటనే తెలియజేస్తాడు.

'కర్ట్' లేచి నిల్చున్నాడు.

"పుస్సీ ! రా, భోజనానికి పోదాము."

'పుస్సీ' ఆనందంతో ఒక్కగంతువేసింది. తానిక్కడికి రావటం యెంత మంచిదయింది ; లేకపోతే 'కర్ట్' ఇంటికి రావటానికి ఇంకెంత ఆలశ్యం చేసేవాడో !

మంచు మీదపడుతున్న కాంతివల్ల కళ్ళు జిగేలుమంటున్నాయి. బరువైన 'కర్ట్' పాదాలక్రింద మంచు 'పుస్సీ' పాదాలక్రిందకంటేగూడా యెక్కువశబ్దంతో నలిగిపోతున్నది. ఆకాశంలో ఒకప్రక్క రంగురంగుల

ఇంద్రధనుస్సు కనబడుతూంది. ఆ దృశ్యం చూడటానికి యెంతయినా ఆహ్లాదకరంగా ఉన్నది.

"అదుగో ఇంద్రధనుస్సు! ఇక్కడ ఈకాలంలోగూడా ఇంద్ర ధనుస్సు పొడుస్తుందా?" - అన్నాడు 'కర్ట్' ఆశ్చర్యంతో.

'పుస్సీ' కొద్దిసేపాలోచించింది.

"అబ్బే! నేనెప్పుడూ యీకాలంలో చూచినట్టు గుర్తులేదు."

భూమ్యాకాశాలకి కలిపే సూత్రంలాగ కనబడుతున్న ఆ రంగు రంగుల ఇంద్రధనుస్సును చూస్తూ నిలబడిపోయాడు 'కర్ట్ వెర్నర్.'

"అబ్బ! రండి; చలికి నాకాళ్ళు రాళ్ళయిపోతున్నాయి".

"ఇంద్ర ధనుస్సు శుభశకునం అంటారుగాదు...."

"ఇంద్రధనుస్సంటే, ఇంద్రధనుస్సే.... అంతకంటే అందులో యేమీలేదు...." అని 'కర్ట్'ని పదమని ముందుకి లాగింది 'పుస్సీ'.

ఇంద్రధనుస్సు అంతకంతకు పెద్దదయి స్ఫుటంగా కనబడసాగింది. ప్రపంచానికి అలంకారంగా వేసిన గాజుకప్పులాగ కనబడుతున్నది ఆకాశం. ఊరిమధ్య చర్చి దగ్గర ఫిరంగుల దగ్గర ఉన్న సైనికులు తలలు పైకెత్తి ఆ సుందర దృశ్యాన్ని చూస్తున్నారు.

'కర్ట్', 'పుస్సీ'లు యింటికి చేరుకునేటప్పటికి 'ఫెదోసియా' బయటనిల్చుని గంభీరవదనంతో ఇంద్రధనుస్సుని చూస్తున్నది.

"ఇంద్రధనుస్సు కనబడటం మంచి శకునం అంటారు" అని 'కర్ట్' మళ్ళీ అన్నాడు.

'ఫెదోసియా' ముఖం ముకుళించింది.

"అవును ఇంద్రధనుస్సు శుభాన్ని సూచిస్తుంది" అని భావగర్భితంగా పలికి, వాళ్ళసద్దర్నీ లోపలికిపోనివ్వటానికి ప్రక్కకు తొలిగినిల్చుని తదేకదృష్టితో ఇంద్రధనుస్సుని చూస్తున్నది. చలిబాధకూడా ఆమెకు తెలియటంలేదు. తనచుట్టూ క్రమ్ముకున్న అంధకారంలో ఆశాజ్యోతివలె కనిపిస్తున్నదా ఇంద్రధనుస్సు ఆమెకు. ఆజ్యోతిలో ఆమె మనస్సు లీనమైపోయింది....



## 2

'పుస్సీ' బంతిలాగ ముడుచుకుని 'కర్ట్' చేతిమీద తలమోపి నిద్రపోతున్నది. ఒకేస్థాయిలో నెమ్మదిగా ఊపిరి పీలుస్తూ విడుస్తున్నది. 'కర్ట్' వెల్లికితల పడుకుని గురకలుపెడుతూ నిద్రపోతున్నాడు. వంటింట్లో పడుకున్న 'ఫెడోసియా' ఆ గురకలువిని సహించలేకుండాఉన్నది. ఆ గురకలే ఆమెకు నిద్ర పట్టనివ్వకుండా చేస్తున్నవనిపిస్తున్నదామెకు. కిటికీ మీద పేరుకున్న మంచు మీదపడి ప్రతిఫలిస్తున్న వెన్నెలను రెప్ప వాల్చ కుండా చూస్తున్నది. బాల్చీలు, స్టూలు, మొదలైన వాటివల్ల వికారమైన నీడలు పడుతున్నాయి.

అబ్బ! ఇప్పటికి రాత్రయింది. చివరికి ఒకరోజు గడిచి పోయిం దన్నమాట. 'ఫెడోసియా' కు జర్మను ఆఫీసరువల్లా, వాడి ఉంపుడు కత్తెవల్లా దినమంతా విరామంలేకుండా పోయింది. ఆమె మనస్సు ప్రతి రోజుకంటే ఇవ్వాళ యెక్కువ మధనపడింది. 'పుస్సీ' చూచే చూపులు ఆమెకు బల్లెపు పోట్లలాగ తగులుతూవచ్చినై. అటు బ్రతుకనివ్వకుండా ఇటు చావనివ్వకుండా ఆమెను యేడ్పించి కొంత ఆనందాన్ని పొంద దలచుకున్నది 'పుస్సీ'. 'ఇదిగో, కర్ట్‌తో చెప్పేస్తాను' అన్నట్టు 'ఫెడోసియా' వైపు మాటిమాటికిచూచి వికృతంగానవ్వి హేళన చేస్తు న్నది. తనను గుప్పెట్లో పెట్టుకుని ఆడిస్తున్నట్టుగా ఉన్నది 'ఫెడో సియా' కు అక్కడ మంచులో పడివున్న బాలునిగతి తనగుప్పెట్లో పెట్టు కుని 'ఫెడోసియా' మాతృహృదయాన్ని యేక్షణాన్నయినా మట్టివేయ టానికి సిద్ధంగాఉన్నది 'పుస్సీ'. ఏ నిముషాన్నయినా జర్మను తోడేళ్ళకు ఆ బాలుని అప్పగించి అతడు మృత్యువులో పొందుతున్న గాఢనిద్రను, శాంతిని భంగపర్చగలదు........

ఆ రోజంతా 'ఫెడోసియాకు హృదయం బండబారినట్టనిపించింది. ఆ నిశీధంలో ప్రక్కగదినుంచి వస్తున్నగురకలు వింటుంటే ఆమెశరీరం

కోపంతో వణికిపోయింది. సహనం కట్టుదాటిపోతున్నది. ఇంకా యేం చేస్తారో చెయ్యనివ్వమనుకున్నది. తన కొడుక్కి యెంత చెయ్యాలో అంతా చేశారు. అంతకంటే యిప్పుడేం చేయగలరు? అతన్ని తల్లికి లేకుండా చేశారు. తలలో గుండు పేల్చారు. శరీరంమీదఉన్న గుడ్డలు కూడా ఊడదీసుకున్నారు. అంతకన్నా యింకేంచేస్తారు! చివరికి అతని ప్రాణాలే వాళ్ళ పొట్టను పెట్టుకున్నప్పుడు, ఆ శవాన్ని యేంచేస్తే మాత్రం పోయేదేముంది? వాళ్లెన్నిచేస్తేమాత్రం తాను పుట్టిపెరిగినగ్రామాన్ని మితి లేని ఉత్సాహంతో రక్షిస్తూ ప్రాణాలు విడిచిన తన ముద్దుబిడ్డడిని గ్రామస్థులు మరిచిపోతారా? ప్రజల భద్రతకోసం, ప్రజల సౌఖ్యంకోసం, ప్రాణాలు అర్పించిన యోధులను ప్రజల మనస్సులనుండి తొలిగించటానికి జర్మన్లు యెన్నిప్రయత్నించినా లాభం ఉండదని ఆమె సంతృప్తిపడ్డది. తమను రక్షిస్తూ ప్రాణాలు విడిచిన యోధులకు చచ్చిపోయినతర్వాత గూడా శాంతి చేకూరనివ్వని జర్మనులను ప్రజలు యెప్పటికీ మరిచిపోరు, క్షమించరు. తన కొడుకు 'వాస్యా' శరీరంనుంచి కారిన ప్రతి రక్తబిందువుకి, అతని శవాన్ని తన్నిన ప్రతి తాపుకి, అతన్ని మంచులో ఉంచిన ప్రతి క్షణానికి ప్రజలు ప్రతీకారం తీసుకొని తీరుతారు!

ఇక యెప్పుడు ప్రొద్దుపొడుస్తుందాఅని కాచుకు కూర్చున్నది 'ఫెదోసియా'. ఆమె గుండె రాయిబారిపోయింది. ఆ నీచురాలు 'ఫ్రస్సీ' దాని జర్మను మగడికి అంతా చెప్పనీ; ఎంత త్వరగా చెప్పేస్తే అంత మంచిది. 'ఫెదోసియా'ను లొంగదీయటానికి మిగిలిన చివరిసాధనం, అక్కడ మంచులో బండబారిఉన్న కొడుకువిషయం జర్మనువాడికి చెప్పనీ, అప్పటికిగూడా 'ఫెదోసియా' లొంగదని, వాళ్ళకి తెలిసిపోతుంది!

'ఫెదోసియా' మాతృహృదయానికి రంపపుకోత పెట్టటానికి ఆ రహస్యాన్ని సాధనగా పెట్టుకొని ఆడుతున్నది 'ఫ్రస్సీ'. కాని ఆ రహస్యంకూడా దానికి పనికిమాలినదే అవుతుందని తెలియదు. 'ఫెదోసియా' దానిని గాని, దాని జర్మను మగణ్ణిగాని దయచూపమని యెన్నటికీ ప్రాధేయపడదు!

'ఫెదోసియా' హృదయం కఠినమైపోయింది. ఆమె నెవ్వరూ యిక లోంగదీయలేరు. హానిచేయలేరు. శత్రువుయెడలద్వేషం ఆమెకు కవచమయింది!

అప్పుడప్పుడు కిటికీమీద ఒక క్రీనీడ పడుతున్నది. ఇంటిముందు కాపలా సైనికుడు గస్తీ తిరుగుతున్నాడు. అతని బూటుకాళ్ళక్రింద మంచు నలుగుతున్నశబ్దం వినవస్తున్నది. 'ఫెదోసియా' తనలోతాను నవ్వుకున్నది. పాపం! ప్రజలనోళ్ళల్లో మన్నుగొట్టి తెచ్చుకున్నపరుపులు, మంచాలమీద తన ఉంపుడుకత్తెతో హాయిగా నిద్రపోతున్న తన జర్మను ఆఫీసర్ని రక్షించటానికి, యెంత శ్రమపడుతున్నాడు! వీడు రాత్రింబగళ్లు యీవిధంగా రక్షించితేమాత్రం వాడి ప్రాణాలు నిలుస్తాయనిగాబోలు వీడి భ్రమ. ఇటువంటి వాళ్ళు వందమందికాదు లక్షమంది రక్షించుతున్నా యెర్రసైనికులు రాకమానరు. ఈ జర్మను నీచుణ్ణి, వాడి ఉంపుడుకత్తెను గొంతునొక్కి చంపేకాలం రాకపోదు. ప్రజల్ని హింసలుపెట్టి చంపిన వారందరిమీద పగతీర్చుకునేసమయం వస్తుంది. నిండు గర్భిణీ అయిన 'ఓలెనా'ను పెడుతున్న యమయాతనలకు తగిన ఫలితం అనుభవించే కాలం వచ్చితీరుతుంది....

'ఓలెనా!' 'ఓలెనా' మాట తలుచుకుంటుంటే ఆమె హృదయం మళ్ళీ బాధపడసాగింది. ఆమెసంగతి యెవరు బయటపెట్టిఉంటారు? ఎవ్వరికీ అనుమానం కలుగకుండా రహస్యంగా వచ్చి ఆమె తన యింట్లో చేరిందే; జర్మన్లకు ఆవిషయం యెలా తెలిసిఉంటుంది? గ్రామస్థు లందర్నీ లెక్కవేసుకుని ఉన్నారంటే అదీలేదు. పోనీ ఆమె బయట తిరగనన్నా తిరుగలేదే! అయినా, పాపం, వచ్చిన రెండురోజులలోనే జర్మన్లు ఆమెయింటికివచ్చి ఈడ్చుకుపోయి; నానాహింసలు పెడుతున్నారు. దీనినిబట్టి చూస్తే గ్రామంలో జరుగుతున్న విషయాలన్నీ గ్రామస్థుల్లోనే యెవరో జర్మన్లకు తెలియజేస్తున్నట్టు తోస్తున్నది. ఎవరో రహస్యంగా 'ఓలెనా'కు 'వాస్యా'కు ద్రోహంచేస్తున్నారన్నమాట గ్రామస్థుల్లోనే ఉంటూ, వారికెవ్వరికీ తెలియకుండా ఒక విరోధి తిరుగుతున్నాడు. జర్మన్లకన్నీ పూసగుచ్చినట్టు చెప్పేస్తున్నాడు. ఎవరైవుంటారు?

'ఓలెనా' గ్రామంలోకి వచ్చి చేరుకున్నసంగతి 'ఫెదోసియా'కు మొదటినాడే తెలిసింది. ఇంకా అనేకమందికిగూడా ఆవిషయం తెలుసును. కాని వాళ్ళందరూ సమిష్టి వ్యవసాయక్షేత్రంలో సభ్యులు. యెర్రసైనికుల ఆత్మబంధువులు అయినవారే. తమ పవిత్ర మాతృభూమిపై పుట్టి పెరిగి, ఈనాడు ఆపవిత్ర మాతృదేవినే కాటువేయదలచుకున్న విషసర్పం యెక్కడ దాగిఉన్నది?

దూరంనుంచి కొన్ని కంఠాలు వినుపించినై 'ఫెడోసియా' కు. మంచు దట్టంగా కురుస్తున్న ఆ నిశీధంలో చిన్న శబ్దంకూడా స్పష్టంగా వినిపిస్తున్నది. కొద్దిసేపటికి పెద్దకేకలుగూడా వినబడసాగినాయి. పడక మీదనుంచి ఒక్కగంతువేసి లేచి కిటికీదగ్గరకు వెళ్ళింది. కిటికీ అద్దంమీద పేరిన మంచు గీకివేసి బయట జరుగుతున్నవన్నీ గమనింపసాగింది. పూర్వం గ్రామ సోవియట్ కార్యాలయంగాఉండి ఇప్పుడు జర్మను సైనిక కార్యాలయంగా మారిన యిల్లు, దానికి దాపునఉన్న ధాన్యపుకొట్టు మొదలైనవన్నీ కనిపిస్తున్నాయి.

వెలుగు పట్టపగలులాగ ఉన్నది చంద్రకాంతితో ప్రపంచమంతా నీలిరంగు పూసుకున్నట్టుగా అగుపడుతున్నది. గ్రామంమధ్యనున్న ఖాళీస్థలం దగ్గర్నుంచి, వంటిమీద సరిగ్గా దుస్తులుకూడాలేని ఒక స్త్రీ పరుగున వస్తున్నట్టు కనుపించింది. కాదు, పరుగెత్తటంకాదు! ముందుకి వంగి భారంగా నడుస్తున్నది. ఆమె పెద్ద కడుపు వెన్నెల్లో స్పష్టంగా కనిపిస్తూ ఉన్నది. ఆమె వెనుక తుపాకితో ఒక సైనికుడు వస్తున్నాడు. అతని తుపాకిమీది విచ్చుకత్తి వెన్నెట్లో మెరుస్తున్నది. ఆమె యెక్కడైనా ఆగిందంటే ఆకత్తివచ్చి ఆమె వీపులో నాటుకుంటున్నది. ఆ సైనికులు ఏదో కేకలు పెడుతున్నారు. ప్రక్కనవున్న ఇద్దరు సైనికులు తిరిగి కేకలు పెడుతుంటే ఆగర్భిణీ స్త్రీ ఆయాసంతో ముందుకి కదులుతున్నది. ఒక యాభై గజాలు ముందుకి పోగానే, మళ్ళీ యాభై గజాలు వెనుకకు తిప్పి తీసుకుపోయేవారు; అదేవిధంగా వెనుకకి, ముందుకి ఆ స్త్రీని పశువుని తోలినట్టు తోలుతున్నారు. మధ్య మధ్య వికటాట్టహాసాలతో 'ఫెడోసియా' చెవులు గింగురుమని పోతున్నాయి.

కిటికీమీద చేయి బిగించి తీక్షణంగా చూస్తున్నది 'ఫెడోసియా'. ఈ జర్మను ఆఫీసరు తన ఉంపుడుగత్తెతో హాయిగా నిద్రపోయేగూడా రాత్రులు తన సైనికులద్వారా యిటువంటి హత్యాకాండ సాగిస్తున్నాడన్నమాట!....

అదుగో, ఆమె 'ఓలెనా' యే! చాలాకాలంక్రితం 'ఓలెనా' తనూ కలిసి ఒక భూకామందుదగ్గర పాలేరుతనంచేశారు. వాళ్ళతో పనిచేయించే మేస్త్రీనిచూచి యిద్దరూ హడిలిపోతుండేవారు. వాడు వీళ్ళమీదకన్ను వేసి, నానా అవస్థలు పెడుతుంటే, ఇద్దరూ కలిసి ఒకరిసంగతి ఒకరికిచెప్పుకుని యేడ్చేవారు. అసలు కూలీయువతులగతి అందరిదీ అలానేఉండేది.

అటుతర్వాత సమిష్టి వ్యవసాయక్షేత్రంలోగూడా యిద్దరూ కలిసి పనిచేస్తూవచ్చారు. తమచేలో పంటలుపండి వారిగిపోతుంటే ఇద్దరూ అమితానందాన్ని పొందేవారు. విప్లవం తర్వాత కలిగిన నూతన జీవితాన్ని యిద్దరూ ఆనందంతో చవిచూచారు.

ఈనాడు 'ఓలెనా'కు ఇటువంటి భయంకరమైన దుర్గతి పట్టింది. ఈక్షణమో, మరుక్షణమో ప్రసవించే ఆమెకు విచ్చుకత్తులు యెక్కుబెట్టి శరీరం మెలికలుతిరిగిపోతున్న చలిరాత్రిలో గుడ్డలన్నీ ఊడపెరికి జోళ్ళులేని పాదాలతో తిప్పుతున్నారు! వెనుకనుంచి యమకింకరుల్లాగ జర్మను సైనికులు అట్టహాసంచేస్తూ విచ్చుకత్తులతో పొడుస్తున్నారు!!....

'ఫెడోసియా' కేకలు వెయ్యలేదు; ఏడ్వనూలేదు. ఆమె హృదయంలోని రక్తం గడ్డకట్టుకుపోయినట్టయింది. ఈ జర్మను పశువులు యిక్కడున్నంతకాలం యీ ఘోరాలు యిలానే సాగుతుంటాయనుకున్నది. తాము యెంతటిపని చేయటానికైనా వెనుకాడమని తమ ప్రజ్ఞ చూపించుకుంటున్నారు. ఆ బాధలన్నీ 'ఓలెనా'కు పెడుతున్నట్టనుపించలేదు. తననే ఆవిధంగా కటికి మంచులో వివస్త్రనుచేసి విచ్చుకత్తులతో పొడుస్తూ నడిపిస్తున్నట్టనిపిస్తున్నది 'ఫెడోసియా'కి. ఆ జరుగుతున్న చిత్రవధ, అవమానం, ఒక్క 'ఓలెనా'కే గాక, గ్రామానికంతటికీ జరుగుతున్నట్టుగా తోచిందామెకు.

ఆవిధంగా కిటికీలోంచి గంభీరంగా చూస్తున్నది 'ఫెడోసియా'. జర్మన్లు తమయొక్క నిజరూపం గ్రామస్థులకి చూపిస్తున్నారు. అంతేగాక జర్మనుసైనికులు గ్రామస్థులకు మరొక సత్యాన్నిగూడా వెల్లడిచేస్తున్నారు. వీళ్ళ నీచకార్యాలతో గ్రామస్థులు సోవియట్ విధానంయొక్క ఉత్కృష్టతను తెలుసుకొనేటట్లుచేస్తున్నారు. జర్మన్లు ఏ గ్రామంలోగాని కనీసం ఒక్కదినమైనా తమ రక్తపాతపు రాజ్యవిధానాన్ని ప్రజలకు చూపించిఉంటే, గ్రామస్థుల్లో యే సోమరిపోతుకిగూడా జన్మజన్మాలకు సోవియట్ విధానం అంటే నిర్లక్ష్యం యేర్పడదు, అనుకున్నది 'ఫెడోసియా'. మళ్ళీ తమ జీవితాల్లో యీవిషయాలు మరిచిపోలేరు! ఈ మధ్య గ్రామంలో జరిగిన స్త్రీల సభలు 'ఫెడోసియా' స్మృతిపథంలోకివచ్చినాయి. వారి జీవితవిధానం యేవిధంగా అన్ని భయంకర సమస్యలను పరిష్కరిస్తూ వస్తున్నదో ఆమెకు తేటతెల్లమైనది.

'ఓలెనా' క్రిందపడి మళ్ళీ లేచింది. అదంతా సహించటానికి 'ఓలెనా'కు యింతటిశక్తి యెక్కడినుంచి వచ్చింది? 'ఫెడోసియా'కు తెలుసును. తనహృదయంలాగే 'ఓలెనా' హృదయంకూడా ఎట్టి బీభత్సాన్నయినా ఎదుర్కొనగలిగే మహత్తరశక్తినిచ్చే ద్వేషంతో నిండిఉన్నది.

ప్రతియింటిలోనివారు కిటికీల అద్దాలలోంచి ఆభయంకర దృశ్యాన్ని చూస్తూనేఉన్నారు. 'ఓలెనా' తోపాటు వారందరి హృదయాలు ఆమంచులో క్రిందపడుతూ లేస్తూ ఉన్నాయి; విచ్చుకత్తుల పోట్లను పొందుతూ ఉన్నాయి! అలా చిత్రవధ చేస్తున్న రక్కసుల నవ్వులు అందరి చెవులను బ్రద్దలు చేస్తున్నాయి!! —

గ్రామస్థులందరికండ్లు తనవైపే ఉన్నవని 'ఓలెనా' కి గూడా తెలుసును. ఇదే ఆమె స్వగ్రామం. ఇక్కడే ఆమె అనేక కష్టసుఖాలనుభవించింది. ఇక్కడే తన ఆనందమయజీవితాన్ని సృష్టించుకున్నది...

మంచుముక్కలు గుచ్చుకునిపడ్డ గాయాలనుంచి రక్తం స్రవిస్తున్నది. సహించలేనిబాధ! తల తిరిగిపోతున్నది. తూలిపోయి, క్రిందపడిపోతున్నది. తుపాకి మడమలతో తగులుతున్న దెబ్బలు ఆమెకు తెలియటమేలేదు! క్రింద పడుతున్నప్పటికీ, సైనికులు కొడుతున్నారనిగాక— జర్మను నీచుల కాళ్ళదగ్గర తన శరీరం ఉంచటానికి యిష్టపడక—అతి ప్రయత్నంమీద లేస్తున్నది. తన సహన శక్తిని వాళ్ళు ఓడించామని గర్వపడకూడదని ఆమె పట్టుదల! నిజానికి తనశరీరానికి యేమి జరుగుతున్నదీగూడా తెలియని స్థితిలోఉన్నదామె. అంతాకలలాగ కనిపిస్తున్నది. శరీరంనుంచి రక్తపుముక్కలుజారి మంచుమీదపడి గడ్డకట్టుకుపోతున్నాయి. అడవికిపోయే రోడ్డు, సైనికులు లీలగా కనిపిస్తున్నారు. చెవిలో యేదో సంగీతం వినిపిస్తున్నట్టుగావుంది. 'కర్లీ' "అమ్మా" అని చిరునవ్వుతో పిలుస్తున్నాడు! చుట్టూ అడివి కనిపిస్తున్నది. ఒకచోట తాను పేల్చివేసిన వంతెన కాలుతుండటం కండ్లకగుపడుతున్నది. భర్త 'మికోలా' యుద్ధానికిపోతూ కడసారిగా ఆమెనుచూచి రోడ్డు మలుపుతిరిగి పోతుండడం కండ్లకు కట్టినట్టుగా ఉంది....

'ఓలెనా' మళ్లీ కిందపడ్డది. ఈ సారి చాలా ప్రయత్నంమీద లేచి విలచోగలిగింది.

"త్వరగా!" అని ఆమెవెనుకనున్న సైనికుడు కేకపెట్టాడు.

"పొట్టమీద ఒక్కటివ్వరా ...హుషారు పుడుతుంది" అని సలహా యిచ్చాడు ఒక జర్మను పశువు.

"అట్లాగైతే యీ లోగానే చచ్చి ఊరుకుంటుందోయ్. దీన్నుంచి ఇంకా యెన్నిసంగతులు లాగాలనుకున్నావు....ఇంతవరకు ఒక్క అక్షర మన్నా బయటపెట్టిందికాదు ముండ" అని నవ్వి విచ్చుకత్తితో ఒక్క పోటు పొడిచాడు రెండవవాడు.

"మన కెప్టెన్ దీన్ని యింతటితో వదిలాడనుకుంటున్నావా? దీన్ని పీకె కొరికి మరీ చెప్పిస్తాడు అన్ని సంగతులూ"

"అది నిజమేలే....ఒసే, నడువు...." అని అరిచాడు ఆమెను నడిపిస్తున్న జర్మను సైనికుడు.

"పొడవరా! ఒక్కపోటు పొడువు"

అంటుండగా విచ్చుకత్తి ముందుకి పోయింది. 'ఓలెనా' వీపు నుండి రక్తపుచుక్కలు కారసాగాయి.

"నడువు. త్వరగా....రంకుమగడితో షికారుకెళుతున్నట్టుగా నడుస్తున్నావే?...."

తాము మాట్లాడుతున్నది 'ఓలెనా'కు అర్థం అవుతున్నదా లేదా అను ప్రశంస వారికి లేనేలేదు. నోటికివచ్చినట్టు వాగుతూ తమలోని పశుత్వాన్ని వెకిలినవ్వుద్వారా వెలిబుచ్చుతున్నారు. చివరికి వాళ్ళకేవిసుగు, కోపము పుడుతున్నాయి. ఈ ముండ లేకపోతే హాయిగా ఇంటిలో వెచ్చగా కూర్చుందుముగదా అనుకున్నారు. రాత్రి గడుస్తూన్నకొద్దీ చలి భయంకరరూపందాల్చుతున్నది. తమలో రేగుతున్న కోపాన్నంతా 'ఓలెనా' మీద చూపిస్తున్నారు.

ప్రపంచాన్నంతటిని కప్పివేసిన పొగమంచు ఆకాశంలోకిగూడా చొరుచుకుపోయి, చంద్రుణ్ణికూడా మంచుగా ఘనీభవింపజేసిందా అని పిస్తున్నది. పండు వెన్నెల్లో లీలామాత్రంగా కనిపిస్తున్నది. ఆకాశంలో ఒకమూల ఇంద్రధనుస్సు.

"పదవేముండ!"—అని జర్మను సైనికులు మొఱటుగా కేక వేశారు ఊరికే అరవాలనేగాక, ఆ నిశీధంలో గుండెలు పీచు పీచు మంటుంటే భయం పోగొట్టుకోటానికి మరి కొంత అలా అరుస్తున్నారు. అటువంటి భయంకరమైన రాత్రి ఆ జర్మన్లు యెప్పుడూ చూచిఉండలేదు. గ్రామమంతా నిశ్శబ్దంలో మునిగిఉన్నది. వెన్నెలమంచుమీద తళతళ

లాడుతూ మెరుస్తున్నది. ఆ కాంతిలో నల్లగా గభీరంగా కనిపిస్తున్నాయి యిండ్లు. నిర్మానుష్యమైఉన్న వీధుల్లో ఆ యిండ్లు జర్మన్లను హుంకరించి చూస్తున్నట్లుగా ఉన్నాయి. అసలు చీకటిరాత్రులైతే జర్మన్లు బయట అడుగైనా పెట్టి ఉండేవారుకాదు. బయట కాలుపెడితే ప్రతివీధిమలుపులో, ప్రతి పొదచాటున, ప్రతి క్రీనీడలో చావు వారికోసం పొంచిఉంటుందని వారికి తెలుసు మెఱుపులాగ యేక్షణాన్న తన్నుకుపోతుందో! కాని యివ్వాళ్ళ వెన్నెట్లో అన్నీ తేటతెల్లంగా కనిపిస్తున్నప్పటికి ఆ జర్మన్ల హృదయాలు పీచుపీచుమంటూనే ఉన్నాయి. ఒక్కొక్కసారి హఠాత్తుగా ఆగిపోయి ఇండ్లప్రక్కపడే నీడలవైపు భయంతో తేరిపారచూస్తూ కేకలు పెడుతుండేవారు. చలికి వారి ముఖాలు పగిలిపోతున్నాయి. అరచేతుల్తో చెవులు రుద్దుకుంటూ బెదురుగుండెల్తో అడుగులు వేస్తున్నారు.

చివరికి వాళ్ళకే విసుగెత్తిపోయింది. 'ఓలెనా' తూలిపడిపోవటం మరీ యెక్కువయింది. మళ్ళీ లేవటంకూడా మహాకష్టంగాఉన్నది. అన్ని బాధలు పడుతూగూడా యేడ్వటంలేదు. చివరికి నోటివెంట ఒక్క శబ్ద మన్నా రానివ్వటంలేదు. ఆ బాధలకు లొంగి, వారికి అవసరమైన సంగతులు చెప్పేసూచన యెక్కడా కనబడటంలేదు. కాని చలిమట్టుకు మరీ భయంకరమైపోతున్నది. కాళ్లు చేతులు ముఖాలు పగిలిపోతుండటమేగాక, ఊపిరిపీల్చటంకూడా కష్టసాధ్యమైపోతున్నది. గొంతుకలుకూడా బాధ పెడుతున్నాయి. కండ్లల్లో నీళ్లు తిరుగనారంభించినవి. శరీరాలు గజగజ వణికిపోతున్నాయి.

"హుషారుగా నడవాలి. ఇంటిముఖం....త్వరగా నడువ్...."

ఈలలువేసురుటూ, కేకలుపెడుతూ పశువును తోలినట్టు ఆమెను ధాన్యపుకొట్టువైపుకి తోలుకుపోయారు. తలుపుదగ్గర గుమ్మం తగిలి ధాన్యపు కొట్టులోపల బోర్లబడిపోయింది. కడుపుకి దెబ్బతగలకుండా చేతులుపెట్టి ఆపుకున్నది. తల గొడ్డళ్ళతో కొట్టినట్టు బాధపెడుతున్నది. గుండె విపరీతంగా కొట్టుకుంటున్నది. కొద్దిసేపటికి చలి తన భయంకర కౌగిట్లో 'ఓలెనా'ను చిక్కించుకుని నలిపివేస్తున్నట్టనుపించిందామెకు. ఇంతవరకు యెక్కడ తగిలినవోకూడా తెలియని గాయాలు కారంజల్లినట్టు భగ్గున మండసాగాయి. అతి ప్రయాసమీద లేచి కూర్చుని భుజాలు, నడుము, కాళ్లు చలితో బండబారిన చేతుల్తో రుద్దుకొనసాగింది. చెక్కల సందుల్లోంచి చంద్రకాంతి అక్కడక్కడా చారలుగా పడుతున్నది. ఎందు

గడ్డి ఒకమూల కనుపించింది. 'ఓలెనా' అక్కడికి దేకుకుంటూపోయి, గడ్డిలో మేను వాల్చింది.

"చలితో బిందబారి చచ్చిపోతాను" — అనుకున్నదామె. అట్లా తలచుకున్నప్పుడు కొంత హాయి అనిపించింది.

ఆమె తోలుకోటు, శాలువకూడా జర్మను ఆఫీసరు ప్రొద్దుట లాక్కున్నాడు. తక్కిన గుడ్డలన్నీ యిందాకనే జర్మను సైనికులు ఊడదీసి, మంచులో యింతసేపు గొడ్డుని తోలినట్టు తోలారు. ఒకవేళ ఆ గుడ్డలు అక్కడేన్నా మరిచి వెళ్ళిపోయారేమోనని గదిఅంతా కలియజూచింది. లేదు! ఒక్కటికూడా వదిలిపెట్టి పోలేదు. అక్కడ పడిఉన్న యెండు గడ్డే ఆమెకు ఆధారమయింది.

బయట అంతా నిశ్శబ్దంగా ఉన్నది. బహుశా, కాపలా ఉండటం అనవసరమనుకున్నారుగాబోలు — తలుపుతాళంమాత్రంవేసి వెళ్ళిపోయారు సైనికులు.

'ఓలెనా'కు శరీరమంతా కారం చల్లినట్టు భగ్గుభగ్గున మండుతున్నది. నిద్ర రావటంలేదు. నిద్ర పట్టేస్తుందేమోనని భయంకూడా వేసింది. నిలువుగుడ్లు వేసుకుని చెక్కల సందుల్లోంచి పడుతున్న వెన్నెల వైపు చూస్తున్నది.

హఠాత్తుగా యేదో శబ్దం వినుపించింది. చెవులు నిక్కపొడుచుకుని వినసాగింది 'ఓలెనా'. భూమిమీద మంచు చిదుగుతున్న శబ్దం వినుపిస్తున్నది. జర్మను సైనికుల బరువైన పాదాలశబ్దంమాత్రంకాదది. ఎవరో నెమ్మదిగా, జాగ్రత్తగా ఇటువైపే వస్తున్నట్టున్నది. కొద్దిసేపు శబ్దం వినుపించి ఆగిపోతున్నది. మళ్ళీ వినవస్తున్నది. ఎవరో పాకుకుంటూ దగ్గరికి వస్తున్నారు. 'ఓలెనా'కు భయం పుట్టింది. ఏమిటది? ఎవరైఉంటారు?

అంతలోనే సవ్వడి ఆగిపోయింది. బహుశా తాను భ్రమపడుతున్నానేమోననుకున్నది. కాని శబ్దం మళ్ళీ వినబడసాగింది. సందేహం లేదు — యెవరో వస్తున్నారు! అటు నిరీక్షిస్తూ కూర్చున్నది, 'ఓలెనా'. శబ్దం సమీపించసాగింది. ధాన్యపు కొట్టువెనుక అటువైపునుంచి వస్తున్నదాశబ్దం. చివరికి యెవరోవచ్చి కొట్టు బయట చెక్కగోడలప్రక్క నిల్చున్నారు. ఆ వ్యక్తి ఊపిరి పీలుస్తున్నశబ్దంగూడా వినబడసాగింది. ముందుకి వంగి చెక్కసందుల్లోంచి చూస్తున్నట్టుగాకూడా తెలుస్తున్నది.

ఎవరది ? విరోధులో, స్నేహితులో ? లేక దారినపోతున్నవారా ? చీకటిపడ్డతర్వాత బయట కాలుపెట్టడమంటే మృత్యువుతో చెలగాటమైన యీరోజుల్లో బయట తిరిగేవారు కూడా ఉంటారా ?

"అత్తయ్యా !"— అని ఒకసన్నని కంఠం వినుపించింది.

'ఓలెనా' నిశ్చేష్టురాలై పోయింది. గోడవెనుక పసికంఠం వినుపిస్తున్నది. జవాబివ్వాలనుకున్నది. కాని ఒకమూల్గుమాత్రం ఆమె గొంతు నుండి వినిపించింది.

"'ఓలెనా' అత్తా !"

'ఓలెనా' పొరుగింటివారి పిల్లవాడు దొంగతనంగా వచ్చి పిలుస్తున్నాడు. ఆమె మళ్ళీ ఒకసారి మూల్గింది.

"ఓలెనా, అత్తా! నీకోసం రొట్టె తెచ్చాను."

రొట్టె ! రెండురోజులబట్టి ఆమె రొట్టెముఖం చూడలేదు. ఒక ముక్క రొట్టెకుగాని, గుక్కెడు నీళ్ళకుగాని నోచుకోలేదు. ఆకలిమాట అటుంచి, దాహంమాత్రం విపరీతంగా వేస్తున్నది. ప్రొద్దుట 'కర్ట్' ప్రశ్నలు వేస్తున్నప్పుడే అమితంగా దాహం వేసింది. ఇందాక జర్మను సైనికులు ఆమెను విచ్చుకత్తులతో పొడుస్తూ తిప్పుతుండగా, క్రిందపడి నప్పుడల్లా యింతింతేసి మంచుముద్ద నోట్లో వేసుకుంటూవచ్చింది. ఆ విధంగా ఆమె నోరుకొంత తడిపడ్డది. కాని అది జర్మన్ల కండ్లబడి అది కూడా సాగనిచ్చారుకారు. చివరికి పెదిమలమీద పడుతున్న మంచుతో నాలిక తడిచేసుకుంటూ వచ్చింది. ఇప్పుడు ఆకలిగూడా తీవ్రంగాఉన్నది.

తనకూ, ఆ పిలుస్తున్న పిల్లవానికీ యెంత దూరమున్నదో చూచుకొని, తనలో ఉన్న శక్తినంతా కూడదీసుకుని "వస్తున్నాను" అన్నది.

నిలబడటానికి శరీరంలో శక్తిలేకపోతున్నది. కాళ్ళు చేతులమీద దోగాడుతూ అటువెళ్ళింది. వీపు కాళ్లు అపరిమితంగా బాధపెడుతున్నాయి. అట్లానే ప్రాకింది. ఇంతలో నిశ్శబ్దాన్ని ఛేదించుకుంటూ హఠాత్తుగా చెవులు చిల్లులు పడేటట్లు ఒక తుపాకి శబ్దం వినుపించింది. వెంటనే ఒక పెద్దకేక! 'ఓలెనా' కదలకుండా కూలబడిపోయింది. గోడవతల యేమి భయంకరమైన సంఘటన జరిగిందో కొంతసేపటికిగాని అర్థంకాలేదు. నోరువెళ్ళబెట్టి ఆ నల్లటిగోడవైపు పిచ్చిగా చూస్తున్నది. కొద్దిసేపటికి జర్మన్లు తిట్టుకుంటూ అటువైపు రావటము, యేదో మెత్తని వస్తువుమీద తుపాకి మడమలతో బాదటము వినబడింది. 'ఓలెనా' నిశ్చేష్టురాలై వినసాగింది.

ఇంకేదైనా శబ్దం వినబడుతుందేమోనని చూచింది. కాని యేమీ వినబడటంలేదు. బాగా గురిచూచి తుపాకి పేల్చివుంటారు ....

ఈరెండురోజులబట్టి శరీరంమీద పడిన గాయాలన్నీ ఒక్కసారిగా బాధపెట్టి శరీరాన్ని మెలికలు తిప్పేస్తున్నాయి. కండ్లు చీకట్లు క్రమ్మసాగినాయి. స్మృహతప్పి ఆ కటికినేల మీద పడిపోయింది.

తుపాకి పేల్చిన శబ్దం, దానివెంటనే వచ్చినకేక గ్రామమంతటా ప్రతిధ్వనించాయి. 'ఓలెనా' ను బంధించిన ధాన్యపు కొట్టుకి సమీపంలో ఒకయింటి కిటికీలోంచి మూడు ప్రాణులు బయట జరుగుతున్నదంతా ఆత్రుతతో చూస్తున్నవి—

"అమ్మా! మిష్కా. అమ్మా, మిష్కా!!"— అని అమాయకపు పిల్ల 'జీనా' యేడుస్తున్నది.

కేకలు పెట్టొద్దన్నట్టు 'మాల్యూచికా' ఆ పిల్లచెయ్యి గట్టిగా నొక్కింది.

"అరవ్వొద్దు!"

"అమ్మా! 'మిష్కా' ని వాళ్ళేం చేశారు?"

"కనబడటం లేదూ? 'మిష్కా' ని చంపేశారు" అని ఆమె రుద్ధకంఠంతో అన్నది.

ఎనిమిదేళ్ళ 'సాషా' కిటికీ దగ్గర్నుంచి ముందుకి పరుగెత్తుకు వచ్చి, "అమ్మా! 'ఓలెనా' అత్తయ్యకి నేను రొట్టె పట్టుకెళతాను" అన్నాడు.

"వద్దు! తెల్లవారిందాకా బాగా కాపలా కాస్తుంటారు" అని కాసేపాగి "అయినా యింట్లో రొట్టెలేదు. ఉన్న కొద్దిరొట్టెముక్కా 'మిష్కా' ఇందాక తీసుకెళ్లాడు" అన్నది గంభీరవదనంతో.

'సాషా' మళ్ళీ కిటికీ దగ్గరకు వెళ్ళిచూచాడు. కాని యేమీ కనబడలేదు.

ధాన్యపుకొట్టు చెక్కగోడలదగ్గర 'మిష్కా' బోర్లపడి ఉన్నాడు. తుపాకిగుండు భుజందగ్గర వీపులోంచి దూసుకుపోయింది. కేకపెట్టే వ్యవధికూడా లేకుండా ప్రాణాలు యెగిరిపోయినాయి. జర్మను సైనికుడు బూటుకాలితో శవాన్ని ఒక ప్రక్కకి తోశాడు. అతని గుప్పెట్లోంచి ఒక రొట్టెముక్క దొర్లింది.

"పంది ముండాకొడుకు దానికోసం రొట్టె పట్టుకొచ్చాడు" అని మళ్ళీ శవాన్ని యింకొకతాపు తన్నాడు

"ఇంకొక్క నిముషమైతే దానిచేతిలో పడిపొయ్యేదే! బయటికి వస్తూనే యేదో యిక్కడ కదలుతుండటంచూచి తుపాకి యెక్కుపెట్టి ఒక్కయేటు వేశాను."

"మొత్తానికి భలే గురిపెట్టి కొట్టావురా!...." అన్నాడు రెండవ సైనికుడు.

"కాదుమరీ! నా గురి యేనాడూ తప్పుపోదే....అయితే వీడ్నిప్పుడేం చేద్దామంటావు? ఇక్కడ వదిలేద్దామా?"

"కాదు. ఆ పక్క కందకంలోకి యీడ్చేస్తే మంచిది."

ఇద్దరూ ఆ కుట్టవాడి కాళ్లు చెరిఒకటి పట్టుకుని ఈడ్చుకుపోయి ఒక్క విసురుతో రోడ్డు ప్రక్కనున్న కందకంలోకి విసిరేశారు.

"ఇక్కడ పడుంటాడ్లే....ఎక్కడ్నుంచి వచ్చిపడ్డాడో ఆశ్చర్యంగా వుందిసుమా!"

"కెప్టెన్ రేపు కనుక్కుంటాడులే. అయినా అందరూ ఒకటే విధంగా మూగదయ్యాల్లా కూర్చుండే వీళ్ళనుంచి మనకేంతెలుస్తుంది."

"మనకెందు కొచ్చింది. కెప్టెన్ యెవర్నో ఒకళ్ళను పట్టుకు తంటాలు పడతాడు"

"అదే కాదోయ్. అసలిక్కడపరిస్థితులే బాగుండలేదంటున్నాను" అన్నాడు.

సన్నని పొడుగాటి రెండవ సైనికుడు తన తుపాకిమీద ఆనుకొని నిలబడి మాట్లాడుతున్నతని వైపు అనుమానంగా చూచాడు అతని ముఖంలో నమ్మకం గోచరించి నట్టుగావుంది.

"అవును. పరిస్థితులేమీ బాగుండలేదు. ఇంటిమీద యావపోయింది నాకు. మా అబ్బాయి 'మైకేల్' యీ పాటికి పది సంవత్సరాలవాడై యుంటాడు. వాడ్ని చూచి అప్పుడే రెండుసంవత్సరాలు దాటిపోయింది."

రెండవ సైనికుడు సానుభూతితో తలఊపాడు.

"పోయిన వానాకాలంలో నేను యింటికెళ్ళొచ్చాను".

"పోయిన తడవ యింటినుండి తిరిగివస్తూ మా 'మైకేల్'కి సైకిల్ తెచ్చిపెడతానని వాగ్దానం చేశాను. కాని రెండు సంవత్సరాలు

దాటిపోయింది. ఇక్కడ్నుంచి పంపుదామంటే, వీలుపడదు." అన్నాడు మొదటి సైనికుడు.

"ఏమీ? మన సార్జెంటు తనయింటికి రెండు సైకిళ్లు పంపలేదూ?"

"అయితేమాత్రం? సార్జెంటు, సార్జెంటే—అతనికీ మనకీ పోలికేనా? మనలాంటి సాధారణ సైనికుడు యింటికి సైకిలు పంపుతానంటే ఒప్పుకుంటారా?"—అంటుండగా యిద్దరూ బయలుదేరారు.

జర్మను సైనిక కార్యాలయంముందు అటూయిటూ తిరుగుతూ కాపలా కాస్తున్నారు. లోపటినుంచి దీపపుకాంతి కనిపిస్తున్నది.

"టైము యెంతయిఉంటుంది?" అని ప్రశ్నించాడు వారిలో ఒకడు.

"ఇంకొక అరగంటలో మన డ్యూటీ పూర్తవుతుందిలే".

నిముష నిముషానికి చలి భయంకరరూపం దాల్చుతున్నది. పొడుగాటి సైనికుడు తలకు ఉన్నిగుడ్డ చుట్టుకున్నాడు. కాని రెండవ సైనికుడు చలికి తికమకలు పడుతూ చెవులూ, ముఖమూ అరిచేతుల్తో రుద్దుకుంటున్నాడు.

"అబ్బ! ఇంతటి చలిలో యిక్కడివాళ్ళు యెట్లా బ్రతుకుతారో?"

"ఈ పశువులకు చలన్నమాటే లేనట్టు కనబడుతుంది!"

"ఇంద్రధనుస్సు పొడిచింది చూచావా?"

"ఓ, చూశాను."

"దానిభావమేమయ్యుంటుంది?"

"ఏముంది? ఈ దేశంలో చలికాలంలోగూడా ఇంద్రధనుస్సు పొడుస్తుందన్నమాట" అంటూ పొడుగాటి సైనికుడు బుజాలు యెగురవేశాడు.

"ఎంత అందంగావుందోచూడు?"

"అవును"—అని సమాధానం చెబుతూ త్రుళ్ళిపడి పొట్టి సైనికుడు దేనికొరకో కలియజూచాడు.

"ఏమిటది, అలాచూస్తున్నావు?"

"అబ్బే! యేమీలేదు."

కాని పొడుగాటి సైనికుడికిగూడా యేదో భయంగానే ఉన్నది. బిత్తరపోతూ చుట్టూ చూచుకున్నాడు.

"ఏమిటోయ్, చూస్తున్నావు? ఎక్కడా యేమీ కనబడందే—" అని కోపంతో అడిగాడు.

"భలేగావుంది. నువ్వుమాత్రం అలా చూడటంలేదూ?"

"ఎవరో రోడ్డుప్రక్కన నడుస్తున్నట్టనుపిస్తుంది. తిరిగి చూద్దును గదా యేమీ ఉండదు. ప్రతి తఫా అలానే అనిపిస్తుంది. మళ్ళీ చూస్తే యేమీ ఉండదు."

ఇద్దరూ భయపడిపోయారు అందువల్ల దూరంపోకుండా సైనిక కార్యస్థానం సమీపంలోనే పచార్లు చేస్తున్నారు, ఇంతలో కార్యాలయం తలుపు తెరుచుకున్నది—

"ఎవరా తుపాకిపేల్చింది?"

"నేనే పేల్చాను. ఒక పిల్లాడు ఆ ఖైదీకి రొట్టె యివ్వటానికి ప్రయత్నిస్తుంటే చంపేశాను"—అని పొడుగాటి సైనికుడు ముందు కొచ్చాడు.

"ఎక్కడున్నదా శవం?"— అని బయటికివచ్చిన సార్జెంటు మళ్ళీ ప్రశ్నించాడు.

"రోడ్డు ప్రక్కనున్న గోతిలో పారేశాము"

"ఏదీ, పోయిచూద్దాముపదండి."

ముగ్గురూ కలిసి రోడ్డుప్రక్కనున్న కందకం దగ్గరకువెళ్ళారు.

"అదుగో, అక్కడే" అని ఒక సైనికుడు అటువైపు వేలితో చూపించాడు.

సార్జెంటు ముందుకివంగి పరీక్షగాచూచాడు.

"ఏదీ, ఏమీకనబడదే?"

"అక్కడే ఉండాలే! ఈడ్చుకొచ్చి యిందులోనే పారేశాము" అని ఆశ్చర్యపోతూ అన్నాడు పొడుగు సైనికుడు.

ఆ యిద్దరు సైనికులూ కందకంలోకిదిగి అటూ, ఇటూ వెతుక నారంభించారు.

"అంతదూరంవెళ్ళి లాభంలేదు. అసలు అంతవరకు పోకనే పోతిమే........"

సార్జెంటు వాళ్ళిద్దరి ముఖాలు అనుమానంతో చూడసాగాడు.

"ఏమిటిది? నాకేమీఅర్థంకావటంలేదు." అని వాళ్ళను గద్దించాడు.

"అదికాదండీ; నా ప్రమాణపూర్తిగా చెబుతున్నాను. ఈకుప్పకు వచ్చి ఆ శవాన్ని యిక్కడే పారేశాము. మామాటల్లో నమ్మకం లేకపోతే ఇదిగో, యివైనా చూడండి...." అని మంచుమీదనున్న రక్తపుమరకలు చూపించాడు ఒక సైనికుడు.

అవి పరీక్షగాచూచి– "ఇదంతా తొక్కేసి ఆచోకీ దొరకటానికి అణుమాత్రమైనా సాక్ష్యం లేకుండా చేసేశారు. చాలా గొప్పగా కాపలా కాస్తున్నారన్నమాట. మీ కళ్ళముందునుంచే శవాన్ని యెవరో యెత్తుకుపోయారు. కాని, యింతకూ మీ మాటలెవరు నమ్మగలరు?" అని సార్జెంటు విసుక్కున్నాడు.

"నిజంగానండీ; తెచ్చి యిక్కడేగదూ పారేసింది! ...."

"దద్దమ్మలు; ఇంకా ప్రాణాలుండగానే పారేసుంటారు. మీ కళ్లు మరిపించి చక్కాపోయుంటాడు."

"లేదు, లేదు! ఒకటే దెబ్బతో గుండు వీపులోంచి దూసుకుపోయి ప్రాణాలు విడిచాడు. ఒక్క నిముషంలోచచ్చి ఊరుకున్నాడంటే నమ్మండి"

సార్జెంటు ధాన్యపు కొట్టుదగ్గరికి వెళ్ళాడు. మంచులో రక్తపు మరకలు ఒక రొట్టెముక్కా కనుపించినై. చిన్న పాదాలగుర్తులుగూడా కనిపిస్తున్నవి.

"ఇక్కడే అది జరిగింది. తర్వాత ఆ గోతిలోనికి యీడ్చివేశాము. ఇంకా కావాలంటే ఆ గుర్తులన్నీ చూడండి"

"అవును"

సార్జెంటుకి నమ్మకం కలిగింది. ఆ యిద్దరు సైనికులు నిజం చెబుతుండడం ఆశ్చర్యంగానే ఉన్నది.

"సరే పదండి. మిమ్మల్నిద్దర్నీ అరెస్టు చేస్తున్నాను" అన్నాడు సార్జెంటు.

"అరెస్టా! ఎందుకు?" అని యిద్దరు సైనికులు నిశ్చేష్టులై పోయారు.

"ఎందుకా నోరు వెళ్ళబెట్టటం? ఈ ప్రాంతం కాపలా కాయటం మీవంతా కాదా? అలాంటప్పుడు, యిదేస్థలంలో మీ ముందే యిలాంటి సంగతులు జరిగిపోతున్నాయంటే అర్థం? నేరస్థుడి శవం దొంగిలించుకుపోయినా మీ యిద్దరికీ యేమీ తెలియనేలేదు! భలేకాపలా కాస్తున్నారు.

మిమ్మల్ని నమ్ముకుంటే. యెవడైనా వచ్చి నిద్రపోతుండగా మా అందరి గొంతుకలు తెగగోసినా దిక్కుండదు.

సైనికులిద్దరూ తలలు క్రిందికి దించుకుని సార్జెంటువెంట వెళ్ళసాగారు.

"దరిద్రపుదేశం" అని గొణిగాడు పొడుగు సైనికుడు, నిట్టూర్చుతూ.

"అసలెవ్వరూ కనబడనేలేదే! ఎవరు దొంగిలించుకుపోయుంటారు చెప్మా!"

పొట్టి సైనికుడు భయంతో వణికిపోతున్నాడు. వంటిమీది రోమాలన్నీ నిక్కపొడుచుకుంటున్నాయి. నిజమే - అసలు అటువైపు యెవ్వరూ వచ్చినట్టేలేదు. చివరికి మంచు చిలికిన అలికిడిగాని, నీడగాని కనబడనేలేదే? అయినా శవం మాయమైపోయింది! ఎలా జరిగుంటుంది?—

తన ప్రశ్నలకు తాను సమాధానం వెతుక్కోటానికే భయంగా ఉన్నది. అడుగులు తొందరగా వేయసాగాడు. భయంకరమైన చలినుంచి తప్పించుకుని వెచ్చగానున్న సైనిక కార్యాలయంలోకి చేరుకునేటప్పటికి ప్రాణం కొంత హాయిమనిపించింది. తాను అరెస్టులోనున్నానన్న సంగతి కూడా మరిచిపోయాడు, కొంతసేపు. ఆ ఇంటి నాలుగుగోడలు ఆ భయంకరమైన రాత్రిని ఓడించేసాయని తృప్తిపడ్డాడు.

"కెప్టెన్ వచ్చింతర్వాత మీ విషయం విచారిస్తాడు. ప్రొద్దుపొడిచేవరకు మీరిక్కడ్నుంచి కదలటానికి వీల్లేదు" అన్నాడు సార్జెంటు.

గదిలో ఒకమూల, నేలమీద యిద్దరు సైనికులూ కూలబడ్డారు. మొత్తానికి వెచ్చగా హాయిగానే ఉన్నది. పొడుగాటి సైనికుడు గోడ కానుకుని మగత నిద్రలో పడ్డాడు. కాని నల్లులు తెగకుడుతున్నాయి. కొంతసేపు మగతలోనే గోక్కొని చివరికి కోపంతో తిట్టుకుంటూ లేచిపోయాడు.

"బయట చలితో చావు. లోపలికొస్తే నల్లుల్తో చావు."

ఇద్దరూ చలిమంట దగ్గరికి చేరుకున్నారు. ఒక్కొక్క నల్లినే తీసి చంపసాగారు.

* * * *

'మాల్యూచికా' రొప్పుకొంటూ కూలబడ్డది. కందకందగ్గర్నుంచి మూడువందల గజాలకుపైగా పొట్టమీద ప్రాకుకుంటూ రావటమంటే

సామాన్యవిషయంకాదు. జర్మను సైనికులదృష్టి పడకుండా ఉండటానికి అనేకసార్లు మంచులో కూరుకుపోయి భూమిని కరుచుకుపోవలసివచ్చింది. కాని యేమైనప్పటికి తన కొడుకు శవాన్ని దిక్కులేని కుక్క శవానికి మల్లే వదిలివేయదలుచుకోలేదు.

తిరిగి వచ్చేటపుడు మరీ కష్టమైపోయింది. తనకొడుకు శవం వీపు మీదవేసుకుని ప్రాకుకుంటూవస్తుంటే అటూ, యిటూ తొలిగి పోతుండేది. కాపలా సైనికులు సైనిక కార్యాలయం ముందు నిల్చుని మాట్లాడుకుంటున్న సమయంలో కందకంలోంచి వీపుమీద వేసుకు ప్రాకుకుంటూ వచ్చేటప్పటికి బాగా అలసిపోయింది. చివరికి యెలాగైతేనేం బిగుసుకు పోయిన 'మిష్కా' శవాన్ని ఇంటికిచేర్చి బల్లమీదఉంచింది. ప్రాణాలు పోయి యెంతోకాలమై పోయినట్టుగా శరీరంబండబారి పోయింది. పిల్లలందరు తమ అన్నశవంచుట్టు చేరారు. కిటికీగుండా వస్తున్న వెన్నెల ప్రాణాలు విడుస్తూ కేకపెట్టినపుడు తెరుచుకొని ఉండిపోయిన అతని చిన్నని నోటీమీదా, అందమైన కురులమీదా ప్రకాశిస్తున్నది. 'జినా' అన్న చొక్కామీద పడిన రక్తాన్ని నెమ్మదిగా తాకి చూచింది.

" ఏమిటిది? "– అని గాయంవైపు చేయిచూపించి అడిగింది.

" అక్కడ తాకొద్దు. గుండుదెబ్బ అక్కడేతగిలింది కదమ్మా?"– అని చెల్లెల్ని వారిస్తూ 'మిష్కా' తమ్ముడు 'సాషా' తల్లిని అడిగాడు.

" అవును, తండ్రీ ఔను! " అని గద్గదకంఠంతో తల్లి అని, 'మిష్కా' తలవెంట్రుకలు దువ్వసాగింది. 'మిష్కా' చనిపోయాడన్న మాట! ఇందాకనేకదూ 'ఓలెనా' కురొట్టె అందివ్వటానికి పొంచివెళ్ళింది!! రొట్టె అందజేసి జాగ్రత్తగా వచ్చేస్తాడనుకున్నదామె, కాని........

" 'మిష్కా 'ను పంపకుండా ఉండాల్సింది." అన్నది చిట్టి 'జినా' బిక్కముఖంతో.

" కాదుతల్లీ, తప్పకవెళ్ళవలసే, వెళ్ళాడు "అని తల్లి జవాబిచ్చింది.

" జర్మన్లు 'ఓలెనా' అత్తయ్యకు తినటానికేమి యివ్వటంలేదుగా...." అని చెల్లెలికి తెలియజెప్పుతున్నాడు 'సాషా.'

" అవున్నాయనా 'ఓలెనా' అత్తయ్య మీనాన్నతో పాటు గెరిల్లా దళంలో ఉంటుండేది. ఆమెనెట్లా బాధిస్తున్నారోచూడు పాపాత్ములు చివరికి మన 'ఓలెనా' ను చంపేస్తారు కూడాను....."

"అమ్మా, నిన్నటి బంగాళదుంపల్లో కొన్ని మిగిల్న వున్నాయిగా, అవి తీసుకెళ్ళిస్తాను" అన్నాడు 'సాషా' పళ్లుబిగించి.

"వద్దునాయనా, వద్దు ఇకనిప్పుడెవ్వరూ అక్కడికి వెళ్ళడం సాధ్యంకాదు. తెల్లవారేవరకూ జాగ్రత్తగానే ఉంటారు. అనవసరంగా ప్రాణాలు పోగొట్టుకోటమౌతుంది. ఎవ్వరూ ఉండరుగదా అని నమ్మకంగా ఉన్నప్పుడే 'మిషా్క' గతిలాగై పోయింది."

"నన్ను కనుక్కోలేర్లే" అని 'సాషా' ఇంకా తన పట్టుదలను చూపించసాగాడు.

"చాల్లే; 'మిషా్క' కే అలివిగాని పని నువ్వేం చెయ్యగలవ్?"

'సాషా' యేమీ జవాబివ్వలేదు. 'మాల్యూచికా' తన కొడుకు తల నిమురుతూ విశ్చలంగా ఉన్న అతని ముఖంలోకి చూస్తున్నది.

"ఎక్కడ సమాధి చేద్దాం? తెల్లవారటంతోనే ఈ శవం కొరకు వెతకటం ప్రారంభిస్తారు. చూశారంటే లాక్కుపోకమానరు"

"మనతోటలో సమాధి చెయ్యొచ్చుగదమ్మా?" అని 'సాషా' సలహా యిచ్చాడు.

"అదెట్లా సాధ్యమౌతుంది? త్రవ్వుతుంటే వింటారు. అదీ గాక ఆనేల కఠినంగా ఉన్నది. గొయ్యి తవ్వటం సాధ్యంకాదు. చివరికి మంచుతో కప్పెయ్యవలసొస్తుంది."

ఏమి చెయ్యాలాఅన్న సమస్యతో కొద్దిసేపు ఆలోచించారు.

"ఏం చేద్దాము?"

"ఇక్కడే పూడ్చి పెట్టెయ్యాలి" అని నెమ్మదిగా అన్నది తల్లి.

"ఇంట్లోనే?" — అని 'జినా' ఆశ్చర్యంతో అడిగింది.

"అవును. ఇంకెక్కడా పాతటానికి వీల్లేదు. పోనీ, మనతోపాటు ఇంట్లోనే వుంటాడు. అంతకంటే చేయదగిందేమీలేదు."

"ఇక్కడ; ఈ గదిలోనే?"

'మాల్యూచికా' నిస్సహాయతతో కొంతసేపు చుట్టూచూచింది —

"ఈ గది తలుపుకి అవతల సమాధి చేద్దాము"

అంతా నడవలోకి వెళ్ళారు. అది సన్నగా, యిరుకుగా ఉన్నది. 'మాల్యూచికా' నేలను పరిశీలించి చూచింది.

"ఇక్కడ తవ్వుదాము 'సాషా'! తలుపు వెనకాలవున్న ఆ పార పట్రా"

(6)

ఎంతవరకు తవ్వాలో గీట్లు గీసుకొని పార భూమిలో గుచ్చింది. భూమి చాల గట్టిపడి ఉన్నది. ఆమె కొద్దిసేపట్లోనే అలిసిపోయింది.

" ' సాషా ' కొద్దిసేపు తవ్వుబాబూ...."

' సాషా ' పార తీసుకొని తన బలంకొద్దీ తవ్వుతున్నాడు. 'జినా' క్రింద కూర్చొని చేతులతో మట్టి తోడుతున్నది.

ఒకరి తర్వాత ఒకరుగా ఆ గట్టి నేలను తవ్వసాగారు. గట్టిగా వున్న పై భాగం తవ్వగానే తక్కినదంతా కొంత సులభంగానే సాగి పోయింది. చివరికి ఒకలోతు గొయ్యితొవ్వగలిగారు.

' సాషా '! అన్నయ్య శవం అట్లానే గోతిలో పెట్టేస్తామా ? "

ఆమె నీళ్లు తెచ్చి ' మిష్కా ' శరీరంమీది రక్తమంతా కడిగింది. పెట్టెలోంచి ఒక చొక్కా తీసి ఆ బిగిసిపోయిన శరీరానికి దిగవేసింది.

" అన్నయ్యా. నీ కెంతగతిపట్టింది ! " అని చిన్నపిల్ల ' జినా ' యేడుస్తున్నది.

" ఏడవొద్దు. మన ' మిష్కా ' యెర్రసైనికుడికిమల్లే వీరమరణం పొందాడు తెలుసా ? దేశంకోసం చచ్చిపోయాడు "

అని ' మాల్యూచికా ' ' జినా ' కు చెబుతున్నది. కాని ఒక విధంగా తనకుతానే చెప్పుకొని సమాధానపడుతున్నదని చెప్పాలి. దుఃఖం పొంగి పొరలి వస్తున్నది. తన కొడుకుమీదపడి గ్రామమంతా మారు మ్రోగేటట్టుగా — తాను పదిసంవత్సరాలు పెంచి పెద్దవాడ్నిచేసిన ముద్దు బిడ్డడు జర్మన్ల తుపాకిగుండుకి యెర అయ్యాడన్న ఆమె దౌర్భాగ్యం అందరికీ తెలిసేటట్టుగా— యేడవాలనిపిస్తున్నది.

"మీ నాన్న గెరిల్లా దళంలోచేరి వెళుతున్నప్పుడు, 'మిష్కా' ను పిలిచి "నా గౌరవం నిలబెట్టాలిసుమా !" అని చెప్పి మరీవెళ్లారు. చివరికి ఆయనమాట నిలబెట్టాడు, నా చిట్టితండ్రి ! "

"అవు - ను.... " అని ' జినా ' వెక్కి వెక్కి యేడుస్తున్నది.

" ఏడవకు తల్లీ ! అట్లా మనం యేడిస్తే మన ' మిష్కా ' కి యీ సమాధిలోగూడా శాంతి ఉండదు. ఏడవకు....ఇదుగో, ఈ గుడ్డ యిటు పట్టుకో, పైన కప్పుదాము.... "

' మిష్కా ' శవాన్ని ఒక తెల్ల దుప్పటితో చుట్టివేసి, నెమ్మదిగా గోతిలోకి దించారు.

" 'జినా' యింతమట్టితీసుకుని మీ అన్నమీద వెయ్యితల్లీ.... " అన్నది 'మాల్యూచికా'.

'జినా' క్రింద కూలబడి, యింత మట్టితీసి 'మిష్కా' శవం మీద నీరసంగా జారవిడిచింది. 'సాషా' కూడా యింత మట్టితీసి అన్న గారి శవంమీద వేశాడు. తర్వాత తల్లి పారతో మట్టితీసి గొయ్యి నింపేసింది. గొయ్యి నిండిపోగా పైన ఒక చిన్న దిబ్బ యేర్పడింది.

" ఈ దిబ్బ కనబడకుండా కాళ్ళతో మట్టి వెయ్యాలి. లేకుంటే రేపు జర్మన్లు వచ్చి యీదిబ్బచూశారంటే, అంతా కనుక్కుంటారు "— అన్నదామె.

ముగ్గురూ కలిసి జాగ్రత్తగా ఆ దిబ్బను తొక్కసాగారు. ఎవ్వరూ, యెన్నడూ కనీ వినీ యెరుగనటువంటిపని తాను చేస్తున్నందుకు - తన ముద్దుబిడ్డడి సమాధిని తానే తొక్కుతున్నందుకు - దుఃఖభారంతో క్రుంగిపోతున్నది. తన 'మిష్కా' శరీరంమీద - తాను పెంచి పెద్దచేసిన బిడ్డడి మృదువైన శరీరంమీద యెక్కి తొక్కుతున్నట్టనుపించింది....

" చెయ్యక తప్పదు.... " అని గొణుగుకున్నది.

" ఇంక చాలదా, అమ్మా ! " అని 'సాషా' అడిగేడు.

" చాలదు, బాబూ; ఇంకా తొక్కాలి దిబ్బ యింకా యెత్తుగానే ఉన్నది. భూమి మట్టం అయ్యేవరకు తొక్కాలి. "

మిగిలిన మట్టినంతా భద్రంగాచేర్చి తీసుకెళ్ళి పొయ్యిమూలపోసింది. సమాధిదగ్గర అంతా ఊడ్చివేసి యెవ్వరికీ తెలియకుండా ఉండటానికి ఇంత యెండుగడ్డి, చెక్కపేళ్లు, తెచ్చి అక్కడ చిందరవందరగా వేసింది.

" ఏమైనా అనుమానం కలిగేటట్టున్నదా ? "

'సాషా' సూక్ష్మంగా పరిశీలించి " లేదు....ఇప్పుడుమట్టుకేమీ కనబడటంలేదు....అయినా ప్రొద్దుపొడిచాక మళ్ళీ ఒకసారి చూద్దాము " అన్నాడు.

'మాల్యూచికా' తన కొడుకు సమాధిని చూచుకుంటూ నిలబడిపోయింది. కొన్ని గంటలక్రితం తన ముందున్న ముద్దుబిడ్డ యిప్పుడు గుర్తుకైనా లేకండా తన కళ్ళముందునుండి మాయమైపోయాడు. ఇంతకు ముందు యెంతో మంచి బాలురు చనిపోయినప్పుడు ఆమె కళ్ళారా చూచింది. కాని వాళ్ళందరికీ గౌరవంగా సమాధులు జరిగేవి. ఈనాడు

తనబిడ్డ అటువంటివేమీలేకుండా అజ్ఞాతంగా తాను పుట్టిన యింట్లోనే యీ మూల తవ్విన గోతిలో ఉండవలసి వచ్చింది।

"పోయిపడుకోండి" – అని పిల్లలనుద్దేశించి అన్నదామె.

"మరి, నువ్వో?"

"నేనుకూడా పడుకుంటాను. ఇంక కొద్దిసేపట్లో తెల్లవారనే తెల్లవారుతుంది। పడుకోండి"

కాని 'మాల్యూచికా' కి కన్నుమూతపడలేదు. 'మిష్కా' సంగతి తన భర్త 'ప్లాటన్' సంగతి ఆలోచిస్తున్నది. 1918 నాటి యుద్ధంలో ఆమెభర్తకు చేతిరెండువేళ్లు తెగిపోయినై. అందువల్ల సైన్యంలోకి పనికి రాలేదు. కాని గెరిల్లా దళంవారు, అతనికి రెండు వేళ్లు తక్కువైనప్పటికీ అతనుచూపే ఉత్సాహాన్నిచూచి తమ దళంలో చేర్చుకున్నారు.

'ప్లాటన్' యింటికి తిరిగిరాగానే 'మిష్కా' యేదని అడుగుతాడు. 'మిష్కా' అంటే ఆయనకు అమితమైన ప్రేమ. కాని తాను యేం జవాబుచెప్పగలదు? "అదుగో, అక్కడున్నాడు।" అనిచెప్పాలా॥

కాని 'ప్లాటన్' మాత్రం ఈ మాటలు ప్రశాంతంగానే వింటాడు. పైగా "ఏడవకు 'మాల్యూచికా।' మన 'మిష్కా' జర్మన్లతో పోరాడుతూ వీర మరణం పొందాడు. దేశంకోసం చనిపోయాడు. మనం గర్వపడాలి।" అని ధైర్యం చెబుతాడు॥

'ప్లాటన్' యుద్ధరంగానికి వెళ్ళిపోతూ అన్న మాటలు ఆమె చెవిలో ప్రతిధ్వనించినై– "'మాల్యూచికా' నువ్వు ధైర్యంతో పని చేస్తుండాలి. స్త్రీలు, పిల్లలు, ముసలాళ్లుగూడా తమ శక్తివంచనలేకుండా కష్టపడి దేశాన్ని రక్షించుకోవలసిన రోజులొచ్చాయి. చేతికేదిదొరికితే అది ఆయుధంగా గ్రహించి దేశాన్ని రక్షించుకోటం మరిచిపోవద్దు।"–

'మాల్యూచికా' కి యేడ్పయినా రావటంలేదు. నిలువు గుడ్లతో నడవలోని తనకొడుకు సమాధివైపు చూస్తున్నది........

* * * *

వీధుల్లో కాపలాకాస్తున్న సైనికులు అప్పుడు జరిగిన విషయాన్ని గురించే యింకా మాట్లాడుకుంటున్నారు.

"దరిద్రపుదేశం. ఆ శవాన్ని యెవరెత్తుకు పోయుంటారబ్బా? కాలు కదిపితే మంచు పరపరలాడుతుంటుంది. అలాంటిది యిక్కడున్న వారికి అలికిడైనా కలుగకుండా శవం మాయం కావటం ఆశ్చర్యంకదూ?"

"ఏమో, యేంచెప్పగలం? ఈ దేశంలో యేదీ అర్థంకాదు" అని అందులో ఒక సైనికుడన్నాడు.

ఈ విధంగా మాట్లాడుకుంటూ భయంతో చుట్టూ చూచుకుంటున్నారు. ఏదో పాదాల చప్పుడు వినిపించినట్టు చెవులు నిక్కపొడుచుకొని వింటున్నారు, కాని యేమీ కనబడటంలేదు. చంద్రునిచుట్టూ పెద్ద వలయాకారం యేర్పడింది.

"కొద్దిగా చలితగ్గినట్టుందికదూ?"

"చలితగ్గిందా? — ఇంకా నయం; నా చెవులు చలికి ఊడిపోయేటట్టున్నయి—"

"అలా ఊడిపోయినా కొంతనయం. హాయిగా హాస్పటల్‌లోపడి ఉండవచ్చు."

"ఆ మాట అసలే యెత్తవద్దు. మొన్న 'మహ్లార్' ని హాస్పటల్‌కి పంపారా? వాడికాళ్ళు పగిలి పాడై పోవటంచూడలేమ?"

"గట్టిగా అనకోయ్—నీపుణ్యముంటుంది"

"ఎవ్వరూ లేరు లెద్దూ...."

"అలానే అనుకుంటావు; కాని రేపటికల్లా అంతా సార్జెంటుచెవిని పడిఉంటుంది"

"నువ్వు చెబితేనే తెలియాలి"

"మళ్ళా ఆమాటన్నావంటే బాగుండదు సుమా"

"అప్పుడే అంత కోపమా? ఏదో మాటవరసకంటే"

పొగమంచు అంతకంతకూ దట్టమై చంద్రునికి తెరగా యేర్పడ్డది. అందమైన నీలివర్ణంలో కనిపిస్తున్నాడు చంద్రుడు.

"నువ్వు యేమన్నా అను—చలిఅంతకంతకు యెక్కువపుతున్నదేగాని తగ్గటంలేదు—"

ఆ యిద్దరు సైనికులు కొంతసేపు మౌనంగా అటూ యిటూ తిరిగారు.

"అన్నట్టు—ఆమనిషి యింకా ధాన్యపు కొట్లోనే ఉన్నదా?"— అని అందులో ఒకడు ప్రశ్నించేడు.

"ఊఁ"

"చలికి బండబారి చస్తుందిలే"

"ఆరి! ఇక్కడి ఆడవాళ్ళను, పిల్లల్ని కూడా ఆపలేకుండా ఉన్నాంరా!"

"ఆహా—ఆ ఆడముండవైపు కన్నెత్తి చూశావంటే, నీప్రాణాలు యెగిరినవన్నమాటే. చిన్న పిల్లలో? ఎక్కడ చూచినా వాళ్ళే నక్కుకుంటూ వచ్చి తయారవుతారు. మనసంగతులు తెలుసుకోటానికి గ్రామస్తులు వాళ్ళనట్లా పంపుతుంటారు."

మళ్ళీ కొద్ది సేపు యిద్దరూ మౌనంవహించారు.

"వీళ్ళను నాచేతికిస్తే—ఆగ్రామంలో కెప్టెన్ చేశాడు చూశావూ?—అలా చేసి వదుల్తాను" అని ఒకడు ప్రారంభించాడు.

రెండనవాడు అవునన్నట్టు తల ఊపాడు.

"మనకువాళ్లు సహాయం చెయ్యరు. వాళ్ళ సంగతంతా నాకు తెలుసు. ఎంత ప్రయత్నం చేసినా లాభం ఉండదు. ఇంత అనవసర ప్రయత్నం చేసేబదులు మొదటగానే తెగనరికితే వదిలిపోతుంది. పైగా భద్రంగా ఉండొచ్చు"

"అంతా అంతే నంటావా?"

"అంతా అంతే. ఎలాంటివారో నువ్వు మాత్రం చూడడటం లేదూ? చిన్నపిల్లలతో సహా యెందుకూ పనికిరాకుండా అయిపోయారు. వాళ్ళను మంచి మార్గానికి తీసుకురావటం అసాధ్యం అనవసరమైన శ్రమే గాని యెందుకూ పనికిరారు"

రెండవ సైనికుడు ఒక నిట్టూర్పువిడిచి ఊరుకున్నాడు. ఇంతలో చంద్రుడ్ని మబ్బుకప్పేసింది. రోడ్డుపక్కనున్న చెట్టుకొమ్మలు ఊగ నారంభించాయి. కొమ్మలమీది మంచు జల్లుగా పడుతున్నది.

"ఇంత వెన్నెలా ఒక్కక్షణంలో యెట్లామారిపోయిందోచూడు! గాలి మారుతున్నట్టున్నదికదూ?"

"గాలిదుమారం లేచేటట్టున్నది."

గాలి తీవ్రంగా వీచనారంభించింది. అక్కడక్కడా సుడులు తిరుగుతూ మంచును పైకి లేపుతున్నది. గాలితోపాటు మంచువచ్చి తీవ్రమైన వడితో శరీరాలకు తగులుతున్నది.

"టైమెంతయింది?"

"అబ్బో. పొద్దు పొడవటానికి చాలాటైమున్నది."

మంచు కప్పిఉన్న పొలాలమీదుగా ఒక గంభీరమైన శబ్దం అంత కంతకూ దగ్గరగా యెక్కువవుతూ వినబడసాగింది. అది గ్రామం సమీపించేటప్పటికి 'కీ' మను శబ్దంలోకిదిగింది. చెట్లు ఊగులాడిపోతున్నవి. మంచు గాలితో పైకి లేచి వెండివర్షంలాగ కిందికి పడుతున్నది. కాపలా సైనికులు కాలు ముందుకి కదపలేక గాలివైపు తలలు వంచి నిల్చున్నారు. గాలి ఒక్కొక్కతడవ ఒక్కొక్కవైపునుండి వీచసాగింది. వెనుకనుండి వీస్తున్నప్పుడు సులభంగా ముందుకి పోగలుగుతున్నారు.

"నాశనపు చలికాలం. మళ్ళీ గాలిసమూహం ప్రారంభించింది. యే వస్తువూ కనుపించదీ గాలిలో"

ఇద్దరూ ఒక్కసారిగా భయంతో వెనక్కితిరిగి చూచారు. కాని యేమీ కనుపించలేదు. అంతాశూన్యం........



# 3

"ప్రేయసీ, 'లూయిసా':"

కెప్టెన్ 'కర్ట్ వెర్నర్' తాను వ్రాస్తున్న ఉత్తరంమీదినుంచి దృష్టిని కిటికీవైపుకి మరల్చాడు. బయట తీవ్రమైన గాలి దుమారంలేచింది. గ్రామంలోని యిండ్లన్నీ కదలిపోతున్నట్టుగా ఉన్నాయి.

విచారంతో 'కర్ట్' హృదయం బాధపడసాగింది. ఇతర ప్రపంచంతో సంబంధం లేనట్టు; మంచుయెడారిలాగఉండే యీ భయంకర చలి దేశంలో భార్యా, బిడ్డలకు దూరమైపోయి ఉండడం కష్టంగాఉన్నది. 'డ్రెస్‌డెన్' లోని తనభార్యా, బిడ్డల్నిచూచి చాలాకాలమయింది. ఫ్రాన్సునుంచి తనదళం ఇక్కడికి మారివస్తున్నపుడు ఒకరోజుపాటు అయినా యింటికి పోయివచ్చేటట్టు యేర్పాటు చేసుకుందామనుకున్నాడు.

కాని ఈ రంగానికి ఆదర బాదరగా మార్చేటప్పుడు 'డ్రెస్‌డెన్' మీదుగా వచ్చినప్పటికీ, అక్కడ ఎవ్వరూ దిగకూడదన్న కఠినమైన ఆజ్ఞ అధికారులు యివ్వటంవల్ల, చివరికి గ్రామంలోకి ఒక్కసారివెళ్ళిరావటానికైనా వీల్లేకపోయింది. రైలుపెట్టె కిటికీలోంచి తన ఇంటివైపు చూచుకొని ఒక నిట్టూర్పు మాత్రం విడిచాడు. ఇప్పుడు చివరికి ఒకగంట, అలాకాకపోతే ఒక పది నిముషాల పాటయినా ఇంట్లో కుటుంబంతోపాటు హాయిగా ఉండాలని హృదయం తపించి పోతున్నది. అక్కడ ఈ గాలిదుమారాలు, ఏ నిముషాన్నయినా తన్ను కబళింపజూజే మృత్యువు ఉండదు. తనకుటుంబము యిప్పుడు వెచ్చగా కుర్చొని కాఫీత్రాగుతూ ఉండలి. 'లూయిసా' అందరికీ రొట్టె పంచుతుంటుంది. ఆమె మృదువైన హస్తంతో యిచ్చే కాఫీ త్రాగే భాగ్యం తనకు మళ్ళీ యెప్పుడు కలుగుతుంది?

ఇక్కడ తన జీవితమంతా అసహ్యమనిపించింది. మధ్యాహ్నం వరకూ పక్కమీదినుంచి లేవకుండా, యేదానికీ మూతి ముడుచుకుంటూ

ఉండే 'పుస్సీ' ని చూస్తే రోతపుడుతున్నది. ఇల్లు ఊడవటంరాదు. చిప
రికి పక్కసర్దటానికికూడా పళ్లొంగని మనిషిది. ఇంటినిండాచెత్త, చిందర
వందరగా పడివున్న వస్తువులు చూడటానికి అసహ్యమనిపిస్తున్నాయి.
ఎప్పుడూ యిల్లు చక్కబెడుతూ, అన్నీ శుభ్రంగాఉంచే 'లూయిసా' జ్ఞాప
కానికివచ్చింది....అన్నిటికంటే యిక్కడి ప్రజల్ని చూస్తుంటే మరీ వొళ్లు
మండిపోతున్నది. ప్రతివాడు తనను ద్వేషించేవాడేగాని, ఒక్కడూ గౌర
వించేవాడు కనబడడు. దారిని పోతున్నవాళ్లు తమదృష్టిని భూమి మీదే
ఉంచుతారుగాని తనవైపు మరల్చటానికి యిష్టపడరు. తనకు ఆనందం
కలిగించే—తానంటే భయంకాని, గౌరవంకాని—యేకోశాన చూపించరు.

"మీపని పట్టిస్తా ఉండండి" అని పళ్లు బిగించాడు. సగంవ్రాసిన
ఉత్తరం కనుపించగానే మళ్ళీ చర చర వ్రాయ నారంభించాడు.

"మీ మధ్యకు వచ్చి మళ్ళీ యెప్పుడు చేరుకుంటానా అని నా
మనస్సు తహ తహలాడి పోతున్నది. ఈ భయంకరమైన అనాగరికత
దేశంలో యెడతెరిపి లేకుండా ముందుకి సాగి పోతున్నాము. 'లూయిసా'
త్వరలో మాయుద్ధం విజయవంతంగా ముగిసి పోతుంది."

'లూయిసా' సంతోషపడాలని అతని ఆశ. నెలరోజులబట్టి వారి
సైన్యదళం యిక్కడే ఉండిపోయిందనీ ఆమెకు చెప్పకూడదనుకున్నాడు.
ఈ వెధవ గ్రామాన్ని గురించి చెప్పకపోయినా నష్టంలేదు. పాడు చలి
ప్రాణాలు తోడేస్తుందని, జర్మన్లకోసం యెక్కడబడితే అక్కడ గెరిల్లాలు
పొంచిఉన్నారనీ, తన సైనికులు రోజు రోజుకీ విరక్తి చెందుతున్నారనీ,
ఫ్రాన్సునుంచి వచ్చిన తనదళంలో చివరికి ఒక్కడైనా బ్రతికిలేడనీ, తన
స్వగ్రామం వారిలో 'వెబెర్' మాత్రం మిగిలి ఉన్నాడనీ ఆమెకు వ్రాయ
టంయిష్టంలేదు ఆమెకివన్నీ తెలియనవసరం లేదు. ఎందుకూ, అనవస
రంగా యుద్ధరంగంనుంచి వచ్చే ఉత్తరాలు ధైర్యాన్ని కలిగించేవిగా
ఉండాలి. అంతేగాక ఆమెకు చేరేలోగా అనేకమంది చదివే యీ ఉత్త
రాలు తన మనస్థితి ప్రతిబింబిస్తుందికదా!

'చలి యిక్కడ భయంకరంగా ఉన్న మాటనిజమే. ఇంతటి చలికి
మేము అలవాటు పడకపోయినా, హెర్ హిట్లర్ పల్కులు మాకు ఉత్సా
హాన్నిచ్చి, చలిని తరిమేసేటట్టు చేస్తున్నాయి. అతని కార్యక్రమాన్ని
ఆచరిస్తూ జర్మనీకి సేవచేసే భాగ్యం మాకు కలిగినందుకు గర్వపడు
తున్నాము'

మరికొన్ని వాక్యాలు వ్రాసి ఉత్తరాన్ని మొదటినుంచి చదివిచూచు కున్నాడు. మొత్తానికి బాగానేఉన్నది. ఇక్కడి సైనికులకు పంచటానికి జర్మనీనుంచి వచ్చే కరపత్రాలకంటే యెన్నోరెట్లు నయంగా ఉందని పించింది.

కలంపుల్ల నోటితో కొరుకుతూ కొంతసేపు ఆలోచించి అందులో యేమీ మార్చటం అవసరం లేదనుకున్నాడు. చివరికి తన పిల్లల్నిగురించి కొంత వ్రాయవలసి ఉంటుందనుకున్నాడు తను కేవలం కెప్టెనేగాక ఆదర్శమైన భర్త, ప్రేమమయుడైన తండ్రి అని తెలియజేయకపోతే యెట్లా ? —

'ప్రేయసీ, యింటిదగ్గర అన్నీ సవ్యంగా జరుగుతున్నట్లువ్రాయి. 'లిజ్జి' యెట్లాగున్నాడు ? 'విల్లీ'కి జబ్బునయమైనట్టేనా వాడి జబ్బు శరీరానికి పనికొచ్చే కోటొకటి పంపిస్తాను. నీకు మేజోళ్లు కావాలని వ్రాసావుకదూ ? కాని యేం చెయ్యను, ఇక్కడ అవిదొరకటం కష్టంగా ఉన్నది. ఇప్పటివరకు మేం వచ్చినవన్నీ చిన్నచిన్న గ్రామాలే; కాని పెద్ద పట్టణాలు మా వశంకాగానే నీకు పంపటానికి ప్రయత్నిస్తాను పోయిన వారం నీకు వెన్న పంపించాను. అది, యితర పార్శిళ్లు అందినట్టు వ్రాయించు, వచ్చేవారం మీకు తేనె పంపిస్తాను, 'విల్లీ'కి గూడా అది చాలామంచిది.'

ఇంతలో తలుపుతట్టిన శబ్దమయింది.

"ఏమిటది ?"

"గ్రామాధికారి వచ్చేడండీ"

"సరే, ఉండమను"— అని మళ్లీ ఉత్తరం వ్రాయటానికి పూను కున్నాడు. కాని అతని మనసు 'డ్రెస్‌డెన్' నుంచి మళ్లీవచ్చి యీ భయంకర గ్రామంలో పడటంచేత, దానిని ఉత్తరంమీద లగ్నం చేయ లేకపోయాడు. పిల్లలికి ముద్దులు, భార్యకు ఆశీర్వాదాలు తెలియజేస్తూ ఉత్తరం పూర్తిచేసి, సంతకంచేసి కవరులో పెట్టాడు.

"సరే; యేడీ ? అతన్ని లోపలికి పంపించు"

కొద్దిగా నడుమువంగిన ఒక పొడుగాటి మనిషి లోపలికివచ్చాడు.

"నా కోసం కబురు పంపేటటకదూ ?"

"అవును, పిలిపించాను"

టేబిలుక్రింద కాళ్ళు పూర్తిగా చాపుకొని క్రొత్తగవచ్చిన మనిషి వైపు పరీక్షగాచూస్తూ యిలా అన్నాడు.

"ధాన్యం సిద్ధంగా ఉన్నట్లేనా ?"

గ్రామాధికారి గతుక్కుమని తలవంచుకున్నాడు.

"నాశక్తికొద్దీ ప్రయత్నిస్తున్నానండీ; కాని ధాన్యం యెక్కడా లేదు"

"ఏమిటీ? ధాన్యమేలేదా? మూడువందల గడపగల గ్రామం—సారవంతమైన భూములూ అయితే—ధాన్యమే లేదంటావూ? అంతా దాచేసుంటారు; అంతే"

"అవును, దాచేసారు"— అని ఒక నిట్టూర్పు విడిచాడు గ్రామాధికారి. మళ్ళీ బయటవీస్తున్న గాలిదుమారంవైపు చూపిస్తూ "ఈమంచు దుమారంలో వెతికి పట్టుకోవడం సాధ్యమయ్యేటట్టుకూడాలేదు. ఇంకనేనేం చెయ్యను" అన్నాడు.

"ఇదిగో! 'గాప్లిక్' నేచెప్పే మాట సరిగ్గావిను. గట్టిగా ప్రయత్నిస్తే యెటువంటప్పుడైనా పట్టుకోవచ్చు. ముందు కూర్చో చెబుతాను"

'గాప్లిక్' ఒకకుర్చీ కొనను నమ్రతతో కూర్చున్నాడు.

"నీపని నాకేమాత్రమూ తృప్తిగాలేదు. అసలు నిన్నేవుద్దేశంతో యిక్కడికి పంపించారో అర్థంకావటంలేదునాకు. ఈ గ్రామం మనిషయితే బాగుండుననిపిస్తుంది. ఏంలాభం, నువ్వు నెలరోజులయినా యిక్కడి ప్రజలఅంతు పట్టలేకపోయావు. పోనీ. చివరికి యీ గ్రామస్థుల్లో ఒక్కడైనా పరిచయమయ్యాడా ?"

గ్రామాధికారికి కొంతధైర్యం కలిగినట్లయింది. తలపంకిస్తూ యిలా అన్నాడు "అవునండీ. నాకెవ్వరూ తెలియదు. పెద్దగ్రామము; అందులోనూ నాతో యెవ్వడూ కలిసి మాట్లాడడు, ఇక్కడి మనిషయితే చాలా సులభంగా వుండేదేమో—"

"ఐతే, యీపనిచేయటం నీకు యేమీ యిష్టం లేదన్నమాట" అన్నాడు కెప్టెన్ 'కర్ట్ వెర్నర్.'

'గాప్లిక్' చేతిలోవున్న టోపీని గట్టిగా నొక్కుతూ మౌనంగా ఉండిపోయాడు.

"నేనేగాని నీస్థితిలోవుంటే, మేము లేకపోయేటట్టయితే యెర్ర సైనికులు యేనాడో కాల్చిచంపేసి ఉండేవారన్నమాట మరిచిపోను. అంత

కంటే ఘోరమేమిటంటే, యీ రైతులు నిన్ను గడ్డపారల్తో పొడిచిచంపే సుందురు.....నీప్రాణాలు రక్షిస్తున్నందుకు నీవు జర్మను అధికారులకు కృతజ్ఞుడవై ఉండాలి. వాళ్ళ ఆజ్ఞలను శిరసావహించాలి నిన్ను యెంతో పెద్దసహాయం కోరటంలేదు. ఆమాత్రమైనా చేయలేవా ? "

'గాప్లిక్' ఒకనిట్టూర్పు విడిచాడు. కాని మాట్లాడలేదు.

" నీవు ఉత్సాహంతో పనిచేయటంలేదు. 'బొల్షివిక్కు'లు నీభూమి లాక్కుని, నిన్ను జైల్లోపెట్టారు. నువ్వు మాకెంతో సహాయం చేస్తావను కున్నాము. కాని నువ్వుచేసిందేమీలేదు. నాసైనికులు ప్రయత్నించి తెచ్చిన ధాన్యంతప్ప నువ్వుతెచ్చింది శూన్యం. పోనీ విలువగల వార్తలైనా నీ నుండిమాకు లభించలేదు. "

" 'ఓలెనా' సంగతి నేనేగా మీకు చెప్పింది– "

ఎక్కడో పొంచివుండి విన్న యీవార్త జర్మన్లకు తెలియజేసివాళ్ళ ప్రాపకం సంపాదించి తనను ప్రమాదంనుంచి రక్షించుకోవాలనుకున్నాడు 'గాప్లిక్'.

" సరే; అంతకంటే యింకేం సహాయంచేశావోచెప్పు ? "

" బడి పంతులమ్మసంగతో.... " అని 'గాప్లిక్' గొణిగాడు.

" పంతులమ్మసంగతిమాత్రం యేం చెప్పావని ? చెప్పిన కొద్దయినా రూఢికాలేదాయె. "

" ఈ గ్రామస్థుడెవడైనా అయితే అన్నీ బాగా తెలిసేవి.... "

" అవును లేవయ్యా ! దొరికితే, బాగానేవుండును. కాని దొరికే దెలా ? ఉన్న మూడువందల గడపలో అంతా సమిష్ఠి వ్యవసాయ క్షేత్రంలోనివారే. విడిగా వ్యవసాయం చేసుకునేవాడు ఒక్కడూ కనబ డడు. దమ్మిడీ కానని యీ దరిద్రపు ముండాకొడుకులకు 'బొల్షివిక్కు' లు మర్యాదస్తులైన గొప్పవారందరిదగ్గర్నుంచి భూమి గుంజుకుని పంచి పెట్టారు. విప్లవానికి పూర్వం, రోజుకూలి చేసుకుంటూ బ్రతికిన యీ ముండాకొడుకుల్లో నమ్మకస్థుడెవడు దొరుకుతాడు ? " అంటూ 'కర్ట్' కోపంతో బల్లగుద్ది " 'గాప్లిక్ !' యికనుంచయినా నువ్వు మెలకువతో పనిచేయక తప్పదు. లేకపోతే నీయెడల నేను వేరుగా ప్రవర్తించవలసి వస్తుందిసుమా ! నీకు నేను, మూడు - అంతకూకాకపోతే నాల్గు - రోజుల

గడువిస్తాను, ధాన్యం సంపాదించటానికి. సైనికులకు తిండి అందాలి. ఈ రైతులదగ్గర నీ చాతగానితనంవల్ల నా సైనికులు తిండిలేక చావటానికి వీల్లేదు!"

"నా అంతట నేను యేమీ చెయ్యలేను. సైనిక సహాయంవుంటేనే యేమైనా సాధ్యపడుతుంది." అన్నాడు చిఱచిఱలాడుతూ.

"సైనిక సహాయం నీకేనాడైనా నిరాకరించానా చెప్పు? నీకవసరమైన సహాయమంతా యిస్తాను. కాని నువ్వుకూడా నీబుద్ధిని ఉపయోగించి పనిచేయాల్సిఉంటుంది. ఏదైనా మార్గం ఆలోచించు...."

'గాప్లిక్' ముఖం వికసించింది.

"సరేనండీ; తగినమార్గం ఒకటి ఆలోచించి మీకు నివేదించుకుంటాను."

"సరే; కాని ఆలస్యం చెయ్యబోకు. ఇంకా నాల్గురోజులు మాత్రమే గడువున్నదని గుర్తుంచుకో! మరొకసంగతి; నిన్నటి శవం యెత్తుకు పోయినవాళ్ళనుగూడా పట్టివ్వాలి. వాళ్ళు దొరకకపోతే నిన్నే బాధ్యుడ్నిగా యెంచుతాను. అందుకుగూడా నాల్గురోజులవ్యవధిమాత్రమే యిస్తున్నాను."

'కర్ట్,' ఈవిధంగా చెప్పి అటువైపు తిరిగి కిటికీ అవతలికి చూడనారంభించాడు. గాలి జోరుగా వీస్తున్నది. మంచు పొడిసుడిగాలిలో మేఘాల్లాగ ఆకాశానికి లేస్తున్నది. ఆ తుఫానులో యిల్లు ముక్కలు ముక్కలైపోతుందా అనిపిస్తున్నది. తనతో పని పూర్తయిందని గ్రహించి, 'కర్ట్'కి సలాంచేసి, గదివిడిచి బయటపడ్డాడు 'గాప్లిక్.'

బయటికి వచ్చినతర్వాతగాని టోపీ నెత్తిన పెట్టుకోటానికి ధైర్యం కలుగలేదు. ఈ తలపొగరు గ్రామస్థులదగ్గర్నుంచి యేవిధంగా ధాన్యం సేకరించాలా అని దారిపొడుగునా ఆలోచించసాగాడు. ఆలోచనతో అలాగే నడిచి పోతుండగా యెదుటవచ్చే ఒక మనిషికి గుద్దుకునేటంతటి పని జరిగింది. భయంతో ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు. తలనెరిసిన ఆ రెండవమనిషి మొదట యితనెవ్వరో తెలియక, క్షమించమనబోయి, ముఖంబాగా పరిశీలించిగుర్తుపట్టి, అసహ్యంతో కాండ్రించి ఉమ్మేసి, యిండ్లతట్టు వెళ్ళిపోయాడు.

'గాప్లిక్' యింటికి చరచరావెళ్ళి, బల్లముందు కూర్చొని, కాగితం మీద యేదో వ్రాయనారంభించాడు. ఆలోచనతో తల ఇటు, అటువంచుతూ కలంతో నెత్తిగోక్కుంటూ, వ్రాసింది మళ్ళీ కొట్టేస్తూ ఒక నిట్టూర్పు

విడిచాడు. చెమటపట్టిన బట్టబుట్ట తుడుచుకున్నాడు. బయట వీస్తున్న గాలి శబ్దం సహించలేకుండా ఉన్నాడు. మాటిమాటికి జ్ఞప్తికివస్తున్న 'కెప్టెన్' కఠినమైన పలుకులు, దానికి మించిన తన యెడల గ్రామస్థుల ప్రవర్తనా తలుచుకుంటుంటే వళ్ళు మండిపోతున్నది. గ్రామస్థుల మనోనిబ్బరాన్ని నాశనంచేసి, యీ తడవైనా 'కర్ట్' ని తృప్తిపరచకపోతే తనకు మూడిందనుకున్నాడు.

గాలిదుమారంలో మంచుసుళ్ళు తిరిగి పైకిలేస్తున్నవి. గ్రామస్థులందరు తమ ఇండ్లల్లో కూర్చొని ఆ గాలి రొదను వింటున్నారు. ఒక్క ముసలి 'యాడోకిమ్ ఒఖాబ్కొా' మాత్రం యేకాంతాన్ని సహించలేక, ఆ గాలి దుమారంలోనే పొరుగువారింటికి వెళ్లాలనుకున్నాడు. గాలిలో అతిప్రయత్నంమీద 'మాల్యూచికా' యింటిగుమ్మం ముందుకి చేరుకొని చెప్పుల కంటుకున్న మంచు దులుపు కున్నాడు. లోపలంతా నిశ్శబ్దం. 'యాడోకిమ్' తలుపుకొట్టి, జవాబు రాకముందే త్రోసుకొని లోపలికి వెళ్ళాడు. లోపల తల్లీ పిల్లలు భయంతో నివ్వెరపోయి చూడసాగారు.

"అంతా బాగున్నారా ?"

'మాల్యూచికా' ఒక నిట్టూర్పు విడిచింది. ఆమెగుండె దడదడ కొట్టుకోసాగింది.

"నువ్వా, 'యాడోకిమ్' తాతయ్యా ?"

"అవును, తల్లీ. ఎందుకట్లా గాభరాపడతారు ?"

ఆమె జవాబు చెప్పలేదు. 'యాడోకిమ్' తాత యింకా అట్లానే తనచేతికట్టను ఆనుకొని నిల్చున్నాడు.

"ఏమిటీ, అలాగున్నారు ? కూర్చొమ్మనైనా అనటంలేదే ?"

"ఈ యింట్లో కూర్చోకపోవటమే మంచిది" అని ఆమె గంభీర వదనంతో అన్నది.

"ఏమిటో, నాకేమీ అర్థంకావటంలేదు" అంటూ 'యాడోకిమ్' తాత కిటికీ అంచుమీద కూలబడ్డాడు.

"గాల్యా, నువ్వట్లా కూర్చున్నావేం ? వొంట్లో బాగుండలేదా ? 'మిష్కా' యేడీ ?"

'జినా' బావురున యేడ్వటం ప్రారంభించింది.

"అసలు సంగతి చెప్పరేం ?"

"ఏడవకు 'జినా'" అని తల్లి 'జినా'ను ఊరుకోబెడు తున్నది.

'యాదోకిమ్' తాతకు యేమీ అర్థంకాక తల గోక్కున్నాడు. చేతికట్టుమీద గెడ్డం ఆనించి 'మాల్యూచికా' వైపు చూడసాగాడు.

"ఏదో జరిగినట్టేవున్నది. మీ 'మిష్కా' యేడీ? ఈ గాలి దుమారంలో యెక్కడికీ పోయిఉండడే...."

"'మిష్కా' పోయాడు, తాతయ్యా!"

"పోయాడూ? ఎక్కడికి?"

"ఎక్కడికీలేదు........జర్మన్లు రాత్రికాల్చి చంపేశారు!"

"ఏమిటీ. నువ్వనేది? 'మిష్కా'ని చంపేశారు?"—అని నివ్వెర పోయాడు.

తుపాకి దెబ్బవినబడలేదూ? 'ఓలెనా'కు రొట్టె యివ్వటానికి వెళ్ళాడు. వాళ్లు కాల్చేశారు....

'యాదోకిమ్' తాతచూపులో యేదో ప్రశ్న గుర్తించిందామె.

"లేదు-నాబిడ్డను జర్మన్లకు వదిలెయ్యలేదు-కందకంలోంచి రహస్యంగా వీపుమీద వేసుకు వచ్చేశాను. జాగ్రత్తగా సమాధి చేసేశాము. ఎవ్వరూ కనిపెట్టలేరు...."

"అసలు యెవరైనదీ, వాళ్ళు గుర్తుపట్టేరా?"

"ఎలా తెలుస్తుంది? చంపటంతోటే కుక్కను యీడ్చిపారేసినట్టుగా, ఒక కందకంలోకి యీడ్చిపారేశారు. ఇంతవరకు చూచుకొని ఉండరు. శవం కనబడకపోవటం కనిపెట్టగానే బయలు దేరకమానరు. నువ్వుతలుపుతట్టి నప్పుడు వాళ్ళేననుకున్నాము"

'యాదోకిమ్' తాత తలపంకిస్తూ అన్నాడు "ఆదాసంగతి? ఎంత మంది నశించిపోతున్నారు!.... చివరికి పిల్లలు గూడా....'సాషా', నీవీ సంగతి యెన్నటికీ మరువగూడదు."

అవునన్నట్టుగా 'సాషా' తల ఊపాడు.

"మీనాన్న. వాళ్ళు వచ్చినప్పుడు యివన్నీ-నువ్వుచూచినవన్నీ చెప్పాలి"

"ఇవన్నీ వాళ్ళకు మాత్రం తెలియవా-" అన్నది 'మాల్యూచికా'

"అవును; తెలుసునన్నమాటనిజమే. వాళ్ళు తమ కళ్ళార అనేకం చూచారు. అయినా యిదివేరు....ఇంతకుముందు నీభర్త 'ప్లాటన్'

యితరులకొరకై జర్మన్లమీద పగ సాధిస్తున్నాడు. కాని యిప్పుడు తన 'మిష్కా' —తన ఆత్మీయుడు—కొరకు వాళ్ళమీద పగతీర్చుకుంటాడు..."

"కాని యేం లాభం........" అన్నది నెమ్మదిగా, 'మాల్యూచికా'

"అది నిజమే. కాని యెంతైనా స్వంతకొడుకుగదా? పోయిన యుద్ధంలో జర్మన్లు నా కొడుకుని చంపేశారు. అన్ని విషయాలకంటే అది నాకు యిప్పటివరకు బాగా గుర్తున్నది. ఎంత దగ్గరివారైతే అంతగా బాధపడతాము. ఏకాకినైపోయాను నేను........వాడే బ్రతికుంటే, మనుమలతో యిల్లు యెంత కళకళలాడుతూ ఉండేది!"

"మేం లేమా, తాతయ్యా?"

"అది నిజమే. కాని యెంతైనా కడుపునగన్న కొడుకంటే...."

"ఆగండి!....అదుగో, గంటవాయించు తున్నారు. అంటే, యేదో, సభపిలుస్తున్నారన్నమాట!...."

'మాల్యూచికా' ముఖం కళ తప్పిపోయింది.

"తప్పకుండా 'మిష్కా' విషయమయ్యే ఉంటుంది"

'ఏమో, యేమిచెప్పగలం? ఇంకా ఎన్నికాదరాలు లేవుగనుక?" అని సమాధానమిచ్చాడు, 'యోదోకిమ్' తాత.

గంట మ్రోగుతునే ఉన్నది.

"వెళ్ళక తప్పదు.... లేకుంటే బలవంతాన యీడ్చుకుపోతారు. నువ్వూ వస్తున్నావా, తాతయ్యా?"

"ఏంజేస్తాము.... వెళ్ళక మానగలమా...." అని 'యోదోకిమ్' తాత తనకఱ్ఱ నానుకొని ఆయాసంతో లేచాడు.

"'సాషా' నువ్వు చెల్లెల్ని కనిపెట్టుకొని యిక్కడే వుండు. అది ముగిసిపోగానే, నేను వచ్చేస్తాను."

గాలిలో లేస్తున్న మంచుగూడా కాళ్ళీడ్చుకుంటూ రోడ్డువెంట బయలుదేరారు. అలా పోతుండగా ఒక్కొక్క యింటిలోంచి ఆడవాళ్ళు, ముసలివాళ్ళు వచ్చి చేరుకోసాగారు.

"ఏమిటోసంగతి, నీకేమైనా తెలుసా?"

"నాకుమాత్రం యేమితెలుస్తుంది? గంటవిని నీలాగే బయలుదేరి వస్తున్నాను."

"ఓరి, దేవుడా! ఈసారి యేమి ముంచుకువస్తుందోగదా?" అని ఒక స్త్రీ నిట్టూర్చింది.

" ఊరుకోవమ్మా! వినకముందే యింత గొడవచేస్తే యెట్లా ?" అని 'ఫెదోసియ' ఆమెను మందలించింది.

" తప్పకుండా యేదో కష్టమేవచ్చిపడుతుంది."

" కష్టాలుగాక, సుఖాలు తెచ్చి పెడతారనుకున్నావా ? నీకు యేమాత్రం సుఖం తెచ్చిపెట్టారుతల్లీ ?"

" అంతేలే, అంతేలే."

" అలాంటప్పుడు అనవసరంగా గోలపెట్టేమిలాభం ?" అన్నది 'ఫెదోసియ'.

ఎవ్వరూ జవాబివ్వలేదు. 'ఫెదోసియా' సంగతి, ఆమె కొడుకు 'వాస్యా' సంగతి గ్రామస్థులందరికీ తెలుసు. ఆమెకు నుదుటిమీద ఆ ముడతలు యెందువల్ల యేర్పడ్డవో అందరికీ తెలుసు. నిట్టూర్పులు విడవటానికి అది యెవరికీ సమయంకాదని చెప్పటానికి ఆమెకు ప్రత్యేక హక్కు ఉన్నది. ఇతరులకు, ఎర్రసైన్యంలోగాని, గెరిల్లాదళాలలోగాని ఉన్న తమ భర్తలు, బిడ్డలు తిరిగి రాగలరనే ఆశ అయినా ఉన్నది. కాని 'ఫెదోసియా'కి అటువంటి ఆశాకిరణంగూడాలేదు. అయినప్పటికి ఆమె తన దుస్థితిని గురించి యితరులతో యెన్నడు మొఱపెట్టుకొని యెరుగదు!

అన్నివైపులనుండీ స్కూలు భవనంలోకి ప్రజలు చేరుకొనసాగారు. మునుపటి అలవాటుప్రకారం దానిని స్కూలు భవనం అంటున్నారు. విశాలమైన గదులు. యెత్తయినకప్పు. చక్కని కిటికీలుకలిగి యెంతో కళగా వుండేది. కాని యిప్పుడది స్కూలు కాదు. జర్మన్లు బల్లలు, కుర్చీలు విరుగగొట్టి వంటచెరుకుగా వాడుకున్నారు. మ్యాపులు, చిత్రాలు మొదలైనవి చించిపారేశారు. ఆ భవనాన్నే యిప్పుడు సభలు జరుపటానికి ఉపయోగిస్తున్నారు. స్త్రీలు, ముసలివాళ్ళతో కూడుకున్న ప్రజా సమూహమంతా నెమ్మదిగా లోనికి చేరుకున్నది.

వచ్చినవారందరిలో 'మలాషా' మాత్రం తనకూ యితరులకూ మధ్య పెద్ద అఖాతం - ఎవ్వరు దాటలేనటువంటి అఖాతం - యేర్పడినట్టు దూరంగా నిల్చున్నది. పాలిపోయిన ముఖంతో గోడప్రక్క నిలబడి శూన్యదృష్టితో యెటో చూస్తున్నది. తలమీదనుంచి కప్పుకున్న శాలువా లోంచి ముంగురులు చిందరవందరగా ముందుకి పడుతున్నాయి. వాటిని వెనక్కి దువ్వుకునే ప్రయత్నమైనా చేయటంలేదు—

వేదికమీద ఒక చిన్న బల్ల వెనుక 'గాప్లిక్' కూర్చుని ఉన్నాడు. అతని ప్రక్క ఒక జర్మను సార్జెంటు ఆవలింతలుతీస్తూ, అక్కడ మూగిన ప్రజలవైపు నిర్లక్ష్యంగా చూస్తున్నాడు.

"అందరూ వచ్చినట్టేనా?" అని 'గాప్లిక్' కేకవేశాడు.

"ఆఁ, అంతా వచ్చారు." అని యెవరో తలుపుదగ్గర్నుంచి గొణిగారు.

'గాప్లిక్' టేబిలుమీద కొన్ని కాగితాలుపెట్టి, వణుకుతున్న చేతులతో ఒక్కొక్కటే తిరుగవేయసాగాడు.

"బట్టబుర్రవాడికి చేతులు యెందుకో వణుకుతున్నాయి" అని గుంపులో యెవరో గుసగుసలాడుతున్నారు.

"ఏదో కిందా మీద చెయ్యటానికి తలపెట్టి ఉంటాడు."

"వాడికీ తెలుసు - మన వాళ్ళు వస్తే వాడ్ని ప్రాణాలతోనే చర్మం వొలుస్తారని."

"అంతవరకెందుకు? ఈలోగా మనమే చేసేస్తేకాదూ? వాడికి పట్టిన గ్రామాధికారి జబ్బు కుదిరిపోతుంది...."

"ఎలాచేస్తాము?" అని సమిష్టి వ్యవసాయక్షేత్రపు గుర్రాలకాపరి, కుంటి 'అలెగ్జాండర్' అడిగేడు.

"దిగులుపడకు ఎలాచెయ్యాలో మాకుతెలుసులే" అని 'ఫ్రోస్యా' జవాబిచ్చింది.

"నిశ్శబ్దం! ఎవరక్కడ, మాట్లాడేది? సభ ప్రారంభమయింది" - అని 'గాప్లిక్' కోపంతో కేకలేస్తూ గుంపునంతట్నీ కలియజూచాడు.

"ప్రారంభించినట్టు నాకేమీ కనపళ్ళే" - అని 'యాడోకిమ్' గొణిగాడు.

"ఇంకేం కావాలినీకు? శ్రీ శ్రీ శ్రీ గ్రామాధికార్లుంగారు వచ్చేరు. మహాఘనతవహించిన వారి ప్రభువులుగూడా వేంచేశారు. అంతకంటే యేంగావాలిచెప్పు?" అని యెవరో జవాబిచ్చేరు.

"నోరుముయ్యండి! మాట్లాడవద్దని యెన్నిసార్లుచెప్పాలి? ఆ గుసగుసలు కట్టిపెట్టండి" అని 'గాప్లిక్' గర్జించేడు.

"హుష్! ఉండండర్రా. కథయేమిటో విందాము—" అని 'పెర్ఫిలిఖా' మందలించింది.

'గాప్లిక్' గొంతు సవరించుకొని, జేబులోంచి కళ్ళజోడు తీసి తుడిచిపెట్టుకొని, కాగితాలు చదవటానికి తీశాడు."

"ఓహో, యేవో కాగితాలు చదివేటట్టున్నాడు"

"ఏదో కొత్తవల వేస్తున్నాడన్నమాట"

కళ్ళజోడు ముకుటిపైనుంచుకొని తీవ్రంగా గుంపువైపు చూడ సాగాడు 'గాప్లిక్'. అంతా ఊరుకున్నారు. మళ్ళీ గొంతు సవరించు కొని, చిన్న కీచుగొంతుకతో చదువనారంభించాడు - "ఈ గ్రామనివాసులు యెవ్వరూ యింతవరకు తమమీద వస్తురూపంగా విధింపబడిన పన్నును - అనగా ధాన్యాన్ని - యిచ్చియుండలేదు - "

గుంపులో కలవరం బయలుదేరింది. కాని అది మరుక్షణంలోనే తగ్గిపోయింది.

"ఈ ప్రకటన చేసిన మూడురోజులలోపల ధాన్యం చెల్లించవలసిన గడువు దాటిపోతుందని మళ్ళీ హెచ్చరిస్తున్నాను."

మళ్ళీ కలవరం—

"మాతృదేశంయొక్క, జర్మనుసైన్యంయొక్క యీ అవసరాన్ని గౌరవించి మూడురోజుల్లో ధాన్యమివ్వక ఆజ్ఞను ఉల్లంఘించినవారు...."

చదవటం కొద్దిగా ఆపి విజయం పొందినవాడిలాగ గుంపుమీదికి ఒక్కచూపు విసిరేడు. అంతా నిశ్శబ్దంగా అతనివైపుచూస్తూ వింటున్నారు.

"ఆవిధంగా ధాన్యం యివ్వక అధికారుల ఆజ్ఞలను ఉల్లంఘించిన వారు, ప్రస్తుత ప్రభుత్వాన్ని విధ్వంసం చేయటానికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పూనుకొన్న నేరంక్రింద...."

"అదంతా మాకు తెలుసులే -" అని యెవరో బిగ్గరగా ద్వేషంతో పలికారు.

జర్మను సార్జెంటు లేచి, ఆధ్వని వచ్చినవైపు తీవ్రంగా చూడ సాగాడు. కాని గ్రామస్థులెవ్వరూ చలించకుండా 'గాప్లిక్' వైపు చూస్తున్నారు.

"....మరణదండన విధింపబడుతారు." అని గుక్కతిప్పు కున్నాడు 'గాప్లిక్!'.

దీర్ఘంగా ఒకసారి శ్వాసవిడిచి, ఆ ఆజ్ఞాపత్రంయొక్క తేది, సంతకంచేసిన కెప్టెన్ కర్ట్ వెర్నర్ పేరు చదివి, దానిని మడిచిపెట్టాడు.

"అందరూ విన్నారా?"

"ఆఁ అందరము విన్నాము."

"అందరికీ అర్థమయిందా?"

"ఓ, చక్కగా అర్థమయింది" అని సభావేదికముందే వించున్న 'పెర్ఫిలిఖా' జవాబు చెప్పింది.

'గాప్లిక్' ఆమెవైపు అనుమానంతో చూచాడు. కాని ఆమె మాత్రం ప్రశాంతంగా అతనివైపు చూడసాగింది.

"ఐతే అక్కడి కది పూర్తయింది -"

గుంపంతా వెళ్ళిపోబోతున్నది. అప్పుడే కొందరు గడపదాటి పోయారు.

"ఆగండి! ఎక్కడికి, అప్పుడే పోతున్నారు?"

"ఇంకా పూర్తికాలేదా?"

"మరొక సంగతున్నది -" అని 'గాప్లిక్' అనే సరికి 'మాల్యూచికా' గుండె దడదడలాడటం ప్రారంభించింది.

"ఆసంగతేమిటంటే -"

అందరూ నిరీక్షిస్తున్నారు.

"రాత్రియెవరో, నిర్బంధంలోనున్న ఒక ఖైదీకి రొొట్టె దొంగతనంగా తీసుకెళ్ళి యివ్వటానికి ప్రయత్నించారు...."

'మాల్యూచికా' తన ప్రక్కనిల్చున్న 'చెకోరికా' చెయ్యి గట్టిగా పట్టుకున్నది. 'చెకోరికా' ఆశ్చర్యంతో ఆమెవైపు చూచింది.

"ఏమిటి, సంగతి?"

"ఏమీలేదు.........ఏమీలేదు........"

కాని 'చెకోరికా' చెయ్యి ఇంకా విడువలేదు.

"ఆ ప్రయత్నం చేసినవాడు షుమారు పదిసంవత్సరాల కుఱ్ఱవాడై ఉంటాడు........"

గుంపులో గుసగుసలు బయలుదేరినై. ఒకరిముఖాలు ఒకరు చూచుకొన సాగారు.

"మాట్లాడకండి....ఆ పది సంవత్సరాల కుఱ్ఱవాడ్ని కాల్చివేయటం జరిగింది....."

'చెకోరికా' వెలవెలబోతున్న 'మాల్యూచికా' ముఖంవైపు ప్రశ్నార్థకంగా చూచింది. తర్వాత ఆమెచేతికి తనచెయ్యి ఆధారంగా యిచ్చింది.

"జాగ్రత్తగా ఉండమ్మా. ఏ మాత్రం అనుమానం కలిగినా కొంప మునిగిపోతుంది....." అని ఆమె 'మాల్యూచికా' చెవిలో రహస్యంగా చెప్పి ధైర్యం కలిగిస్తున్నది.

కాని 'గాప్లిక్' దృష్టిమాత్రం యిటుపడలేదు. నసుగుతూ చదువ నారంభించాడు. "ఆ అపరాధిశవాన్ని యెవరోదుర్మార్గులు రహస్యంగా యెత్తుకుపోయి దాచేశారు, ఆ అపరాధిశవాన్ని గుర్తించగలవారుగాని, శవాన్ని దొంగిలించుకుపోయిన వార్నిగురించి తెలిసినవారుగాని, తక్షణం జర్మను సైనిక కార్యాలయానికివచ్చి: వాఙ్మూలాన్ని యివ్వాలి"

'గాప్లిక్' చదవటం పూర్తిచేసి, జర్మను సార్జెంటు వైపుచూచి ఒకసారి దగ్గాడు. సార్జెంటులేచి అందరినీ తొలగించుకొని ముందుకివచ్చి నిల్చున్నాడు. బైట సాయుధులైన సైనికులు తయారుగా ఉండటం అందరికీ కనుపించింది. ఒకరి నొకరు చూచుకొని, గుసగుస లాడుకొంటున్నవారంతా మౌనం వహించారు.

"....దేశరక్షణ బాధ్యత ననుసరించి, జర్మను సైనికాధికార వర్గం యీ విధంగా ప్రకటిస్తున్నది......"

ఎటువంటి భయంకర శాసనం విరుచుకు పడనున్నదో అని ప్రజ లంతా మంత్రముగ్ధులవలె నిల్చున్నారు.

ఈ దిగువ నుదహరించిన గ్రామస్థులను నేరస్థులకు జామీనుగా బంధించడ మౌతున్నది ..."

అందరూ చెవులు నిక్కబొడుచుకొని వింటున్నారు. 'యొాదోకిమ్' తాత ముందుకివంగి మరీ వింటున్నాడు.

"పలాన్‌చుక్, ఓల్గా......"

తలుపుదగ్గర నిల్చున్న ఒక యువతి భయంతో వణికిపోయింది. ఏదోకేక వేస్తున్నట్లు నోరు తెరిచింది; కాని శబ్దం రాలేదు.

"ఒఖాబ్‌కొా, యొాదోకిమ్...."

'యొాడోకిమ్' తాత వెలవెలబోతూ తనచుట్టూవున్నవారిని చూడ సాగాడు.

"ఎవరు ?"

"ఒఖాబ్‌కొా, యొాదోకిమ్" అని మళ్లీ ఆ పేరు నొక్కిచెప్పి తర్వాత పేరు చదివాడు - "గ్రోఖాచ్ డసిప్...."

బలమైన శరీరంగల ఒక ఒంటికాలిరైతు విచారంతో తలఊపాడు.

" చెకోరికా మరియా.... "

' మాల్యూచికా ' తన ప్రక్కనున్న మనిషి చెయ్యి హఠాత్తుగా వదిలేసి ఆమెవైపు భయంతో రెప్పవాల్చకుండా చూడసాగింది.

" ఫరవాలేదు, ' మాల్యూచికా, ' నన్ను గురించి చింతపడకు. కాని నాకు పసిబిడ్డలున్నారు. వాళ్ళను జాగ్రత్తగా చూస్తుంటావుగా ? " అన్నది ' చెకోరికా ' ప్రశాంతంగా !

" వ్యాస్చినెవా మలాన్యా.... "

ఈ యువతి ముఖంలో మాత్రం యేమీ చలనం కనబడలేదు. అర్థంలేని దృష్టుఖ శూన్యంలోకి చూస్తూ నిల్చున్నది.

ధాన్యంవిషయంలోకూడా వీరినే జామీనుగా ఉంచటం మంచిదని పించింది గ్రామాధికారికి. చావుకి భయపడేవారు లేరన్నమాటమాత్రం నిజం. అయినప్పటికి తమ కొరకు యితరుల ప్రాణాలు బలికావటం యిష్టపడనివారు నిజం తెలియజేయటానికి ముందుకి రావటం జరుగుతుం టుంది. అలాంటివి ' గాప్లిక్ ' ఇంతకుముందు చూచాడు. అందువల్ల యీపన్నాగం పన్నాడు. " మూడుదినాలలోపల ధాన్యం అందజేయటము, ఆశవం యెత్తుకుపోయినవారిని పట్టివ్వటము జరుగనట్టయితే, జామీనుగా బంధించినవారిని ఉరితీయటం జరుగుతుంది.... " అని చదివేడు 'గాప్లిక్.'

గుంపులో అలజడి కలిగింది. గుసగుసలు ప్రారంభమయినై.

" అంతేనా ?.... ఇక మేం పోవచ్చునా ? " - అని ' ఫెదోసియా ' గంభీరంగా అడిగింది.

గుంపులో అందరూ ఒక్కసారిగా నిట్టూర్పు విడిచారు.

" సభ ముగిసింది. ఇప్పుడు పేర్లు చదివినవారు తప్ప తక్కిన వారందరు దయచేసి వెళ్ళిపోవచ్చును. "

ఒకరితర్వాత ఒకరుగా అందరూ బయటికినడిచారు. జామీనుగా గ్రహింపబడ్డ ఐదుగురూ, యెవ్వరూ చెప్పనవసరంలేకుండానే టేబిలు ముందుకిపోయి నుంచున్నారు. బయటికివెళ్ళిపోతూ గ్రామస్థుల్లో కొందరు వారిముఖాలు చూడలేకపోయారు, కొందరు మాత్రం జాలితో వారివైపు చూచి వెళ్ళిపోయారు.

కాని ప్రజలు వారి యిళ్ళకు పోకుండా స్కూలుభవనముందే గుమికూడి నిల్చున్నారు. తీవ్రంగా వీస్తున్న ఆ మంచుతుఫానులోనే దేని కొరకో వేచివున్నారు. కొంతసేపటికి ' గాప్లిక్, ' బంధించిన అయిదు

గురు జామీను ఖైదీలను సాయుధ సైనిక పహరాతో తీసుకొని బయటికి వచ్చాడు. 'చెకోరికా', 'ఓల్గా' లు ఒకరిభుజంమీద ఒకరు చేతులు వేసుకొని నడుస్తున్నారు. 'యొవోకీమ్' తాత తన ఊతకర్ర కిందకొట్టుకుంటూ నడుస్తున్నాడు. గుంపుదాటేవరకు నిశ్శబ్దంగా ఉన్నారు. హఠాత్తుగా 'చేకోరికా' వెనక్కి తిరిగి ప్రజలనుద్దేసించి అన్నది:

"మీరేమీ విచారపడకండి. ఇంతమాత్రందానికే లొంగిపోకండి. మమ్మల్నిగురించి మీరేమీ దిగులుపడనక్కర్లేదు. కాని ధైర్యంగా నిలబడండి!"

ఒక జర్మను సైనికుడు బలవంతంగా ఆమెను ముందుకి తోశాడు. ఆమె తూలిపోయి. మళ్ళీ తనను తాను సంభాళించుకొని, నిర్లక్ష్యంగా ముందుకి నడువసాగింది.

గ్రామస్థులు నిశ్శబ్దంగా యెవరిదారిని వారు పోసాగారు. జర్మను సైనికుల నడకతో కలిసికోటానికి 'గాప్లిక్' వేగంతో ఉరుకుతున్నాడు. బ్రహ్మాండం తల్లక్రిందులైనా అతడు యీసమయంలో వెనుకబడడు. తనను 'గ్రామాధికారి' ని చేసినతర్వాత బహిరంగంగా ప్రజలను ఆజ్ఞాపించటం యిదే మొదటిసారి. గ్రామస్థుల ముఖాలు గుర్తుకివచ్చేటప్పటికి వణుకు పుట్టింది. కాని ప్రొద్దుట జర్మన్ కెప్టెన్ బెదిరించిన బెదిరింపులు తలుచుకుంటే, యింతకంటేకూడా యెక్కువ భయం పుట్టుకు వస్తున్నది. అయినా గ్రామస్థులంటే స్త్రీలు, పిల్లలు, ముసలివాళ్ళతో కూడుకున్న విషయమేగదా అనుకున్నాడు కెప్టెన్ 'ఎర్ట్' అంటే జర్మను అధికారం యొక్క ప్రతినిధి: అతని మాటలకు వెనుక సాయుధబలం ఉన్నది. మొదట్లో యివన్నీ యెలాగో తప్పించుకోవాలని ప్రయత్నం చేశాడు 'గాప్లిక్.' కాని యికముందు అలా ప్రయత్నంచేసికూడా లాభం ఉండదని తేలిపోయింది. పైగా తనకు ముప్పువచ్చిపడేట్టున్నది. 'రాస్టావ్' నుంచి పారిపోయివస్తున్నప్పుడు జర్మన్లతో కలుసుకున్నదినం తలుచుకొని తననుతాను తిట్టుకున్నాడు. ఎక్కడైనా కొంతకాలం దాగుకొని, అటుతర్వాత యెక్కడికైనా వెళ్ళిపోయిఉంటే బాగుండేదనుకున్నాడు. అటుతర్వాత యేదో ఒకవిధంగా బ్రతుకవచ్చు. అనవసరమైన కష్టాలు నెత్తిని తెచ్చిపెట్టుకున్నట్టయింది. జర్మన్లకు, అడవుల్లోను, బురద ప్రదేశాల్లోను తానే దారిచూపించి యిక్కడికి తీసుకువచ్చాడు!

ఒకవేళ జర్మన్లు విజయం పొందుతారే అనుకున్నప్పటికీ, చిన్న పిల్లలతోసహా తనను ద్వేషించే యీ గ్రామంలో ఉండటమంటే శరీరం కంపిస్తున్నది. దీర్ఘమైన ఒక నిట్టూర్పువిడిచి, సైనిక కార్యాలయంలోకి సభయొక్క వివరాలు తెలియజేయటానికి వెళ్లాడు.

గ్రామస్థులుగూడా యిళ్ళకి చేరుకున్నారు. 'మాల్యూచికా' యిందా కటి భయంనుంచి యింకా తేరుకోలేదు. జీవచ్ఛవంలాగ, నిస్పృహతో నడిచిపోతున్నది.

'సాషా', చెల్లెలు 'జినా'ను ఆడిస్తున్నాడు. ఆ పిల్లలముఖాలు చూచేటప్పటికి, ఆమె హృదయంలోని బాధ మరీ యెక్కువయింది.

"బాబులూ! జినా అల్లరిచేయలేదుగా?"

"అబ్బే, లేదమ్మా....సభముగిసిందా?"

"ఆఁ, ముగిసింది. నేను 'చెకోరికా' యింటికివెళ్ళి యిప్పుడే వస్తాను ఉండండి...."

"మళ్ళీ యిప్పుడే యెందుకే అమ్మ- 'చెకోరికా' గారింటికి?"

"'చెకోరికా'ను జర్మన్లు అరెస్టుచేశారు. ఆమె పిల్లల్ని యిక్కడికి తీసుకురావాలి" అన్నది 'మాల్యూచికా'. ఆడుకుంటున్న 'సాషా' నివ్వెరపోయి చూడసాగాడు.

"అరెస్టు? ఎందుకు?"

"జర్మన్ల సంగతి యింకా తెలియలేదా? అని తల్లి జవాబుచెబుతూ బయటికి వెళ్ళిపోయింది. కొద్దిసేపట్లో 'చెకోరికా' ముగ్గురుబిడ్డల్ని వెంటతీసుకొనివచ్చింది. అందులో పెద్దపిల్లవాడికి యెనిమిది సంవత్సరాల వయస్సుంటుంది. అనగా 'సాషా' యీడువాడన్నమాట.

"అమ్మా! అమ్మా!!" అని మూడేళ్ళబిడ్డ 'నైనా' పెద్దగా యేడుస్తున్నది.

"ఏడ్వకు తల్లీ, మీ అమ్మ యిప్పుడే వస్తుందిలే. కూర్చో; నీకు తినడానికి యేదైనా తెచ్చిపెడతాను."

పొయ్యివెనుక దాచిపెట్టిన బంగాళాదుంపలు కొన్ని తీసి, కడిగి తుడిచి జాగ్రత్తగా ఉడకబెట్టసాగింది. దాచిఉంచిన యీబంగాళాదుంపలు, కొద్దిగా రాగులు తప్ప యింట్లో మరే ఆహారపదార్థాలులేవు. ఉన్న ఆహార పదార్థాలన్నీ - ధాన్యము, బంగాళాదుంపలు, తేనెసీసాలు మొదలైనవన్నీ - దూరంగా, భూమిలో దాచివేయవలసి వచ్చింది.

" ఈ బంగాళాదుంపలతో సరిపుచ్చుకోవాలి. రొట్టెగిట్టే మనవాళ్ళు వచ్చేవరకు దొరకవు."

" ఊఁ, బంగాళాదుంపలేనా ? " అని జినా గునిసింది.

" ఇంతకన్నా యేంకావాలి ? ఇంకా అమాత్రం తినటానికి దొరికి నందుకు సంతోషించక, అవి కావాలి, యివి కావాలని కోర్కెలు కూడానా !...." అని కోపంతో కూతురువైపు చూచింది. కాని చిక్కి-పోయిన ' జినా ' శరీరం కంటబడేటప్పటికి మనస్సు చివుక్కుమన్నది. హృదయం దుఃఖభారంతో కృంగిపోయింది.

" ఏడవబాకు తల్లీ ! మన సైనికులు వచ్చాక అన్నీ బాగుంటాయి. రొట్టెలు కాల్చుకుని తేనెతో నీయిష్టమొచ్చినంత తిందువుగాని. ఇప్పుడు మాత్రం అల్లరిచెయ్యబోకు...."

" అవును; బంగాళాదుంపలతోనే తృప్తిపడాలి...." అని విచారంతో అన్నాడు ' సాషా '.

" అవును, అవును " అని తృప్తిపడ్డది ' జినా '.

బంగాళాదుంపలు ఉడకబెడుతూ, పిల్లలతో మాట్లాడుతున్నప్పటికి తనలో అధికమౌతున్న భయాన్ని అణుచుకోలేకపోతున్నది ' మాల్యూచికా '. మతిమరుపుతో ఒకటిచేసి మరొకటి చేయటం మరిచిపోతున్నది. ' జినా ' కి ఉడకపెట్టిన బంగాళదుంపలివ్వబోయి పచ్చిముక్కలే యిచ్చేసింది. ఇది చూచి పిల్లలు ఆమెవైపు వింతగా చూస్తున్నారు.

" ఏమిటే, అమ్మా అల్లాగున్నావు ? " - అని ' సాషా ' చివరికి అడిగేడు. కొడుకువంక చూచి ఆమె భయపడిపోయింది.

" అబ్బే, యేమీలేదు.... "

" తలనెప్పా ? "

" ఆఁ. అవును. తలనొప్పిగావుంది " అని ఒక సాకుచెప్పింది పిల్లల్ని మరిపించటానికి.

" మీటింగువల్లే నీకు తలనొప్పివచ్చింది " - అన్నాడు ' సాషా '.

" కావచ్చు. జనం యెక్కువై పోవటంతో అక్కడ ఉక్కపోసేసింది. అందువల్లనేమో.... ".

పిల్లలు అదినమ్మి తమంపట తాము ఊరుకున్నారు.

'మాల్యూచికా' గిన్నెలు కడుగుతూ, పొయ్యిదగ్గర ఆడుకుంటున్న పిల్లల్ని చూచింది. ఆమె దుఃఖం కట్లు దాటిపోతున్నది. అయ్యో! ఈ చిన్నిబిడ్డల కెన్నిపాట్లువచ్చినై !! తండ్రి దారిన తండ్రి యుద్ధానికి పోయాడు. తల్లి జర్మన్ల పాలిట బడ్డది....

ఆమె ఆందోళన యింకా యెక్కువవుతున్నది. మాటిమాటికి దేని కొరకో కిటికీదగ్గరకువెళ్ళి చూస్తున్నది.

"అక్కడెవరున్నారమ్మా?"

"ఎవ్వరూ లేరుగాని, నేను కొద్దిసేపు బయటికివెళ్ళిరావాలి. ఇప్పుడే వచ్చేస్తాను."

"అబ్బా, యెప్పుడూ నువ్వు యెక్కడికో వెళ్ళిపోతూనేవుంటావు" అని 'జినా' బిక్కమొగంవేసింది.

"ఊరుకోవే! వెళ్ళక తప్పదు" అని 'మాల్యూచికా' కోపంతో అన్నది.

"శాలువాతీసుకెళ్ళవే అమ్మ" అని ఉత్తనేవెళ్ళిపోతున్నమాల్యూచికా 'కు 'సాషా' గుర్తుచేశాడు.

'గ్రోఖాచ్' యిల్లు చాలాదూరంలో ఉన్నది. గాలి జోరుగా వీస్తున్నది. మంచు విసురుగాలేచి ముఖానికి కొడుతున్నది. మంచుముక్కలు గాజుముక్కల్లాగ ముఖంలో గుచ్చుకుంటున్నాయి. గాలిలో ఊపిరి సలపక, ఉక్కిరి బిక్కిరవుతూ 'గ్రోఖాచ్' యింటిముందుకి చేరుకున్నది 'మాల్యూచికా'. రొప్పుతూ లోపలికి పోవటం యిష్టంలేక కాసేపు గుమ్మందగ్గరే నిలబడిపోయింది. కాని కొంతవరకు 'గ్రోఖాచ్' కుటుంబంయొక్క ముఖం చూడలేకే అలా ఆగిపోయిందనవచ్చు బహుశా అతని భార్య, యిద్దరు బిడ్డలు రేపు ఉరికంబంనుంచి వ్రేళ్ళాడబోయే 'గ్రోఖాచ్'ని తలుచుకుని యేడుస్తున్నారుగాబోలు! వారి మొఖాలు చూడటం యెట్లా?

కాని ఆమెకు యేడ్పుకిబదులు, రంపంతో యేదో కోస్తున్న శబ్దం వినవస్తున్నది. 'గ్రోఖాచ్' యింటిలో, యీసమయంలో యెవరు పని చేస్తుంటారా అని ఆశ్చర్యపోయి లోపలికి వెళ్ళింది.

లోపల 'గ్రోఖాచ్' భార్య, పెద్దకూతురు కలిసి ఒక పెద్ద కర్రను రంపంతో కోస్తున్నారు. 'మాల్యూచికా'ను చూడగానే ఆశ్చర్యపోయారు. ఆరోజుల్లో ఒకరిళ్ళకు మరొకరు వెళ్ళటం చాలా అరుదు.

గ్రామస్థులందరు తమ తమ యిండ్లల్లో కూర్చొని, ఇకముందు జర్మన్లు యేంచేస్తారా అని ఆలోచిస్తూ పడివుండేవారు.

"మీతో ఒకసంగతి మాట్లాడటానికి వచ్చాను."

"వచ్చి యిట్లా కూర్చోండి -" అన్నది 'గ్రోఖాచ్' భార్య.

'మాల్యూచికా' గ్రోఖాచ్ పిల్లలకేసి చూస్తూ అన్నది - "మీతో యేకాంతంగా మాట్లాడాలి."

"ఏకాంతంగా మాట్లాడాలా?"

"ఏకాంతంగానా!" అని 'గ్రోఖాచ్' భార్య కొంచెం ఆశ్చర్య పడి బిడ్డల్నుద్దేశించి అన్నది "మీరు కొద్దిగా ఆగదిలోకి వెళ్ళండమ్మా. కొంచెం రహస్యం మాట్లాడాలి."

ఇద్దరుపిల్లలూ వెళ్ళిపోయారు. 'మాల్యూచికా' నీరసంతో కూల బడ్డది. 'గ్రోఖాచ్' భార్య ఆశ్చర్యంతో మౌనంగా అంతా చూస్తున్నది.

"గాలిదుమారంలో వచ్చారే?"

"అవునండీ" అన్నది చివరికి 'మాల్యూచికా', కాని మళ్ళీమౌనం-'గ్రోఖాచ్' కోటు చిలుకకొయ్యినుంచి వ్రేళ్ళాడుతున్నది. ఒక జేబు చినిగిపోయింది. అన్నిచోట్లా అతుకులే. ఒకగుండీ దారపుపోగున వ్రేళ్ళాడుతున్నది.

"ఏమిటోచెప్పవచ్చారే?" అని 'గ్రోఖాచ్' భార్య చివరికి అడిగింది.

'మాల్యూచికా' ఆమెవైపు అర్థంలేని చూపులుచూడసాగింది.

"మీ ఆయనను పట్టుకుపోయారు" అని నెమ్మదిగా అన్నది.

'గ్రోఖాచ్' భార్య యేమాత్రమూ చలించలేదు.

"అవును, పట్టుకుపోయారు. ఏంచేస్తాము చెప్పండి. వీళ్లైనంత మందిని యిట్లానే హతమార్చటానికి ప్రయత్నిస్తారు. వాళ్ళు జర్మన్లుగాక మరొకరా?.... ఇదేనా మీరు చెప్పవచ్చారు?"

"ఊఁ అదే! మరొకవిషయంగూడా...."

"చెప్పండి. మొదట్లో యీవార్త వినగానే అక్కడే పడిచచ్చిపో తానేమోననిపించింది. తర్వాత, యేదో ఒకపని చేస్తూవుంటే, ఆ దుఃఖం మరిచిపోవచ్చునని యింటికి వచ్చి ఈపని చేయటం ప్రారంభించాను. ఏడ్చిమాత్రం యేం లాభం చెప్పండి? పరిస్థితులిలానేవుంటే యివ్వాళ మా ఆయనకు పట్టినగతే రేపు అందరికీ పట్టేటట్టుంది. ఒకరి తర్వాత ఒకర్నిగా అందర్నీ హతమార్చేస్తారు."

"కాని యిట్లా యెక్కువకాలం సాగుతుందనా ?"

"అబ్బే, యిలాగే ఉండిపోతుందనిగాదు. ఉండేపక్షంలో సర్వమూ నాశనమైపోక తప్పదంటున్నాను. కాని యింతమట్టుకు యేమీ జరుగుతున్నట్టు కనబడటంలేదు. ఏమాత్రం అలికిడి కలిగినా మన సైనికులే వస్తున్నారనుకుంటాను. అబ్బ! ఒక్కనెల గడిచేటప్పటికే ఒక సంవత్సరం గడిచినట్టుగావుంది!!— ఈనెలలో యెంతమంది నశించిపోయారు!.... గ్రామాధికారి మా ఆయనపేరు చదువుతూ నాముఖంచూచాడు. అది గమనించి నాలో నేను యిలా అనుకున్నాను 'ఓరి, కుక్కలకొడకా! నేను యేడస్తున్నానా, లేదా అని చూస్తున్నావా ? నీ తాతలు దిగిరావాలి, నన్ను నువ్వు యేడ్పించటానికి. కాని చివరికి నువ్వే వలవల యేడ్చే రోజు ఒకటి రాకమానదు. రైతుస్త్రీలను నువ్వు మోసగించలేవు'".

'మాల్యూచికా' ఉండి ఉండి బావురుమని యేడ్వసాగింది ఈమె వింతప్రవర్తన 'గ్రోఖాచ్' భార్యకు యేమీ అర్థంకావటంలేదు.

"ఏమిటిది ? అలా పిచ్చిదాన్లాగ యేడుస్తావు."

"అమ్మా! రాత్రి జర్మన్లు మా 'మిష్కా' ను చంపేశారు!"

"'మిష్కా'నా ?"

"అవును; నేనే వాడి శవాన్ని రహస్యంగా యెత్తుకువచ్చి సమాధి చేశాను. నావల్లనే, నీభర్త, తక్కినవాళ్ళు జర్మన్ల చేతుల్లో పడ్డారు...."

'మాల్యూచికా' నిలువునా వణికిపోతున్నది. కాని యేదో మహాభారాన్ని దింపి వేసికొన్నట్టు కొంత కుదుటబడ్డది.

"ఇవన్నీ నాకెందుకు చెప్పటానికి వచ్చావు ? నాకేం అవుసరం వాటితో" అని 'గ్రోఖాచ్' భార్య అడిగింది.

'మాల్యూచికా' కు ఆమె మాటలేమీ అర్థంకాలేదు.

"ఎందుకు చెప్పటమా ? నావల్ల నీభర్త జైల్లోపడ్డాడుగాబట్టి చెబుతున్నాను. నేను వెళ్ళి జర్మను ఆఫీసరుకి తెలియజేసి వాళ్ళందర్నీ విడిపిస్తానంటున్నాను."

'గ్రోఖాచ్' భార్య కోపంతోలేచి నిలబడింది.

"ఏమంటావ్ ? జర్మన్లకుచెబుతావూ! నీకు మతిపోయిందాయేం?"

"ఏంజరిగిందో చెప్పెయ్యాలి. అన్యాయంగా వాళ్ళను నేరస్థులుగా చెయ్యకూడదు."

"ఏం? నువ్వుమాత్రం యేం తప్పుచేశావని వెళ్ళి వాళ్ళకు పట్టుబడతావు? నీ పిల్లాడి శవం వాళ్ళకు వదిలెయ్యటం మంచిదా? నువ్వు చేసేపన్లో యేమైనా అర్థంవున్నదా? చెప్పు! నువ్వు రైతుస్త్రీవికావూ? గ్రామాధికారి నిన్నుమాత్రం-దయ తలిచి ఊరుకుంటాడనుకుంటున్నావా? వాళ్ళచేతుల్లో ఉన్నపనిగాబట్టి అయిదుగుర్ని పట్టుకుపోయారు. నువ్వు చేసేపని యెలా పరిణమించుతుందో యేమైనా ఆలోచించావా? వాళ్ళకన్నీ నేర్పిస్తావన్నమాట! ఈనాడు నువ్వుపోయి పట్టుబడతావనుకో; మర్నాడు మళ్ళీ యేదైనా జరిగిందంటే, అప్పుడో యాభైమందిని పట్టుకుపోతారు. కొద్దిగా ఆలోచించు. ఇంతవరకు మేమెవ్వరమూ జర్మన్లకు లొంగలేదు. నువ్విక పని మొదలుబెట్టాలనుకుంటున్నావా?"

"కాని నావల్ల యితర్లు బాధపడటం...."

"నీవల్లయెన్నటికీకాదు. మన దురదృష్టంవల్ల. ఈయుద్ధంవల్ల, యీ జర్మన్లవల్ల మనం యీ బాధలన్నీ పడుతున్నాము. కాని నీవల్ల యెంతమాత్రమూకాదు."

'మాల్యూచికా' విస్తుపోయి చూస్తున్నది.

"ఐతే...."

"ఐతే లేదు, యేమీలేదు. ఆలోచించవలసిందేమీలేదు. మాట్లాడకుండా చక్కగా యింటికెళ్ళిపో. ఈమాట మళ్ళీ యెవ్వరికీ చెప్పబోక. అందరూ మనవాళ్ళే నైనప్పటికి, యేసమయం యెట్లాగుంటుందో యేం చెప్పగలం? మన వాగుడే మనకు శత్రువవుతుంది. కాబట్టి పిచ్చిపిచ్చిగా ప్రవర్తించక యింటికిబోయి యేదైనా పని చేసుకో."

"కాని అనవసరంగా మీ ఆయన...."

"అదే మళ్ళీ అనవద్దనేది. నేను ఊరుకోగాలేంది నీకెందుకు చెప్పు? జరిగేదేదో జరుగుతుంది. అతను బతకాలనిరాసివుంటే యెలాగో బ్రతికి బయటపడతాడు. లేకపోతే జర్మన్లకెరఅవుతాడు. ఆమాటకొస్తే జర్మన్లక్రింద బ్రతికే కంటే చావేమేలు."

"ఎప్పటికీ వీళ్ళక్రింద ఉండబోతామా -"

"ఇలాగే ఉండిపోతామని నేననుకుంటే, యింతవరకు నేనుంటాననుకున్నావా? ఏనాడో ఉరిబోసుకు చచ్చిపోయేదాన్ని. కాని ఒకటి మాత్రం నిజం. ఇది మనకాలంగాదు. వాళ్ళ రాజ్యం నడుస్తున్నది. ఎన్నయినా జరగటానికి అవకాశం ఉన్నది."

'గ్రోఖాచ్' భార్య ముఖంలో యేదో ఒక దివ్యతేజంకనిపించింది. 'మాల్యూచికా' ఒక నిట్టూర్పువిడిచి అన్నది:

"నేననుకున్నవన్నీ నువ్వు తలక్రిందలు చేసేశావు."

"కాదు. నువ్వు నాదగ్గరకి రాకముందే, నీ ఆలోచనలు తలక్రిందలుగా ఉన్నాయి. ఇప్పుడు వాటిని నేను చక్కబర్చాను. నువ్వు యేదైనా పనిచేసేముందు నీవిషయమేగాక యితర్ల విషయంగూడా ఆలోచిస్తుండాలి. అల్లా మమ్మల్నందర్నీ గురించి ఆలోచించినదానివైతే జర్మన్లకు పట్టుబడతానసవు. నీ యంతట నీవు జర్మన్ల దగ్గరికిపోయి ఉరితాడు మెడకు తగిలించుకోడానికిగూడా నీకు హక్కు లేదంటాను. వారి యిష్టంవచ్చినట్టు మనల్ని హింసించనీ, కాల్చనీ, ఉరితీయనీ, కాని మనంతట మనం వాళ్ళకి అవకాశం యివ్వకూడదు. వాళ్ళెంతచేసినా మనం చలించ కూడదు, మహా చంపితే కొద్దిమందిని చంపవచ్చు. అందర్నీ హతమార్చటం వారితరంకాదు. మనం చేయగలదంతా యేమిటంటే, యే విధాన్నయినా మన సైనికులు వచ్చేవరకు ధైర్యంతో విలబడి వుండాలి."

'మాల్యూచికా' తల ఊపుతూవిన్నది. ఆమెకు చాలా నీరసంగా ఉంది. శరీరంలోని బలమంతా ఒక్కసారిగా మాయమై పోయినట్టయింది. 'గ్రోఖాచ్' భార్యకాళ్ళముందు కూలబడి బావురుమని యేడ్వాలనిపించింది. 'మిష్కా' ని 'గ్రోఖాచ్' ని, ఇంటిదగ్గర 'సాషా' తో విడిచివచ్చిన 'చెకోరికా' ముగ్గురు బిడ్డల్ని. యేటిఒడ్డున పడిఉన్న 'వాస్యా' ని—ఇంకా యెందరెందర్నో తలుచుకుని హృదయభారం తగ్గేవరకు యేడ్వాలనిపించింది.

"నువ్విక చురుగ్గావుండాలి. ఇలా యేడుస్తూ కూర్చుంటే లాభం లేదు" అన్నది 'గ్రోఖాచ్' భార్య.

'మాల్యూచికా' లేచి సెలవు తీసుకున్నది. నడవలో పనిచేస్తున్న 'గ్రోఖాచ్' యిద్దరి బిడ్డలతో మాట్లాడటానికి ఆమెకు మనస్కరించలేదు. 'గ్రోఖాచ్' భార్యవేసిన చీవాట్లతో ఆమె తలతిరిగి పోతున్నది. 'గ్రోఖాచ్' భార్యకి ఒకరిపొత్తు కిట్టదనీ, అందరితో కయ్యానికి కాలుదువ్వుతుందనీ, గయ్యాలిగంప అనీ అందరూ చెప్పుకుంటారు. కాని ఆమె హృదయాంతరాళంలో యెంతటి దివ్యమైన గుణాలు యిల్లు కట్టుకున్నాయి!

'మాల్యూచికా' యింటిదగ్గర పిల్లలంతా కలిసి ఆడుకుంటున్నారు. 'సాషా' పుల్లలతో ఒకపొలం కట్టాడు. అందులో ఒకమూల పశువుల శాలొకటి, అందులో పశువుల్ని ఉంచాడు. 'జినా' కూడా యేడ్పుమాని అందరితో కలిసి ఆడుకుంటున్నది.

"ఇక్కడేం పెడదాము ?"

"కొత్తగాకొన్న గొఱ్ఱెల్ని"

"హాఁ బావుంది"

"బొగ్గులు తీసుకురండి. గొఱ్ఱెలు నల్లగావుంటాయికదూ— అవి పెడదాము." అన్నాడు 'సాషా'

"మరి పిల్లి వుండద్దూ ?" — అని అడిగింది 'నైనా'.

"పిల్లి బయటి కెక్కడికో వెళ్ళిపోయిందట— పిల్లులు యెప్పుడూ తిరుగుతునే వుంటైగదూ ?" అని 'జినా' సమాధానం చెప్పింది. 'నైనా' ఒప్పుకున్నది.

"అదుగో జర్మన్లు వస్తున్నారంట; మన పశువుల్ని తోలుకు పోవాలి"— అని 'ఓస్యా' ప్రకటించాడు

"సరే యెవరు తోలుకెళతారు ?"

"నేను తోలుకెళ్ళి మన గెరిల్లాల దగ్గర ఉండిపోతాను" అని 'ఓస్యా' సమాధానం.

బొగ్గుముక్కలన్నీ బయటికి తోశారు.

"ఎక్కడికి తోలుకుపోదాం ?"

"నదిదాటించి. అడివిలోపలికి తోలుకుపోదాం. మన వాళ్లు జర్మన్లను నది దాటనివ్వరులే" అన్నాడు 'సాషా'

"నదిదాటుతుండగా బాంబులువేస్తే ?"

"ఫరవాలేదు. రాత్రిపడ్డాక దాటుదాము." అని నిశ్చయించాడు 'సాషా.'

ఇంతలో తలుపు దభాలున తెరుచుకున్నది. పిల్లలంతా అటుతిరిగి చూచారు. 'సాషా' వెలవెలబోతున్నాడు.

గుమ్మంముందు ఒక జర్మనుసైనికుడు కనిపించాడు. నిప్పుల్లా ఉన్న కళ్ళతో పిల్లల్ని పరీక్షగా చూచాడు. ఒంటి మీదంతా మంచు కనబడుతున్నది. పెద్దవాళ్లెవరూలేరని తెలుసుకొని యేవో ప్రశ్నలు వేస్తున్నాడు. మొదట్లో 'సాషా' విభ్రాంతుడైపోయాడు. తమ రహస్యమంతా

తెలిసిపోయిందనీ, అమ్మను పట్టుకున్నారనీ, ఇప్పుడు 'మిషాక్' సమాధి తవ్వటానికి వీడువచ్చాడనీ అనుకున్నాడు. జర్మనుసైనికుడు యేదోప్రశ్న పదేపదే అడుగుతున్నాడు. అనేకసార్లు అడిగినతర్వాతగాని, వాడు పాలు కావాలని అడుగుతున్నట్టు తెలియలేదు.

"పాలు మా దగ్గరలేవు"— అని జవాబిచ్చాడు 'సాషా.'

కాని జర్మను సైనికుడు ఇంకా అదేప్రశ్న వేయసాగాడు.

'సాషా' ఏమీ మాట్లాడకుండా దొడ్లోకి వెళ్ళాడు. నడవలోంచి, అన్నను సమాధిచేసిన స్థలంమీదుగా నడిచివెళుతుంటే, అన్నశరీరంమీద నడుస్తున్నట్లనుపించింది. 'సాషా' వెళ్ళినవైపే చూడసాగాడు జర్మను సైనికుడు. గొడ్లశాల తలుపుతెరిచి అందులో యేమీలేదని చూపించాడు 'సాషా'. ఉన్న ఒక్క ఆవుని మొదటిరోజునే తోలుకుపోయి చంపుకు తిన్నారు, జర్మన్లు. అల్లాంటప్పుడు యింకేం మిగులుతుంది?

జర్మను సైనికుడు గొడ్లశాల అంతా కలియజూచాడు. ఏమీ కనబడలేదు. అక్కడక్కడ గడ్డిమాత్రం కనుపిస్తున్నది. రొచ్చువాసన కొడుతున్నది. పాలు దొరికే అవకాశం యేమీ కనబడలేదు.

'సాషా' గూడా లేకపోవటంచూచి 'జినా' యేడ్వటం ప్రారంభించింది. ఆ పిల్లతోపాటు 'నైనా' గూడా యేడువసాగింది.

జర్మను సైనికుడు తిరిగి లోపలికివచ్చి అర్థంలేని చిరునవ్వుతో యేడుస్తున్న పిల్లలవైపుచూచేడు.

"ఏయ్, యేడువకండీ!" అన్నాడు పళ్ళికిలిస్తూ

'జినా' యింకా బిగ్గరగా యేడ్వసాగింది. జర్మను సైనికుడు తుపాకితీసి ఆ పిల్లవైపు గురిపెట్టాడు. 'సాషా' ముందుకి ఒక్కగంతువేసి చెల్లెకి అడ్డంగా నిలబడి వాడిముఖంలోకి తీవ్రంగా చూడసాగాడు.

"హ, హ, హా"— అని జర్మను సైనికుడు వికృతంగానవ్వుతూ 'నైనా' వైపు తన తుపాకి తిప్పాడు. కాని ఆ చిన్నపిల్ల 'నైనా' కు యేమీ తెలియక యేడుపుమాని అమాయకంగా జర్మనివాడివైపు చూస్తున్నది.

"కాల్చేస్తా!........"

'నైనా' కి ఆ మాటలేమీ అర్థంకావటంలేదు. కాని యేదో భయంకరమైన సంఘటన జరిగేటట్టున్నదని గ్రహించింది. 'జినా' కూడా యేడ్పుమాని అటువైపు చూస్తున్నది. 'సాషా' జర్మను సైనికుడు

చూపిస్తున్న తుపాకి గొట్టంవైపు భయంతో చూస్తున్నాడు. జర్మను సైని కుడు తుపాకి గొట్టాన్ని అటూ, ఇటూ తిప్పసాగాడు.

'సాషా' కి హఠాత్తుగా ఆలోచన తట్టింది. ఒక్కసారి మీదికి ఉరికి తుపాకి లాక్కుంటేనో ? తుపాకి యెట్లా కాలుస్తాడు ? జర్మను సైనికుడు చచ్చిపోయింతర్వాత యేం జరుగుతుంది ? అన్నిటికంటే, వాడి దగ్గర్నుంచి తుపాకి లాక్కోటం సాధ్యమవుతుందా ?.......

జర్మను సైనికుడు, తన అసహ్యమైన పళ్ళు కనబడేటట్టు యిగి లిస్తున్నాడు. పిల్లలు భయపడుతుంటే చూడటం వాడికి సరదాగా వున్నది. ఊరికే వాళ్ళను యేడ్పించటానికి అట్లా వాడు చేస్తున్నాడని 'సాషా'. గ్రహించాడు.

పెద్దవాడు గాబట్టి తననే ముందు చంపుతానుకున్నాడు 'సాషా' దానికోసం యెదురుచూస్తూ నిలబడ్డాడు. ఎంత ముందుగా చంపేస్తే అంత మంచిదనుకున్నాడు.

చివరికి జర్మను సైనికుడికి విసుగుపుట్టింది. ఒక్క తడవనవ్వి, తుపాకి భుజాన వేసుకొని, వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళి పోయాడు. పిల్లలంతా నిశ్చేష్టులై తలుపువైపు చూస్తూ ఉండిపోయారు. వాడు తలుపు వెనుక దాక్కున్నాడేమో ? వాళ్ల కదలటం కనిపెట్టి, మళ్ళీ లోపలికివచ్చి కాలుస్తాడేమో అని నిరీక్షిస్తున్నాడు 'సాషా'. చివరికి 'నైనా' కూడా శిలాప్రతిమలాగ కదలకుండా కూర్చొని చూస్తున్నది. అదుగో, మళ్ళీ అడుగుల చప్పుడౌతున్నది ! వాడు వస్తున్నాడేమో ?....

మెల్లిగా తలుపు తెరచుకున్నది. 'మాల్యూచికా' లోపలికివచ్చింది. ఆమెను చూడగానే చిన్నపిల్లలంతా ఒక్కపెట్టున యేడ్చారు. 'సాషా' మాత్రం చలించకుండా మౌనంగా తల్లిముందు నుంచున్నాడు.

"ఏమిటిది ? ఏంజరిగింది ? -" భయంతో కంపిస్తున్న కంఠంతో అడిగింది.

"ఏమీలేదు. జర్మనువాడొకడు వచ్చేడిక్కడికి" అని 'సాషా' జవాబిచ్చాడు.

"జర్మనువాడా ? ఎందుకొచ్చాడు ?"

"అబ్బే, యేమీలేదు. పాలకోసం వచ్చేడు."

" ఐతే ? "

" మనకు ఆవుల్లేవని దొడ్డిచూపించాను. "

" అంతటితో వెళ్ళిపోయాడా ? "

" ఆఁ వెళ్ళిపోయాడు. "

" మరెందుకు అట్లా యేడుస్తున్నారు ? పోయాడుగా లేక మిమ్మ ల్నేమైనా కొట్టాడా ? "

" ఉఁ హుఁ కొట్టలేదు. " అని ' సాషా ' మెల్లిగా జవాబిచ్చాడు. ' మాల్యూచికా ' బయటికివెళ్ళి తన శాలువామీది మంచు దులుపుతున్నది.

" అబ్బ ! యేమి గాలిదుమారం ! ! "

దూరంనుంచి బాధను వెల్లడించే ఒక పెద్దకేక వినుపించింది.

" ఏమిటది ? "

" 'ఓలెనా' అత్తయ్య పాపని కంటున్నది " అని ' మాల్యూచికా ' జవాబిచ్చింది.

' ఓలెనా ' ప్రసవవేదనపడుతూ కేకలుపెడుతున్నది. మౌనంగా అంతా వినసాగారు—



# 4

అరెస్టుచేసిన ఖైదీలను జర్మను సైనిక కార్యాలయంలోని ఒక గదిలో బంధించారు. పెద్ద పెద్ద మొద్దులతో దాని గోడలు నిర్మింపబడి ఉన్నాయి. జర్మన్లు రాకమునుపు ఆగదిలో గ్రామ సోవియట్ యొక్క గ్రంథాలయం ఉండేది. ఇప్పుడు జర్మన్లు ఆగది కిటికీలన్నీ బలంగా బిగించేశారు. అందువల్ల అంతా చీకటిగావుంది. దాని ప్రక్కనేఉన్న కాపలా సైనికులగదిలో వెలుగుతున్న దీపపుకాంతిమాత్రం తలుపుసందులోంచి సన్నగా కనుపిస్తున్నది.

లోపల కూర్చోటానికి యేమీలేదు. మొదట్లో ఆ అయిదుగురు ఖైదీలకు చీకట్లోయేమీ కనుపించలేదు. కొద్దిసేపటికి వారికళ్లు ఆచీకటికి అలవాటు పడిపోయినై. గోడల నానుకొని ఒక్కొక్కరే కూలబడ్డారు. 'గ్రోఖాచ్' వట్టినేలమీద తలక్రింద చెయ్యిపెట్టుకొని చేరగిలబడ్డాడు. కొద్దిసేపట్లోనే నిద్రకూడా పట్టేసింది.

కాని తక్కినవాళ్లు నిద్రపోలేకపోయారు. 'ఓల్గాపలాన్‌చుక్' 'చెకోరికా'కు దగ్గరగా కూర్చున్నది. ఆమెకు ఆగదిని, ఆచీకటిని చూస్తుంటే భయంవేస్తున్నది. ఇకముందు యేమి జరుగబోతుందోనని ఆమె మనసు ఆరాటపడుతున్నది. అందువల్లనే 'చెకోరికా'ను అనుకొని మరీ కూర్చున్నది.

ఒక్క 'మలాషా' మాత్రం అందరికీ దూరంగా ఉన్నది. ఒక మూల గోడకానుకొని చేతులతో మోకాళ్లు చుట్టి కూర్చొని తదేకదృష్టితో గాడాంధకారంలోకి చూస్తున్నది. ఆమె మనస్సు తక్కిన ఖైదీలవలెలేదూ. నిశ్చేష్టురాలై, రెప్పవాల్చకుండా ముందుకి అంధకారంలోకి చూస్తూ, నెమ్మదిగా ఊపిరితీస్తూ యేదో వింటున్నది. ప్రక్కగదిలోంచి వచ్చే శబ్దాలుమాత్రం ఆమెకు వినుపించటంలేదు. గ్రామంలోంచివచ్చే యితర శబ్దాలయినా ఆమె చెవికెక్కటంలేదు. కనుబొమ్మలు ముడిచి తనలోనే

యేదో వినటానికి ప్రయత్నిస్తున్నది. ఒక వారంరోజులు అప్పుడే దాటిపోయినై. అహఁ, కాదు, కాదు....పదిరోజులు దాటిపోయినై. ఒక భయంకరమైన ప్రశ్న ఆమెను వదులకుండా బాధిస్తున్నది. నిజమా?.... వట్టిదేనా? నిజమా?....వట్టిదేనా? కండ్లల్లో రక్తం జేవురించింది. హృదయం వేగంగా కొట్టుకుంటున్నది. తన శరీరంలో ప్రవహిస్తున్న రక్తంయొక్క శబ్దం, సమ్మెటలతో కొడుతున్న శబ్దంలాగ వినుపిస్తున్నది. చివరికి యెట్లా తెలుసుకోటం?....ఏదిదారి?....

మళ్ళీ ఒకసారి రోజులు లెక్కవేసుకున్నది. ఒకవేళ పొరపాటు పడ్డదేమో? ఉఁ హుఁ - లేదు. ఎన్నిసార్లు లెక్కవేసినా పదిరోజులే తేలుతున్నవి. పదిరోజులు గడిచిపోయినై!.... ఈరోజుకీ, 'ఆ' నాటికీ-తనను రెండుగా చేసిన 'ఆ' నాటికి - మధ్య జరిగిన సంఘటనలన్నీ కళ్ళముందు తిరుగుతున్నాయి. 'ఆ' నాటిని తలుచుకుంటే యేదో బాధతో ఆమె శరీరం కంపించిపోయింది! పిడికిళ్లు బిగించి, కాళ్లు పొత్తికడుపులోకి లాక్కొని ముద్దలాగ కూర్చున్నది. భయంకరమైన బాధ నరాల్లో ప్రవేశించింది. ఇక నేమాత్రం భరించలేక, తనకు తెలియకుండానే పెద్దపెట్టున యేడ్చేస్తానేమో అనిపించిందామెకు. తన బాధనంతా యేడ్పులో ముంచెయ్యాలనిపించింది.

అమితమైన బాధతో కృంగిపోతున్నది. ఇక భరించలేక అక్కడే పడి చచ్చిపోతుందేమో అనిపిస్తుంది. కాని చావురాదుగదా! పైగా యిక్కడ కూర్చొని, అంటరాని తన జీవితాన్ని, ప్రజలకు, గ్రామానికి, ప్రపంచ జీవిత సర్వస్వానికి వెలియైపోయిన తన జీవితాన్ని, గురించి తలుచుకోటం మరీ దారుణం!!—తనలాంటి అంటరాని వాళ్ళెవ్వరూ ఉండరు....ఉండకూడదు....

'మలాషా'కి గదిలోని చీకటి కనిపించటంలేదు. పశుతుల్యులైన ముగ్గురు ముష్కరులముఖాలు తనమీదికి వంగుతున్నట్టు కనుపిస్తున్నాయి. ఆ ముగ్గురు ఆమె మనోఫలకంమీద, జీవితంలో యెన్నడూ మరువలేనట్టి-మరువరాని - భయంకర చిత్రాన్ని ముద్రించేశారు. ఏనుగుదంతాల్లాగ ముందుకు పొడుచుకువచ్చి, కనుపించే పళ్ళిగిలిస్తూ మాసినగడ్డాలతో, ఆ మొరటు ముఖాలు యెన్నటికీ మరుపుకి రావు....

మొన్న మొన్నటివరకు ఆమె తన భర్త 'ఐవన్' తో అదే గదిలో కాపురంచేస్తూ వచ్చింది. అదే పడకమీద పడుకుంటుండేది. కాని

'ఆ' నాటి రాత్రి చింపేసిన తలగడలోంచి దూదిఅంతా గదినిండా యెగురుతూ, పగలగొట్టిన పువ్వులు పెట్టుకునే 'వాస్' ముక్కలు యింటినిండా పడి యెంతైనా అసహ్యమైపోయింది. ఆ విషయం తలుచుకుంటుంటే ఆమె హృదయం వ్రక్కలై పోతుంది. కాని ఆ తలంపు దూరంచేయటానికి ఆమెకు సాధ్యం కావటంలేదు. క్షణిక కాలమైనా ఆమెను విడువకుండా ఆ తలంపు ఆమెను వెంటాడుతున్నది. ముగ్గురు :— మాసినగడ్డాలతో, ఆ మొరటుముఖాలతో, వెకిలినవ్వులు నవ్వుతూ, కేకలు పెడుతూ, తమ యినుప హస్తాలతో ఆమెచేతులు వెనుకకు విరిచి, కాళ్లు అదిమిపట్టి అడవి మృగాల్లాగ ప్రవర్తించి, ఆమెను అక్కడ పడేసి తలుపు ముఖం మీద కొట్టినట్టుగా విసిరికొట్టి వెళ్ళిపోయారు. అది మొదలు ఈ పిశాచం ఆమెను క్షణమైనా విడువకుండా వెంటాడు తున్నది. ముఖ్యంగా యీ మధ్య గడచిన పదిరోజులు— నిద్రాహారాలుకూడా లేకుండా— రాత్రింబగళ్లు, పిచ్చెత్తి పోయేస్థితిలో, తన అంతర్యంనుండి యేదో వినటానికి ప్రయత్నిస్తూ, ఒక్కొకరోజు గడుస్తుంటే ఒక్కొక్క మహాపర్వతంమీదికి దొర్లిపోతున్నట్టుగా హింసపడుతున్నది.

గ్రామంలో యెంతోమంది బాధపడ్డమాట వాస్తవమే. అనేకులు ప్రాణత్యాగులైన మాటకూడా నిజమే. 'లివాన్యుక్' ఉరికంబంనుంచి వ్రేళ్ళాడుతున్నాడు. 'ఓలెనా' నిండుగర్భిణి అయికూడా యమయాతనలకు గురియవుతున్నది. కాని వారెవ్వరికీ తనకు కలిగినటువంటి భయంకరానుభవం కలుగలేదు. ఇప్పుడు తాను, తనలోనే ఒక జర్మను విత్తనాన్ని పోషిస్తున్నది : ఇతర్లు యెంతటిబాధలు అనుభవించినప్పటికి, తనలాగ తనశత్రువునే తమలో పెంచవలసిన భయంకరస్థితి ఎవ్వరికీపట్టలేదు.... ...

ఒకమూల 'ఓల్గా' చిన్నబిడ్డలాగ యేడుస్తూ కూర్చున్నది. 'మలాషా' కి తీవ్రమైన కోపంవచ్చింది. ఆ తెలివితక్కువ మనిషియెందుకట్లాయేడ్వాలి ? ఆమె యేడ్వవలసినంత కష్టమేమి వచ్చింది. జర్మన్లు తన శీలాన్ని చెరిచేటంతటి దురదృష్టానికి ఆమె పాల్పడలేదుగా ? ఇంకెందుకూ భయం ? చంపేస్తారనా ? అలాచేస్తారని ఆమె నమ్మలేక పోయింది. అలా ఒక్కసారి చంపేవేస్తే ఇంకా కావలసిందేముంది ? ఉహుఁ. అలా యెప్పటికీ చేయరు. ఇంకా వారిని యెన్నెన్నో ఘోరమైన కష్టాలు- చావుకంటే కూడా భయంకరమైన కష్టాలు— పెడతారు. ఒకేసారి చంపేస్తే అదృష్టమే కదూ ?........

మళ్ళీ ఆమె రోజులు లెక్కపెట్టసాగింది— ఒకటి, రెండు, మూడు. పదివరకు లెక్కించుకొని వణికిపోయింది. హృదయం పగిలిపోయే టట్టున్నది. భరించలేక పోతున్నది: ఇక ఒక నిముషంకూడా భరించటం అసాధ్యం. కాని ఆమె హృదయం పగిలిపోలేదు. తన శరీరంలో పరుల రక్తం ప్రవహించటం వినుపిస్తున్నది. ఛీ! ఈ బ్రతుకెందుకు? ఎర్ర సైనికయోధుని భార్యఅయిన 'మలాషా' ఒక జర్మను శిశువును కనటానికేనా బ్రతికున్నది!!....

ఆమెపరీక్షగా వింటున్నది. హృదయంలోను, కణతల్లోను రక్తం సమ్మెటలతో కొట్టినట్టుగా వినబడుతున్నది. చేతితో తనగర్భాన్నితాకింది. అక్కడగూడా అదేశబ్దం!—

'మలాషా'కి తనశరీరం చూచుకుంటే తనకే భరింపలేని అసహ్యం వేస్తున్నది. అది యిక తనశరీరం కాదు— పుట్టబోయే ఒక జర్మను శిశువుని పెంచుతున్న నీచగృహం! ఇప్పుడు తాను భోజనం చేస్తుంటే తానొక్కర్తే ఆ ఆహారాన్ని పొందటం లేదన్నమాట. తన జీవితాన్ని సర్వనాశనంచేసే జర్మను శిశువు ఆ ఆహారంతో పెరిగి పెద్దదవుతున్నది. ఆమెనిద్రిస్తుంటే, 'మలాషా' విశ్రాంతిని పొందటం లేదన్నమాట. ఆమెలోని జర్మను శిశువు విశ్రాంతిని పొందుతున్నది. తన శరీరంలో పెరుగుతున్న 'దానిని' ఒక శిశువుగా ఆమె భావించలేక పోతున్నది ఇప్పుడు బాధతో పెడబొబ్బలు పెడుతున్న ఆ 'ఓలెనా' కు పుట్టబోయే శిశువే శిశువు. రాత్రి జర్మను తుపాకికి గురియైనలాంటి బాలుడే బాలుడు! 'చెకోరికా' కు కలిగిన సంతానంలాంటి సంతానమే సంతానము! రూపసులో, కురూపులో— ఆ తల్లులు ఆ బిడ్డల్ని ఆనందంతో తొమ్మిది నెలలూమోసి కన్నారు. కాని తాను తనగర్భంలో పెంచుతున్నది, తాను కనబోయేది శిశువుకానేరదు. అదొక జర్మను తోడేలు పిల్ల అనటం బాగుంటుంది. ఇక దానిని మార్చేవిధంలేదని తలుచుకుని ఆమె భయకంపితురాలై పోయింది. అది—తన గర్భంలో నున్నది—చనిపోయినప్పటికీ— తాను స్వయంగానే పిసికి పారేసినప్పటికి— యేం లాభం? బేధంయేమీ ఉండదు. ఒక నీచుడా జర్మనువాడికి సంబంధించిన శిశువుని, తనగర్భంలో, తనరక్తంతో పెంచినపాపం తనను యెన్నటికీ వదలదు. ఆ గర్భాన్ని— దినదినం వృద్ధిచెందే ఆ గర్భాన్ని— చూచినవారు యెంతైనా

అసహ్యించు కొంటారు. పెరిగిన తనగర్భాన్ని, తనను చూచి, కుష్టు రోగిని చూచి తొలగిపోయినట్టుగా తొలిగి పోతారు.

ఆమెకు కలిగిన ఘోరదుస్థితి సంగతి గ్రామస్థులందరికీ తెలిసింది. ఆమె పట్ల అందరూ సానుభూతిచూపించి, ఆ జర్మన్ల పాపం బద్దలయ్యే రోజు రాకపోదన్నారు. తాము పగతీర్చుకొనక మానమన్నారు. కాని అది అసాధ్యమని 'మలాషా' కి తెలుసు. ఇతరులకు జరిగిన అన్యాయాలకు ప్రతీకారం తీసుకొనటం సాధ్యమవుతుంది. 'లివాన్యుక్', 'ఓలెనా' మొదలైనవారికి కలిగిన అన్యాయాలకు పగతీర్చుకోటం వీలవుతుంది. కాని తనకు జరిగిన అన్యాయంలో ప్రతీకారం తీసుకోటానికి తావులేదు. ప్రజలు అసహ్యించుకో నప్పటికీ, కుష్ఠురోగి శరీరంలాంటి తన శరీరంతో యీ ప్రపంచంలో బ్రతికటంయెట్లా? ఏనకూ, తన ప్రజలకూ, ఆ నాడు-ఆ ముగ్గురు జర్మను పశువులు తనశీలాన్ని చెరిచిననాడే— ఒక పెద్ద అఘాతం యేర్పడిపోయింది! ఈ యమయాతన అనుభవించటానికి యింకా బ్రతుకి ఉన్నది. శీలంచెడి, శరీరం మలినమై పోవటమేగాక, యీ విధంగా భయంతో ఒక్కొక్కరోజే లెక్కించుకోటానికి యింకా ప్రాణాలు మిగిలాయి. తాను లెక్కవేయటం పొరపాటేమోననీ, ఇలాంటి ఆలస్యాలు సాధారణంగా అప్పుడప్పుడు జరగటానికి అవకాశముందనీ, పిచ్చిఆశ ఒకమూల ఉన్నప్పటికీ, తాను గర్భవతి అయినదని యేదో ఆమె ఆంతర్యంనుండి ఘోషిస్తున్నది........

చక్కని సూర్యరశ్మితోను, అందమైన పువ్వులు, వాటి సువాసనల తోను నిండిన యెండాకాలపు ఆనందమయ దినాలు గుర్తుకొచ్చాయి. వెండి పూతబూసినటువంటి ఆ వెన్నెలరాత్రుల్లో, ఎత్తుగా పెరిగిన పొలాలు, అవి విరజిమ్మే సువాసనలు కోతలుకోసి కళ్ళాల్లోవేసి, అక్కడ చిన్న చిన్న గుడిసెలు వేసుకొని గడిపిన ఆ మధురమైన రాత్రులు జ్ఞప్తి కొచ్చాయి. ఆ రాత్రుల్లో, ఆ ఆలింగినాల్లో ఆమె గర్భం తాల్చలేదు. మధుర మైన రాత్రులు, ఆనందం వెల్లువలై ప్రవహించిన సమయాలు, పెదవులు పెదవుల కలిసిన ఆ క్షణాలు, హృదయం ఉప్పొంగి గంతులు వేసిన ఆ అనుభవాలు, యెలాంటి చిహ్నంకూడా లేకుండా, అసలు జరుగనట్టు గానే గడిచిపోయినై. పైగా ఆ నూర్పుల కాలంలో యెన్నెన్ని రాత్రులు గడిపింది! తన ప్రియుడికి తన సర్వస్వాన్ని అర్పించి, అతనిలో కరిగి పోయింది - కాని ఆమెకి అటుతర్వాత యేమీ కలుగలేదు.

కాని యీనాడు, కొన్నిక్షణాల్లో కలిగిన ఆ భయంకరానుభవం, ఆమె జీవితానికి మాయని మచ్చ కలిగించింది: ఒక నీచుడి ప్రతిబింబాన్ని తన గర్భంలో పెంచే దౌర్భాగ్యానికి దారితీసింది.

'ఐవన్ 'తో తనకు వివాహం జరిగినప్పటి విషయాలు గుర్తుకి తెచ్చుకున్నది. ఆమె వివాహ జీవితం యెక్కువకాలం జరుగకపోయినా, ఆకాశంలో నక్షత్రాలు ముసిముసినవ్వులు నవ్వే మధురాతి మధురమైన అనేక రాత్రులు భర్తతో గడిపింది. తర్వాత అతడు సైన్యంలోకి వెళ్ళిపోవటంతో ఆమె వివాహజీవితం అంతరించిపోయింది. అటుతర్వాత గూడా ఆమె ఊచలాంటి తన అందమైన శరీరంతోను, నాగుబాములాంటి నడుముతోను, ఉబికి వస్త్రువలైన వక్షంతోను, వీధుల్లో నడుస్తుంటే, ఆమె 'ఐవన్ 'సొత్తు అయిపోయి యెంతోకాలమైనదని తెలిసిగూడా యువకులు ఆమెనుచూచి మందహాసం చేయకుండా ఉండలేకపోయేవారు. మిలమిల లాడే ఆమెకళ్లు, తీర్చిదిద్దిన పలువరుసా చూడటానికి వారెంతైనా ఆనంద పడేవారు.

కాని ఒక కాళరాత్రిలోని కొన్నిక్షణాలు వాటినన్నింటిని తారుమారు చేసినాయి. ఇంతవరకు ఆవిషయం యెవ్వరికీ తెలియదు. పైకి కనబడటం కూడా లేదు. అయినా రోజులు గడచిన కొద్దీ గ్రామస్థులకీవిషయం బయటపడుతుంది. ఆమెకు జరిగిన ఘోరం చాలదన్నట్టు, ఈ జర్మను శిశువును తన శరీరంలో పెంచేనైచ్యం, బాధ ఆమెకు పాల్పడ్డాయి. తాను నొప్పులుపడేవేళ, ఆశిశువును కనేవేళ యెవరు సహాయంచేస్తారు? ఒక తోడేలు పిల్లను, హంతకుని బిడ్డను కనబోయే తనకు పురుడుబోయటానికి గ్రామంలో యేస్త్రీ అంగీకరించగలదు?.... పైగా 'ఓల్గా' ఆమూల గూర్చుని చావుకి భయపడుతా యేడుస్తున్నది. ఆ ఖైదీలు చావరనిమాత్రం 'మలాషా 'కి తెలుసు. వారి ప్రాణాలను యేదిరక్షిస్తుందోమాత్రం తెలియదు. ఆ చనిపోయిన పిల్లవాడి విషయం, అతని శవాన్ని జర్మన్లపాల్పడకుండా రక్షించిన వారివిషయం జర్మన్లకు యెవరైనా తెలియజేస్తారనటం కలలోనైనా జరుగదనికూడా ఆమెకు తెలుసు. జర్మన్లకు ధాన్యం యెవ్వరైనా అందజేస్తారనుకోటం అంతకంటే అసాధ్యమైన విషయం. ఏమి జరుగుతుందో, యేవిధంగా జరుగుతుందో తెలియకపోయినా, తాను చావననీ, తనను వాళ్ళు చంపరనీ యెందుకో అనిపిస్తున్నదామెకు. ఆమెను చంపనప్పుడు, తక్కినవాళ్ళుకూడా బ్రతికిఉండటాని కవకాశముంది....

మొదట్లో 'చెకోరికా' 'ఓల్గా'కు ధైర్యం కలిగేటట్టు ఆమె చెయ్యి నిమురుతూ కూర్చున్నది. కాని ఓల్గా యింకా యేడుస్తుంటే, ఆమె సహించలేకపోయింది.

"ఎందుకట్లా యేడుస్తావు? జరిగేదేదో జరుగుతుంది. అలా యేడ్వటానికి సిగ్గెయ్యటంలేదూ?" అని కసరుకున్నది.

"ఏం చెయ్యను? యెంత ప్రయత్నించినా దుఃఖం దానంతటదే వచ్చేస్తున్నది." అని చిన్నపిల్లలాగ వెక్కివెక్కి యేడుస్తున్నది. ఆ యేడ్పు వింటుంటే 'చెకోరికా'కి తన చిన్నకూతురు నైనా జ్ఞాపకం వచ్చింది.

"సరే, ఊరుకో. ఇంకా యేమీ నిశ్చయంకాలేదుగా -"

'మలాషా' ఆ చీకట్లో తనలోతానే వెఱ్ఱినవ్వు నవ్వుకున్నది. అంతా నిశ్చయమైపోయిందని ఆమెకు తెలుసు. చావుకలిగే ఆశేలేదు—

"నా ముగ్గురుబిడ్డల్ని యింటిదగ్గర వదిలివచ్చేశాను. వాళ్ళగతి యేమయిందో తెలియదు. అయినా నేను, నీలాగ యేడుస్తూకూర్చున్నానా?" అని అన్నది 'చెకోరికా'. ఆమాటలు అంటున్నదేగాని, ఆమె హృదయం దుఃఖభారంతో నలిగిపోతున్నది. పిల్లల్ని ఒకసారి, ఒకనిముషంపాటైనా చూడాలనిపించింది. ఏంచేస్తున్నారో? ఎట్లాగున్నారో? 'మాల్యూచికా' వాళ్ళయింటికి తీసుకుపోయిందో. లేక తనయింట్లోనే ఉండిపోయారో? చీకట్లో, వీధిలో వినబడే అడుగుల చప్పుళ్లువిని, భయపడి, గుండెపగిలి బేజారై పోయారేమో? ఆనాడు జర్మనుసైనికులువచ్చి, తమయింటినుంచి తమనే వెళ్ళగొట్టినప్పటినుండి పిల్లలు యెన్నడూలేని భయాన్ని పొందుతున్నారు.

"పో. బయటికి!" అని ఒక పొడుగాటి సార్జెంటు, వాళ్లతమను బయటికి గెంటేస్తున్నప్పుడు, చలిలో పిల్లలు గడ్డకట్టిపోకుండా కాపాడుకోటానికి ఆమె కొన్ని గుడ్డలు తీసుకోటానికి ప్రయత్నిస్తే. తుపాకిమడమతో కొట్టాడు. "వెళ్ళిపోండి!" అని వాడు మళ్ళీ గర్జించేటప్పటికి పిల్లలు భయంతో ఆ కటికి చలిలోకి పరుగెత్తారు....

కాని తర్వాత వాళ్ళకాయిల్లు నచ్చక అదివదిలేసి మరొక యింటికి వెళ్ళిపోయారు. అందువల్ల తనకూ,తన పిల్లలకూ తలదాచుకోటానికి మళ్ళీ యింతస్థలం దొరికింది. కాని యిల్లంతా బాగుచేసుకునేటప్పటికి కడుపులో పేగులు తోడేసినై. జర్మన్లు పైలకి కూడా నడప

లోనే కుర్చున్నారు. తనయిల్లు నచ్చక అట్లాచేసేసి వెళ్ళిపోయారేమో అనుకున్నది 'చెకోరికా'. కాని కొన్ని రోజులు గడిచాక గ్రామంలో జర్మన్లున్న అన్ని యిళ్ళల్లోను అదేవిధంగా జరుగుతున్నదనికూడా తెలిసింది. చలికి బయటికి పోలేక అలా చేస్తుండేవారు. జర్మను పశువులు ఆరోతలో యెలాగుండేవారో ఆమెకు అర్థమయ్యేదికాదు....

'మాల్యూచికా' దగ్గర పిల్లలు చేరికగా ఉంటారో లేదో? 'ఓస్యా', 'మాల్యూచికా' కొడుకు 'సాషా' తో కీచులాడతాడేమో! 'ఓస్యా', 'సాషా' కంటే చిన్నవాడు. బలంతక్కువవాడైనప్పటికి పౌరుషంలోమాత్రం తీసిపోడు, వయస్సులో తనకు రెండింతలు పెద్ద వాళ్ళతోకూడా కయ్యానికి తయారౌతుంటాడు. బయటికి వెళ్ళాడంటే యెక్కడో ఒకచోట దెబ్బలుతినే వస్తుంటాడు. 'సోన్యా' మట్టుకు అల్లరిచెయ్యకుండా బుద్ధిగానే ఉంటుంది. కాని తక్కిన యిద్దరు 'ఓస్యా', 'నైనా' లతోనే పేచీవస్తుంది....పాపం! 'మాల్యూచికా' ఈ పిల్లలందరితో యెట్లా తంటాలుపడుతుందో! ఈ కరువు రోజుల్లో వాళ్ళనెట్లా పోషించగలుగుతుందో!!—

'యొడోకిమ్' తాత ఉండి ఉండి ఒక్క నిట్టూర్పు విడిచి యిలా అన్నాడు "'గ్రోఖాచ్'ని చూడండి, ఎంతహాయిగా గుఱకలుపెట్టి నిద్రపోతున్నాడో?"

'గ్రోఖాచ్' ఆ నిశీథంలో నిశ్చలంగా గుఱకలు పెడుతూ నిద్రపోతున్నాడు.

"తాతయ్యా. నీకు నిద్రరావటంలేదూ?"-అని 'చెకోరికా' తనఆలోచనలు పిల్లలమీదినుంచి మరల్చుకోటానికి ప్రయత్నిస్తూ అడిగింది.

"నిద్ర? నిద్రయేనాడో మరిచిపోయాను. ఏదో అప్పుడప్పుడు యింత కునుకుతీస్తాను."

"ఇప్పుడు టైము యెంత అయ్యుంటుందో? అని 'ఓల్గా' అడిగింది.

"ఏమో? చెప్పటం కష్టం. ఇట్లా కూర్చుంటే టైముసంగతి కూడా తెలియదు....ప్రక్కగదిలో దీపంవెలిగించారు. బహుశ రాత్రి పదిఉండవచ్చు."

"ఇంతేనా?"-అని 'ఓల్గా' నిరుత్సాహపడింది- "ఎంతో కాలమైపోయిందనుకున్నాను."

"అవును; యెంతోకాలం గడవలేదు. కాని అలా నిరుత్సాహపడితే యెట్లా చెప్పు పిల్లా? ఇంకా యెంతకాలం ఇక్కడ ఉండవలసివస్తుందో?"

"'ఓల్గా' ఇంకా చిన్నది. ఐనా మీ ఆడవాళ్ళకు తగని తొందర" అన్నాడు 'యాడోకిమ్' తాత.

'చెకోరికా' ఆ చీకట్లోనే 'యాడోకిమ్' తాతవైపు తిరిగి చూడ సాగింది. ఆమె కళ్లు ఆ చీకటికి బాగా అలవాటుపడిపోయినై. ప్రక్క గదిలోకున్న తలుపుసందులోంచి సన్నని వెల్తురు లోపలికి వస్తున్నది. ఆ కొద్ది వెల్తుర్లోనే ముగ్గుబుట్టలాగ పండిపోయిన 'యాడోకిమ్' తాత తల కనుపిస్తున్నది.

"తొందరెందుకు తల్లీ! ఇక్కడ గడిపే క్షణాలే మనవి. ఆతర్వాత యేమైపోతామో, యేం చెప్పగలం?"

"మన సైనికులు యీలోగావచ్చేస్తే" - అని 'ఓల్గా' అడిగింది. ఆ బందిఖానానుండి మృత్యుముఖంలోకేతప్ప, వేరుచోటుకి పోలేమని ఆమె మనుస్సు ఊహించలేకుండావుంది.

"కాని జర్మన్లు మనకిచ్చిన గడువు మూడురోజులేగా?"

"ఈ మూడురోజులు చాలదూ?"

"గాలిదుమారం యిట్లాలేస్తుంటే యేం చెప్పగలం? మన వాళ్లు మెషిన్‌గన్నులు మొదలైన వాటితో రావటం సాధ్యమవుతుందా? గజం దూరంలో ఉన్నవార్ని చూడటమే దుస్సాధ్యంగా ఉందాయె - అలాంటప్పుడు దారీ, డొంకా యేం తెలుస్తుంది?" అని 'చెకోరికా' నిశ్చలంగా పలుకుతున్నది. కాని తన మాటల్లో తనకే నమ్మకం కలుగలేదు.

గాలిదుమారం జోరుగా ఉన్నమాట నిజమే. కాని అలాంటప్పుడు గూడా వారు అచంచలమైన నమ్మకంతో ఎర్రసైనికుల రాకకొరకు యెదురు చూస్తున్నారు. ఆవాళ ప్రొద్దుటే 'చెకోరికా' ఎర్రసైనికులు వస్తున్నారేమోనని యెంతోసేపు నిరీక్షిస్తూ కూర్చున్నది. ఈ తుపాను యెర్రసైనికులకు ఒక లెక్కలోనిదా? ఎక్కడపడితే అక్కడ ప్రజలు వారికి సహాయంచేసి, దారిచూపిస్తారు. అలాంటప్పుడు యెందుకు రాకూడదు?

'ఓల్గా' అన్నమాట నిజమే. వాళ్ళు యేక్షణాన్నన్నా రాగలరు. మృత్యువుకీ తమకూ మధ్యగల యీ మూడురోజుల్లో యేక్షణాన్నన్నా రావచ్చు. హఠాత్తుగా ఆ చీకటికూపం తలుపులు తెరుచుకొని, ఆమె కాంతి

మయ ప్రపంచంలోకి పరుగెత్తి ఎర్రసైనిక యోధులను కలుసుకొని, 'మాల్యూచికా' దగ్గరఉన్న తన బిడ్డలదగ్గరికి వెళ్ళటం జరుగవచ్చు.

ఒకవేళ యితర శబ్దాలు యేవీ వినబడనివ్వకుండా జేసే యీ గాలి దుమారాన్ని, చీకటిని ఆధారంగా చేసుకొని గ్రామానికి చేరుకుంటున్నారేమో? ఒక్కసారిగా, మెఱుపు మెరిసినట్టు వచ్చిపడి తమ రక్తం పీలుస్తున్న యీ జర్మను జంతువుల్ని తుదముట్టించలేరూ?

"వాళ్లువస్తే రానూవచ్చును. మనం బ్రతికి బయటపడటానికి గూడా అవకాశమున్నదేమో?" - అని ఆమె బిగ్గరగా అన్నది.

"వస్తారని నమ్మకమేనా?" - 'ఓల్గా' అడిగింది.

"ఏమో? — ఇప్పటికే కాలం మించిపోయింది" — అని 'యాడోకిమ్' తాత గొణిగాడు.

"వాళ్ళు వచ్చిన తక్షణమే మనను విడిపించటానికి వస్తారు. గ్రామస్థులకు మనం యెక్కడున్నదీ తెలుసుగా —" అని ఉద్రేకంతో అన్నది 'ఓల్గా'. ఇక ఒక్కక్షణంకూడా అక్కడ కూర్చోలేనిస్థితిలో ఉన్నది ఆమె. తమ సైనికులు యెప్పుడు వచ్చి తమను విడుపించుతారా అని ఆమె మనస్సు తపించిపోతున్నది.

వచ్చినప్పటి మాటగద....అప్పుడే గ్రామంలోకిగూడా వచ్చేసినట్లు మాట్లాడతావే—" అన్నది 'చెకోరికా'.

"ఏమో వచ్చేశారేమో?"

'మలాషా' ఇంకా అదేవిధంగా కూర్చుని చీకట్లోకి వెఱ్ఱిచూపులు చూస్తున్నది. అవును - వాళ్ళందరు విముక్తి పొందటానికి ఆశతో వేచి ఉండగలరు. కాని తన విషయం? ఎవ్వరూ సహాయంచేయలేరు; ఎవ్వరూ రక్షించలేరు. ఎర్రసైనికులొస్తేమాత్రం? తాను పోయి ఆనందంతో వారిని ఆహ్వానించటానికి నోచుకోలేదు. ఇంతకూ వారిముఖాలు యెలా చూడగలను?.... తానెవరు? ఒక జర్మను శిశువును తన గర్భంలో పెంచుతున్న నీచురాలు! పాపాత్మురాలు....యుద్ధం ముగిసి 'ఐవన్' ఇంటికి తిరిగి వచ్చినప్పటికి, అతనిని ఎలా కలుసుకోగలగుతుంది? తన పాడుముఖం 'ఐవన్'కి చూపించటం యెట్లా? ఎక్కడైనా కనబడ్డా అసహ్యంతో ముఖంమీద ఉమ్మివేయడూ?....

'చెకోరికా' చెవిలో 'ఓల్గా' యేదో రహస్యంగా చెబుతున్నట్టు అనిపించింది 'మలాషా'కి. 'అవును - అదుగో! వాళ్లుచూడు, నాకు

యెంతదూరంగా కూర్చున్నారో ?' అని తనలో తాను కృంగిపోతున్నది 'మలాషా'. మొదట్లో అందరూ కూర్చున్న తర్వాత తానే అంతదూరం వచ్చి కూర్చున్నమాట మరిచిపోయింది. అవును, 'ఓల్గా' ఆశతో కూర్చో గలదు. చావంటే ఆమెకు భయం ఉండవచ్చు. ఆమెకు జీవించి ఉండా లన్న ఆశకలగటం ధర్మమే. తన ప్రియుడు 'ఓస్టప్' సైన్యంలోంచి తిరిగి రాగానే, అతన్ని వివాహమాడి, యెప్పటికిమల్లే నే హాయిగా ఉండ గలదు 'ఓల్గా'. చక్కగా సంసారం చేసుకోగలదు. కాని తనమాటో ? ఇక ఎన్నిమారినప్పటికి తన జీవితం యెప్పటిలాగ ఉండటం అసంభవం. మళ్లీ తనుగ్రామంలో అందరికంటే అందగత్తెననీ, చురుకైన పిల్లననీ, మునుపటి 'మలాషా'గా తలయెత్తుకు తిరుగలేను -

'ఫెడోసియా' కొంతకాలంవరకు తనకొడుకు 'వాస్యా' కోసం యేడుస్తుంది. కాని ఆ తర్వాత ఆమె దుఃఖం చల్లారిపోతుంది. జర్మనులు కూలగొట్టిన యిండ్లు మళ్ళీ కట్టుకోటము సాధ్యమవుతుంది. ప్రజలకు తగిలిన దెబ్బలు కొంతకాలానికి నయమై పోతాయి. కాని తన హృద యానికి తగిలినగాయం యెన్నటికీ మానే అవకాశంలేదు ! ఆమెకు కలిగిన భయంకరానుభవం యెన్నటికీ మరపుకి రాదు !!.........

గ్రామంలో అందరు యువతుఃకంటే అందకత్తెఅనీ సమిష్టి వ్యవ సాయ క్షేత్రంలో అందరికంటే చురుకైన పనికత్తెఅనీ, అందరూ మెచ్చు కుంటుంటే ఒకప్పుడు ఆనందపడేది. పాటపాడుతుంటే యితర యువతుల కంఠాల్లోలేని మాధుర్యం ఆమెకంఠంలో కనుపించేది. తన అందమైన కళ్లు, ఆకేశాలు; గులాబిబుగ్గలు యితర్లు చూస్తుంటే తాను ఆనంద డోలి కల్లో ఊగిపోతుండేది.

కాని ఆ అందమే నేడు తనకు గర్భశత్రువైనట్టు కనిపిస్తున్నది. కురూపిఅయిఉన్నా తనకీ ఘోరం సంభవించేదికాదేమో ? అందగత్తె అయి ఉండటంవల్లనే ఆముగ్గురు జర్మనుసైనికులు ఆమెను అధోగతికి ఈడ్చారు.

అప్పుడప్పుడు ప్రక్కగదిలోంచి జర్మను సైనికుల అడుగుల చప్పుడు వినవస్తున్నది. అదుగో ! జర్మను పశువులు గ్రామ సోవియటు కార్యాలయంలో తమ స్వంతయింట్లోలాగే హాయిగా కులుకుతున్నారు. ఆ యింటికి యజమానుల్లాగే ప్రవర్తిస్తున్నారు ! 'మలాషా' కోపం పట్టలేక పిడికిలి బిగించింది. 'వాళ్ళు' యిక్కడేకాదు— తాను ఒకసారి వస్తు ప్రదర్శనశాల చూడటానికి వెళ్ళివచ్చిన 'కీవ్' నగరంలోగూడాఉన్నారు

ఉన్నతమైన బంగారుభవనాలతో కళకళలాడే ఆనగరంలో 'వీళ్ళు' తిరుగుతున్నారు. ఒక్క 'కీవ్' నగరంలోనేగాక, 'ఖార్కావ్' మొదలైన అన్ని ప్రదేశాల్లోనూ—'ఉక్రేనియన్' దేశమంతటా—చేరారు ఈ నీచులు. ఒక్క 'మలాషా' నే గాక వారు యావత్తు 'ఉక్రేనియన్' భూతలాన్నంతా హింసించారు— చెరిచారు. 'ఉక్రేనియన్' గ్రామాలన్నీ భూమి మట్టంచేశారు. 'ఉక్రేనియన్' మాత బిడ్డలను వేనకువేలు చిత్రవధచేసి, చివరికి సమాధికూడా చేయనివ్వకుండా తమ పైశాచాన్ని వెల్లడిస్తున్నారీ జర్మన్లు 'ఉక్రేనియన్' భూమండలమంతా రక్తపాతంతోను, అశ్రుధారలతోను వరదలై పారింది!....

కాని జర్మన్లు దేశంవిడిచి వెళ్ళిన మరుక్షణమే, అక్కడి పవిత్ర నదీజలాలతో అంతా పావనమైపోతుంది. దేశమంతా సౌందర్య శోభితమైపోతుంది. ప్రజలంతా సౌఖ్యసీమలను చేరుకుంటారు.

మరి తన సంగతో?— అధోగతికి పాల్పడిన తన జీవితానికి యింకెక్కడి ఆశ?.... తాను పతితురాలు....

ఈ విధంగా మనస్సులో మధనపడుతూ 'మలాషా' అప్రయత్నంగా ఒకసారి మూల్గింది.

"నిద్రపోవటంలేదా, 'మలాషా'?" అని అడిగింది 'చెకోరికా'

'మలాషా' ఉలిక్కిపడ్డది. తన సంగతి వీళ్ళకెందుకూ, అని అర్థంలేని కోపం తెచ్చుకున్నది.

"లేదు! నీ కెందుకూ ఆ గొడవ?" అని కటువుగా జవాబిచ్చింది.

"ఊరకనే అడిగాను"

"నా సంగతి మీ కనవసరం!"

"ఏం? అందరమూ ఒకే కష్టంలో ఉన్నామని నిన్ను పలకరించాను"

'మలాషా' అర్థంలేని నవ్వునవ్వింది.

"మీ అందరిదీ ఒకేరకమైన కష్టమే కావచ్చును. కాని నా కష్టం, మీ కష్టాలలాంటిదికాదు"

"ఐనా, నీదీ కష్టమేగా...."

"మహా తెలుసులే, నీకు కష్టాలు! అట్టేవాగకుండా కూర్చోలేవూ?"— 'మలాషా' అర్థంలేని కోపంతో మండిపోతున్నది. తన ప్రవర్తన తనకే తెలియటంలేదు.

"ఆమెతో మాట్లాడకు.... ఆమె యెంతటి దీనావస్థలో ఉన్నదో తెలియటం లేదూ ?" అని 'ఓల్గా' 'ఎకోరికా' చెవిలో రహస్యంగా అన్నది.

కాని 'మలాషా'కి ఆ మాటలు వినబడినై.

"అవును ! నేను అంటరాని దానిని. నాతో మాట్లాడబోకండి"

'మలాషా'కి యెవరూ జవాబివ్వలేదు. దీర్ఘంగా నిట్టూర్పులు విడుస్తూ, చీకట్లోకి తదేకదృష్టితో చూస్తున్నది.

కోతలకాలంలో తన చిత్రం ఒకసారి పత్రికల్లో పడినప్పటి సంగతి జ్ఞాపకానికి వచ్చింది. అప్పుడు ఆమెను యెవరూ అంటరానిదానిగా యెంచలేదు. గ్రామంలోని యువతులు, స్త్రీలు ఆమెను ఆనందంతో కౌగిలించుకున్నారు. సమిష్టి వ్యవసాయక్షేత్రంలో అందరికంటే ఉత్సాహంగా పనిచేస్తుందని ఆ చిత్రంకింద వ్రాశారు. అదినిజమే. కాని అట్టి 'మలాషా' నేడు జర్మను శిశువును తన గర్భంలో పెంచుతున్నది !....

బయటవీస్తున్న పెనుగాలిరొద, అన్ని వైపులా బిగించివేసిన ఆ గదిలోకిగూడా స్పష్టంగా వినవస్తున్నది. 'గ్రోఖాచ్' హఠాత్తుగా లేచి పోయి ఒక ఆవలింత తీశాడు.

"మొత్తానికి హాయిగా నిద్రపోతున్నావయ్యా" అని 'యూడోకిమ్' తాత ఒక విధంగా ఈర్ష్యతోనే అన్నాడు.

"మనసుతీరా యివ్వాళే నిద్రపోవాలి. రేపు యేంజరుగుతుందో యేం చెప్పగలం ?"

"తెలియకేం ? రేపు జరుగబోయేది అందరికీ తెలిసిందే—"

"మన సైనికులు వస్తారేమో !"— అని 'ఓల్గా' మధ్యలో కల్పించుకొని అన్నది. 'గ్రోఖాచ్' తన మాటకేమి జవాబు చెబుతాడోనని చూస్తున్నది.

"రావటంమాట నిజమే....కాని ఇంతలోవస్తారని యేంనమ్మకం ?

"పోనీ, మన గెరిల్లాదళమే వస్తుందేమో ?" అని తన నమ్మకాన్ని విడిచిపెట్టలేక 'ఓల్గా' మళ్ళీ అన్నది.

"అబ్బే, వాళ్ళు వచ్చే నమ్మకమేమీలేదు. ఈ మంచుతుపానులో యెట్లా రాగలరు ? అడవులు విడిచి బయటికివస్తే జర్మన్లదృష్టిలో పడతారు. ఎండాకాలం అంటే యెక్కడబతితే అక్కడ దాక్కొని రావచ్చు. కాని యీ పరిస్థితుల్లో కష్టం" అన్నాడు 'గ్రోఖాచ్'.

"మరి యెర్రసైన్యంమాత్ర మెట్లారాగలదు ?"

"సైన్యం సంగతి వేరు. ఎటువంటివైనా వాళ్లు లెక్కచేయకుండా వచ్చెయ్యగలరు.... "

"అబ్బ ! వెధవగాలి యెట్లా వీస్తుందో !!" అని ఒక నిట్టూర్పు విడిచింది 'ఓల్గా'

"ఇటువంటి గాలిలో మృత్యువు నృత్యం చేస్తుందంటారు." అన్నాడు 'యొాడోకిమ్' తాత.

'ఓల్గా' భయంతో వణికిపోయింది. అసలు గదిలోని చీకటిని చూస్తుంటేనే ఆమెకు భయంవేస్తున్నది. అందులో యీ ముసలాడు చావు మాట యెత్తుతున్నాడు....

"మనదేశంలో నేడు మృత్యువు ప్రళయతాండవమాడుతున్నమాట నిజమే" అని 'చెకోరికా' తాతను బలపర్చింది.

ఆ కాళరాత్రిలో నడుస్తున్న మృత్యువు పాదాలచప్పుడు వింటున్నట్టు అందరూ కొద్దిసేపు నిశ్శబ్దం వహించారు.

"ఈనాడు మృత్యువు రెండురూపాల్లో ఉన్నది" - నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ 'యొాడోకిమ్' తాత పలికాడు.

"రెండురూపాలంటే ?"

"జర్మన్లవల్ల మనలాంటివాళ్ళకు కలిగే మృత్యువు ఒకవిధం. ఇకముందు జర్మన్లకు రాబోయే మృత్యువు ఇంకొకవిధం."

'ఓల్గా' భయంతో ఇంకా 'చెకోరికా' దగ్గరికి జరిగింది.

"తాతయ్యా, ఆమాటలెత్తకండి. నాకు భయంవేస్తున్నది."

"ఈమాత్రందానికే భయపడితే యెట్లా ? ఈనాడు ప్రపంచమంతా కూడా భయంకరంగానే ఉన్నది. అయినా ఆమాత్రందానికి భయపడాలా ? అలా భయపడితే మనను అసలు నిలువనే నిలువనివ్వరు" అని 'గ్రోఖాచ్' గంభీరంగా అన్నాడు.

"ఎవరు ?"

"ఇంకెవరు ? - జర్మన్లు. మనను భయపెట్టటానికి అనేక ప్రయత్నాలు చేస్తారు. భయపడ్డామంటే, మనను లొంగదీసేశారన్నమాటే. కాని భయానికి లొంగిపోకుండాఉంటే, జర్మన్లుకారు, వాళ్ళ తాతలు వచ్చినా మనను లొంగదీయలేరు.

" 'వాస్యా' వాళ్ళంటే భయపడలేదు. కాని అతనిని చంపెయ్య లేదూ ? "

" వాళ్ళు చంపరని నేను అన్నానా ? అసలు వాళ్ళపనే అదిగా. వాళ్ళ తుపాకులు ఉన్నదే అందుకు. నేను ఆవిషయం అనటంలేదు. మనకు ధైర్యాన్ని, బలాన్ని యిచ్చేది అదికాదు.... "

" మరేది ? "

" నీకు తెలియదా ? "

ఆమెకు యేమి చెప్పటానికీ తోచక మౌనం వహించింది.

" మనం లొంగకుండా ఉండటంలోనే మనబలం ఉన్నదన్నమాట వాళ్ళకు యేదైనా అవసరమై మనలను ప్రశ్నలువేసినప్పుడు మౌనం వహించటంలోనే బలం ఉన్నది. ఇంతకూ ముఖ్యంగా గమనించవలసిం దేమిటంటే, ఇలాంటి పరిస్థితులు యెల్లకాలమూసాగవు. ఒక్క జర్మను వాడుకూడా ప్రాణాలతో తప్పించుకు పోలేని కాలం వస్తుంది. ఇక మన వాళ్ళని చంపటంమాట అంటావూ ?....నువ్వింకా చిన్నదానివి....పోయిన యుద్ధంలోను, అంతర్యుద్ధంలోను యెంతమంది చచ్చిపోయారో నీకు తెలియదు. అయితేమాత్రం ? జర్మన్లు మచ్చుకైనాలేకుండా యిక్కడ్నుంచి తొలగిపోయారు. మనం— మనప్రజలం— మాత్రం మిగిలాము. మన భూముల్లో మనం యెప్పట్లాగా ఉన్నాము "

" కాని అప్పటికంటే చాలామందిని చంపెయ్యటంలేదూ ? "

" అవును— చాలామందిని చంపేస్తున్నమాట నిజమే. కాని అందర్నీ చంపటం వారితరంకాదు. పంటలు పండించటానికీ ఇండ్లు కట్ట టానికి యింకా అనేకమంది మిగిలిఉంటారు. అదృష్టముండి, బ్రతికి బయటపడితే, మనదేశం మునుపటికంటే బలంగాను, సౌఖ్యవంతంగాను- మహాద్భుతంగా తయారవటం మనము చూస్తాం "

'ఓల్గా' ఒక నిట్టూర్పు విడిచింది.

" అది చూడాలని నాకు యెంతో ఆశగాఉన్నాది "

'గ్రోఖాచ్' ఉద్రేకంతో ఒక్కసారిగా లేచాడు.

" అంతేకాదు ! నేను బ్రతికుండి ఈ గ్రామంలో అడుగుపెట్టిన ప్రతి జర్మనువాడు, ఇక్కడే సమాధి అయ్యేటట్టు చూడాలని ఆశగా ఉన్నది. ఒక్క జర్మనువాడుకూడా మనదేశంలో మిగలకుండా ఉరికంబాల నుంచి వ్రేళ్లాడుతుంటే చూడాలనివుంది. జర్మనీలోఉంటూ, ఈ సర్వ

నాశనంచేసే భూతాలకు తోడ్పడుతున్నవారు. మనదేశంవచ్చి ఇక్కడ కూలిపోయిన భవనాలన్నీ కడుతుంటే నా కళ్లారాచూడాలనివుంది"

"వాళ్ళను ఇంకా కళ్ళముందుచూస్తూ ఉండవలసిన ఘోరంకంటే, స్వయంగా మనమే మనభవనాలు తిరిగి కట్టుకోటం హాయి అనిపిస్తుంది నాకు." అన్నది 'చెకోరికా'

'యోడోకిమ్' తాత ఒక నిట్టూర్పు విడిచి యిలాఅన్నాడు.

"మన ప్రజలు చాలా జాలిగుండె కలవారు. ఒక క్షణంలో కోప మొచ్చినా, మరుక్షణంలో అదంతా మరిచిపోతారు. తమ హృదయాల్లో క్రోధాన్ని యెక్కువకాలం ఉంచుకోలేరు."

"తాతయ్యా, నువ్వక్కడే పొరపాటు పడుతున్నావు. మనవాళ్లు ఉదార స్వభావులన్నమాట నిజమే. కాని వాళ్లు సామాన్యులుకారు. ఒక సారికనుక వారి హృదయానికి నాటిందంటే వారి జన్మాంతరం మరువరు. ఇప్పుడు వారిక్రోధం కట్టుదాటి పోయింది. ఇక వారు మరిచిపోవటం అసాధ్యం. వారి జీవితాలలో మరువలేని సంఘటనలు జరిగినాయి."

'మలాషా' నిశ్శబ్దంగా వింటున్నదీమాటలు. తన మనస్సులోని కొన్ని భావాలనే 'గ్రోఖావ్' పలుకుతున్నట్టనుపించింది. కాని జర్మన్ల మీద యెంత ప్రతీకారం తీసుకున్నప్పటికి తనకేం లాభం? ఇతరులు సంతృప్తిపడి, వారి హృదయాలుశాంతించవచ్చు. కాని తనహృదయాని కింకెక్కడశాంతి? ఇక నెంతటి రక్తపాతమైనా, ఎంతటి ప్రతీకారమైనా, యెంతకాలం గడిచినా ఆమె ఆ భయంకరానుభవాలను మరిచిపోవటం అసంభవం. తన హృదయంలో కలిగినగాయం, దుర్గంధంతో ఉంటూనే ఉంటుంది, తాను బ్రతికున్నంత వరకు.

"లేదు! మనప్రజలు వారి జీవితాంతాలవరకు, జర్మన్లు చేసిన రాక్షస కృత్యాలు మరువలేరు" అని చివరికి గంభీరంగా పలికాడు 'గ్రోఖావ్.'

"ఎప్పటికీ మరువరు!" అని 'మలాషా' అదే ధోరణిలోఅన్నది.

"నాకు దాహం వేస్తున్నది" అని మెల్లిగా అన్నది 'ఓల్గా'

"నీళ్ళమాట యెత్తకు కావాలంటే మాత్రం వాళ్లు మనకు నీళ్ళిస్తా రనుకున్నావా? నీళ్లు లేకపోయినా మూడురోజులపాటు ఉండవచ్చు. అందులోను చీకటికే కూర్చున్నాము కాబట్టి, దాహానికి కొంత ఓపికపట్ట వచ్చు. కాని అస్తమానం నీళ్ళమాటే ఆలోచిస్తూ కూర్చోబోకు. అలా చేస్తే దాహం మరీ యెక్కువవుతుంది"

"అబ్బా!"

"అలాభయపడటానికి నీకు సిగ్గువెయ్యటంలేదూ? నీతోటి వాళ్లు అంతా అట్లా భయపడుతున్నామా? నువ్వొక్క దానివే కష్టాల్లో ఉన్నావనుకుంటున్నావా? గ్రామంలోఉన్న వారందరుకూడా మనస్థితిలోనే ఉన్నారు" అని 'ఓల్గా' ని 'చెకోరికా' మందలించింది.

"కాని మనం ఖైదీలం కదూ!...."

"అయితే మాత్రం? మూడురోజుల్లో మనను కాల్చిచంపేస్తామన్నారు. అయితే యేం? కాని జప్మన్లుప ధాన్యంమాత్రం యెవ్వరూ యివ్వరు. అందువల్ల మృత్యువు మనతలమీద యెంతగా కూర్చొని ఉన్నదో, బయటఉన్న వారి తలలమీదకూడా అంతగానే కూర్చొనిఉన్నది.

అంతా మాట్లాడకుండా కూర్చున్నారు. 'ఓల్గా' భయంతో చీకట్లోకి చూస్తున్నది.

గాలిదుమారం లేపుతున్న మంచుమేఘాల్లో నిద్రపోతున్నట్లుగా ఉన్నది గ్రామం. గ్రామప్రజలందరూ గాఢనిద్రలో ఉన్నట్టుగా తుపాను శబ్దమూ, ప్రసవవేదనపడుతూ అప్పుడప్పుడు 'ఓల్గైనా' వేసే కేకలుతప్ప మరేశబ్దమూ వినబడటంలేదు.

కాని గ్రామస్థులు మాత్రం నిద్రపోవటంలేదు. 'యాదోకిమ్' తాత అన్నట్టు మృత్యువు చేస్తున్న భీకర నృత్యాన్ని చూస్తూ యిండ్లల్లో కూర్చొని ఉన్నారు. జోరుగా సుడిగాలిలో లేస్తున్న మంచు మేఘాల్లో గ్రామం మూలమూలల్లో, తన భీకరనృతాన్ని కనబరుస్తున్న మృత్యువుయొక్క వికటాట్టహాసం అంతటా ప్రతిధ్వనిస్తున్నది!-

లోయలో యేటివొడ్డున మృత్యువు! ప్రతిరోజు 'ఫెడోసియా' వచ్చి తుడిచి శుభ్రంచేసే 'వాస్యా' మృతకళేబరంమీద 'గీ' పెడుతూ మంచుపోస్తున్నది మృత్యువు. ఆలోయలో వీరమరణంపొందిన రెడ్ఆర్మీ సైనికులందరిమీద రాజ్యంచేస్తున్నది.

'గెరిల్లా' దళందగ్గరికి వెళ్ళటానికి ప్రయత్నిస్తూ పట్టుకోబడి ఉరితీయబడిన 'లివాన్యుక్' శవాన్ని ఉరికంబనుంచి అటూ యిటూ ఊపుతున్నది, మృత్యువు. అతని శరీరంకూడా శిలారూపందాల్చింది. ఉరికంబంనుంచి గాలివిసురికి ఊగులాడుచుంటే 'కిర్రు' మను శబ్దం వినబడుతున్నది. ఉరికంబపు గెడలకు అతని కాళ్ళు తగులుతూ 'దుబ్బు' మంటున్నాయి.

ప్రసవవేదనపడుతూ, 'ఓలెనా' ఉన్న ధాన్యపుకొట్టు తలుపుల ముందు నృత్యం చేస్తున్నది, మృత్యువు.

మృత్యువు గ్రామమంతటా యీవిధంగా చేస్తున్న వికటాట్టహాసం మధ్య గ్రామస్థులెవ్వరూ కన్నుమూయలేకుండా ఉన్నారు. తమ, తమ పక్కలమీద పడుకొని శూన్యదృక్కులతో అంతా గమనిస్తున్నారు. వికటాట్టహాసంతో తన కోరలు పదునుపెట్టుకుంటూ, కుత్తుకనిండా మెయ్యడానికి బలికోసం కూర్చున్నది జర్మను మృత్యువు. ఏటిఒడ్డున 'వాస్యా'ను, గ్రామంమధ్య వ్రేళ్ళాడుతున్న 'లివాన్యుక్' లను పొట్ట బెట్టుకోటమేగాక, గ్రామస్థులందరి మెడలకు ఉరిత్రాడుతగిలించి తయారుగా కూర్చున్నది. జర్మనుమృత్యువు....

* * * *

గ్రామస్థులందరూ యేమైతే ఆలోచిస్తున్నారో అదే మాట్లాడుతున్నారు, జర్మను సైనిక కార్యాలయంలోని గదిలో బంధింపబడిన ఆ అయిదుగురు ఖైదీలు. మృత్యువు వికటాట్టహాసంచేస్తూ నృత్యంచేస్తున్న ఆ కాళరాత్రిలో గ్రామస్థులందరికీ కనుమూత పడనివ్వకుండా చేస్తున్న విషయాలగురించే వాళ్ళు మాట్లాడుతున్నారు.

చివరికి 'యౌడోకిమ్' తాత యిలా అన్నాడు :

"అందర్నీ చంపలేరుగదా ?....గ్రామస్థులందర్నీ చంపినప్పటికి వాళ్ళకు మన గుట్టుదొరకదు. ఒక్కగింజయినా వాళ్ళకు చేజిక్కదు."

"అవును. మన ప్రజలకిది కొత్తకాదు. 'సాడ్యా', 'లివనెవ్కా', 'కోస్టిన్కా' మొదలైన గ్రామాలన్నిటిలో యిదేవిధంగా జరిగింది," అన్నాడు 'గ్రోఖాచ్'.

నేలమట్టం అయిపోయినగ్రామాలు వారి కళ్ళకు కట్టినట్టుగా కనబడ సాగినై. ఒక జర్మనుసైనికుని వైపు తుపాకి పేల్చినేరానికి 'లివనెవ్కా' గ్రామం పూర్తిగా పరశురామప్రీతి చేయబడ్డది. జర్మన్లు ఆ గ్రామానికి నాలుగుమూలలా నిప్పంటించారు. మంటల్లోంచి తప్పించుకోటానికి ప్రయత్నించిన గ్రామస్థులను తుపాకిగుండ్లకు యెఱచేశారు. తల్లులముందు పిల్లల్ని మంటల్లోకి విసిరారు. నూటయాభైమందిని ఒకచోటచేర్చి బాంబులతో హతమార్చి, నేలమట్టంచేసిన 'సాడ్యా' గ్రామం వారి కళ్ళ ముందు కనబడసాగింది. మగవాళ్ళనందర్నీచంపి, స్త్రీలను, పిల్లల్ని వారి

గుడ్డలు ఊడదీసుకొని, కటికి చలిలో యిండ్లల్లోంచి వెళ్ళగొట్టి, నేలమట్టం చేసిన 'కోస్టిన్‌కా' గ్రామం వారికి గుర్తుకివచ్చింది.

"'సాడ్యా', 'లివనెవ్‌కా', 'కోస్టిన్‌కా' మన జిల్లాలోనివే! ఇక తక్కిన జిల్లాలలో మాటో? 'కీవ్', 'ఒడెస్సా' మొదలైన పట్టణాల నేంచేశారు? మన గ్రామాలు యేమాత్రం మిగిలిఉన్నాయి? 'యాదోకిమ్' తాతయ్యా, పోయినయుద్ధంలోకూడా యింతేజరిగిందా?"

రెండుచేతులతోను ముఖం కప్పుకొని 'ఓల్గా' నిశ్శబ్దంగా కూర్చున్నది. ఇప్పటివరకు తాను 'గెరిల్లాల' అరుపులు వింటున్నట్టూ, వాళ్లు వచ్చి తమ నందర్నీ విడిపిస్తారన్నట్టూ భావించుకుంటున్నది. కాని వీళ్ళందరు ఇప్పుడు మృత్యువునిగురించి - మృత్యువు తప్పదన్నట్టు మాట్లాడుతున్నారు. మృత్యువునిగురించి వారు అంత ప్రశాంతంగా మాట్లాడటం చూస్తుంటే 'ఓల్గా' శరీరం మరీ కపించిపోతున్నది. 'వాళ్ళకేం, చావంటే చులకనగానే ఉంటుంది. 'యాదోకిమ్' తాతయనభైయేళ్ల జీవితం గడిపాడు, ఇప్పుడు హాయిగానే ప్రాణాలు విడువగలడు. 'గ్రోఖాచ్', 'చెకోరికా'లు సంసారాలు అనుభవించారు. పిల్లల్ని కన్నారు. వాళ్ళకుమాత్రం లోటేమున్నది? వాళ్ళుగూడా హాయిగా చావగలరు. కాని తానో? జీవితంలో యేసుఖాలు అనుభవించింది?' అని ఆలోచించుకోసాగింది 'ఓల్గా'.

"ధాన్యం యెవ్వరూ యివ్వరు" అన్నాడు 'యాదోకిమ్'.

"ముమ్మాటికీ, నిజం" అని బలపర్చింది 'చెకోరికా'.

గ్రామస్థులందరిలోను ఇదే నమ్మకం దృఢంగా నాటుకొని ఉన్నది. మంచువల్ల రాయిలాగ మారిపోయిన భూమి త్రవ్వి ధాన్యమంతా దాచేశారు గ్రామస్థులు. ఎర్రసైనికులకు తీసుకుపోయి యివ్వటానికి వీలుపడని ధాన్యమంతా భూమిలో దాగుని ఉన్నది. ఈ తుపానులో ఆ ధాన్యపు గాదెలు యెక్కడున్నవో పరులెవ్వరూ తెలిసికోటం అసాధ్యం. గ్రామం చుట్టుపట్ల ఉన్న నేలంతా త్రవ్వితేగాని జర్మన్లకు ఆ ధాన్యం పట్టుబడదు.

భూదేవి ప్రసాదించిన ధాన్యాన్ని, జర్మను బందిపోట్లకు భయపడి భూదేవి హృదయంలోనే దాచిపెట్టారు. రైతు బిడ్డలకు భూమాత ప్రసాదించిన ధాన్యంకంటే అధికం మరేదీలేదు. అట్టి మహాప్రసాదాన్ని జర్మన్లకిచ్చి, వారి సైన్యాన్ని పోషించటమా! జర్మన్లకు ధాన్యం వదలటమంటే, వాళ్ళప్రాణాలు రక్షించటమన్నమాట. జర్మన్లకు ధాన్యమివ్వటమంటే,

మంచులోను, అడవుల్లోను తమకై సర్వస్వము త్యాగంచేసి పోరాడుతున్న వీరులకు వెన్నుపోటు పొడవటమన్నమాట. జర్మన్లకు ధాన్యమివ్వట మంటే తమ మాతృదేశమైన 'ఉక్రేనియా' కి ద్రోహంచేసి, జర్మన్లను దానికి అధిపతుల్ని చేయటమన్నమాట. జర్మన్లకు ధాన్యం అందనివ్వట మంటే, తమ దేశమంతటా, అందరి హృదయాల్లోను ప్రతిధ్వనించిన 'శత్రువులకు ఒక్కధాన్యపు గింజకూడా అందనివ్వరాదు' అను నినా దాన్ని పెడచెవినిబెట్టి, తమను తమజాతిని శత్రువులకి అమ్ముకోవట మన్నమాట. జర్మన్లకు ఆహారమివ్వటమంటే, నేటి యుద్ధంలో పోరాడు తున్న యోధులకు, అంతర్యుద్ధంలో చనిపోయిన వీరులకేగాక, యావత్తు ప్రపంచమంతటా మానవస్వాతంత్ర్య సమరం సాగిస్తున్న వారందరికి ద్రోహం చెయ్యటమన్నమాట.

గ్రామంలో ఒకానొకప్పుడు రోజుకూలి చేసుకున్నవారుకూడా తమ సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో హాయిగా నివసిస్తూ వచ్చారు. తాము పోయిన తర్వాత పరిస్థితులేవిధంగా నడుస్తాయోనని గ్రామంలోని స్త్రీలందరు ఆలోచిస్తున్నారు.

ముసలిదైన 'కొవాల్‌చక్' ఆ చీకట్లో నిద్రపోతున్న తన ఎని మండుగురు బిడ్డల్ని తలుచుకొని ఆలోచిస్తున్నది. అందరికంటే పెద్దపిల్ల 'లినా' ఇంటిపన్లు చూచుకుంటూ, చిన్నపిల్లల్ని సంబాళించుకో గలదని నిశ్చయించుకున్నది. ఎర్రసైన్యం తిరిగివస్తే, వారికి తగినంత ఆహారం సురక్షితంగా దాచి ఉంచామనుకున్నది. అంతవరకు అందరిలాగానే, తాముకూడా ఉండకతప్పదు.

'విషన్‌కోవా' ఊయలలోనున్న తన బిడ్డను పరీక్షగాచూస్తూ తాను పోయినతర్వాత యీ పసికూనను యెవరు సంరక్షిస్తారా అని మథన పడుతున్నది.

'గ్రోఖాచ్' భార్య చీకట్లోకి నిరీక్షిస్తూ ప్రశాంతంగా ఆలోచిస్తున్నది. 'గ్రోఖాచ్' ని జామీను ఖైదీగా పట్టుకుపోయారు ఇప్పుడు ధాన్యం యివ్వకపోవటానికి తానా, లేక అతడా నేరస్థుడని ఆమెకు ఆలోచనపడ్డది. చివరికి తానే, నేరస్థురాలనని నిశ్చయించుకున్నది. కాని ఆమెకు మాత్రం యేమి బెంగలేదు. చిన్నపిల్ల లెవ్వరూలేరు. ఉన్నయిద్దరూ తమంతట తాము బ్రతుకగల యీడుకివచ్చారు.

నవయౌవనంలోఉన్న 'వస్యుక్' భార్య తన భర్తవిషయమై ఆలోచింపసాగింది. ఈ పరిస్థితులనుబట్టిచూస్తే ఇక తన ప్రియుడిముఖం కనబడే ఆశలేనట్టే ఉన్నది. ఒక నెలక్రితం తాను యుద్ధంలో గాయాలు తగిలి హాస్పటల్‌లో ఉన్నాననీ, బహుశా సెలవుమీద యింటికి రాగలనేమో ననికూడా వ్రాశాడు. కాని యీలోగా జర్మన్లు గ్రామాన్ని వశపర్చుకున్నారు. చివరికి ఎర్రసైనికులువచ్చి గ్రామం విడిపించినా, తాను వెళ్ళిపోవాలని అనుకుంటున్నది. తనకంటే, తన భర్తవిషయము ఆమె చాలా వ్యధ పడుతున్నది. అసలే కోమలహృదయుడు. ఈ కష్టాలను యేవిధంగా భరిస్తున్నాడో ?....

వారివారి అభిరుచుల్నిబట్టి, వారివారి ఆలోచనలు నడుస్తున్నాయి, ప్రజల్లో. వారివారి ఇండ్లల్లో వేరువేరుగానే కూర్చొని ఆలోచిస్తున్నారు. కాని వారందరి హృదయాల్లోను ఒకటిమాత్రం నిశ్చయమైపోయి, దృఢంగా నాటుకుపోయిఉన్నది. ఏమైనాసరే, ధాన్యం భూమిలోనే ఉండాలి. భూదేవి యిచ్చిన ఆ పవిత్ర ప్రసాదాన్ని, జర్మన్ల మలినహస్తాలు తాకటానికి వీలు లేదు ! ఇది తమ జీవితాలకంటే ముఖ్యమైన సమస్య ! !

మృత్యువు - జర్మను మృత్యువు - గ్రామమంతటా వికటాట్టహాసం చేస్తూ నృత్యంచేస్తున్నది. ఇండ్లల్లో కూర్చొని గ్రామస్థులందరూ ఆ వికటాట్టహాసాన్ని వింటున్నారు. కాని గస్తీ తిరుగుతున్న జర్మను సైనికులు గూడా, గాలిదుమారం లేపే మంచుమబ్బుల్లో మృత్యువుయొక్క వికటాట్టహాసం విని కంపించిపోతున్నారు. మృత్యువు ! ఎక్కడో ? ఏమూల దాగిఉన్నదో తెలియటంలేదు. ఇండ్లచాటునుంచి, సందుగొందుల్లోంచి మృత్యువు తొంగిచూస్తున్నట్టుగా ఉన్నది వారికి. వెయ్యికళ్ళతో పరిశీలిస్తున్నది వారిని. ఏమూలచూచినా మృత్యువే ప్రత్యక్షమవుతున్నట్టున్నది జర్మను సైనికులకు ! తన కౌగిట్లో చేర్చుకోటానికి 'యుక్రేనియన్' మృత్యువు చేతులు చాస్తున్నట్టుగా ఉన్నది వారికి ! !....



# 5

గాలిదుమారం భయంకరంగా వీస్తున్నది. 'ఓలెనా'ను బంధించి పెట్టిన ధాన్యపుకొట్టు కప్పు ఎగిరిపోయేటట్టు ఊగిపోతున్నది. కప్పు పైనుంచి చెత్త రాలుతున్నది.

'ఓలెనా' ప్రసవవేదన పడుతున్నది. నొప్పులకు భరించలేక అప్పుడప్పుడు కేకలుపెడుతున్నది. దీనికితోడు జర్మను సైనికులు వీధుల్లో తిప్పుతూ, విచ్చుకత్తులతో పొడిచిన గాయాలబాధ, దాహం అధికమయింది. శరీరమంతా బల్లాలతో పొడుస్తునట్టు బాధగాఉన్నది.

ఆమె బాధతో యిప్పుడు కేకలుపెడుతున్నది. ఇప్పుడు కేకలు పెట్టవచ్చుననుకున్నది. ఇది ప్రసవవేదనగాబట్టి. ఇందాకా అన్నిబాధలు పడుతూకూడా నోరు మెదపని 'ఓలెనా' యిప్పుడు బాధతో కేకలు పెడు తున్నది. జర్మన్లు యెన్నిచేసినప్పటికి, ఆగర్భంలోని శిశువు మాత్రం చావ లేదు. బ్రతికేఉన్నది. ఇప్పుడు–కాంతిలోకి, ప్రపంచంలోకి రావటానికి ప్రయత్నిస్తున్నది. 'ఓలెనా' ప్రసవవేదన పడుతున్నది.

ఆమె అరుస్తుంటే, అడవి మృగం బొబ్బలు పెడుతున్నట్టున్నది. కాని ఆ అరుపులే ఆమెకు కొంత తేలిక నిస్తున్నాయి. బయటవీస్తున్న గాలి దుమారపు రొదను దూరం చేస్తున్నట్టుగా ఉన్నది.

తలుపు తెరిచిన శబ్దమయింది. కాని ఆమె అటు తిరిగి చూడలేక పోయింది. నొప్పులు అంతకంతకీ తీవ్రమవుతుండడంచేత ఇంకా యెక్కు వగా అరవటం ప్రారంభించింది.

జర్మను సైనికుడు తలుపుదగ్గర నిలబడి, యేదోకేక వేయ బోయాడు. కాని అంతలోనే 'ఓలెనా' ప్రసవించే సమయానికి వచ్చిం దని తెలుసుకున్నాడు. ఇంతలో ఇంకొక సైనికుడు వచ్చి మొదటివాడి ప్రక్కచేరాడు. ఇద్దరూ మాట్లాడుకుంటూ, ఆమెవైపు చూచి నవ్వుకో సాగారు. 'ఓలెనా' మాత్రం తాను వివస్త్రగా ఉన్నదన్నసంగతీ, సిగ్గు

మాలిన జర్మను పురుషులు తనవైపు చూస్తూ అపహాస్యం చేస్తున్నారన్న సంగతి కూడా తెలియని స్థితిలో ఉన్నది. తనబాధలో తానున్నది. బహుశ బిడ్డను కంటున్నదని గాబోలు, ఆమె దగ్గరికి చేరకుండా నిల్చున్నారు జర్మను సైనికులు.

'ఓలెనా' కేకలు అంతకంతకూ యెక్కువవుతున్నాయి. చుట్టు పట్ల యిండ్లల్లోఉన్న స్త్రీలందరు విచారంతో బయట చెలరేగుతున్న తుపానులోకి చూస్తున్నారు. 'ఓలెనా' ఒక్కర్తే నిస్సహాయురాలై ధాన్యపుకొట్టులో ప్రసవిస్తున్నది! చలికి, జర్మన్ల బాధలకు ఆమె యెప్పుడో చచ్చిపోయి ఉంటుందనుకున్నారు. గ్రామస్థులు. అలా కాకపోయినా, ఆమె గర్భంలోని శిశువు యెంతోకాలంక్రితం చనిపోయి ఉంటుందనుకున్నారు. కాని యిప్పుడు 'ఓలెనా' దాహం యివ్వటానికిగూడా యెవ్వరూ దిక్కులేకుండా, యేకాకియై ప్రసవవేదన పడుతున్నది. గ్రామస్థులు మును పెప్పుడూ కని, విని యెరుగని విధంగా - దారుణమైన పరిస్థితుల్లో - ప్రసవిస్తున్నది 'ఓలెనా'. దేవుడికి ప్రార్ధనలుచేస్తూ, 'ఓలెనా' అరుపులను నిరాశతో వింటున్నారు, గ్రామంలోని స్త్రీలందరు.

చివరికి ఆ అరుపులు పెద్ద యేడ్పులోకి మారి కొంతసేపటికి ఆగి పోయినై.

" 'ఓలెనా' ప్రసవించింది!" - తన యింట్లో కూర్చుని 'ఓలెనా' కేకలువింటున్న 'మాల్యూచికా' నోటివెంట వెడలినై యీమాటలు.

"పాప పుట్టిందా?" - అని అడిగింది 'జినా'.

కొంతసేపటివరకు 'ఓలెనా' స్పృహలేకుండా పడిపోయింది. మెలకువవచ్చి చూచుకునేటప్పటికి ప్రక్కన మగశిశువు కనిపించాడు.

శిశువుని చేతుల్లోకి తీసుకున్నది. సహాయంచేసేవారెవ్వరులేరు. పళ్ళతో బొడ్డుకొరికి, తన శాలువాలోని గుడ్డపేలిక కట్టింది. బిడ్డశరీరం కడగటానికి యిన్ని నీళ్లుంటే యెంతో బాగుండుననిపించింది. చివరికి బండబారిన తన వట్టిచేతులతోనే శిశువు శరీరాన్నంతా తుడిచింది.

ఆమె నలభైయేళ్ళకు యిదే మొదటికాన్పు. అందులోను మగ శిశువు! ఎన్ని కష్టాలుపడినా చివరికి ఆ కొడుకుని కనగలిగినందుకు అమితానంద భరితురాలై పోయింది 'ఓలెనా.'

"ఇదిగోనండీ, మనబిడ్డడు!"— అని తనభర్త 'మికోలా' బ్రతికుంటే చూపించి, అతనిని ఆనందపర్చేదానిని గదా అనుకున్నది.

అతనికి పిల్లలంటే చాలా యిష్టం. కాని యీ బిడ్డకు పుట్టేటప్పటికి ఆయన యీ ప్రపంచం వదిలిపోయాడు.

నలభై సంవత్సరాల వయస్సులో గర్భంరావటమంటే మొదట్లో 'ఓలెనా' తనేకుతానే నమ్మలేకపోయింది. కాని చివరికి అదినిజమే అయింది.

అంతలోకే యుద్ధము రావటమూ, తనభర్త సైన్యంలోకి వెళ్ళి పోవటమూ జరిగింది. కాని తనకు కలుగబోయే శిశువుని చూడకుండా వెళ్ళిపోవటానికి ఆమెభర్త మనస్సుచాలా ఆరాటపడ్డది.

దురదృష్టంవల్ల భర్త యుద్ధరంగంలో పోరాడుతూ చనిపోయాడు. ఆయన ఆశించిన శిశువు ఈనాడు ప్రపంచంలోకి వచ్చింది. బ్రతికిఉంటే యెంత ఆనందపడునో!....

అక్కడి యెండుగడ్డిలోనే ఆ పసిపాపన్ని తన ప్రక్కన పడుకో బెట్టుకున్నది చలి తగలనివ్వకుండా బిడ్డను దగ్గరికి లాక్కున్నది. ఇన్ని బాధలకు ఓర్చి కన్నబిడ్డను చివరికి చలి పిశాచానికి వదిలివెయ్యటమే! బిడ్డను ఇంకా దగ్గరికి లాక్కున్నది.

ఇందాకటి సైనికులిద్దరు ఇంకా తలుపుదగ్గరేఉన్నారు. ఏదో మాట్లాడుకున్న తర్వాత ఒకడు వెళ్ళిపోయి, కొద్దిసేపట్లో మళ్ళీ తిరిగి వచ్చాడు.

"ఇదుగో!" అని, యింతకుముందు ఆమె శరీరంమీదినుంచి ఊడదీసిన దుస్తులుతెచ్చి అక్కడపడేశాడు. వాళ్ళు నిజంగా ఆ దుస్తులు యివ్వటానికి ప్రయత్నిస్తున్నారన్నమాట ఆమె నమ్మలేక పోయింది, 'ఓలెనా' కొద్దిసేపు శంకిస్తూచూచి, గభాలున దుస్తులను అందుకున్నది. ఆత్రంతో తన బిడ్డను ఆ గుడ్డల్లో పడుకోబెట్టి, కప్పింది. మిగిలిన మరొక గుడ్డతీసి తన నగ్నశరీరానికి చుట్టుకున్నది. ఆమె చలికోటు, శాలువాకూడా జర్మను ఆఫీసరు నిన్న గుంజుకున్నాడు. పోనీ, తనబిడ్డను చలినుంచి రక్షించుకోటానికి యీ మాత్రం గుడ్డలైనా దొరికినందుకు సంతోష పడా లనుకున్నది. జర్మన్లు తనగుడ్డల్ని యెందువల్ల తిరిగియిచ్చారో, తెలియక ఆశ్చర్యపడుతున్నది.

తలుపు మూసివేసిన శబ్దమయింది. ఒక దూలానికి ఆనుకొని 'ఓలెనా' మగతనిద్రలో పడ్డది. శరీరం సలసల మరుగుతున్నట్టు వేడిగా ఉన్నప్పటికి ఆమెకు వణుకు పుడ్తున్నది. కన్నుమూయగానే భర్త

'మికోలా' కనుపించసాగాడు. అదుగో, అతనిప్రక్క జర్మను ఆఫీసరు ఉంచుకున్నముండ, 'పుస్సీ' కూడా ఉన్నదే! 'మికోలా' యేదో మాట్లాడుతున్నాడు!!— హృదయంమీద యెవరో తన్నినట్టయి గభాలున మేల్కొని చుట్టూ చూచుకున్నది. అబ్బే! ఎవ్వరూలేరు. అంతా తనభ్రమ. పసిబిడ్డమాత్రం అమాయకంగా నిద్రపోతున్నాడు. 'ఓలెనా' బిడ్డను దగ్గరికి లాక్కున్నది. మళ్ళీ అంతలోనే మగత వచ్చింది.

........ఎర్రసైనికులు ముందుకి ఉరుకుతున్నారు. అదుగో! 'మికోలా' తుపాకి పట్టుకొని ముందుకి దూకుతున్నాడు..... 'కర్లీ!' గెరిల్లాదళ నాయకుడుకూడా యిక్కడే ఉన్నాడే! ఆ ముఖంలో ఉట్టిపడే సాహసం చూడండి!

"అదుగో 'ఓలెనా' నీ బిడ్డ నడుస్తున్నాడు!" అని 'ఫెదోసియా' అంటున్నట్టనిపించింది. 'ఓలెనా' ఆశ్చర్యంతో లేచి చూచుకుంది....

దాహం అపరిమితంగా వేస్తున్నది. పెదవులు తడి ఆరిపోయినై. వ్రేళ్ళతో పెదవులు తాకి చూచుకున్నది. వ్రేలికి ఒక రక్తపుచుక్క అంటుకోటం కనిపించింది. చెవులు గింగురు మంటున్నాయి. శరీరం కదలటానికి వీలులేకుండా నొప్పులు పెడుతున్నవి.

....నిర్మలమైన నీటితో నిండిఉన్న సరస్సు కనబడింది. బాల్చీతో నీళ్ళు ముంచటానికి ప్రయత్నిస్తున్నది. 'ఓలెనా'. అయ్యో! బాల్చీకి అడుగులేదే!!........లోపలికిదిగి దోసిలితో నీళ్ళు త్రాగబోతున్నది. అమ్మయ్యో! లోపలికి కాలుజారి పోతున్నది..... హఠాత్తుగా మెలుకువ వచ్చింది.....భయం వేస్తున్నది....

పాపం! బిడ్డయింకా నిద్రపోతున్నాడు. దాహంకాలేదు. ఇంకా నయం. దాహమయి, యేడుస్తే పాలు కుడిపేదెట్లా? అసలు పాలు వస్తాయా అని?....

.... అదిగో! గ్రామానికి నాలుగుమూలలా నిప్పంటుకున్నది. అమ్మో! బిడ్డనురక్షించాలి. ఇదిగో! తన శాలువాకిఅప్పుడే నిప్పంటుకున్నది. అంటుకుంటే అంటుకోనివ్వండి. బిడ్డనుమాత్రం ముందు రక్షించాలి.... కొడుకుని హృదయానికి అదుముకొని పరుగెత్తుతున్నది.... పరుగెత్తుతున్నది....అరే! వంతెనకూడా అంటుకున్నదే!! ఇంకెట్లా తప్పించుకోటం?

పిల్లవాడు చేతిలోంచి జారిపోయాడు. మంటలు చుట్టుకున్నాయి .... అమ్మో! ఏం చేసేది!!....

ఏదో కేకవినబడి మేల్కొన్నది 'ఓలెనా'. ఒక జర్మను సైనికుడు బూటుకాలితో తన్ని లేపుతున్నట్టు అప్పుడు తెలిసింది.

తన బిడ్డను వక్షానికి అదుముకొని ఆయాసంతో లేచి నిలబడ్డది. తలుపువైపు నడువమని జర్మనుసైనికుడు తుపాకి మడమతో అటునెట్టాడు. బయట ఆ మంచుని చూడగానే ఆమెకళ్ళు జిగేలుమన్నాయి. నడుస్తున్నదే గాని, నీరసంతో తూలిపోతున్నది.

'ఓలెనా'ను చూడటంతోటే కెప్టెన్ కర్ట్‌వెర్నర్‌కి అమితమైన అసహ్యం వేసింది. తెల్లగా పాలిపోయిఉన్నది. పగిలిన పెదవులనుంచి రక్తం స్రవించి బుగ్గమీద గడ్డకట్టింది. దెబ్బలవల్ల కలిగిన కదుములా, ముఖంనిండా అసహ్యంగా కనిపిస్తున్నాయి. తల వెంట్రుకలు చిందర వందరగా యెగురుతున్నాయి.

బల్లమీద వ్రేలితో కొట్టి సైనికుడ్నిపిలిచి 'ఓలెనా'కు ఒక కుర్చీ నివ్వమని సంజ్ఞచేశాడు కెప్టెన్‌కర్ట్. ఓలెనాకు ఆశ్చర్యంవేసింది. కాని మారు మాట్లాడకుండా, కుర్చీమీద కూలబడి 'కర్ట్' ముఖంకేసి తదేక దృష్టితో చూడసాగింది.

"పిల్లా, పిల్లడా?" అని 'కర్ట్' ప్రశ్నించాడు.

"కొడుకే" - నెమ్మదిగా జవాబిచ్చింది, 'ఓలెనా'.

ఒక సైనికుడ్ని పిలిచి 'ఓలెనా'కు మంచినీళ్ల తెచ్చివ్వమని ఆజ్ఞాపించాడు. ఆమెకు యిదంతా కలకంటున్నట్లున్నది. మంచినీళ్ళగ్లాసు చేతికివ్వగానే ఆత్రంతో గబగబ తాగేస్తున్నది—

"ఇకచాలు" - అని 'కర్ట్' నోటివెంట మాటరాగానే, ప్రక్కనున్న సైనికుడు గ్లాసు ఆమె నోటిదగ్గర్నుంచి లాగేశాడు. 'ఓలెనా' కళ్ళు నిరాశాపూరితాలై ఆ గ్లాసువైపు తిరిగినై. ఆమెకు దాహం యింతకు ముందుకంటే యెక్కువయింది....

"ఐతే కొడుకు పుట్టాడన్నమాట...." అని మళ్లా ఆరంభించాడు 'కర్ట్'.

ఆమెకు 'కర్ట్' ప్రవర్తన యేమీ అర్థంకావటంలేదు. కూర్చోటానికి కుర్చీ యివ్వటం - గుక్కెడు నీళ్ల యిప్పించటం - ఏమీ అర్థం

కావటంలేదు. మొత్తంమీద యేదో ప్రమాదం రానున్నదనిమాత్రం ఆమెకు అనిపిస్తున్నది. ఇంకా యేమిరానున్నదో ననుభయంతో 'కర్ట్' వైపు చూస్తున్నది.

"ఇప్పటికైనా నీతల తిరిగి నోటికివస్తేచాలు. ఇప్పుడు నీకు నిన్ను గురించిన బాధ్యతేకాక, నీకొడుకుని గురించిన బాధ్యతకూడా వచ్చిపడింది. ఆ శిశువుని బ్రతికించుకోవాలన్నా, చంపుకోవాలన్నా నీచేతిలోనే ఉన్నది." అన్నాడు 'కర్ట్'.

ఈమాటలు అంటుంటే తనబిడ్డను హృదయానికి యింకా దగ్గరకి లాక్కున్నది 'ఓలెనా'. ఆమాటలు ఆమెలో తీసుకువస్తున్న మార్పులను 'కర్ట్' జాగ్రత్తగా పరిశీస్తున్నాడు.

"రాత్రి యెవరో నీకు రొట్టె తెచ్చియివ్వటానికి ప్రయత్నించారు కదూ? ఎవరది?"

"నాకు యేమీ తెలియదు"

"తెలియదంటే?"

"నాకేమీ తెలియదు" - అని మళ్ళీ అదేజవాబిచ్చింది 'ఓలెనా'.

"మీ ఇరుగు పొరుగువాళ్ళల్లో యెవరికి పిల్లలున్నారు?"

"పిల్లలు?.... ఒకరికేమిటి? అందరికీ పిల్లలున్నారు" - అని జవాబిచ్చింది 'ఓలెనా', నిజంగానే ఆచుట్టుపట్ల తనకుతప్ప అందరికీ పిల్లలున్నారు. ఇప్పుడు తనకుగూడా ఒకబిడ్డ పుట్టాడు. 'జర్మన్లు' అంటే యేమిటో తెలియక అమాయికంగా తనచేతుల్లో నిద్రపోతున్నాడు, తన బిడ్డడు.

"పోనీ, నీకు రొట్టె యెవరు తేవటానికి ప్రయత్నించిఉంటారో ఊహించి చెప్పగలవా?....షుమారు పది, పదకొండు సంవత్సరాల పిల్లవాడై ఉంటాడు...."

ఆ పిల్లవాడు ఎవరై ఉంటాడా అని ఆలోచింపసాగింది 'ఓలెనా'. ఆ రహస్యం జర్మన్లకు తెలియజేద్దామన్న ఉద్దేశంతోమాత్రంకాదు. తన ఆపదసమయంలో, తనకై అంతటి ఆపదలో పడటానికిగూడా సాహసించినవారు యెవరా అని ఆలోచింపసాగింది. మొత్తానికి యిరుగుపొరుగు వాళ్ళందరికి పిల్లలున్నారు - పది, పదకొండు సంవత్సరాల కొడుకులు అనేకమందికి ఉన్నారు.

" నేనేమీ చెప్పలేను. ఆ వయస్సుపిల్లలు అనేకమంది ఉన్నారు. గ్రామస్థులందరికీ పిల్లలు ఉండనే ఉన్నారు."

'కర్ట్' ఒకసారి ఛీత్కారం చేశాడు. నిజంగానే 'ఓలెనా' కు ఆసంగతి తెలియదనుకున్నాడు.

" పోనీ, 'కర్లీ' - మీ గెరిల్లాదళ నాయకుడు - ఇప్పుడెక్కడ ఉన్నాడో చెప్పు ?"

'ఓలెనా' కొయ్యబారిపోయినట్టయింది. 'కర్ట్' మళ్ళీ మొదటికి వచ్చాడు! తన బిడ్డను వశంలోకి లాక్కొని అదుముకున్నది. ఈసారి తానేగాక, ఇరవై సంవత్సరాలు నిరీక్షించి, అనేక ప్రయాసలకు ఓర్చి కన్న తన ముద్దుబిడ్డడుకూడా ప్రమాదంలో ఉన్నాడుగదా అనుకున్నది.

" బహుశ యేప్రాంతాల్లో ఉంటాడనుకుంటావు ?" - అని మెల్లగా అడిగాడు. కాని ఆధ్వనిలో, 'చెబితేకాని వల్లగాదు' అన్న భావం స్ఫురిస్తున్నది.

" నాకు తెలియదు " - మళ్ళీ 'ఓలెనా' జవాబుయిదే.

" నువ్వు అక్కడ్నుంచి తిరిగి వచ్చేటప్పటికి యెక్కడున్నాడు ?"

" నాకు తెలియదు.... అడివిలో యెక్కడో ఉన్నారు."

" ఏ అడవిలో ?"

" అడవిలో."

ఈసమాధానంలో అర్థమేలేదు మంచుమయం అయిఉన్న గ్రామానికి చుట్టుపట్లఉన్న ప్రదేశాలన్నీ అడవులతోనే నిండిఉన్నాయి. ఈప్రాంతాల్లోకల్లా దట్టమైన అడవి సమీపంలో లేనిది ఆగ్రామమొక్కటే. అందువల్లనే 'కర్ట్' అతని సైన్యం గెరిల్లాలచేతుల్లో పడకుండా యింత కాలం ఉండగలిగారు. ఇతర ప్రాంతాలలోని జర్మను సైనికులకు గెరిల్లాలతో దినదినగండాలు గడుస్తున్నాయి. ఈ కారణంవల్ల జర్మను సైన్యాధికారులు గెరిల్లాదళం యెక్కడున్నదీ త్వరగా ఆచూకీతీయవలసినదని 'కర్ట్' ని మాటిమాటికి దబాయిస్తున్నారు.

" చుట్టుపట్ల అన్నీ అడవులేగా.... నువ్వు యెటువైపు నుంచి వచ్చావో చెప్పు...."

" నాకు తెలియదు.... గుర్తులేదు. మంచులోపడివచ్చాను. గుర్తేముంటుంది...."

"పోనీ, ఏరోజ్జున పడివచ్చావో చెప్పు."

"ఉఁ హుఁ గుర్తులేదు."

"అంతటి మతిమరుపా? నాలుగురోజులక్రితమేగా వచ్చింది?"

నిజంగానే ఆమె తిరిగివచ్చి ఆరురోజులన్నా తిరుగలేదు. చాలా ఆశ్చర్యం వేసింది. ఐతే, జర్మన్లకు తన సంగతంతా స్పష్టంగా తెలిసిపోయిందన్నమాట! ఆరురోజులే ఐనప్పటికి 'ఓలెనా'కి అవి ఆరు సంవత్సరాల్లా గడిచినై.

'కర్ట్' సిగరెట్టు ముట్టించి నెమ్మదిగా పీలుస్తున్నాడు. తర్వాత కళ్ళపైకెత్తి, గాయాలతోనిండి ఉన్న 'ఓలెనా' ముఖంలోకి చూస్తూ అన్నాడు.

"ఇప్పుడు నీతోపాటు కొడుకు గూడా ఉన్నాడు సుమా—"

కొడుకు సంగతి యెత్తేటప్పటికి ఆమె ముఖం వికసించింది. అవును! తనకు మగపిల్లవాడు కలిగాడు.

"ఆపసికూన పెరిగి పెద్దవాడై, వృద్ధిపొందాలని నీకు తప్పకుండా ఉండితీరుతుంది...."

అవును. ఆబిడ్డ పెరిగి పెద్దవాడై, వృద్ధిపొందాలని ఆమెకు సహజంగానే ఉంటుంది. చిట్టిచేతులతో యిల్లంతా బంగరుతుంటే ఆమెకెంత ఆనందం! తప్పటడుగులు వేస్తూ తోటలోని మొక్కలు లాగేస్తాడు. ఉరకలువేస్తూ, కుక్కలవెంటా, పిల్లులవెంటా పరుగెత్తుతాడు. ఈడొచ్చిన తర్వాత బడికివెళ్ళి చదువుకుంటాడు.... పెద్దవాడౌతాడు. ఆ తర్వాత.... ఏమో, ఈపసికూన అంతపెద్దవాడై పెళ్ళి చేసుకొని బిడ్డల్ని కనేదాకా తాను బ్రతికే అదృష్టం ఉంటుందో లేదో!....

"నీకు చివరిసారి అవకాశమిస్తున్నాను. నిన్నేగాక నీబిడ్డని రక్షించుకోటంకూడా నీచేతిలోనే ఉన్నది. కాబట్టి తెలివి తక్కువగా ప్రవర్తించక నీబిడ్డనీ, నిన్నూ కాపాడుకో—"

ఓలెనా యేమీ అనలేదు. అసలు జర్మను ఆఫీసరుయొక్క ఉద్దేశ్యం యేమిటో ఆమెకు అర్థంకావటంలేదు. కాని యేదోభయంకరమైన సంగతి జరిగేటట్టున్నదని మాత్రం ఆమె హృదయానికి తెలుస్తూనే ఉన్నది.

"ఇవ్వాళ కాకపోతే యింకొకనాడైనా గెరిల్లా దళం మాచేతికి చిక్కక మానదు. బాగా ఆలోచించుకో. ఎర్రసైన్యం పూర్తిగా నాశనమైపోయింది. అడవిలోనున్న గెరిల్లాదళానికి బయటయేమి జరుగుతున్నదో

తెలియటంలేదు. వారిని అన్నివైపులనుంచి చుట్టుముట్టేశామన్న సంగతి వారికింకా తెలియదు. త్వరలోనే మాచేతికి చిక్కి శిక్షను అనుభవించి తీరుతారు. కాని నీవిషయం చూస్తే నాకు చాలా జాలిగా ఉన్నది. అందులోనూ ఇప్పుడు బిడ్డ తల్లివయ్యావు. నువ్వు వంతెన పేల్చివేసిన నేరాన్నిగూడా క్షమిస్తాను. ఇంతకూ వాళ్ళ దుర్బోధలవల్ల అట్లా వేశావు. కాబట్టి ఇప్పటికైనా బుద్ధితెచ్చుకొని మెలగితివంటే, నీబిడ్డతోపాటు నీవుగూడా సుఖంగా బ్రతికి ఉండవచ్చు—"

'కర్ట్' ముఖంకేసి నిశ్చలంగా చూస్తూ వింటున్నది 'ఓలెనా'

"నువ్వేమీ భయపడనవసరంలేదు. నేను ఘాతాన్నికాదు. సైనికుడిగా నాదేశంపట్ల నాధర్మాన్ని నిర్వర్తిస్తున్నాను....కాని విను, నీ బిడ్డను చూస్తే నాకు చాలాజాలి వేస్తున్నది. పోనీ, నీప్రాణంమీద నీకు తీపిలేకపోయినా, ఆ పసిబిడ్డ సంగతైనా ఆలోచించు. కన్నదానివి చేతులారా చంపుకుంటావా ?...."

"ఏమిటి ?.... చంపెయ్యటమేమిటి?" అని చటాలున అడిగింది 'ఓలెనా'

'కర్ట్' కోపంతో సిగిరెట్టు అవతల పారేశాడు—

"నేనడుగుతున్న ప్రశ్నలకు జవాబు సరిగా చెప్పకపోతే నీ బిడ్డ ప్రాణాలు తియ్యటానికి నువ్వేకారణ మవుతావన్నమాట. కొంతకాలం వ్యవధికూడాయిస్తున్నాను. బాగా ఆలోచించుకో. వారి ఉనికి చెప్పకపోయినందువల్ల నువ్వు గెరిల్లాలకు చేయబోయేమేలు యేమీలేదు. పైగా చెప్పినందువల్ల నీ బిడ్డను రక్షించుకో గలుగుతావు, బాగా ఆలోచించుకొని చెప్పు"

మళ్ళీ ఒక సిగిరెట్టుతీసి ముట్టించాడు. సిగరెట్టుపొగలు ఉంగరాలుగా తిరుగుతుంటే వాటివైపు చూస్తున్నాడు.

"ఏమంటావ్ ?"

'ఓలెనా' జవాబివ్వలేదు.

"నా ప్రశ్నలకు జవాబివ్వవన్న మాటేనా ?

"నా కేమీ తెలియదు."

'కర్ట్' గభాలునలేచి కోపంతో ముఖం ధుమధుమలాడించుకుంటూ 'ఓలెనా' వైపు వంగి అన్నాడు— "ఐతే నీ పనిట్లా ఉన్నదన్నమాట!

నిన్ను మనిషివి చూచినట్టు మర్యాదగా చూస్తుంటే, నీకళ్ళు నెత్తికెక్కి-పోతున్నాయి. సరే, నీపని పడతానుండు—' హాన్స్ '. ఇటురా...."

ఆ మాట వింటూనే ఒక సైనికుడు లోనికివచ్చాడు. అతని వెనుకనే మరిద్దరు సాయుధులైన సైనికులు తయారయ్యారు. తానిందాక ప్రసవిస్తున్నప్పుడు మానవత్వంగూడ మరచి, తనపైపుచూస్తూ నవ్వినవారే ఆ యిద్దరు సైనికులని ' ఓలెనా ' గుర్తుపట్టింది.

" దాన్ని పట్టుకోండి.... ఆ గుంటడ్ని ఇటివ్వండి "

ఏమిజరుగుతున్నదో తెలుసుకొనే లోగానే ఒక సైనికుడు పసివాడ్ని ఆమెచేతుల్లోంచి చటాలున గుంజుకున్నాడు. తన బిడ్డను తిరిగి గుంజుకోటానికి ఆమె ముందుకి ఉరకబోయింది. కాని వెనుకనుంచి ఇద్దరు బలమైన సైనికులు, ఆమె రెండుచేతులు పట్టుకొని ఆపేశారు. పిచ్చిదానిలాగ బిడ్డకోసం చూస్తున్నది.

" గుంటడ్ని టేబిలుమీద ఉంచు "

ఆ సైనికుడు పసిబిడ్డను టేబిలుమీద ఉంచాడు. ఈ అలజడిలో పిల్లవాడు నిద్రనుంచి మేల్కొని యేడవటం ప్రారంభించాడు. ముఖమంతా కందిపోయింది. అది చూడలేక ' ఓలెనా ' జర్మను సైనికులనుంచి తన చేయులు విడిపించుకోటానికి ప్రయత్నిస్తున్నది. కాని ఆ యినుప చేతులక్రింద కదలలేకపోయింది.

" నీతో కాలయాపన చేసుకుంటూ కూచోటానికి వీల్లేదు. చివరి పర్యాయం అడుగుతున్నాను; చెప్పు. నేనడిగిన వాటికి సమాధాన మిస్తావా లేదా " అని కటువుగా పలికాడు ' కర్ట్ '.

కొడుకు మీదినుంచి దృష్టిమరల్చి విచారంతో అన్నది ' ఓలెనా '— " లేదు ! ఏమీ చెప్పలేను !! "

టేబిలుమీద పైన గుడ్డయినాలేకుండా, కాళ్ళుచేతులు తన్నుకొని కేరుకేరుమని యేడుస్తున్నాడు పిల్లవాడు. ఆ యేడుస్తున్న పిల్లవాడిని ' కర్ట్ ' పిడికిట్లో గొంతుచిక్కించుకొని కుక్కపిల్లను యెత్తినట్టు పైకెత్తాడు. పిల్లవాడు గాలిలో కాళ్ళు చేతులు కొట్టుకుంటున్నాడు.

" ఏమంటావ్ ? " - అని ' కర్ట్ ' జేబులోంచి పిస్తోలుతీశాడు.

' ఓలెనా ' నిశ్చేష్టురాలైపోయి నిల్చున్నది. ' కర్ట్ ' పెనుభూతం లాగ కనబడుతున్నాడు. అతని చేతిలో తన ముద్దుబిడ్డడు గిలగిల కొట్టు

కొంటున్నాడు. చేతులు, కాళ్ళు గాలిలో అల్లల్లాడుతున్నాయి. ఏడ్పు కట్టి పోయింది. పిచ్చిదానిలాగ 'ఓలెనా' గుడ్లప్పజెప్పి చూస్తున్నది.

"చెప్పు? నువ్వు బోల్షివిక్ లంజవా, లేక ఈ బిడ్డ తల్లివో? - చెప్పు!"

'ఓలెనా' స్పృహలోకి వచ్చింది.

"చెప్పవే!"

"....ఆ బిడ్డతల్లిని...." ఈమాటలు పలుకుతుంటే, తనను 'అమ్మా!' అని గెరిల్లాదళయోధులు పిలుస్తూ ఉండిన విషయం గుర్తు కొచ్చింది.

"ఐతే వాళ్ళెక్కడుంటున్నారో చెబుతావా?"

గాలిలో ఊగులాడుతూఉన్న కొడుకువైపు జాలిగా చూస్తూ అన్నది— "ఏమీ చెప్పలేను...."

'కర్ట్' తన పిస్తోలు బిడ్డముఖందగ్గరికి తీసుకొచ్చాడు. ఆ పిస్తోలు తన ముఖంలోకే తెస్తున్నట్టుగా ఉన్నది 'ఓలెనా'కు.

"వీడొక్కడేగదూ, నీకున్న బిడ్డ?" - అని అడిగేడు 'కర్ట్'.

'ఓలెనా' తలపంకించి అన్నది "ఊఁ హూఁ."

'కర్ట్' ఆశ్చర్యపోయాడు. పిస్తోలుతోపాటు అతని చెయ్యి క్రిందికి జారిపోయింది.

"ఏమిటి?.... ఇంకా నీకు పిల్లలున్నారా? ఎక్కడ? ఈ గ్రామంలోనే!"

పగిలి రక్తం కారుతున్న ఆమె పెదవులమీద చిరునవ్వు చిందులాడింది.

"అవును.... అనేకమంది బిడ్డలున్నారు.... వాళ్ళంతా వీరులు....

'కర్లీ' మొదలైన గెరిల్లాలంతా నా బిడ్డలే...."

ఈమాటలు 'కర్ట్' సహించలేక పోయాడు. పిస్తోలు పేల్చేశాడు. తిన్నగా పసిబిడ్డముఖంలోంచి దూసుకుపోయింది, గుండు. 'ఓలెనా'ను పట్టుకునిఉన్న సైనికులిద్దరు ఉలిక్కపడ్డారు.

"చూసుకో, తల్లివి!"

పిల్లవాడికి కాళ్ళు, చేతులు తిత్తుల్లాగ వేలబడి ఉండిపోయినై. ముసుపు అందమైనముఖం ఉన్నచోట, రక్తం స్రవిస్తున్న పెద్ద రంధ్రం యేర్పడింది.

"చూడు! నీబిడ్డగతి యేంచేశావో?" - అని 'కర్ట్' ఆరక్తపు ముద్దను ఊపాడు.

ఆమె తల ఊపింది - కాని యెందుకో ఆమెకే తెలియదు. ఎక్కడో అడివిలో ఉన్నట్టు, జర్మను సైనికకార్యాలయాన్ని చుట్టుముడుతున్నట్టు, ఇంకా యేమేమో కనబడుతున్నాయి ఆమె కళ్ళముందు. ఎక్కడున్నదో, ఏమి చేస్తున్నదో ఆమెకే తెలియటంలేదు.

చనిపోయిన పిల్లవాడి శరీరంనుంచి రక్తం కిందికి ధారలుగా కారుతున్నది అదిచూస్తుంటే 'కర్ట్'కి అసహ్యంపుట్టింది.

"తీసెయ్యండి, ఈ పీనుగను!"

సైనికులు సందేహిస్తూ నిలబడ్డారు.

"చెప్పేది మీకుగాదూ? తీసుకెళ్ళండి దీన్ని" అని కోపంతో అరిచేడు. ఒక సైనికుడు ముందుకొచ్చి ఆశవాన్ని తీసుకున్నాడు.

"ఇదుగో, ఇది ఆఖరుసారి అడుగుతున్నాను. చెబుతావా లేదా?"

'ఓలెనా' నోరు మెదపలేదు-అసలు ఆప్రశ్న విన్నట్టేలేదు ఆమె బయటవీస్తున్న పెనుగాలివైపు అర్థంలేని చూపులు చూస్తున్నది.

"చెప్పకపోతివా, నీప్రాణాలుగూడా తీస్తాను"

ఈ మాటలుగూడా ఆమె చెవిని బడలేదు. ఇరవైసంవత్సరాలపాటు నిరీక్షించి కన్నబిడ్డకూడా పోయాడు. హృదయం శూన్యంగాఉన్నదిప్పుడు. ఇక ఆశలు అంటూ ఆమెకులేవు. భయం అంతకన్నా లేదు!—

"దీన్ని తీసుకుపోయి, దీనిపనికూడా పూర్తిచెయ్యండి. గ్రామంలో మాత్రం చంపకండి. ఇప్పటికే గలభాగా ఉన్నది. ఏటిదగ్గరకు తీసుకుపోయి, అందులో పారవేయండి—" అని ఆజ్ఞాపించాడు 'కర్ట్'

తుపాకి మడమలతో యెటుతోస్తే అటువెళ్తున్నది, 'ఓలెనా'. ఆమె యిదే గ్రామంలోపుట్టి పెరిగింది. ఇక్కడే వివాహమాడింది. చివరికి ఇదే గ్రామంలో తనబిడ్డను కన్నది కాని ఆ బిడ్డను, ఒక్కమాటకోసం, తుపాకికి అర్పించింది. తానే - తన చేతులార తుపాకి గుండుకి అర్పించింది.

"చిట్టితండ్రీ, నేనామాటలు చెప్పలేకపోయాను" - అని చనిపోయిన ఆ పసిబిడ్డ వింటున్నదన్నట్టుగా తనలో తాను గొణుగుకున్నది. బిడ్డశవాన్ని చేతిలో తలక్రిందులుగా వెళ్ళాడవేసి పట్టుకొని నడుస్తున్నాడు జర్మను సైనికుడు. శవాన్ని తనకు అందివ్వమన్నట్టు చెయ్యిజాపింది ఆమె. సైనికుడు మొదట్లో శవాన్ని ఆమెకివ్వటానికి సందేహిం

చాడు. కాని దానిని పట్టుకోటం అసహ్యమనిపిస్తున్నది. ఆమెకు అందించాడు శవాన్ని. ఆతురతతో, హృదయానికి హత్తుకున్నదాశవాన్ని.

ఎక్కడికి తీసుకుపోతున్నదికూడా తెలియకుండానే ఆ యిద్దరు సైనికుల కాపలాలో వెళుతున్నది 'ఓలెనా'. జర్మను ఆఫీసరు ఇచ్చిన ఆజ్ఞ ఆమె విననేలేదు. బహుశ యెక్కడికో తీసుకుపోయి చంపుతారనుకుంటున్నది. కాని ఆమెకు యేమాత్రమూ బెంగలేదు. తన బిడ్డచావుతోనే ఈ ప్రపంచంతో ఆమెకు అన్ని సంబంధాలూ వదిలిపోయినై.

గాలి తీవ్రంగా వీస్తున్నది. మంచు బాగా గాలిలోకిలేచి ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది. ఎక్కడా ఒక్క ప్రాణిగూడా కనబడటంలేదు. ఈ కడపటి ప్రయాణం - మృత్యుముఖంలోకి ఏకాకిగా నడిచిపోవాలి !

తుపాకి మడమదెబ్బ సంజ్ఞతో ఆమె రోడ్డువిడిచి ఒక చిన్నబాటను పడ్డది. అసలు యెక్కడికి తీసుకుపోతున్నారో ఆమెకు తెలియటంలేదు. తుపాకి మడమలతో యెటుతోస్తే అటునడుస్తున్నది. గ్రామం మధ్యలో ఉన్న గంటస్తంభం దగ్గరకు తీసుకుపోయి ఉరితీస్తారేమో ననుకున్నది. కాని వాళ్ళు పోయేది ఆ దిశకుకాదు. కొంతదూరం పోయేటప్పటికి యేటి దగ్గరికి తీసుకుపోతున్నట్టు తేలింది. ఆమె కాళ్ళు గాయాలతో నిండిపోయినై. రక్తం స్రవిస్తున్నది. నడవటం కష్టమై పోతున్నది.

ఏటి పైభాగమంతా చలికి మంచుగా గడ్డకట్టుకుపోయి ఉన్నది. గ్రామస్థులు నీళ్ళుతోడుకునే చోటమాత్రం మంచుపగిలి ఒక పెద్దరంధ్రం యేర్పడి, ఆ తెల్లనిమంచు వాతావరణంలో నల్లగా కనిపిస్తున్నది. కాని ఇంతవరకుగూడా తనను యెక్కడికి తీసుకు పోతున్నారో తెలియటంలేదు 'ఓలెనా'కు. మరికొంత దూరంపోతే, యుద్ధంచేస్తూ చనిపోయి, జర్మన్ల నిషేధంవల్ల సమాధికూడా చేయటానికి వీల్లేకపోయిన యోధుల శవాలున్నాయి. తనను అక్కడికి తీసుకుపోయి తుపాకితో కాలుస్తారేమో? సాధారణమైన, తనలాంటి రైతు స్త్రీ, ఎర్రసైనిక యోధులతో సమానంగా చావటం !....

"ఒసేవ్, ఎటుపోతున్నావ్ ?"

ఆ జర్మను భాష ఆమెకు అర్థంకాలేదు. తుపాకి మడమతో పొడిచిన దెబ్బతో, నదిమీద కట్టిన మంచులోని రంధ్రంవైపు పొమ్మంటున్నారని తెలుసుకున్నది.

"దానిని ఇటివ్వు" అని పసిబిడ్డ శవంకోశం ఒక సైనికుడు చేయిజాచాడు. భయంతో ఆ శవాన్ని తన హృదయానికి ఇంకా దగ్గరగా కరుచుకున్నది.

"ఇటివ్వు!" అని ఆమెను గద్దిస్తూ, ఆమె చేతిని తోసేశాడు. శవం క్రిందబడి పోయింది. మళ్ళీ శవాన్ని తీసుకోటానికి ఆమె వంగింది. కాని అంతలోనే సైనికుడు శవాన్ని తన తుపాకిలోని విచ్చుకత్తితో పొడిచి గాలిలోకి యెగురవేశాడు. అదివెళ్ళి సరిగ్గా మంచులోని రంధ్రం దగ్గర పడ్డది. రెండవ సైనికుడు ముందుకి ఉరికి తనవిచ్చు కత్తి మళ్ళీ ఆ శవాన్నిగుచ్చి సరిగ్గా కన్నంలోకి త్రోసివేశాడు. చిన్న శబ్దంతో శవం నీళ్ళల్లో మునిగిపోయింది. లోపలినుండి పైకి నీటి బుడగలు తేలు తున్నాయి.

బిడ్డను తీసుకోటానికి మోకరిల్లిన 'ఓలెనా' అట్లాగే శిలలాగ ఉండిపోయింది. శవం మొదటిసారి పడ్డచోట ఎర్రని రక్తపుచుక్కలు మెరుస్తున్నాయి. రంధ్రంలోంచి బుడగలు వస్తున్న ఆ నీటిమీద ఆమె చూపులు నిలిచిపోయినై. ఆ జలం తన బిడ్డను మింగేసింది. తన ముద్దు బిడ్డ అంతరించిపోయాడు. అతని చిహ్నాపల్లా, అక్కడ మెరుస్తున్న ఆ రక్తపు చుక్కలే. ఆ జలం మంచు క్రిందినుంచి తన బిడ్డను ఎక్కడికో అజ్ఞాతస్థానానికే తీసుకుపోతూన్నది. కాని తూర్పుదిశకే యేరు ప్రవహిస్తున్నది. ఐతే సంతోషమే! తన బిడ్డ మళ్ళీ తన ప్రజల్లోకి - స్వతంత్ర రష్యాలోకి చేరుకుంటాడు!! అక్కడి ప్రజలు ఆ శవంయొక్క రూపం చూచి, ఆక్రమితదేశాల్లో జర్మన్లుచేస్తున్న రాక్షసకృత్యాలు గ్రహించు కుంటారు. గౌరవంతో తన బిడ్డకు అంత్యక్రియలు జరుపుతారు!! ...

ఇద్దరు సైనికులూ యేదోవిషయమై వాదనచేసుకుంటున్నారు. ఏటి మీది రంధ్రంనుంచి కొద్దిదూరం నడిచివెళ్ళి యెవో కొలతలువేసుకుంటు న్నారు. అందులో ఒకడు రంధ్రంచుట్టూ తుపాకి మడమతోకొట్టి వెడల్పుగా చేశాడు.

ఇంతలో ఎవరిదో పాదాలచప్పుడు వినవచ్చింది. సైనికులిద్దరు వెనుకకుతిరిగి చూచారు. కెప్టెన్ 'కర్ట్ వెర్నర్' కనబడటంతోనే అటెన్షలో నిలబడ్డారు.

'ఓలెనా'కి చుట్టుపట్ల యేమిజరుగుతున్నదోకూడా తెలియటం లేదు. ఆమె చూపులు మంచులోని రంధ్రంలో కదులుతున్న నీటిమీదనే

లగ్నమైఉన్నవి. 'కర్ట్' ఆమెను కాలితో తోశాడు. అతనివైపు తిరిగి శూన్య దృక్కులతో చూడసాగింది.

"ఏయ్; ఇంకొకక్షణంలో నీపని పూర్తవుతుంది. ఇప్పటికైనా గెరిల్లాలసంగతి చెబుతావాలేదా?" - 'కర్ట్' కోపం పట్టలేకుండా ఉన్నాడు.

'ఓలెనా'ను ఇక్కడికి పంపించిన మరుక్షణంలోనే. ఆ యుద్ధరంగం యొక్క కేంద్ర సైనిక కార్యాలయంనుంచి 'కర్ట్'కి టెలిఫోను పిలుపు వచ్చింది. గెరిల్లాదళంలోఉన్నవారు చాలామంది 'కర్ట్' ఆధీనంలోఉన్న గ్రామానికి చెందినవారని పై అధికారులకు తెలియవచ్చిందట. అందువల్ల 'ఓలెనా' నుంచి యేవిధంగానైనా గెరిల్లాదళానికి చెందినవివరాలు తెలుసుకుని తమకు పంపవలసినదని పై అధికారులు ఒత్తిడిచేస్తున్నారు. కాని 'ఓలెనా'ను యెన్ని చేసినప్పటికి నోరుమెదపటంలేదు. లేక లేక పుట్టిన ముద్దుబిడ్డను కళ్ళముందు చంపినా ఆమె చలించలేదు! 'కర్ట్'కి యేమి చేయటానికి తోచటంలేదు -

"ఒసే, నిన్నే అడిగేది! గెరిల్లా లెక్కడున్నారో చెప్పు?"

'ఓలెనా' జవాబివ్వలేదు. అతనిముఖంలోకి అర్థంలేని చూపులు చూస్తున్నది.

"ఏమిటి. దెయ్యంలాగ చూస్తావు? గెరిల్లా లెక్కడున్నారని అడుగుతుంటే?"

ఆ ప్రశ్నలు ఆమె వినిపించుకోటంలేదని గ్రహించాడు. ఆమెను చూస్తుంటే కోపం మితిమీరిపోతున్నది. దాని బిడ్డను చాలా త్వరగా చంపేశానే అని విచారపడుతున్నాడు. ఆమె చూస్తుండగా ఆ శిశువుకళ్ళు పొడిచి, ముక్కు చెవులు కోసి, చర్మంవొలిచి దానిని యేడ్పించాలనిపిస్తున్నది. ఇంతకూ తాను, ఒక గెరిల్లాస్త్రీని పట్టుకున్నానని తొందరపడి కేంద్రకార్యాలయానికి తెలియజేయటం తనదే బుద్ధితక్కువ అనుకున్నాడు. 'కర్ట్', ఒక గెరిల్లా స్త్రీ నుంచి రవమాత్రం వివరాలు లాగలేకపోయాడని తన స్నేహితులంతా యెగతాళిచేస్తారు. కాని అది యెంతటి కష్టమైనపనో వాళ్లు గ్రహించరు....

హఠాత్తుగా ఒక సైనికుడిచేతిలోంచి తుపాకి లాక్కున్నాడు. భయంతో ఒక్కగంతువేసి వెనక్కి తగ్గాడు ఆ సైనికుడు. 'ఓలెనా' అసలు 'కర్ట్' వైపు చూడనే చూడటంలేదు. మంచులోని రంధ్రంలో కదులుతున్న నీళ్ళమీద ఆమెచూపులు లగ్నమై ఉన్నాయి.

'కర్ట్,' ఒక అడుగు వెనక్కి వేసి తన శక్తినంతా వినియోగించి అటువైపు తిరిగిఉన్న 'ఓలెనా' వీపులోకి బాయినెట్ దిగవేశాడు. మంచు లోని రంధ్రంముందు ఆమె బోర్లగిలపడిపోయింది. ఆమె వీపులోంచి విచ్చుకత్తి లాగి మళ్ళీ దిగవేశాడు. కొద్దిసేపు గిలగిల తన్నుకొని ఆగి పోయింది ఆమె. రంధ్రానికి సమీపంలో కరిగిపోయింది అమెంల కేశాలు నీటిలో తేలియాడుతున్నాయి....

"దాన్ని లోపలికి తోసెయ్యండి." అని 'కర్ట్' ఆజ్ఞాపించాడు.

సైనికులిద్దరూ ముందుకి ఉరికి తుపాకిమడమలతో 'ఓలెనా' శవాన్ని రంధ్రంలోకి నెట్టటం ప్రారంభించారు. తలమాత్రం చప్పున లోపలికి జారి పోయింది. కాని శరీరంలోపలికి పోవటం కష్టమవుతున్నది.

"వెధవలు! ఈమాత్రం చేయలేరా?" - అని 'కర్ట్' మొరిగాడు.

సైనికులు భయంతో తమ శక్తినంతా ఉపయోగించి శవంయొక్క చేతులు వెనుకకు విరిచి రంధ్రంలోకి తోసేరు. అప్పటికీ నడుముమట్టుకే జారి ఆగిపోయింది. కెప్టెన్ చూస్తున్నాడన్న భయంతో ఒదుంబాదుంగా పైకి మిగిలిన భాగంమీద తుపాకి మడమలుపెట్టి మోదారు. బిడుగున పాదాలవరకు మళ్ళీ జారింది. అప్పటికే గాయాలతో అసహ్యమైపోయి ఉన్న పాదాలమీద చివరిదెబ్బ పెద్దపెట్టున బాదారు. మళ్ళీ బుడుంగుమని 'ఓలెనా' శరీరమంతా నీళ్ళల్లోకి మాయమైపోయింది. నీటిమీద బుడగలు తేలుతున్నాయి.

కోపంతో తిట్టుకుంటూ కర్ట్ వెళ్ళిపోయాడు. సైనికులిద్దరూ అతి వినయంతో అతని వెనుకనే బయలుదేరారు.

రంధ్రంలో నీరు గలగల లాడుతున్నది. నున్నటి మంచుమీద జర్మను సైనికులబూట్లగుర్తు స్పష్టంగా కనుపిస్తున్నది. 'ఓలెనా' కొడుకు శవం పడినచోట రక్తపు మరకలు మెరుస్తున్నాయి. ఆ తెల్లని మంచుమీద ఎర్రని రక్తపు మరకలు కలకాలం ఉండిపోయేటట్టు ఆ రక్తపు మరకలు - లేకిలేక పుట్టిన 'ఓలెనా' ముద్దుబిడ్డని రక్తపు మరకలు - అగ్ని కణాల్లాగ కనబడుతున్నాయి. జర్మను మృగాలు శాంతియుతమైన తమ దేశంమీద చేసిన దండయాత్రకు చిహ్నామల్లే కనుపిస్తున్నాయి.



# 6

'పుస్సీ' స్నానం చేస్తున్నది. 'ఫెడోసియా' మౌనంగా వాల్చిలతో వేడినీళ్లతెచ్చి పోస్తున్నది. ఎంతో విలాసంగా సబ్బు పులుముకుంటున్నది. ప్రక్కనే 'కర్ట్' కూర్చుని సిగిరెట్లమీద సిగిరెట్లు పీలుస్తూ కూర్చున్నాడని సిగ్గయినా వేయటంలేదు. పైగా తన అంగవిలాసమంతా జర్మను మగడికి చూపించాలని ప్రయత్నం చేస్తున్నది.

'పుస్సీ' ఒళ్లు తోముకుంటూ అప్పుడప్పుడు 'కర్ట్' వైపు చూస్తున్నది. 'కర్ట్' ఇవ్వాళ యేమీ సరదాగా కనబడటంలేదు.

"కర్ట్!"

'కర్ట్' అతని ఆలోచనా ప్రపంచంలోంచి బయటపడ్డాడు.

"ఏమిటి?"

"ఎందుకట్లా ఊరికినే కూర్చున్నారు. మాట్లాడటమే కష్టమైపోతుందే!"

"అబ్బే. ఏమీలేదు. ఈ పనితో విసుగుపుట్టి పోతుంది—అంతే"

"మీ కోసం యెంత యెదురుచూస్తూ కూర్చున్నా ననుకున్నారు! కాని మీ దర్శనం దొరకటమే కష్టమై పోతున్నది"

'పుస్సీ' నున్నని వక్షంమీదినుంచి నీరు జారుతున్నది.

"నా మనస్సు ఏమీ బాగుండలేదు" అని విసుక్కున్నాడు 'కర్ట్.' కేంద్ర సైనిక కార్యాలయంనుంచి మళ్ళీ యే సమయంలో 'టెలిఫోను' పిలుపు వస్తుందోనని భయపడుతున్నాడు. 'ఓలెనా' నుంచి యే మాత్రం వివరాలు తీసుకోగలిగావని అడుగుతారు. ఏం సమాధానం చెప్పగలడు? ఎంతో సులభమైన విషయంలాగానే పై అధికారులు మాట్లాడుతారు. కాని ఇక్కడి కష్టాలు వారికి తెలిసియేడిస్తేగా! తనమీద నెట్టేసే బదులు తామే యెందుకు గెరిల్లాలను పట్టుకోగూడదు? వారికి చేతగాక యితర్లమీద నెట్టెయ్యటమా! ఇంతకూ, తనకు మరికొద్దిరోజుల్లో రానున్న ప్రమోషన్

ఆగిపోయేటట్టున్నది. అసలు 'ఓలెనా' ను పట్టుపన్నసంగతి పై అధి కారులకు తెలియజేయటం తనదే బుద్ధితక్కువపని.

"ఏమిటీ సంగతి? చెప్పగూడదూ?" అని అడిగింది 'పుస్సీ' అతని వాలకం గమనిస్తూ.

సిగరెట్టుపొగ నెమ్మదిగా వదులుతూ అన్నాడు "ఇటుచూడూ...."

కళ్లు చికిలించి 'కర్ట్' చెప్పబోయేది శ్రద్ధగా వినటానికి తయా రయ్యింది.

"ఒక్కతడవ మీ అక్కతో మాట్లాడిరాగలవూ?"

'పుస్సీ' గిరుక్కున ప్రక్కకి తిరిగిపోయింది. అదేసమయంలో 'ఫెడోసియా' బాల్చీలతో నీళ్ళు పట్టుకువచ్చింది.

"ఏయ్! నువ్విక్క డెందుకు? బైటికియేడువు?—" అని 'కర్ట్' 'ఫెడోసియా' మీద కేకలేశాడు.

'ఫెడోసియా' మారు పలకకుండా బయటికి వెళ్ళిపోయింది. 'కర్ట్' లేచి తలుపు జాగ్రత్తగా బిగించాడు.

"మా అక్కయ్యతో ఒకమారు మాట్లాడటమా?"

"ఐతే నా ప్రశ్న వినే వినపన్నమాట...." 'కర్ట్' కి కోపం వచ్చింది.

'ఇంతకూ దానిని కలవటం దేనికీ?— అని 'పుస్సీ' అతనివైపు చూస్తూ గారాబంగా పలికింది.

"నువ్వు ఈ విషయంలో నాకు సహాయం చేయాల్సి ఉంటుంది. మీ అక్కదగ్గరికి వెళ్ళి మాట్లాడావంటే నాకు అవసరమైన అనేక వివరాలు తీసుకు రా గలుగుతావు"

'పుస్సీ' ఒళ్ళు రుద్దుకుంటూ అన్నది—

"అటువంటివి యేవీ నాకు చెప్పదది"

"ఆమె చెప్పేటట్టు చెయ్యటం నీలో ఉన్నది. ఇటువంటి ఆటలేవీ యికముందు సాగవని దానికి బోధపర్చు నేను మంచికి మంచివాడ్నే— కాని కోపం వచ్చిందంటే ఇకచూడు—"

"ఆటలు సాగవంటే?"

"అదే; ఆ గెరిల్లా వెధవలసంగతి!" అని పట్టలేని కోపంతో గట్టిగా అరిచేడు.

'షుస్సీ'కి మనస్సు కష్టంవేసింది. మూతిబిగించి పాళ్ళుతోము కుంటున్నది.

"మాకు సహాయపడినట్టయితే వృద్ధిలోకి రాగలుగుతుందని నచ్చ జెప్పు. ఎర్రసైనికులు మళ్లీవస్తారని భ్రమపడేటంతటి తెలివి తక్కువదై ఉండదులే–"

'షుస్సీ' జవాబేమీ యివ్వటంలేదు. ఆమె ముఖంచూచి యేదో సంశయిస్తున్నట్టు గ్రహించాడు 'కర్ట్'

"ఏమిటీ, మాట్లాడవ్ ?"

"అది నాతో మాట్లాడదుగా–"

"ఏమి ?"

'షుస్సీ' కళ్ళు పైకెత్తి 'కర్ట్'ని చూస్తూ అన్నది–

"ఇక్కడ ఎవ్వరూ నాతో మాట్లాడటంలేదన్నసంగతి మీకు తెలియదూ? నన్ను చూస్తే కుష్ఠురోగిని చూచినట్టు దూరం తొలిగిపోతారు....మీకేం, హాయిగా యెన్నయినా కబుర్లు చెప్పవచ్చు...."

"అదుగో, ఆ అర్థంలేని మాటలే నేను వద్దనేది. బాధ్యతవహించి పనిచేయాలి...." కోపంతో కుమిలిపోతున్న 'కర్ట్' ముఖంచూచి 'షుస్సీ' భయపడ్డది.

"ఐతే, ఏమి అడగమంటావు దానిని...."

'కర్ట్' ఒకసారి తలుపువైపు చూశాడు.

"గెరిల్లా దళానికి ఆమెతో సంబంధం ఉన్నట్టు తెలుస్తున్నది. వాళ్లెక్కడ ఉంటున్నదీ తెలియజేయుమని అడుగు–"

"అదిచెప్పదు...."

"ముందే ఆమాట యెందుకూ ? అడగవలసవిధంగా అడిగితే అదే చెబుతుంది."

'షుస్సీ' స్నానం చాలించి వళ్ళు తుడుచుకున్నది. కుర్చీమీద ఉన్న సిల్కుగౌను తీసుకున్నది. ఆ సిల్కుగౌను తన భార్యకి పంపుదామని 'ఫ్రాన్సు' నుంచి పట్టుకు వచ్చాడు. కాని భార్యకు యివ్వటానికి ఇంత వరకు అవకాశం దొరకలేదు. ఇప్పుడు దానిని 'షుస్సీ' ఉపయోగిస్తున్నది.

"ఇక పండుకోరాదూ ?"

"పండుకునేటట్టు లేదిప్పుడు. ఏవిధంగానైనా గెరిల్లాలను పట్టు కొని తీరాలి."

'పుస్సీ' అతను కూర్చున్న కుర్చీ కొనను కూ... ...

వాలింది.

"కర్ట్...."

కోపంతో 'కర్ట్' ప్రక్కకి తిరిగిపోయాడు.

"నీతో యెన్ని చెప్పినా లాభంలేదు!...

"అబ్బ! రాత్రింబగళ్లు అదే ఆలోచనా?" అని గారాబం నటిస్తూ ...

అన్నది. కాని అంతకే 'కర్ట్' ముఖం చూచి అతడు కోపంలో ఉన్నట్టు గ్రహించి తనధోరణి మార్చింది.

"ఐతే, దానికీవిషయాలు తెలుసునన్నట్టు మీకెట్లా తెలిసింది?"

"అదంతా నీకెందుకు? నాకు ఆ విషయాలన్నీ బాగా తెలుసు. నాకు ఆమెసంగతి తెలిసిపోయినట్టు చూచాయగా తెలియజెయ్యి. అప్పటికీ చెప్పక పోయిందంటే; దానిని అరెస్టుచేయించి, ఆ తర్వాత పనిచూస్తాను."

"ఏమిటీ? అరెస్టా?"

"కాకపోతే యేమిటి; నీకు అక్క అయినంతమాత్రాన మాకు వ్యతిరేకంగా పనిచేస్తుంటే చూస్తూ ఊరుకుంటాననుకున్నావా?"

'పుస్సీ' భుజాలు యెగురవేస్తూ అన్నది—

"దానినేంచేస్తేమాత్రం నాది పోయేదేముంది? అంతకూ మీరు వెళ్ళమని పట్టుబడితే, వెళతాను. కాని అది నన్ను గుమ్మంకూడా యెక్క నివ్వకుండా తరిమివేస్తుంది-"

"వీలైనంతవరకు ప్రయత్నించిచూడు."

"నాదేంపోయింది; ప్రయత్నించి చూస్తాను-" అని, మర్నాటి వరకు యేదోవిధంగా ఆ ప్రశ్న దాటవెయ్యటానికి చూచింది. 'కర్ట్'తో యిప్పుడు కీచులాడి యేమీలాభం ఉండదని తెలుసుకున్నది.

"రండి పడుకుందాము."

'కర్ట్' ముందుకి రాబోతుంటే బాల్చీలు కాళ్ళకు తగిలి తూలి పోయాడు.

"ఏదీ, ఆముండ? 'పుస్సీ', నీకు స్నానానికి ఈస్థలంతప్ప మరేదీ దొరకలేదా?"

ఇంతలో 'ఫెడోసియా' వచ్చి కోపంతో పండ్లు నూరుతూ బాల్చీలు తీసుకుపోయింది. 'పుస్సీ' ఆమె ముఖంకేసిచూచి, 'వాస్యా' సంగతి



చెప్పేయాలా అన్నట్టు చిరునవ్వు నవ్వింది. అబ్బే, అప్పుడేకాదు. ఈ ముసిలిముండను ఇంకా కొంతకాలం యిలానే ఏడ్పించాలనుకున్నది.

* * * *

దీపం ఆర్పి 'పుస్సీ', 'కర్ట్' లు పడుకున్నారు. మురికినీళ్ళు బయట పారబోసి రావటానికి 'ఫెదోసియా' బాల్చీలు పట్టుకొని బయలు దేరింది. ద్వారందగ్గర కాపలా కాస్తున్న సైనికుడు ఆమెచేతిలోని బాల్చీలు చూచి ఆటంకం పెట్టకుండా బయటికి పోనిచ్చాడు. గాలి విసురుగా వచ్చి ముఖానికి కొడుతున్నది. ఇంటివెనుక పెంటపోగు దగ్గరికి పోయి బొళ్లన బాల్చీలోని నీళ్ళు దిమ్మరించింది.

"అమ్మా!" అని యెక్కడినుంచో సన్నని శబ్దం వినవచ్చింది.

'ఫెదోసియా' ఉలిక్కిపడ్డది. చేతిలోని బాల్చీలు క్రిందికి జారిపోయాయి. మంచువల్ల కలుగుతున్న కొద్ది వెలుగులో తాను యింతకు ముందు యెన్నోసార్లు చూచిన టోపీ కనబడి విస్తుపోయింది.

"ఎవరక్కడ?"—అని నెమ్మదిగా ప్రశ్నించింది. కాని యెదుటి నుంచి జవాబు రాకముందే, అదియెవరైనదీ గ్రహించుకోగలిగింది. కూలబడి ఆవ్యక్తిని తడమ సాగింది. అతని టోపీలో అయిదు కోణాలుగల నక్షత్రపుగుర్తు చేతికితగిలింది. 'ఫెదోసియా'కి దుఃఖంముంచుకువస్తున్నది.

"ఏమిటి? అట్లాగున్నారేం?" అని ఆ యెర్రసైనికుడు ఆదుర్దాతో ప్రశ్నించాడు.

"నువ్వేనా....నువ్వేనా, తండ్రీ!...." అని ఆమె స్వరం తడబడు తుండగా అన్నది. ఇతంతా ఒక స్వప్నంలాగ తోస్తున్నది. సంతోషము, దుఃఖము ఒకేసారి, ఒక్కుమ్మడిగా వస్తున్నాయి.

"నువ్వేనా!....నాతండ్రీ, నువ్వేనా...."

ఎర్రసైనికుడు ఆమెను భుజాలు పట్టుకొని డీపాడు. ఆ కొద్దికాంతిలోనే ఆమెకండ్ల వెంట నీరు జల జల రాలుతుండటం కనుపించింది.

"ఏమిటిది?"

"అబ్బే, ఏమీలేదు....ఏమీలేదు...." అని తన దుఃఖాన్ని ఆపుకోటానికి ప్రయత్నిస్తున్నది 'ఫెదోసియా'. హఠాత్తుగా ఆమెకు ఇంటిముందు కాపలా కాస్తున్న జర్మను సైనికుడి విషయం గుర్తుకొచ్చింది. ఎర్ర సైనికుని చెయ్యి పుచ్చుకొని—"మాయింట్లో జర్మన్లున్నారు!....వాళ్ళు గ్రామాన్నంతటినీ ఆక్రమించుకొన్నారు...." అన్నది.

"అవును; నాకు గూడా తెలుసును. నీతో కొంతమాట్లాడాలి. నువ్వు ఈగ్రామస్థురాలివేగదూ?"

"అవును—ఇక్కడే పుట్టిపెరిగాను—"

"ఇక్కడి సంగతులెట్లాగున్నవో మాకు తెలియాలి"

"నాయనా, విను. మాయింటి ముందు కాపలాసైనికుడు ఎప్పుడూ ఉంటుంటాడు. ఇక్కడ నేను యెక్కువసేపు ఉన్నట్టు గమనించాడంటే కొంపమునుగుతుంది. ఇప్పుడే యింటికి పరుగెత్తి, మళ్ళీ కొద్ది సేపట్లో ఆ జర్మనువాడి కంటబడకుండా వస్తాను. ఈలోగా నువ్వు ఆ గొడ్లశాల వెనుకకుపోయి అక్కడి గడ్డిచాటున దాక్కొనిఉండు.... నిముషములో వచ్చి పడతాను."

ఎర్ర సైనికుడు ఆమె వైపు అనుమానంతో చూడసాగాడు. ఆమె దానిలోని భావం అప్పుడే గుర్తించేసింది.

"ఏమిటి నాయనా, అట్లా అనుమానిస్తున్నావు? ఇక్కడి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో పనిచేసేదాన్నే నేను. నా కొడుకుగూడా యెర్ర సైనికుడే. అదుగో, యేటిఒడ్డున అతని శవం ఇంకా పడివున్నది. జర్మను కుక్కలు చివరికి సమాధిఅయినా చెయ్యనివ్వకుండా అట్లాఉంచారు—"

ఆమె కంఠంలో ప్రతిధ్వనిస్తున్న దుఃఖం అతనిలో నమ్మకం కలిగించింది. ఆ విధంగా అనుమానపడ్డందుకు కొద్దిగా సిగ్గుపడ్డాడు.

"అమ్మా, క్షమించు. మేము ఇంతజాగ్రత్తగా ఉంటేగాని వీలు పడదు."

"సరే, నువ్వక్కడికి వెళ్లు. ఇప్పుడేవస్తాను"

వణుకుతున్న చేతులతో బాల్చీలు పుచ్చుకొని ఇంటిముఖం పట్టింది. ద్వారందగ్గర కాపలాకాస్తున్న సైనికుణ్ణిచూస్తే నవ్వువచ్చింది. కాని బలవంతంగా ఆ నవ్వుని ఆపుకున్నది. పాపం! ఇంకా కాపలాకాస్తూనే ఉన్నాడు. ఈ దేశంలో యింకా యెంతకాలం తిష్టవేసుకు కూర్చుందామనో!....దగ్గరికి వచ్చిందిలే మీ గతి. మా ఎర్రసైనికులు రాబోతున్నారులే....

'ఫెదోసియా' లోపలికివెళ్ళి, చప్పుడు చేయకుండా తలుపు బిగించుకున్నది. పడుకోడానికి సిద్ధమవుతున్నట్టు లోపలిసామాన్లు అటూ, యిటూ కొద్దిసేపు కదిపింది. ప్రక్కగదిలో జర్మను ఆఫీసరుపెట్టే గురక లనుబట్టి అతడు గాఢమైన నిద్రలోఉన్నాడని తెలుసుకున్నది.

జాగ్రత్తగా ఇంటివెనుక భాగానికి చేరుకున్నది. అక్కడినుంచి పైకి యెగబ్రాకి, ఇంటికప్పులో ఒకచోట గడ్డిలాగివేసి ఇంటిమీదికి చేరుకున్నది. అక్కడ్నుంచి నెమ్మదిగా జారుకుంటూ క్రిందికి దిగింది. అంత ముసలిదైన తాను ఈ విధంగా చేస్తుంటే, తనచర్య తనకే నవ్వును తెప్పిస్తున్నది. వెనుకనుంచి బయటికి దారిలేదన్న నమ్మకంతో కాపలా సైనికుడు ఇంటిముందే తలుపుదగ్గర జాగ్రత్తగా కాపలా కాస్తున్నాడు. ఇట్లానైతే వెనుకనుంచి యెన్నయినా పనులు చేసుకోవచ్చుననుకొని 'ఫెడోసియా' ధైర్యం తెచ్చుకున్నది.

నెమ్మదిగా ప్రాకుకుంటూ గొడ్లశాల దగ్గరికి చేరుకున్నది. కాని అక్కడ యెవ్వరూ కనబడకపోవటంచూచి వెలవెలబోయింది. గొడ్లశాలలో యెవ్వరూ కనుపించటంలేదే? ఇదంతా భ్రమఅయి ఉంటుందా? అవ్వే. యెప్పటికీ కానేరదు—

"అబ్బాయ్. ఎక్కడా?"— అని సన్న స్వరంతో పిలిచింది.

గొడ్లశాలలోని గడ్డి కదిలింది. అదుగో అక్కడున్నాడు! ఒక్కడే కాదు. ముగ్గురున్నారు!! ఆమెకు పట్టలేని సంతోషం కలిగింది. ఆ ముగ్గురితోపాటు తానుకూడా కూర్చున్నది.

"మీకోసం రాత్రింబగళ్లు యెంతగా కాసుకు కూర్చుంటున్నాము! చివరికి వచ్చారు.... వచ్చేశారు" అన్నది ఆనందంతో.

"సరేనమ్మా; ఇంకా మాట్లాడవలసినవి అనేకం ఉన్నాయి."

"తప్పకుండా అడగండి, చెబుతాను. కాని మీకు ఆకలివెయ్యటంలేదూ?" అని హఠాత్తుగా తన అతిథి ధర్మాన్ని గుర్తుకి తెచ్చుకున్నది.

ఎర్రసైనికులు ముగ్గురు నవ్వుకున్నారు.

"నీ ప్రేమకు ధన్యవాదాలుగాని, ఇప్పుడు మేము తింటూ కూర్చోటానికి రాలేదు."

"అయితే, మీ ప్రశ్నలడగండి."

"నీది ఈ గ్రామమేగదూ?"

"అవును; ఇక్కడె పుట్టి పెరిగాను."

"ఇక్కడి సంగతులన్నీ మాకొక తడవ తెలియజేయాలి....జర్మన్లు యెక్కడెక్కడ ఉంటున్నారు? వాళ్ళ మందుగుండుసామాను మొదలైనవి యెక్కడ దాచిఉంచుతున్నారో తెలియజెయ్యగలవూ?"

"మనవాళ్లు వచ్చేటట్టేనా?" అని సంతోషం పట్టలేక అడిగింది.

"అవును - కాని వివరాలన్నీ ముందు బాగా తెలియాలి."

"అయితే, వినండి. గ్రామంలో మూడువందల గడపవరకు ఉంటుంది. నాలుగువైపులకు పోయే రోడ్లు ఈగ్రామంలోనే 'చర్చి' దగ్గర కలుస్తాయి."

"కొద్దిగా, ఆగమ్మా."

ఒక మ్యాపువిప్పి, ఎర్రసైనికులు ముగ్గురూ దానిమీదకి వంగి వెలుతురు బయటికి కనబడకుండా తమ కోట్లు కప్పి, ఒక టార్చిలైటు వెలిగించారు.

"అవును; రోడ్లు కలుస్తున్నచోటు యిదే! ఊరి మధ్య 'చర్చి' అంటే యిక్కడేనన్నమాట...."

"ఆ చర్చిదగ్గరే వాళ్ళ ఫిరంగులు ఉంచుతున్నారు."

"ఎన్నుంటాయి?"

"ఉండండి చెబుతాను. ఒకటి....రెండు....మూడు....నాలుగు. అవును, నాలుగు. చర్చికి సమీపంలో ఒక పెద్ద యిల్లు ఉన్నది. మునుపది గ్రామసోవియట్ కార్యాలయంగా ఉంటుండేది. ఇప్పుడు ఐదుగురు జామీను ఖైదీలను అందులో బంధించారు...."

"జర్మన్లు ఇంకా యెక్కడెక్కడున్నారు?"

"చర్చికి సమీపంలో అన్ని యిండ్లల్లోను ఉన్నారనే చెప్పాలి. ఊరిచివరి యిళ్ళల్లో అంతగా లేరు. కాని పూర్తిగా లేరనటానికిగూడా వీల్లేదు. మాయింటి సమీపంలో అక్కడక్కడా ఉన్నారు. ఇటువైపు గూడా ఫిరంగులు ఉన్నాయిగాని, అవి చాలా చిన్నవి...."

"మెషిన్ గన్నులు యేమైనా ఉన్నాయా?"

"లేకేం? అటుభాగం— ఎడమవైపు— వాటిని అమర్చారు. ఇండ్ల గోడలకు రంధ్రాలుచేసి వాటివెనుక మెషిన్ గన్నులు అమర్చిఉంచారు."

ఎర్రసైనికుల్లో ఒకడు 'మ్యాపు' మీదికివంగి యేవేవో గుర్తులు పెట్టుకున్నాడు.

"ఆ యిండ్లల్లోంచి ముందున్నవాళ్ళనందర్నీ తోలేశారు. ఇప్పుడు ఒక్క జర్మన్లుమాత్రమే ఉంటున్నారు. ఉండండి. చెబుతాను.... అయిదిళ్ళల్లో యీ విధంగా అమర్చుకొని ఉన్నారు. ఇటునుంచి ఊరిమధ్యకు పోయే మార్గంలో ఒకచోటగూడా ఈ విధంగా ఉన్నారు—"

"చాలామంది ఉంటారా ?"

"చెప్పటం కష్టం....అక్కడికివస్తూ, పోతూఉంటారు. కెప్టెన్ మాత్రం యెప్పుడూ అక్కడే ఉంటాడు. సుమారు రెండు వందలవరకు ఉంటారని వినికిడి."

"గస్తీ సైనికులు చాలామంది ఉన్నారా ?"

"అబ్బే, వాళ్ళవిషయం అంతకష్టంలేదు. మా యింటిముందున్న కాపలా సైనికుడిలాగే ఒక్కడూ గుమ్మంవదిలి దూరంపోడు. అందులోను రాత్రుళ్ళంటే అసలే హడలు. పైగా రాత్రిపడింతర్వాత గ్రామస్థులు యెవ్వరూ వీధుల్లో తిరుగరాదన్న ఆజ్ఞ ఉండనే ఉన్నది. అయినా, వాళ్ళకు భయమే. రాత్రిళ్లు యెవరైనా కనబడినట్టయితే, "వచ్చేదెవరు" అని అడగనైనా అడగకుండా కాల్చిచంపేస్తారు....అంతభయం !"

"రోడ్డుకి మధ్య వంతెనలేమైనా ఉన్నాయా ?"

"వంతెనలా ? ఉఁహుఁ. సాపైనరోడ్డే"

"మధ్య యెక్కడైనా చెట్లు దట్టంగా ఉన్నాయా ?"

"అబ్బే. యెక్కడిదీ ? ఉన్నచెట్లుకాస్తా చలిమంటలకోసం జర్మన్లు పడగొట్టనే పడగొట్టేశారు. అక్కడక్కడ పొదలు మాత్రం ఉంటాయి" అని చెబుతూ, యెందుకో జడిసి చుట్టూ, చూడసాగింది.

"ఏమిటీ సంగతి ?"

"ఉండండి; కాపలా సైనికుడు ఇటు యింటివెనుకకుగాని వచ్చేడేమో చూస్తాను" అని ఆమె నెమ్మదిగా బయటికివెళ్ళి జాగ్రత్తగా విన్నది. గాలి జోరుగా వీస్తున్నది. కొద్దిగా గాలి తగ్గినప్పుడు మాత్రం కాపలా సైనికుడి బూట్లచప్పుడు ఇంటిముందునుంచి వినిపిస్తున్నది. 'ఫెడోసియా' తిరిగి గొడ్లశాలలోకి చేరుకున్నది.

"ఫరవాలేదు; ఇంకా అటే ఉన్నాడులెండి"

ఎర్రసైనికులు తమ మ్యాపును మడుచుకున్నారు.

"ఇకమేము వెళ్ళాలమ్మా ! నీ సహాయానికి చాలా కృతజ్ఞులం"

"ఎందుకూ ?....నా కొడుకుమాత్రం ఎర్రసైనికుడుకాదా ? మొన్న మొన్ననే యిక్కడ చచ్చిపోయాడు....ఇంతకూ యెప్పుడు వచ్చేటట్టు ?"

"ఇంకా చూడాలి.... పరిస్థితులనుబట్టి, ఆపైన 'కమాండరు' నిశ్చయాన్నిబట్టీ ఉంటుంది."

"పరిస్థితులేమిటి? మీకోసం చూచీ చూచీ మాకండ్లు కాయలుకాసి పోతున్నాయి. మీరు వచ్చే స్తిరంటే.... "

"అంత సులభమైన పనికాదమ్మా."

ఆమెకు హఠాత్తుగా ఒకవిషయం జ్ఞాపకానికి వచ్చింది.

"ఇంకోసంగతి చెప్పటమే మరిచిపోయాను.... "

"ఏమిటి?"

"వాళ్ళ 'కమాండరు' తన ఉంపుడుకత్తెతోపాటు నాయింట్లోనే ఉంటున్నాడు. కాపలాసైనికుణ్ణి యిట్టే చంపేసి లోపలికి రావచ్చు. అంతగా కాకపోతే, ఇప్పుడు నేను వచ్చినట్టు ఇంటికప్పులోంచి వెళ్ళి వాడిపని పూర్తిచేయవచ్చు."

ఆ ముగ్గురు ఎర్రసైనికుల్లో చిన్నవాడికి పట్టలేని ఉద్రేకం కలిగింది. కళ్ళు మెరిసినై.

"ఇంకేం, పదండి!"

"ఆగండి! ముందువిషయం యేమైనా ఆలోచిస్తున్నారా లేదా.... "

"ఇంకా ఆలోచించేదేముంది, ఆ నీచుణ్ని అంతమొందించక -"

"మహా తెలివి ఉపయోగించావులే! వాణ్ని చంపాక?.... మర్నాడు అంతా గందరగోళం - ఇంకా యెక్కువమంది జర్మన్లు యీ గ్రామనికి చేరుకోటం జరుగుతుంది. అంతటితో మనం వేసుకున్న యెత్తులన్నీ నాశనం.... "

"అదీ నిజమే. ఐతే.... "

"ఇప్పుడు వాళ్ళు యెంత జాగ్రత్తలో ఉన్నారో గ్రహించుకోటం లేదూ? ఈసమయంలోగాని వాళ్ళని గాభరాపెట్టామంటే, అన్నీ మనకు యెదురుతిరుగుతాయి"

"కాని ఆ నీచుణ్ని చంపితీరాలి!"

"ఇంకొకప్పుడు చంపక మానతామా? ఇప్పటిమట్టుకు జాగ్రత్తగా యింటికి తిరిగిపోవటం మంచిది."

"మీ యిల్లెక్కడ?" అని 'ఫెదోసియా' అడిగింది.

"ఏదోమాటవరసకి యిల్లని అంటామమ్మా. అసలు మాయిళ్లు చాలా దూరదేశాల్లో ఉన్నాయి. ఈ యుద్ధసమయంలో ఇల్లు అంటే

మా సైనికకార్యాలయమేనని మా అర్థం.... మాకు వెళ్ళిపోటానికి దారి చూపించు. ఇందాక వచ్చేటప్పుడు మంచులో కూరుకుపోయి చాలా అవస్థలు పడ్డాము- ''

'' తప్పక చూపిస్తాను. అదుగో ఆ యేటిఒడ్డునే వెళ్ళాలి. మధ్య యెర్రసైనికుల శవాలు పడిఉంటాయి. జాగ్రత్తగా వెళ్ళండి. ఇంకా ముందుకి పోయారంటే 'ఓఖది', 'జెలిన్‌టిసి' అని రెండు గ్రామాలు తగులుతాయి. కాని అక్కడగూడా యిదేవిధంగా జర్మన్లు చేరారు. ''

'' అదంతా మాకుతెలుసులే. ఈ మధ్యలో యెవ్వరూ తటస్థపడ కుండా ఉండేచాలు. ''

'' ఏమీ భయపడనక్కరలేదు. మా యింటిముందు ఉన్నవాడే గస్తీ సైనికుల్లో ఆఖరివాడు. ఆ తర్వాత యెవ్వరూ ఉండరు. కాని నడవటం మట్టుకు బహుజాగ్రత్తగా నడవాలి ''

ఆమెతోపాటు ఆ ముగ్గురు జాగ్రత్తగా బయలుదేరారు.

'' అదిగో, ఇటుదిగిపోవాలి. జాగ్రత్తగానడవండి. అటు అంతా జారుడుగా ఉంటుంది. ''

'' సరే వెళ్ళొస్తామమ్మా. నీ సహాయానికి చాలా కృతజ్ఞులం. ''

'' తొందరగా తిరిగి రావాలిసుమా! ''—అని తన ఆదుర్దాని కన బర్చింది, 'ఫెడోసియా.'

'' ఇక యింటికి వెళ్ళమ్మా. చలి యెక్కువవుతున్నది. వీలైనంత త్వరలో వచ్చి వాలుతాము ''

'' అంటేకాదు; వచ్చితీరాలి ''

ఆ ముగ్గురు ఎర్రసైనికులు వెళ్ళటంచూస్తూ అక్కడేనిలబడి పోయింది 'ఫెడోసియా'. తెల్లనిదుస్తులు ధరించిఉన్న ఆ యెర్రసైనికు లను మంచుమధ్య గుర్తించడమే కష్టంగాఉన్నది. కొంతసేపటికి మంచు మధ్య మాయమై పోయారు. వాళ్ళతో గడిపిన ఆ కొద్దినిముషాలు జైలు లోంచి బయటపడ్డదానిలాగ ఆనందపడ్డది 'ఫెడోసియా'. వారు వెళ్ళి పోవడంతోటే జైలుగోడలు మళ్ళీ తనచుట్టూ యేర్పడినట్టుగా ఉన్నది.

'ఫెడోసియా' మళ్ళీ యెప్పటివిధంగా యింటికివచ్చి చేరుకున్నది. 'కర్ట్' పెద్దగా గురకలు పెడుతూ నిద్రపోతున్నాడు. 'పుస్సీ' నిద్రలో యేదో కలవరిస్తున్నది.

'మీకిక మూడిందిలే. మా యెఱ్ఱసైనికులు వస్తున్నారులే' అని తనలోతాను అనుకుని ఆనందపడ్డది.

ఎంతప్రయత్నించినా 'ఫెడోసియా'కి నిద్రపట్టటంలేదు. ఎఱ్ఱసైనికులువచ్చి తమగ్రామాన్ని జర్మన్లనుండి విడిపించేవరకు ఆమెకు నిద్రపట్టేటట్టులేదు. ఏమో? ఇప్పుడు వచ్చినట్టు తనకోసం యేసమయంలో వచ్చేస్తారో? అప్పుడు తను మెలుకువతో ఉండకపోతే యెంతప్రమాదం! వాళ్ళకు తగినసహాయం చెయ్యకపోతే యెట్లా?—

'ఫెడోసియా'కి ఇప్పుడు మునుపటికంటే ఆరాటం యెక్కువయింది. ఇంతకుముందు అందరితోపాటు తానుగూడా ఎఱ్ఱసైనికులు వచ్చి తమను జర్మన్లబారినుండి విడిపిస్తారని నమ్ముతూనేఉన్నది. అంతేగాని, వాళ్లు యెప్పుడువచ్చేది తెలియదు. అందరితోపాటు తానుగూడా నిరీక్షిస్తూ ఉండేది. కాని ఇప్పటి సంగతివేరు. ఎఱ్ఱసైనికులు రావటం నిర్ధారణగా తేలిపోయింది. అందులోను రెండుమూడురోజుల్లోనే రావచ్చునేమో? ఆమె మనస్సు ఆనందంతో నిండిపోయింది. ఆ వార్త గ్రామస్థులందరికీ ఎలుగెత్తిచాటి, తనతోపాటు వాళ్ళందరుకూడా ఆనందపడుతుంటే చూడాలనిపిస్తున్నది కాని అలా చేస్తే యింకేమున్నా ఉన్నదా! అన్నీ తలక్రిందులైపోవూ? ఆ భయంతోనే యెంతో ప్రయత్నంమీద నోరు నొక్కుకు కూర్చుంటున్నది—

....కాని మూడురోజుల్లోపల ఎఱ్ఱసైనికులు రాగలరా? అలా వస్తేగాని లాభంలేదు. ధాన్యం యివ్వకపోతే, జామీనుగా బంధించిన అయిదుగురినీ మూడోరోజున చంపేస్తామని ప్రకటించారు జర్మన్లు. అప్పటికల్లా వచ్చెయ్యాలి. లేకపోతే ఆ అయిదుగురు అన్యాయంగా ప్రాణాలు వదలవలసి వస్తుంది....

ఐయినా ఈమూడురోజుల్లో మాత్రం ఎన్నిజరుగకూడదు? గ్రామస్థులు ఎన్నోబాధలు పడుతూ వారి కొరకు నిరీక్షిస్తున్నారు. వచ్చేస్తే యీ మూడురోజుల్లోపలే వచ్చెయ్యవచ్చు. ఏక్షణాన్నవచ్చి వాలుతారో యెవరు చెప్పగలరు? కన్ను మూతవెయ్యకుండా యెదురుచూస్తుండాలి! వాళ్ళు వచ్చేవరకూ వెయ్యికళ్ళు — వెయ్యి చెవులు చేసుకొని పనిచేస్తుండాలి!....

* * * *

ఆనాడు గ్రామాధికారి గాప్లిక్ చాలా రాత్రివరకు సైనిక కార్యాలయంలో పనిచేస్తూ కూర్చున్నాడు. సమిష్టి వ్యవసాయక్షేత్రంవారి చిట్టా

లను ఆధారంగా చేసుకొని గ్రామస్థులలో యెవరెవరు యెంతెంత ధాన్యం ఇవ్వవలసి ఉంటుందో వివరాలు తయారుచేస్తున్నాడు. జర్మను సార్జెంటు అతనికి సహాయంచేస్తున్నాడు. 'గాప్లిక్' కూడికల్లో తప్పులు చేస్తుంటే జర్మను సార్జెంటు తిడుతున్నాడు. దీపం గుప్పు గుప్పు మంటూ పొగ పట్టిపోతున్నది.

తనమనస్సు, తయారుచేస్తున్న ఆ లెక్కలమీద లగ్నంచేయాలను కుంటున్నాడు 'గాప్లిక్'. కాని లాభంలేకుండా ఉన్నది. ఇన్ని లెక్కలూ తయారుచేసి చివరికి వ్యర్థమైపోతుందేమోననిపిస్తుంది, అతనికి. ఇలాంటి వెన్ని తయారుచేయటమన్నా సులభమే. కాని వీటితో ఈ జర్మను కెప్టెన్ తృప్తిపడడుగా, వాడికి కావలసింది ధాన్యం. గ్రామస్థుల్లో ఒక్కరయినా ధాన్యం యిస్తారని అతనికి నమ్మకం కలుగటంలేదు. తాను ఇన్ని చేసిన పిమ్మటగూడా, ధాన్యం దొరక్కపోయిందంటే, దీని కంతటికిగూడా తననే బాధ్యుడ్ని చేస్తాడు ఆ జర్మను కెప్టెన్. వాడు తలుచుకుంటే యేమైనా చేయగలడు.

ఐదుగురిని అరెస్టుచేసి బెదిరించినప్పటికీ ప్రజలు లొంగివచ్చే సూచనలేమీ కనబడటంలేదు. ఇంతమట్టుకి ఆ పిల్లవాడిశవం యెవడు యెత్తుకుపోయినదిగాని, ధాన్యం యెక్కడ దాచిపెట్టినవిషయంగాని తెలియ జేయటానికి ఎవ్వరూ రాలేదు. ఈవిధంగా ప్రజలు దేనికీ లెక్కచేయ కుండా ఉంటే, తానుమాత్రం యేంచేయగలడు. అందుకే 'కర్ట్' తనని పట్టుకొని, అన్నిటికీ తననే బాధ్యుడ్నిచేస్తున్నాడు.

"ఏమిటీ వెధవవ్రాత ? అంతా పాడుచేసి వదిలావు. సరిగ్గా పని మీద మనస్సు ఉందా లేదా ?" అని జర్మను సార్జెంటు అరిచేడు.

'గాప్లిక్' దీనికి జవాబుగా విధేయతను సూచిస్తూ ఒక చిన్న నవ్వునవ్వాడు. తన మనస్సు పనిమీద యెందుకు లగ్నం కాలేకపోతున్నదో యేంచెప్పగలడు ? కాగితం మీదికి వంగి గబ గబ వ్రాసుకొన సాగాడు.

చివరికి లెక్కలన్నీ ముగించారు. ఇంటికి పోవటానికి 'గాప్లిక్' తయారయ్యాడు. బయట గాలి జోరుగా వీస్తున్నది. బయలు దేరటానికి 'గాప్లిక్' సంశయిస్తున్నాడు.

"బయట నన్నెవరన్నా చూస్తారేమో?"—అన్నాడు చివరికి. అతని యింటిముందు గస్తీ సైనికుడు ఉన్నమాట నిజమే. కాని ఇంటి వరకు వెళ్ళేలోపుగా గ్రామమధ్యస్తం లోంచి కొంత దూరం నడవాలి.

"ఇంటికి పోటానికే భయమా? అయినా 'కెప్టెన్' ఆజ్ఞలేనిదే నీకు సహాయంగా సైనికుల్ని పంపటానికి వీలుండదు" అని భుజాలు యెగుర వేస్తూ జవాబు చెప్పాడు సార్జెంటు.

"పోనీ, అక్కడివరకు మీరయినా–" అని జంకుతూ అన్నాడు 'గాప్లిక్'

"ఏమిటీ, నన్నే రమ్మంటావూ? కేంద్ర కార్యాలయంవారు యే నిముషాన్నయినా టెలిఫోనులో పిలువవచ్చు. నాపని వదులుకొని నీతో వచ్చేదా?—అసలు నీకు భయమెందుకోయ్?.... ఈరాత్రిపూట యెవ్వరూ బయటికి రారులేవోయ్...." అని మండిపడ్డాడు, సార్జెంటు.

మారుమాట చెప్పటానికి ధైర్యం చాలక 'గాప్లిక్' నెమ్మదిగా బయటికి జారుకున్నాడు.

వెలుగులోంచి రావటంచేత అంతా మరీ చీకటిగా ఉన్నది. కండ్లు ఆ చీకటికి అలవాటుపడేవరకు కొద్దిసేపు గడపదగ్గర నిలబడ్డాడు. మసక మసకగా దారికనబడటం ప్రారంభించాక ఇంటివైపు బయలుదేరాడు. చివరికి జర్మన్లు తనను కుక్కకన్నా నీచంగా చూస్తున్నారే అని విచారపడ సాగాడు. ప్రతి జర్మను వెధవా తనమీద కేకలువేసేవాడే! తాను గొడ్డు లాగ పనిచేస్తున్నప్పటికి సాధారణ సైనికుడు మొదలు అందరికీ లోకువే!.... భయంతో చీకట్లో చుట్టూ చూచుకున్నాడు.

రాత్రుళ్లు యెవ్వరూ బయటికి రాగూడదంటూ యెన్ని శాసనాలు ఉంటేమాత్రమేం? ఈ అర్ధరాత్రపు ఊళ్లో యెటువంటి ఘోరాలన్నా జరుగుతాయి. చివరికి సార్జెంటుకికూడా భయమే. అది చెప్పలేక పైగా యేదో ఒక సాకుచెప్పి తనతోరాకుండా తప్పించుకున్నాడు.

చప్పుడుకాకుండా జాగ్రత్తగా వెళ్ళటానికి ప్రయత్నిస్తున్నాడు. కాని కాళ్ళక్రింద మంచు నలుగుతున్న చప్పుడు అవుతూనే ఉన్నది. 'గాప్లిక్' ఆ చప్పుడు గ్రామమంతా ప్రతిధ్వనిస్తున్నట్టనిపిస్తున్నది. హఠాత్తుగా యెవరో సందుమలుపులో నిల్చున్నట్టనుపించింది. నిలువునా నీరైపోయి నిల్చుండిపోయాడు. ఆనీడ కదులుతున్నదేమోనని జాగ్రతగా చూడసాగాడు- ఏమిచెయ్యటానికి తోచటంలేదు.

తిరిగి సైనిక కార్యాలయానికే వెళ్ళిపోయి రేపు ప్రొద్దుట ఇంటికి వెళదామనుకున్నాడు. కాని వెనక్కి తిరిగితే ఆ నిల్చున్నవారు మీదికి ఉరికితే!....

చివరికి మొండి ధైర్యంతో ముందుకే అడుగువేశాడు. అరి!- ఆనీడ కనుపించేది చెట్టుపొదయేనా! పగలు అనేకసార్లు ఆదారిని పోతూ ఆపొదను చూస్తుండేవాడ్ని ఈనాడు జ్ఞాపకంలేకపోయిందే అనుకున్నాడు.

ఇంతలో 'గాప్లిక్' కాలుజారింది. ఏదో భయంకరమైన ముప్పు వచ్చిపడ్డదని అదేక్షణంలో గుర్తించాడు. ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నాడు. నోరు, కళ్లు బంధింపబడ్డాయి. గట్టిగా కేకలు పెట్ట టానికి ప్రయత్నించాడుకాని లాభంలేకపోయింది. నెత్తిమీద ఒక దెబ్బ పడ్డది - తనను అమాంతంగా యెవరో యెత్తుకు పోతున్నట్టు గుర్తించాడు. తలుపుతెరిచిన శబ్దం!.... క్రింద దభాలున కూలవేశారు. అంత లోనే కాళ్ళు చేతులు బంధించివేయటం జరిగింది!——

'గాప్లిక్' ముఖంమీద కప్పబడ్డగుడ్డ తొలిగిపోయింది. బిత్తర పోతూ అంతా చూడసాగాడు. మిణుకుమిణుకుమంటున్న దీపపుకాంతిలో కొందరు వ్యక్తులు కనబడ్డారు. అందులో గుఱ్ఱాల కాపరి అయిన 'అలెగ్జాండర్'ని, 'ఫ్రోస్యా గ్రోఖచ్'ని గుర్తుపట్టాడు. నిలువునా వణికిపోవటం మొదలు పెట్టాడు.

'గాప్లిక్'కి తెలియని ఒక స్త్రీ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ అన్నది.

"అలెగ్జాండర్! నీకు వ్రాయటం వచ్చుగాబట్టి, ఇక్కడ జరుగ బోయేవన్నీ వివరంగా వ్రాతలో తీసుకోవలసివస్తుంది."

అందరూ టేబిలుముందు కూర్చున్నారు. భయంతో 'గాప్లిక్' వడవడ వణికిపోతున్నాడు. దీపపుశిఖ కొట్టుకుంటుంటే, వారి ముఖాల మీద నీడలు నాట్యమాడుతున్నాయి.

"ఏయ్, నిలబడు. నువ్విప్పుడు న్యాయాధిపతుల ముందున్నావని తెలుసుకో" - అని అన్నది అందులో ఒక స్త్రీ.

భయంతో చాలా ప్రయత్నంమీద లేచి నిల్చున్నాడు.

"సరిగ్గా నిలబడరా, నీచుడా!.... ఎందుకంతభయం? మగాడివి, ఆమాత్రం ధైర్యంలేమా?"

"అబ్బే, అది వాడిశక్తికి మించిన విషయం" అన్నది 'ఫ్రోస్యా'.

"వాడు నిలబడితీరాలి. ఇది న్యాయస్థానంగాని, మరేమీకాదు. ఆమాటకువస్తే, ఇందాక అక్కడే చంపిపారేస్తే పీడావదిలిపోయేదిగా? అన్నీ న్యాయంగా విచారించదలుచుకున్నప్పుడు, అన్నీ సక్రమంగా జరగా ల్సిందే!" - అని 'పెర్ఫిలిఖా' పట్టుపట్టింది.

'గాప్లిక్' మరీ వణికిపోతున్నాడు జర్మను సైనికకార్యాలయానికి సమీపంలోఉన్న ఒక పూరిఁట్లోనే తనకీగతి పట్టిందే!.... అక్కడ చేరిన ఆ నలుగురు స్త్రీలు, ఆకుంటి గుడ్డాల కాపరి న్యాయాధిపతులట!.... తనను విచారిస్తారట! జర్మన్లచేత గ్రామధికారిగా నియమింపబడ్డ తాను, ఈ ఆడముండలముందు నోరు మెదపలేక వణుకుతూ నిలబడవలసి వచ్చింది!.... కలగాదు - వాస్తవం!!....

"సరే, నీపేరేమిటో చెప్పు?" అని 'పెర్ఫిరిఖా' ప్రశ్నించింది.

జవాబు చెప్పాలనుకున్నాడు 'గాప్లిక్'. కాని గొంతులోనిమాట పెగలటంలేదు. అస్పష్టంగా యేదోగొణిగాడు.

"ఏం? ఆటలాడుతున్నావా? ఆ ఆటలన్నీ కట్టిపెట్టి సరిగ్గా జవాబు చెప్పు.... అలెగ్జాండర్! నువ్వు అన్నీ వివరంగా వ్రాస్తున్నావా, లేదా?....సరే, చెప్పవోయ్ నీపేరు?"

"మీకుబాగా తెలిసిందేగా...." అని గొణిగాడు 'గాప్లిక్'.

"అది విన్నదగలేదోయ్. ఇది న్యాయస్థానమన్న తర్వాత, అడిగే ప్రశ్నలకన్నిటికీ సరిగ్గా జవాబుచెప్పాలి"

"గాప్లిక్. పీటర్."

"పీటరేనా?.... మానాన్న పేరుగూడా పీటరే. ఆ పవిత్రనామాన్ని మలినం చేశావుగదరా!...."

"ఉండు. 'గార్పినా' అత్తయ్యా! సరిగ్గా వ్రాయనివ్వు...."

"వ్రాయి.... త్వరగా వ్రాయి. తర్వాత యేమిటి? ఆఁ....నీవయస్సెంత?"

"నలభై యెనిమిది -"

"నలభై యెనిమిదా? ఇంతకాలం నీభారాన్ని భూదేవి యెట్లా మోస్తూవచ్చిందో తెలియదు!.... అలెగ్జాండర్, వ్రాశావాలేదా?...."

"అప్పుడే వ్రాశాను. తర్వాత కానివ్వు."

"తర్వాతేమిటి?.... ఆఁ.... నిన్ను గ్రామాధికారిని చేశారుగదూ?"

"అవును"

"గొప్ప గ్రామాధికారివేలే?.... అంతకుముందు యేం చేస్తుండేవాడివి?"

'గాప్లిక్' దీనికి జవాబుచెప్పలేదు. చూపులు నేలకివాల్చాడు.

"ఏమి? చెప్పటానికి సిగ్గువేస్తున్నదా? మునుపు ఇంతకంటే కూడా నీచపు పని చేస్తుందేవాడివన్నమాట."

అప్పటికిగూడా జవాబుచెప్పలేదు. తన బూట్లకేసి చూచు కుంటున్నాడు.

"చెవులు మెలవేసేవరకు మాట్లాడేట్టులేవే? చెబుతావా లేదా?"

"ఉండత్తయ్యా! నేనడుగుతాను" అని 'అలెగ్జాండర్' మధ్య కల్పించుకొని వచ్చాడు

"సరే నువ్వే ఆబాధపడు" అని ఆమె తనకిష్టంలేకపోయినా 'అలెగ్జాండర్' మీద వదిలేసింది.

అతనిని జాగ్రత్తగా పరిశీలిస్తూ నెమ్మదిగా అడిగాడు 'అలెగ్జాండర్'

"జైల్లో ఉన్నావా?"

'గాప్లిక్' చూపులు యింకా భూమిమీదనే ఉన్నాయి.

"చాలాకాలం ఉన్నావా?"

"ఆఁ. చాలాకాలం."

"ఎంతకాలం?"

మళ్ళీ మౌనమే—

"జైల్లో ఎందుకు పడ్డావు?"

దీనికిగూడా జవాబు రాలేదు.

"నువ్వు రైతువా, కార్మికుడివా లేక యేదైనా ఉద్యోగం చేస్తుండే వాడివా—చెప్పు?"

"రైతుని"

"ఓహో, కులక్‌వా?"

"ఐతే నువ్వు కులక్‌వన్నమాట! ఇంతకుముందు రైతులరక్తం పీల్చుకుత్రాగిందికాక, మళ్ళీ పీల్చుకుతాగవచ్చు ననుకున్నావేం?"— అని 'ఔర్ఫిలిఖా' ఉద్రేకంతో అన్నది.

"కొద్దిగా ఆగవమ్మా...."

"ఎందుకాగాలి? ఇదిన్యాయస్థానం అయినప్పుడు నీకెంత హక్కున్నదో, నాకూ అంత హక్కుఉంటుంది!"

"అబ్బే. నీకు హక్కులేదని కాదమ్మా. నేను వేస్తున్న ప్రశ్నలు ముందు కానివ్వు."

"సరే అడుగువాడ్ని...."

"జైలునుంచి యెప్పుడు పారిపోయావు ?"

"యుద్ధం ప్రారంభమైనాక"

"ఇంటికి పోదామనేనా ?"

"అవును"

"ఎక్కడా నీ 'ఇల్లు'?"

"రోస్టావ్ దగ్గర—"

"ఓహో రోస్టావ్ దగ్గిరా ?—ఐతే జర్మన్ల నెక్కడ కలుసుకున్నావు ?"

"అక్కడే, రోస్టావ్ దగ్గర—"

"అక్కడే నిన్ను వాళ్ళు తమలో ఒకడిగా చేర్చుకున్నారన్న మాట"

"అవును"

"ఆగు. కొద్దిగా ?.... 'అలెగ్జాండర్', వీడు జైల్లో యెందుకు పడిందీ తెలుసు కోవాల్సి ఉంటుంది"

"ఎమోయ్ ? ఎందుకు జైల్లో పడ్డావు ?"

ఈ ప్రశ్నకు గాప్లిక్ జవాబివ్వలేదు.

"కులక్‌ల హక్కులు తొలగించిన కాలంలోనేనా నువ్వు జైల్లో పడింది ?"

"అవును"

"అయితే, పెట్‌లియురా" తో నీకు సంబంధం ఉన్నదా ?

"ఊఁ"

"'పెట్‌లియురా' తో గూడా సంబంధం ఉన్నదట !" అని 'పెర్ఫిలిఖా' ఆశ్చర్యపోయింది.

"ఇప్పుడంతా తెలిసిందిలే. 'కులక్' వర్గానికి చెందిన 'పెట్‌లియూరా' బందిపోటుగాడి అనుచరుడివన్నమాట ! మొదటినుంచీ నువ్వు సోవియటు రాజ్యానికి వ్యతిరేకివేనన్నమాట—"

"ఊఁ" అని అంగీకరించేడు 'గాప్లిక్'

"చివరికి ఈ జర్మన్లతో చేరావూ...."

'పెర్ఫిలిఖా' కోపంపట్టలేక ఒక్కగంతువేసి లేచింది.

"వీడిమూలంగానే 'లివాన్యుక్' ఉరితీయబడ్డాడు. వీడి మూలంగానే ఆ అయిదుగురు అరెస్టుచేయబడ్డారు. వీడే స్వయంగా అందరి ఇండ్ల

ల్లోంచి జర్మన్లకోసం పశువులను తోలుకుపోయాడు. నా పిల్లలగతి యేమైతేమాత్రం వీడికేం? ఉన్న ఒక్కఆవునూ వాడి అబ్బసొమ్ములాగ తోలుకుపోయాడు।"

"జర్మన్లు గ్రామాన్నంతాదోచుకోటానికి సహాయపడ్డవాడు వీడే।"

"సరే, మీ ఉద్రేకాలు అణుచుకోండి. ఇంకా యేమేమి చెప్పదలచుకున్నారో నెమ్మదిగా చెప్పండి" అని అందరికంటే యెక్కువగా గలభా చేసిన 'పెర్పిలిఖా' యే చివరికి అన్నది.

"ఇంకా చెప్పేందు కేమున్నది?.... అందరికీ తెలిసిన విషయమే నాయెను. వీడిమూలంగా రోజురోజుకి యెంతమంది నాశనమై పోతున్నదీ అందరూ చూస్తున్నదేగా...."

"అయితే, యేమి నిశ్చయించారు?"—అని 'పెర్పిలిఖా' అందర్నీ అడిగింది.

"ఆ విషపాతకుడ్ని చంపెయ్యాలి!"

"వాడిప్రాణాలు తీసెయ్యాలి।"

"సరే, కామ్రేడ్సు, ఈ విషపాతకుడ్ని చంపివేయాలని ఉపపాదన వచ్చింది. దీనికి యెంతమంది అనుకూలురో చేతులెత్తండి"

అందరిచేతులూ పైకి లేచినాయి.

"ప్రతికూలురు?"

"ఎవ్వరూలేరు"

"ఐతే నిశ్చయమై పోయి నట్టేనన్నమాట. సరే, అలెగ్జాండర్। అంతాపూర్తిగావ్రాసి చదువు...."

'అలెగ్జాండర్' చాలాసేపటివరకు కాగితంమీద వ్రాస్తూ కూర్చున్నాడు. స్త్రీ లందరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. చివరికి వ్రాత పూర్తిచేసి నిలబడి చదవటం ప్రారంభించాడు 'అలెగ్జాండర్.'

"అలెగ్జాండర్ ఓవిస్సి, గార్పినా పెర్పిలిఖా, ఫ్రోస్యాగ్రోఖాచ్...."

"ఫ్రోస్యాకాదు, యుఫ్రోసినా...."

ఈ పొరపాటు కాగితంమీద దిద్దుకున్నాడు 'అలెగ్జాండర్'

"....యుఫ్రోసినా గ్రోఖాచ్, నట్టల్యా లిమెష్ మఱియు 'పిలెగియా పుజయర్' లతో కూడుకొన్న ఈ న్యాయస్థానంవారు పీటర్ గాప్లిక్ అను నేరస్థుని విచారించి, నేరస్థుడని నమ్మకం కలిగినమీదట మరణదండన విధింపవలసినదిగా నిశ్చయించినారు"

ఈ మాటలువింటుంటే గాప్లిక్ ముఖం వెలవెలబోయింది. చలనం లేకుండా నిలబడి, అందరివైపూ పిచ్చిచూపులు చూస్తున్నాడు.

"అంతా సక్రమంగా ఉన్నట్లేనా?" అనిఅడిగింది 'పెఫ్రిలిఖా'

"ఒక్కనిముషం ఆగండి. మరణదండన అయితే విధించాము. కాని అది కార్యరూపంలోకి తేవటం యెలా?"— అన్నది ఫ్రోస్యా.

అందరూ ఒకరిముఖాలు ఒకరు చూసుకున్నారు.

"అవును, యెట్లా?"

"ఉరిపోసి చంపటమే—" అని 'పుజియన్' సలహాయిచ్చింది.

"ఉరితీయుం ఎక్కడ? ఈ యింట్లోనేనా?"

"అంతెందుకూ? నెత్తిమీద ఒక్క పెట్టుపెడితే వాడే చస్తాడు.

"తుపాకిఉంటే, కాల్చి చంపేద్దుము"

"ఏమిటీ, తుపాకితో కాల్చటమా! జర్మన్లు ఆ శబ్దంవిని మనని పట్టుకు పోవటానికేనా?"

'గాప్లిక్' నిలువునా వణికిపోతున్నాడు. తన ముందే, తన ప్రాణాలు యే విధంగా తీస్తే బాగుంటుందా అని తర్కించు కుంటున్నారు! నిస్సత్తువతో నేలకి ఒరిగిపోయాడు.

"మీకు పుణ్యంవుంటుంది. నా ప్రాణాలమీద దయచూపండి. మీకు ద్రోహంచేశాను. కాని యింకెప్పుడూ అట్లా చెయ్యనని ప్రమాణం చేస్తాను" అని తలనేలకువేసి కొట్టుకొంటూ యేడ్వటం మొదలెట్టాడు.

"ఊరుకోవోయ్; విషపాతకుడా!"

గాప్లిక్ ఇంకా యేడుస్తున్నాడు.

"మీ పాదాలకు దణ్ణంపెడతాను. ఈ సారికి క్షమించండి. వాళ్లు చెప్పింది చేశాను. వాళ్ళ బలవంతంవల్ల నేను చెయ్యకతప్పిందికాదు...."

"పాపం! నీ కేమీ తెలియదేం? వాళ్ళ బలవంతంవల్ల చేశావా?... జర్మన్లతో కలిసినప్పుడు ఈ బుద్ధెక్కడికి పోయిందిరా?...."

"నన్ను కరుణించండి. నన్ను రక్షించండి!" అని నేలమీదపడి వలవల యేడుస్తున్నాడు.

అసహ్యించుకుంటూ అందరూ అతనివైపు చూడసాగారు.

"మగాడివై పుట్టినవాడివి, మగాడిలాగ చావలేవా?"

"ఇక వీడితో కూర్చుంటే లాభంలేదు. వీడి యేడ్పు విన్నారంటే జర్మన్లు చక్కగావచ్చి మనని పట్టుకుపోతారు. తొందరపడాలి"

అలెగ్జాండర్, గాప్లిక్ వెనక్కి వెళ్ళి మెడకు ఒక ఉచ్చు తగిలించాడు.

"న్యాయంకోసం!"— అని ఒక గావుకేకవేసి చేతులు తుడుచుకొని తనపని పూర్తిచేశాడు.

'గాప్లిక్' గిలగిలతన్నుకున్నాడు. కొద్దిసేపట్లో ప్రాణంపోయింది.

"ఫ్రోస్యా! కొద్దిగా సాయంచెయ్యి—"

ఇద్దరూకలిసి శవాన్ని క్రిందికి దించారు.

'పెర్ఫిలిఖా' బయటికివెళ్ళి జాగ్రత్తగా పరిశీలించింది. గాలిరొద తప్పితే మరేమీ వినబడటంలేదు.

"త్వరగాపోయి, అక్కడినూతిలో పారెయ్యాలి."

బయట కొద్దిదూరంలోనే ఒక పాడుబడ్డ నుయ్యిఉంది. ఇప్పుడది సగంవరకు మంచుతోటి నిండిపోయి ఉన్నది. 'గాప్లిక్' శవాన్ని అందులో తోసేశారు. పైకి కనబడకుండా మంచులో కూరుకుపోయింది.

ఈ మంచుకాలం పోయిందాకా యిందులోనే పడిఉంటుంది. ఆటు తర్వాత అవసరమైతే యింకెక్కడికైనా తీసుకెళ్ళి పారెయ్యవచ్చు. మొత్తానికి పత్తా దొరకదులేండి"

"ఇప్పుడు ఇంటికి చేరుకునేదెట్లా?"

"ఇండ్లకుపోవటమెందుకూ? ఎటుపోయి, యెటొచ్చినా కష్టం. ఇప్పుడే యింట్లోకావలసినంత స్థలం ఉన్నదిగా.... పొద్దుటివరకు యిక్కడే పడుకుందాము. పొద్దు పొడవగానే యెవరంతట వాళ్లు లేచి వెళ్ళిపోవచ్చు. ఎవ్వరికీ అనుమానంకూడా కలగదు." — అని 'అలెగ్జాండర్' సలహా యిచ్చాడు.

అందరూ స్థలాలు చూచుకొని పడుకున్నారు. కాని యెవ్వరికీ నిద్ర పట్టటంలేదు.

"అలెగ్జాండర్, ఇప్పటి కాగితాలన్నీ జాగ్రత్తగా దాయాలిసుమా మనవాళ్లు వచ్చాక చూపించవలసి ఉంటుంది."

"నీ కాభయమేమీవద్దు. జాగ్రత్తగా దాస్తానులే"

"అలెగ్జాండర్! అంతా అనుకూలంగానే జరిగిపోయిందిసుమా!" అని పెర్ఫిలిఖా మళ్ళీఅన్నది.

"మనం తలుచుకున్నాక సక్రమంగా జరుగకపోతుందా?" అని ధీమాతో జవాబు చెప్పాడు 'అలెగ్జాండర్'.

# 7

జోరుగా వీస్తున్న గాలికి తలుపు దభాలున కొట్టుకున్నది. 'ఫెదోసియా' ఉలిక్కిపడి, చేతిలో నీళ్ళతోఉన్న బాల్చీలు వదిలేసింది. ఇంటినిండా నీళ్ళయిపోయినాయి.

"దరిద్రపుముండ!" - అని కెప్టెన్ కర్ట్ కోపంతో కేకలేసి గభాలున వెళ్ళి అక్కడే నేలమీదఉన్న తనబూట్లను తెమ్ముకున్నాడు.

'ఫెదోసియా' మారుపలకలేదు. ఆమె హృదయం వేగంగా కొట్టుకోసాగింది. ఒక పాతగుడ్డ తీసుకుని క్రిందపడ్డ నీళ్ళను తుడుస్తున్నది. కాని ఆమెచేతులు యింకా వణుకుతునే ఉన్నాయి. 'ఫెదోసియా' ఈ మధ్య యేమాత్రం చప్పుడు విన్నా ఉలిక్కిపడుతున్నది. అవును!- ఎర్రసైనికులు యే క్షణానవచ్చేస్తారో!!- జాగ్రత్తగా ఉండొద్దూ?....

ఈ రహస్యాన్ని తనలో దాచుకోటం మహాకష్టంగా ఉన్నది 'ఫెదోసియా'కి. అబ్బ! తనమీద యెంతబాధ్యత ఉన్నదీ!!- ఏ క్షణాన వచ్చేస్తారో? బహుజాగ్రత్తగా కనిపెట్టుకొని ఉండాలి. ఏ మాత్రం బద్ధకించినా యేమిప్రమాదం జరిగిపోతుందో!....

"బహు చాకచక్యంతో పనిచేసుకురావాలిసుమా" అని ఇంకా ప్రక్కమీదనే పడుకొనిఉన్న 'పుస్సీ'ని హెచ్చరించుచూ, తలుపు దభాలున వేసుకొని వెళ్ళిపోయాడు 'కర్ట్'. తలుపుశబ్దంవిని 'ఫెదోసియా' మళ్ళీ ఉలిక్కిపడ్డది.

తలక్రింద రెండుచేతులూ పెట్టుకొని, వెల్లికితల పడుకుని పెదవి కొరుక్కుంటూ ఆలోచిస్తున్నది 'పుస్సీ'. వెళ్ళిపోతూ 'కర్ట్' పలికిన మాటలు ఆమెకు కష్టమనిపించాయి. ఇంతమంది సైనికుల్ని, సౌకర్యాలని తన అధీనంలో ఉంచుకున్న 'కర్ట్' ఆ గెరిల్లాలను పట్టుకోలేకపోయాడు. పైగా తనను - గ్రామస్థులెవ్వరూ మాట్లాడని తనను - ఆపని చెయ్యటానికి

పొమ్మంటున్నాడు. సిగ్గయినా లేదే! ఈవెధవ యిచ్చిన ఈ సిల్కుగౌను, వీటికోసమేనా, ఈ అధికారం చలాయించటం?....

తన అక్కదగ్గరికి వెళ్ళిమాట్లాడినందువల్ల యేమీ లాభంఉండదని 'పుస్సీ'కి నిర్ధారణగాతెలుసు. యుద్ధానికిముందే తన అక్క 'ఓల్గా' తనతో మాట్లాడటం మానేసింది. అనేక పర్యాయాలు తానుఉన్న గ్రామం వచ్చికూడా తనను చూడకుండా వెళ్ళిపోయింది. వచ్చి. చూచివెళ్ళటానికి గూడా 'పుస్సీ' అర్హురాలు కాదని 'ఓల్గా' నమ్మకం. అందరూ తన లాగేయెప్పుడూ పనిచేస్తూ ఉండాలంటుంది 'ఓల్గా'. కాని 'పుస్సీ'కి పనిచేయటమంటే అసలు గిట్టదు. అందంగా తయారవ్వు, షికార్లు తిరగట మంటే మహా యిష్టం. తనలాగ తిరగనివారెవరైనా సరే 'ఓల్గా' చూచి ఓర్వలేదు. అసహ్యాపడుతుంది. అసహ్యాపడితేమాత్రం, దానిలాగ యెప్పుడూ పనిచేస్తూ, బండదానిలాగ యెవరుంటారు—

ముందున్న నిలువుటద్దంలో తనరూపం చూచుకున్నది, 'పుస్సీ'. తనకుతానే తన అందంచూచుకొని సంతోషపడ్డది. ఇటువంటి శరీరాన్ని, మోటుపన్లుచేస్తూ పాడుచేసుకొమ్మంటుంది 'ఓల్గా'. అంతకంటే బుద్ధి తక్కువపని యేమైనా ఉంటుందా?.... తనకు బిడ్డలు లేకపోతే మాత్ర మేమి? బిడ్డల్నికని ఇటువంటి అందమైన శరీరాన్ని పాడుచేసుకోటం దేనికీ?....ఈమాత్రందానికే ఓల్గా తనను చూచి అసహ్యించుకుంటుంది—

ఇంతకూ తానుచేసిన తప్పు యేముంది? తనభర్త 'సిరోష్యా' ఎర్రసైన్యంలో ఉండి తెచ్చే జీతం తనకు యేమూలకీ చాలదు. అసలు 'సిరోష్యా'కి తన భార్యను యెంతముద్దుగా, బొమ్మలాగ తయారు చేసుకోవాలో తెలియదు. తాను యితర పల్లెటూరి పిల్లల్లాగకాక, యెంత యినా అందంగా తయ్యారు కాగలదు. అయినా 'సిరోష్యా' దగ్గర్నుంచి ఆరునెలలబట్టి ఉత్తరమైనాలేదు. అసలు బ్రతికున్నాడోలేదో తెలియనప్పుడు తాను ఇంకేం చేయగలదు? ఎక్కడైనా చచ్చిపోయాడో, లేక ఖైదీగా చిక్కాడో తెలియదు. అటువంటప్పుడు అతనికోసం యెంతకాలం తెలివి తక్కువగా యెదురుచూస్తూ కూర్చోవాలి? అలా తెలివితక్కువగా కూర్చొని తిండిలేకుండా చావాలా? బాగానేఉంది! 'కర్ట్' మాత్రం మంచివాడు కాదనా? ఈమధ్యతప్ప. ఇంతకుముందు తనని యెంత ప్రేమతో చూచుకునేవాడని! అతను జర్మనువాడైనంతమాత్రంలో నష్ట మేముంది? ఇప్పుడు దేశాన్ని పాలిస్తున్నవారు వాళ్ళేగా. బోల్షివిక్కులు

మళ్ళీ రాజ్యానికివచ్చేమాట వట్టిది. అలాంటప్పుడు తన బాగుకోసం యిలా చేయటంలో తప్పు ఏముంది ? 'ఓల్గా' ఇంతకంటే ఏమిచేయమంటుంది ? తెలివితక్కువగా ప్రవర్తించి తిండికీ, గుడ్డకీ లేకుండా అందరిలాగ యేడవ మంటుంది గాబోలు....

'ఫస్సీ' ప్రక్కమీదినుంచిలేచి దుస్తులువేసుకోటం ప్రారంభించింది. మనస్సు యేమీ బాగుండలేదు. 'ఓల్గా' తన మాట వినదని యెంత చెప్పినా 'కర్ట్' వినకుండా ఉన్నాడు—

ప్రక్కమీది దుప్పటితీసి అవతల పడేసి, 'కర్ట్' కోటు చిలుక కొయ్యకి తగిలించడానికి తీసింది. 'ఫుస్సీ'. కోటుజేబులోంచి యేదో ఉత్తరం ఒకటి క్రిందపడ్డది. అటూ, ఇటూ జాగ్రత్తగాచూచి చటాలున ఆ ఉత్తరాన్ని అందుకున్నది.

ఉత్తరం తెరిచి చూచింది. కాగితాలు విప్పగానే అందులోంచి యెండిపోయిన ఒక రోజాపువ్వుక్రిందికి రాలింది. కోపంతో 'ఫుస్సీ' పెదవి కొరుక్కున్నది. ఉత్తరం జర్మను బాషలోనే ఉన్నప్పటికీ, అది స్త్రీ దస్తూరి అని మాత్రం స్పష్టంగా తెలిసిపోతున్నది పోనీ 'కర్ట్' తల్లి దగ్గర్నుంచి వచ్చిందనుకోటానికీ వీల్లేదు. తల్లి వ్రాసినట్టయితే ఆ పువ్వు యెందుకుంటుంది ? తప్పకుండా యెవరో అతని ప్రియురాలు జర్మనీ నుంచి వ్రాసిఉండాలి !....

'ఫుస్సీ'కి యిప్పుడు అనుమానం కలిగింది. 'కర్ట్' దగ్గర ఒక చిన్న పెట్టె ఉన్నది. దానిని యెప్పుడూ తాకనిచ్చేవాడుకాదు. అందులో యేమున్నదో ? 'ఫుస్సీ'ని తనదేశం తీసుకువెళ్ళి పెండ్లి చేసుకుంటానని వాగ్దానం చేశాడు 'కర్ట్'. ఆ మాట నీన్ని నమ్మింది. కాని అతని జీవిత విశేషాలుమాత్రం యేమీ తెలియవు.

ఇంతవరకు 'కర్ట్' చెప్పేవన్నీ నిజమేననుకుంటూ వచ్చింది. 'కర్ట్' అతని స్వగ్రామం సంగతులు యెత్తితే యెందువల్ల ఆ సంభాషణ మార్చేస్తుంటాడో యిప్పుడు అర్ధమౌతున్నట్టుగా ఉన్నది. ఈ విధంగా ఆలోచించుకుంటూ కూర్చుంటే లాభంలేదనుకున్నది. పైగా ఆ ఉత్తరాన్ని 'కర్ట్' తన చేతిలో చూశాడంటే మండిపడతాడు. ఇందుకేగాబోలు అతని కాగితాలేవీ ముట్టొద్దని కేకలేస్తుండేవాడు!

ఉత్తరం తిరిగి 'కర్ట్' జేబులో పెట్టేసింది. ఆ ఉత్తరం యెవరు వ్రాశారో జాగ్రత్తగా కనిపెట్టి తెలుసుకోవాలని నిశ్చయించుకున్నది.

వంటయింట్లో 'ఫెదోసియా' యేదో సామాను సర్దుతున్న శబ్దం వినవచ్చింది.

"గోలలేకుండా పనిచెయ్యలేవూ?" అని 'పుస్సీ' కేకలేసింది.

'ఫెదోసియా' ఆమె వైపు తీవ్రంగా ఒక చూపు చూచింది. ఆ చూపు 'పుస్సీ' గుండెల్లో బేజారు పుట్టించింది. ఇంతకు మునుపులాగ కాక, ఆ చూపులో ద్వేషంతోపాటు, విజయంకూడా గోచరిస్తున్నది. బహుశా, 'కర్ట్' తనపైచూపిస్తున్న అధికారాన్ని గ్రహించి ఈ ముండ తనను అవమానిస్తుందేమో?....ఐతే దీని సంగతంతా 'కర్ట్'కి చెప్పేసి, దీని మదం అణిచేయాలనుకున్నది.

"ఆగు, నాభర్తరాగానే, నీసంగతంతా చెప్పేసి, నీ పొగరు అణిచేస్తాను!"-అని 'ఫెదోసియా' ను భయపెట్టటానికి చూచింది.

'ఫెదోసియా' నడుంమీద చేతులేసుకుని నిలబడి 'పుస్సీ'ని నఖశిఖపర్యంతం ఒక్కసారి చూచి పక పక నవ్వసాగింది.

"వెళ్ళు; నీ మొగుడితో చెప్పుకో! ఒక్కసారిగాదు, వందసార్లు చెప్పుకో! ఊఁ, పరుగెత్తివెళ్ళి చెప్పుకో!! ..." అని హేళన చేసింది.

ఆ ధోరణి చూచి 'పుస్సీ' నిర్ఘాంతపోయింది.

"ఏమిటీ నీఉద్దేశం?"

"ఏమీలేదు. చెబుతానని బెదిరిస్తున్నావుగా? చెప్పు—నీజర్మను మగడికి కావలసిన రహస్యాలన్నీ తీసుకెళ్ళి చెప్పు."

"చెప్పక ఊరుకుంటానా?....చెప్పితీరుతాను!"

"నేనూ, చెప్పమనే అంటున్నాను. చెప్పు....ఈ తాటాకుల చప్పళ్ళకు కుందేళ్ళు బెదురుతాయనుకున్నావా?"

"ఐతే రోజూ అక్కడికెందుకు పోతావు?"

"అది నాయిష్టం! నిన్నెవడు అడగమన్నాడు? నీజర్మన్లు ఆ శవాన్ని గూడా యెత్తుకుపోతే, ఆ చూడటంకూడా మానుకుంటాను. అంతేనా?"

"ఇది తెలిస్తే 'కర్ట్' నిన్ను అరెస్టు చేయిస్తాడని తెలుసునా? ఆ శవాలదగ్గరికి యెవరూ వెళ్ళగూడదని ఆజ్ఞ ఉన్నదని నీకుతెలుసునా?"

"అబ్బో, యేమి భయంవేసి పోతుంది, నాకు! నీమాటలకు నాకు వణుకు పుట్టేస్తున్నది." అని వెటకారంగా పలుకుతూ 'ఫెదోసియా' 'పుస్సీ'ని సమీపించింది. ఆమెకళ్లు నిప్పుకణాల్లాగ మెరుస్తున్నాయి.

"ఇకమీదట నువ్వే భయంతో వణకవలసిన సమయం వచ్చింది. నువ్వే వలవల యేడ్వవలసిన సమయం వచ్చిందని తెలుసుకో!"

"నేను దేనికిక భయపడాలి?"— అని అన్నదేగాని 'పుస్సీ' కొద్దిగా జడిసింది.

"ప్రతిదానికి జడవాల్సిన సమయంవచ్చింది. ప్రజలు నిన్నెప్పటికీ క్షమించరు. ఎక్కడున్నా నిన్ను వెంటాడి చంపుతారు. నువ్వు నీళ్ళల్లో మునిగి చావాలన్నా నిన్ను నీరు స్వీకరించదు— పైకి తోసిపారేస్తుంది! భూమిగూడా నిన్ను సహించే సమయం దాటిపోయింది. చివరికి నీ కండ్ల వెంట రక్తపుచుక్కలు కారేటట్టు యేడుస్తావు!— ఈ జర్మన్ల చేతుల్లో చచ్చినవారే ధన్యులని అప్పుడనుకుంటావు...."

'ఫెడోసియా' కంఠంలో ద్వేషము, విజయగర్వము ప్రతిధ్వనిస్తున్నాయి. ఎర్రసైనికులు వచ్చేస్తారని తెలిసినతర్వాత ఆమెకింకేం భయం?....

"పో! నా ముందునుంచి పో!"— అని 'పుస్సీ' అరిచింది.

'ఫెడోసియా' మళ్ళీ ఒకసారి పెద్దగానవ్వింది.

"పోతాను. నీ నీచపుముఖం చూడటం నాకుగూడా అసహ్యంగానే ఉన్నది. నా ఇంట్లోఉండి, నన్నే యీ విధంగా పొమ్మంటున్నందుకు త్వరలోనే పశ్చాత్తాప పడతావులే!"

తలుపు దభాలున వేసుకుని వెళ్ళిపోతూ మళ్ళా యిలా అరిచింది— "వెళ్లు! నీ మొగుడితో ఇక్కడ జరిగిందంతా చెప్పుకో .... కాని వాడికి నీ మీద మోజు తగ్గిపోయిందిలే అయినా వాడి యావ వాడికి పడ్డది...."

* * * *

నిజంగానే 'కర్ట్'కి తనయావ తనకి పడ్డది. ఏదో విషయమై అతని మనస్సు మధనపడుతున్నది. గబగబా తన ఆఫీసులోకి వెళ్ళాడు. అతనినిచూచి సార్జెంటు కుర్చీమీదినుంచి లేచి నిలబడ్డాడు.

"కేంద్ర కార్యాలయంనుంచి ఎవరైనా టెలిఫోనులో పిలిచారా?"

"పిలిచారండీ"

"మరి నాకెందుకు కబురు పంపావుగావు?"

"తెలియజేయవద్దని ఆజ్ఞాపించారు"—

"ఏమిటీ? తెలియజేయవద్దన్నారా?"

"....చెప్పనవసరం లేదన్నారు"

" మరియెందుకు పిలిచినట్టు ?"

" అరెస్టుచేసిన గెరిల్లా స్త్రీ దగ్గర్నుంచి వివరాలు తీసుకున్నారా లేదా అని అడిగేరు "

" ఏమి సమాధానమిచ్చావు ?" – అని ' కర్ట్ ' హూంకరించాడు.

" వివరాలేమీ చెప్పలేదని జవాబిచ్చాను "

" ఇంకేం చెప్పావు ?" - అని ' కర్ట్ ' చీవరించుకున్నాడు.

సార్జెంటు వెలవెలబోయాడు.

" అవును సార్.... ఆ తర్వాత...."

" ఆఁ. ఆతర్వాత ?"

" ఆ స్త్రీని చంపేశామనిగూడా చెప్పాను."

" ఆ సంగతి నిన్నెవరు చెప్పమన్నారు ? నీకెవడు అధికార మిచ్చాడు, ఆమాట చెప్పటానికి ?" - అంటూ ' కర్ట్ ' కోపంతో సార్జెంటు మీదికి వెళ్ళాడు. సార్జెంటు భయంవల్ల అక్కడినుంచి కదల్లేదు.

" ఆసంగతి నిన్ను చెప్పమన్నానా ?....చెప్పు ?"

" లేదు, సార్...."

' కర్ట్ ' తన బలంకొద్దీ సార్జెంటు ముఖంమీద చేతితో చరిచాడు. సార్జెంటు అదిరిపడ్డాడు. కాని ఉన్నచోటునుంచి కదలలేదు.

" నిన్నెవరు చెప్పమన్నారోయ్ ?" - అని రెండవదెబ్బ వెయ్యటానికి చెయ్యి యెత్తుతూ ' కర్ట్ ' ఉరిమాడు.

సార్జెంటు చెంపమీద అయిదువ్రేళ్ళ గుర్తులు పడ్డాయి.

" గ్రామాధికారియేడీ ? - వాడు ఇవ్వాళ వచ్చాడాలేదా ?"

సార్జెంటు భయంతో రెప్పవాల్చకుండా చూస్తున్నాడు.

" ఇంకా రాలేదండీ."

" ఎంత ధాన్యం చేతికొచ్చింది ?"

" ఇప్పటివరకు యేమీలేదండీ...."

" నిన్న చంపబడ్డ కుర్రాడిసంగతేమైనా తేలిందా ?" - అని గద్దించి అడిగాడు.

" ఇంకా ఆసంగతికూడా యెవ్వరూ తెలియజేయలేదండీ."

' కర్ట్ ' కోపంతో ప్రక్కనున్న కుర్చీ అంతదూరం నెట్టివేసి, టేబిలుమీది కాగితాలు క్రిందికి తోసేశాడు. సార్జెంటు ఆ కాగితాలన్నీ యేరి, మళ్ళీ టేబిలుమీద పెట్టాడు.

"తక్షణం గ్రామాధికారిని పిలిపించు!"

"మంచిదండీ."

ఈమాటచెప్పి సార్జెంటు బయటికి వెళ్ళిపోయాడు. 'కర్ట్' కోపంతో దహించుకుపోతున్నాడు. ఎన్ని ప్రయత్నించినా 'ఓలెనా' గెరిల్లాదళపు సంగతుల్లో ఒక్కటైనా చెప్పిందికాదు. అక్కడికి తాను అసమర్థుడై ఆమెనుంచి వివరాలు లాగలేకపోయాడనుకుంటారు కేంద్ర కార్యాలయంవారు. కాని యిక్కడి కష్టాలు వారికేమీ తెలియవు. ఆ 'ఓలెనా' ముండ ఒక్కసారికాదుగదా, వందసార్లు చంపినా నోరు మెదిపే రకంకాదు! ఇది యిట్లాఉండగా ధాన్యపు సమస్య మరీ గడ్డుదై పోయింది. ఆవెధవ 'గాప్లిక్', ధాన్యపు బాధ్యతంతా తాను వహిస్తానన్నాడు. కాని ఇంతవరకు ఒక్క గింజయినా చేతికి చిక్క లేదు. సందట్లోపడి అన్నట్టు, యిదే సమయంలో కేంద్రకార్యాలయంలో తనమీద యేదో కుంభకోణం జరుగుతున్నది! లేకపోతే తనకు తెలియ కుండా సార్జెంటుని, తన విషయమై ఆరాలన్నీ అడగటమేమిటి?.... ఆ మడ్డి వెధవ 'ఓలెనా' ను అప్పుడే చంపేసినట్టుకూడా చెప్పేశాడు!....

సార్జెంటు లోపలికి వచ్చిన చప్పుడయింది.

"ఏమయింది?"

"క్షమించాలి....గ్రామాధికారి వెళ్ళిపోయాడు"

"వెళ్ళిపోవట మేమిటోయ్? వాడిని పిలిపించమంటే?"

"తీసుకురావటానికి వెళ్ళానండీ. కాని వాడు వెళ్లిపోయాడు"

"ఎక్కడికి పోయాడు?"

"ఎవరికీ తెలియదండీ"

'కర్ట్' కోపంతో మండిపడుతున్నాడు.

"నీకు పిచ్చాయేం?— నీ బదులు నన్నువెళ్ళి తెమ్మంటావాయేం?"

"అంతా వెతికి చూచామండీ: ఎక్కడాలేడు. రాత్రి చాలా సేపటి వరకు మేమిద్దరం కలిసి ధాన్యపులెక్కలు తయారుచేస్తూ యిక్కడే కూర్చున్నాము. ఆ తర్వాత యింటికి పోతానని వెళ్ళిపోయాడు. కాని ఇంటికిగూడా చేరుకోలేదట. అప్పటినుంచి యెక్కడా కనుపించటం లేదు."

"సరిగ్గా అన్నిచోట్లా విచారించావా?"

"విచారించానండీ"

" పారిపోయి ఉంటాడా ? "

" అంతేకావచ్చునండీ "

" చచ్చాం ! అంతా తలక్రిందు లయ్యిందే !! ఏందారి ? "

" మీరే ఆలోచించండి "

" వెధవ ! మనకు ఉండీచేసిన లాభమేముందిగనుక ? "

" అవునండీ "

" సరే, కూర్చుని కేంద్రకార్యాలయానికి ఒక ఉత్తరంవ్రాయి. ఇక్కడి గ్రామాధికారి పారిపోయాడనీ, ఇంకొకడ్ని మెరినన్నా తెలివైనవాడ్ని పంపించమనీ వ్రాయి "

అక్కడ జరిగిన విషయాలన్నీ వివరిస్తూ సార్జెంటు కేంద్ర కార్యాలయానికి ఒక రిపోర్టు వ్రాశాడు. ' కర్ట్ ' కేంద్రకార్యాలయానికి తెలియకుండా చేస్తున్న కుతంత్రాలన్నీగూడా దానిలో ఉల్లేఖించాడు.

" సాసీ ! " అని సార్జెంటుని ' కర్ట్ ' కేకవేశాడు.

సార్జెంటు ' సాసీ ' వ్రాస్తున్న కాగితాలు డ్రాయరులోకి తోసేశాడు.

" రాత్రి యెవరెవరు గస్తీలోఉన్నారో వారి నందర్నీ ప్రశ్నించి చూడు "

" అప్పుడే ప్రశ్నించానండీ. ఎవ్వరూ, ఏమీ చూడలేదంటున్నారు"

" మహావింతగా ఉన్నది ! మన గస్తీసైనికులకి తెలియకుండానే మనిషి మాయమయ్యాడు ! ఈ విధంగానైతే యేదో ఒకనాడు మనం నిద్రపోతుండగా యెవరైనావచ్చి గొంతకలుకాస్తా తెగకోసి వెళ్ళిపోతారు. ఈ కాపలా గాడిదెలందరు యేం చేస్తున్నట్టు ? నిద్రపోతున్నారా ? "

" అబ్బే, బయట ఆ చలిలో నిద్రపోవటానికిగూడా వీలుండదండీ. అయినా ఈ గాలిదుమారంలో ఎవ్వరికంటా పడకుండా పారిపోవటంకూడా సులభమే. అందువల్ల గ్రామంచుట్టూ కాపలాఉంచితేగాని లాభంఉండదు"

" నీ సలహాకాదు, నే నడిగేది. అంతమందిని గస్తీలో ఉంచటానికి మనుషులేరీ ? అదీగాక గ్రామాధికారికి తగిన రక్షణనేర్పాటు చేయాలన్న సంగతి నీకు తెలియదూ ? "

రాత్రి ' గాప్లిక్ ' తనతో యెవ్వరినన్నా తోడుగా పంపమన్న సంగతి సార్జెంటుకి జ్ఞాపకంవచ్చింది. కాని అది తెలిస్తే ' కర్ట్ ' మండిపడుతాడని చెప్పకుండా ఊరుకున్నాడు. ఆ దరిద్రుడు ' గాప్లిక్ ' ని ఇంటి వరకు విడిచిపెట్టినా పోయేదనిపించింది.

"వట్టి వెధవాయిలంతా చేరారు. ఇలాంటి వాళ్ళతో యుద్ధం చేసి నట్టే–" అని కర్ట్ గొణిగాడు.

సార్జెంటు ఇంకా నిలబడే ఉన్నాడు.

"ఇంకా యెందుకట్లా నిలబడ్డావు? పోయి రిపోర్టు వ్రాయి. నువ్వు కూడా నాకు తగిన వాడివే దొరికావు"

సార్జెంటువెళ్ళి రిపోర్టు పూర్తిచేశాడు. 'కర్ట్' కోపంతో తనను తిట్టినతిట్లన్నీ దానిలోవ్రాశాడు. రిపోర్టు వ్రాస్తున్నంతసేపు తట్టుతేరిన తన చెంపను తడుముకుంటూనే ఉన్నాడు.

'కర్ట్‌కి' చాలా విసుగెత్తిపోయింది.

"ఇక్కడే ఉండవోయ్. నేను కొంచెంసేపు బయటతిరిగివస్తాను"

"బయట చలి అపరిమితంగా ఉన్నదండీ...."

"అది నాకుతెలుసు. నువ్వు చెప్పనక్కర్లేదులే"

'కర్ట్' బయటికి వెళ్ళాడు. గాలి జోరు కొద్దిగా తగ్గింది. కాని చలిమాత్రం అపరిమితంగాఉంది. గుమ్మంముందు నిలబడి క్రోధం ఉట్టి పడే చూపులతో గ్రామమంతా ఒక్కసారి కలియజూచాడు. అక్కడక్కడ కాపలాకాస్తూ ఉన్న జర్మను సైనికులుతప్ప మరెవ్వరూ కనబటందలేదు. సాధారణంగా వీధుల్లో కనబడుచుండే కుక్కలన్నా యెక్కడా కనబడటం లేదు. గ్రామంలోని యిండ్లు దోచుకుంటుంటే వాళ్ళమీదికి ఉరుకుతుండటం చేత జర్మను సైనికులు కుక్కలనన్నింటినీ వచ్చిననాడే తుపాకులతో కాల్చిచంపేశారు. 'వీటి యజమానుల్లాగే యివికూడా మొండిపుట్టుక పుట్టాయి' అని జర్మను సైనికులు వాటివి చూచి మండిపడేవారు.

భయంకరమైన ఆ ప్రశాంత వాతావరణం 'కర్ట్'కి భయం పుట్టిస్తున్నది. ఇటువంటిచోట ఉండేకంటే నడి యుద్ధరంగంలో పోరాడుతూ ఉండటమే హాయి అనిపిస్తుందతనికి. ఆక్రమిత గ్రామాల్లో శాంతి నెలకొల్పటానికి యీవిధంగా ఉండటం విశ్రాంతిసమయమని కొందరు భావిస్తారు. కాని నిజానికొస్తే యిదే భయంకరమనిపిస్తుంది. బోల్షివిక్కులను తరిమివేసి దాదాపు నెలకావస్తున్నది. అయినా గ్రామస్థుల్లో ఒక్కడయినా తమ స్వాధీనంలోకి రాలేదు. ధాన్యంకోసం యెన్నిచేసినా వాళ్ళకి చీమకుట్టినట్టయినా అనిపించటంలేదు. ధాన్యం యివ్వక తప్పదన్న ఆలోచనే లేదు. మళ్ళీ బోల్షివిక్కులు తిరిగివస్తారని వాళ్ళకి వెఱ్ఱి ఆశ.

ఇంతలో ఆకాశంనుంచి యేదోశబ్దం వినవచ్చింది. తలపైకెత్తి చూచాడు 'కర్ట్'.

"అదుగో!" - అన్నాడు గుమ్మందగ్గరఉన్న కాపలాసైనికుడు ఆకాశంవైపు వ్రేలుపెట్టి చూపిస్తూ.

"మనదేనా, విమానం?" - అని అటువైపుచూస్తూ అడిగాడు 'కర్ట్'.

సైనికుడు శ్రద్ధగావిని అన్నాడు.

"శబ్దాన్నిబట్టిచూస్తే మనదానిలాగ కనబడటంలేదండీ."

'కర్ట్'కి ఆరాటం యెక్కువయింది. రష్యను విమానాలు గ్రామం మీద కనబడి నెలరోజులవుతుంది. మళ్ళీ యివ్వాళ కనబడుతున్నది!-

ఎర్రసైనికులు సమీపిస్తున్నారేమో?....

లోపలినుంచి మరికొందరు సైనికులు బయటికివచ్చి చూడసాగారు.

"బోల్షివిక్కుల విమానమే!" అన్నాడు అందులో ఒకడు.

ఇంతవరకు నిర్మానుష్యంగాఉన్న వీధులు, నేల ఈనిందా అన్నట్టు ప్రజలతో నిండిపోయున్నాయి. పసిపిల్లలతోసహా అందరూ వచ్చి చూడ సాగారు.

"అదుగో, మన విమానమే!" - అని 'మాల్యూచికా' సంతోషం పట్టలేక అన్నది.

మంచు ప్రతిబింబింపజేస్తున్న వెలుతురులో విమానంమీది యెర్ర నక్షత్రం కనబడసాగింది.

"మనది! మన విమానం!!" - అంటూ పిల్లలు అన్నీ మరిచి పోయి సంతోషంతో గంతులువేస్తున్నారు. స్త్రీ జనం కండ్ల వెంట అశ్రువులు రాలాయి. నెల్లాళ్ళకు మళ్ళీ యీనాడు ఎర్రసైన్యపు విమానం గ్రామంమీద యెగురుతున్నది. స్వతంత్ర రష్యానుండి స్వాతంత్ర్య సందేశం తెచ్చినట్టు ఆ విమానపు రెక్కలమీదనున్న యెర్రనక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి.

కెప్టెన్ 'కర్ట్' ఆ సమయంలో వీధుల్లో చూసినలాంటి దృశ్యం తానా గ్రామం వచ్చిన తర్వాత ఇంతవరకు యెన్నడూ చూచి ఉండలేదు. వీధులన్నీ ప్రజలతో కిటకిటలాడి పోతున్నాయి! ఊరపిచ్చుకల్లాగ స్వేచ్ఛగా కిలకిల నవ్వుతూ వీధుల్లో పరుగులెత్తుతున్నారు పిల్లలు! ఈ దృశ్యం చూచి 'కర్ట్' కోపంతో ఊగిపోతున్నాడు.

"ఈ గుంపుని తోలెయ్యండి!"— అని తన సైనికులను చూచి కేకలు పెట్టాడు. తన పిస్తోలు తీసి పిల్లల గుంపులోకి రెండుసార్లు పేల్చాడు. కాని కోపంతో చెయ్యి వణుకుతుండటంచేత రెండు దెబ్బలూ గురితప్పినాయి. తక్షణమే పిల్లలంతా పిట్టల్లాగ యెగిరి పోయారు. తల్లులందరూ వాళ్ళవెనకాల పరుగెత్తి తలుపులు మూసుకున్నారు. కొద్దిసేపట్లో మళ్ళీ అంతా నిశ్శబ్దం. 'కర్ట్' కళ్ళముందు మళ్ళీ యెప్పట్లాగే గ్రామం స్మశానవాటికలాగ కనపడసాగింది.

"దున్నపోతుల్లాగ నిల్చుని చూస్తారేం? కళ్ళు మూసుకుపోయినాయా? జరుగుతున్నది కనబడటంలేదూ? విమాన ఫిరంగు లేమయినై? ఆ వెధవలేంచేస్తున్నారు?"- అని అవమానం భరించలేక 'కర్ట్' కిందు మీదైపోతున్నాడు తన సైనికులముందు, అంతదగ్గర్లో, రెండుసార్లు గురి తప్పటమా!....

ఇంతలో విమాన ఫిరంగులు పేలిన శబ్దం వినవచ్చింది. కాని విమానానికి దెబ్బమాత్రం తగలలేదు. రెండవ మ్రోత మోగింది. విమానం తప్పించుకొని దూరం వెళ్ళిపోయింది.

"ఏంచేస్తున్నారింతవరకు? నిద్రపోతున్నారా, లేక ఆడుకొంటున్నారా?"- అని విమాన శతఘ్నులు అమర్చి ఉన్నవైపు పరుగెత్తాడు.

"మొదట్లో మనవేననుకున్నామండీ...."

"ఈ ఊరి ఆడముండల కందరికీ ఆ విమానం యెవరిదైనదీ తెలిసిందిగాని మీకు మాత్రం తెలియ లేదేం? వెధవలు....శుద్ధవెధవలు" అని అరుచుకుంటూ తన ఆఫీసులోకి వెళ్ళిపోయాడు. కోపంతో శరీరమంతా వణికి పోతున్నది.

"గ్రామాధికారి పత్తా దొరికిందా?"

సార్జెంటు భయంతో లేచి నిలబడ్డాడు.

"లేదండీ...."

'కర్ట్' కుర్చీమీద కూలబడ్డాడు. మనస్సు అంతాచికలమైపోయింది. ఈ వెధవలకేంపోయింది. ఏవిషయంలోనూ కల్పించుకోరు. ఎటొచ్చీ పూచీ అంతా తననెత్తిమీద పడుతుంది. కేంద్రకార్యాలయంలో ఉన్న తన 'మిత్రులు' దీని బాధ్యతంతా తననెత్తినే రుద్దుతారు. ఇకనుంచి 'షఫీస్'తో తిరగటం కూడా మంచిది కాదేమోనపించింది. ఇలాంటి విషయాలు

కేంద్రకార్యాలయంవారికి తెలిస్తే అతనిమీద మరీ అనుమానపడతారు. అందువల్ల తనకు అంతగా యిష్టంలేకపోయినా 'పుస్సీ'ని వదుల్చుకోటానికి నిశ్చయించుకొనక తప్పిందికాదు.

ఏమిచెయ్యటానికి తోచటంలేదు. తనస్థితి చాలా చిక్కుల్లో పడిపోయిందనిపించింది. కేంద్రకార్యాలయంవారు తనకు పనిగానిపనిని తెచ్చిపెట్టారు. లేకపోతే సైనికులకు కావలసిన ధాన్యము, మాంసము సంపాదించవలసిన బాధ్యత తననెత్తిన పెట్టడమేమిటి? 'గాప్లిక్', సార్జెంటుకలిసి యెన్నిలెక్కలు తయారుచేసినా ఫలితమేమీ కనుపించలేదు. బోల్షవిక్‌లు పోయినవసంతకాలంలోనే ఇక్కడిపశువుల నన్నింటినీ యెక్కడికో తోలుకుపోయారు. ఇక ధాన్యంసంగతి ఆ బ్రహ్మదేవుడికూడా తెలియనట్టు ఉన్నది. ఇంతవరకు ఒక్కగింజ అయినా చేతికిచిక్కలేదు!

"నిన్న అరెస్టుచేసిన అయిదుగురు ఖైదీలసంగతి యేమయింది?"

"ఆ గదిలోనే పెట్టి ఉంచామండీ"

"తినడానికేమన్నా యిస్తున్నారా?"

"ఉఁహుఁ లేదండీ"

"నీళ్ళు...."

"అదీలేదండీ"

"మంచిపనిచేశారు. ఇంత రొట్టెముక్క కాదుగదా, ఒక్క నీటిచుక్కయినా వాళ్ళకివ్వకండి. మనకు వాళ్ళు తిండి ఇవ్వనప్పుడు మనము గూడా వాళ్ళకు తిండిపెట్టగూడదు—హ—హ—హా. చస్తేచావనివ్వు. నష్టమేమీలేదు."

'కర్ట్'కి ఏమీతోచటంలేదు. ఇంటికి పోదామనుకున్నాడు. కాని 'పుస్సీ'ని కలవవలసి వస్తుందని అక్కడికి వెళ్ళటంకూడా మానుకున్నాడు. ఎటూతోచక, విమాన ఫిరంగులు అమర్చిఉంచిన చోటుకివెళ్ళి అక్కడి సైనికులమీద కేకలువెయ్యటం మొదలుపెట్టాడు.

ఆఫీసులోని సైనికులు కొంతధైర్యంగా మాట్లాడుకొనసాగారు.

"చాలాకోపంమీద ఉన్నాడుసుమా—"

"ఇంకేం చేస్తాడు? ధాన్యం దొరకటంలేదు. దానికితోడు గ్రామాధికారికూడా పత్తాలేకుండా దాటిపోయాడు."

"మొత్తానికి వాడు భలేపనిచేశాడు"

ఈ మాటలు అన్న సైనికుడివైపు సార్జెంటు అనుమానంతో చూస్తూ అన్నాడు "ఏమిటీ, నీ ఉద్దేశం ?"

"అద్బే. పారిపోయినా యెక్కడికి పోగలడు లెండి. ఎక్కడికి పోయినా మనవాళ్ళ చేతుల్లో చిక్కక మానడుగదా?" అని తన పొరపాటును సర్దుకోటానికి ప్రయత్నించాడు ఆ సైనికుడు.

"రష్యన్ల ఆధీనంలో ఉన్న స్థలాలకి పారిపోతేనో?" - అని ఇంకొక సైనికుడు ప్రశ్న వేశాడు.

"బోల్షివిక్‌లు అసలుకే చంపేస్తారు."

"ఏమో? ఇక్కడి గ్రామస్థులే చంపేశారేమో!"

"ఏడిశారు. రాత్రంతా వాడిక్కడే ఉన్నాడు. అదీగాక చీకటి పడ్డాక యెవ్వరూ బయట తిరగకూడదని ఆజ్ఞకూడా ఉన్నది." అని సార్జెంటు కోపంతో అరిచేడు.

అంతకుముందురాత్రే ఒక కుర్రవాడు 'ఓడెసా'కి రొట్టె అందివ్వటానికి ప్రయత్నించటమూ, అతనిని జర్మను సైనికులు కాల్చి చంపేయటమూ, ఆ తర్వాత యెవరో అతని శవాన్ని రహస్యంగా యెత్తుకు పోవటము బహుశ సార్జెంటు మరిచిపోయి ఉండడు. కాని అతనికి బయలు చెప్పటానికి ధైర్యంచాలక సైనికులు ఊరుకున్నారు.

"అయినా సోమరిపోతుల్లాగ యిక్కడ కూర్చుని యీ బాతాఖాని అంత యెందుకంటా? వెళ్ళి మీపన్లు మీరు చేసుకోండి-" అని సార్జెంటు వాళ్ళను మళ్ళీ మందలించేడు.

సైనికులు మారుపల్కలేదు. తనక్రింద పనిచేసేవారిని కొట్టటంలో సార్జెంటుకూడా ఏమీ తీసిపోయినవాడుకాదు. 'కర్ట్' అతనికి వేసిన చెంప కాయగుర్తు ఇంకా ఎర్రగాకనబడుతూనేవున్నది. ఆకోపంలో ఏక్షణానైనా తనమీదపడి కొడతాడని ఆసైనికులు మౌనంవహించి ఊరుకున్నారు.

"స్క్యూమన్ యేడీ"

"మాంసం సంపాదించుకురావటానికి పోయాడండీ."

సార్జెంటు ఈమాటలు విని భుజాలు యెగురవేస్తూ అన్నాడు.

"ఏం? ఆవులెక్కడ ఉన్నవో తెలియదా?"

"ఆవులన్నీ అప్పుడే అయిపోయినైకదండీ. నిన్న కేంద్ర కార్యాలయంవారికి పది ఆవుల్ని పంపించాము. ఇప్పుడు కోళ్ళేమయినా దొరుకుతాయేమోనని వెతకటానికి పోయారు."

సార్జెంటు టేబిలుముందు కూర్చొని యేవో కాగితాలు తిరగవేస్తు న్నాడు. కోపంతో అతని వొళ్ళు దహించుకు పోతున్నది. ఇందాక చెంప మీద పడ్డవ్రేళ్ళ గుర్తులు తడుము కుంటున్నాడు. చెంప బాగామండు తున్నది. వెధవ చెంపమీద కొట్టటం మాత్రం చేతనవుతుంది. గెరిల్లా దళాన్ని పట్టుకునే సమర్థత మాత్రంలేదు. ఇన్నిరోజులబట్టి తల పగుల గొట్టుకుంటున్నాడు గాని ఒక్కధాన్యపు గింజయినా సంపాదించ లేక పోయాడు. పైగా తనకంటే గొప్పవాడు లేడని మిడిసి పడతాడు.

ఈగ్రామానికి వచ్చినది మొదలు సార్జెంటుకి 'కర్ట్' మీద మరీ కోపంగాఉన్నది. వచ్చిననాడు ఇద్దరూ ఒకేసారి ఒకే యింట్లో చొరబడటం తటస్థించింది. ఆ యింట్లో దొరికిన ఒక చక్కని గౌను తీసుకొని తన భార్యకు పంపిద్దామని యెంతో సర్దాపడ్డాడు సార్జెంటు. కాని 'కర్ట్' కళ్ళు గూడా దానిమీదనే పడ్డాయి. సార్జెంటు దగ్గర్నుంచి అదీ లాక్కుపోయి తన ఉంపుడుగత్తెకు యిచ్చుకున్నాడు. ఆ విషయం తలుచుకుంటుంటే సార్జెంటుకి 'కర్ట్' మీద అమిత కోపం కలుగుతుంది. వెధవ! అక్కడికి తానే గొప్పవాడనుకుంటాడు. కాని తెలివిమాత్రం శూన్యం....

దూరంనుంచి 'కర్ట్' కేకలు వినబడసాగినాయి. "అరువు! నీయిష్టం వచ్చినట్టు అరువు ఎంత అరిచినా అంతే లే—" అనిసార్జెంటు తనలో తాను అనుకున్నాడు.

* * * *

జర్మను సైనికులు గుంపుగా ఇంటింటికీ బయలుదేరారు. పట్టపగలైనా ఆ గ్రామంలో ఒంటరిగా తిరగటమంటే వారికి హడలు.

'గ్రోఖాచ్' ఇంటితలుపుకొట్టారు. పిల్లలు భయంతో ఒకమూలకి నక్కారు. 'గ్రోఖాచ్' భార్య తలుపుతీసి జర్మను సైనికులను రుస రుస లాడుతూ చూచింది.

"ఏం కావాలి. మీకు?"

"కోడి, కోడి....కోడికావాలి"

"ఉన్నవన్నీ మీ పొట్టనే పెట్టుకున్నారుగా....ఇంకెక్కడివి?

భాష అర్థంకాకపోయినా వారు ఆమె భావం గుర్తించ గలిగారు. అయినా ఆమె మాటల్లో నమ్మకం కలగక, లోపలికిపోయి ఇల్లంతా వెతికి చూచారు.

"ఉహుం—ఏమీలేవు" అన్నాడు అందులో ఒక సైనికుడు.

అక్కడ ఇక లాభంలేదని తెలుసుకొని, ప్రక్కయింట్లో జొరబడ్డారు.

'బన్యూచికా' ఇంతకాలమూ బహుజాగ్రత్తగా దాచుకుంటూ వచ్చిన ఒక కోడిపిల్ల వాళ్ళకండ్లబడింది. జర్మన్లు దానిని పట్టుకోబోతుందగా రెపరెప కొట్టుకుంటూ కిటికీలోంచి బయటికి గంతేసింది.

"అటు — బయిటికిపోయి పట్టుకోవోయ్...."

సైనికులు దానివెంటపడ్డారు. అది చేతికి చిక్కకుండా గంతులు వేసుకుంటూ తప్పించుకుంటుంది. ఇక చాలలేక ఒక సైనికుడు పిస్తోలు తీసి దానికి గురిపెట్టి కాల్చాడు. దెబ్బతో అది చచ్చి పడిపోయింది. ఎంతో జయంపొందినవాడిలాగ దానిని కాళ్ళతో పట్టుకొని అటూ, ఇటూ ఊపుకొంటూ పోబోతున్నాడు ఆ సైనికుడు.

గ్రామంలో ఈవార్త తెలియగానే అందరూ తమ తమ కోళ్ళను వీలైనచోట్లల్లా దాచేశారు. జర్మను సైనికులు కుక్కలకుమల్లే పసికట్టి కొన్నిటిని బయటికి లాగుతున్నారు. అప్పటికిగూడా వారికి తృప్తికలుగలేదు. చివరికి గ్రామంలో 'లోకుటికా' యింట్లో మిగిలిన ఒక్క ఆవునీ తోలుకుపోవటానికి నిశ్చయించుకున్నారు. కాని ఆవు యేమాత్రమూ కదలటంలేదు.

ఆవుని తోలుకుపోతూవుంటే చూడలేక 'లోకుటికా' కండ్లవెంట నీళ్లు పెట్టుకుంటూ — "పెస్త్రూష్కా! పెస్త్రూష్కా" — అని గోలపెట్టింది. సైనికులు ఆమెను మొటటుగా క్రింద పడదోశారు.

ఆవు జాలిగొలిపే చూపులతో ఆమెను చూడసాగింది. బలవంతంగా లాక్కుపోవటానికి యెంత ప్రయత్నిస్తున్నా కదలటంలేదు. గుమ్మం దగ్గర జారిపడిపోయింది. ఒక సైనికుడు తోకపుచ్చుకొని లేవనెత్తి ముందుకి తోశాడు.

"అయ్యో! అయ్యో! దాన్ని అవస్థపెట్టకండి....సూడితోవుంది, సూడితోవున్నది...."

"అమ్మా, గోలచెయ్యకు!" అని ఆమె పదిసంవత్సరాల కొడుకు 'సావ్కా' గంభీరస్వరంతో ఆమెను మందలిస్తున్నాడు.

"అయ్యో తండ్రీ, ఇంక మీకేం పెట్టేది?.... నా బిడ్డలగతి ఇంకేంకాను?...."

"ఊరుకోవమ్మా !" అని 'సాష్కా' జర్మను సైనికులవైపు ద్వేషంతో చూస్తూ తల్లిమీద కేకలుపెట్టాడు.

సైనికులు ఆవుని వెనుకనుంచి బలవంతంగా తోయటం మొదలు పెట్టారు 'లోకుటికా' ఆవు ప్రక్కకి పరుగెత్తింది. ఒక సైనికుడు ఆమెను త్రోసివేశాడు. నేలమీద దభాలున పడిపోయింది. చెమ్మగిల్లిన కండ్లతో జాలిగా ఆమెవైపు చూస్తూ పోతున్నది ఆవు....

"అమ్మా, గోలచెయ్యొద్దంటే విన్నావూ ? దీనివల్ల వచ్చిన లాభమేమిటో చెప్పు ? - పద, చలివేస్తుంది....లోపలికి పద-" అని 'సాష్కా' తల్లిని ఓదార్చుతున్నాడు.

'లోకుటికా' ఇంకా యేడుస్తూనే ఉన్నది.

"ఇక మనగతి యేమైపోతుంది ? ఈ పిల్లల్ని పెంచటం యెట్లా ?"

"ఇక చాలించు ! ఊర్లో ఇందరి ఆవుల్ని తోలుకుపోతుంటే యెవ్వరైనా నీలాగ గోలచేశారా ?" అని 'సాష్కా' తల్లిని కసురుకున్నాడు.

"మీ ఆయిదుగురి కేం పెట్టేది తండ్రీ !...."

"ఇంతకంటె యెక్కువమంది పిల్లలున్నవారు లేరూ ?"

"ఏడిశావ్. నువ్వటరా గుంటసన్యాసి. నాకు చెప్పవచ్చావ్ - -" అని తల్లి ఆ దుఃఖంపట్టలేక కొడుకుని కసురుకొనసాగింది.

"సరేలే, చెల్లి యేడుస్తున్నది - వెళ్లు."

"చెల్లి యేడుస్తున్నదా !" అంటూ 'లోకుటికా' యింట్లోకి పరుగెత్తింది.

జర్మను సైనికులు ఆవుని తోలుకుపోయి కోసేశారు. తోలుతీసి మాంసాన్ని ఒక దండానికి వేళ్ళాడదీశారు. ఇంతలో, ఫిరంగుల దగ్గర సైనికులమీద కేకలువేస్తూ విసిగిపోయిన 'కర్ట్' తిరిగివచ్చాడు.

"ఒక ఆవుని తీసుకొచ్చామండీ -" అని సార్జెంటు అతనికితెలియజేశాడు.

అసలే 'కర్ట్'కి మనస్సు చీకాకుగావుంది. ఈ వార్త వినేటప్పటికి మరీ వికారమనిపించింది. ఏ గ్రామంలో ఉన్న సైన్యం ఆ గ్రామంలోనే ఆహారపదార్థాలు సంపాదించుకోవాలని పైనుంచి ఆజ్ఞ వచ్చింది. నెల రోజులు ఇంకా తిరగనేలేదు. అప్పుడే కోళ్ళు మొదలైనవన్నీ అయిపోయినాయి. ఇక మహా మిగిలితే ఒకటి, రెండు ఆవులు మిగిలి ఉండవచ్చు.

అవికూడా అయిపోతే యేమిచెయ్యాలో తెలియక తికమకలు పడు తున్నాడు 'కర్ట్'.

"పై నుంచి యేమైనా తినుబండారాలు వచ్చాయా ?"

"చాక్లెట్లూ, కొద్దిగా సారాయిమాత్రం పంపించారండీ-"

"అంతేనా ? ఇంకా యేమీ పంపలేదూ ?"

"అంతేనండీ, ఇంకేమీ రాలేదు. ఎవరిగ్రామాల్లో వారు ఆహారం సంపాదించుకోవాలని మొన్ననే ఆజ్ఞాపించారుకదండీ....ఇప్పుడు వచ్చినవి ఇంటికి పంపించమంటారా ?"

"పంపించు. కాని మధ్యలో మాయంకానివ్వకుండా చూడు."

"అబ్బే: సీలుచేసిన పెట్టెలెండి- అలా యెన్నటికీ జరుగదు."

'కర్ట్' కోటుగుండీలు సరిగ్గా సవరించుకొని, సిగరెట్టు వెలిగిస్తూ అన్నాడు. "సార్జెంటు : ఇంకొకమాట...."

"ఏమిటండీ ?"

"ఇవ్వాళ్ళటినుంచి ఆహారపదార్థాల విషయమై బాధ్యత నీ మీద పెడుతున్నాను."

"సరేనండీ -" అన్నాడేగాని భయంతో ముఖం చిన్నబోయింది. 'కర్ట్' బయటికి వెళ్ళిపోబోతున్నాడు.

"సార్ !...."

"ఏమిటోయ్ ?"

"అవసరమైన వస్తువులు ప్రక్కగ్రామాలనుంచి తెప్పించుకోటానికి అనుమతిస్తారా ?"

"ఏడిసినట్టేవుంది ! ఇతర గ్రామాలు, యితర సైనిక భాగాల ఆధీనంలో ఉంటున్నాయని తెలియదూ ? అలాంటప్పుడు అక్కడినుంచి యెలా తెస్తావోయ్ ?"

"మరి....ఈ గ్రామంలో ఆహారపదార్థాలు దొరకడంలేదండీ...."

"దొరకకేం ?....సరిగ్గా వెతికితే మహాచక్కగా దొరుకుతాయి. ఒళ్ళువంచి పనిచేస్తే అన్నీ దొరుకుతాయిలేవయ్యా...."

అంటూ తలుపు దభాలున వేసుకొని వెళ్ళిపోయాడు, 'కర్ట్'.



# 8

'పుస్సీ' ఇల్లు బయలుదేరింది. కాని యెటుపోటానికీ తోచటం లేదు. 'కర్ట్' చేస్తున్న బలవంతంవల్ల తప్పితే, తాను వెళుతున్న పని సఫలమవుతుందన్న నమ్మకంతో మాత్రం వెళ్ళటంలేదు.

"ఎంతయినా నీ అక్కే కదా.... ఆ మాత్రం మాట్లాడలేవూ ?.... ఇంతకూ నీ కిష్టంలేనట్టు కనబడుతున్నది. సరే, నా సమయంవచ్చినప్పుడు నేనూ, చూచుకుంటాను." అన్న 'కర్ట్' మాటలు ఇంకా ఆమెకు విని పిస్తున్నట్టుగానే ఉన్నవి.

'పుస్సీ'కి భయం పట్టుకున్నది. 'కర్ట్' తనని వదలివేస్తే తనగతి యేమవుతుంది ?

కాని తన అక్క 'ఓల్గా'తో మాట్లాడినందువల్ల యేమాత్రమూ లాభం ఉండదని ఆమెకు నిశ్చయంగా తెలుసు. ఇంతకుమునుపు ఒకతడవ 'కర్ట్'కి తెలియకుండానే 'ఓల్గా'తో కలిసి మాట్లాడింది. 'ఓల్గా' 'పుస్సీ' మీద కోపంతో ముఖంమీద ఉమ్మేసి అనేకంగా తిట్టింది. ఎర్ర సైనిక యోధుడైన 'వాస్యా' తల్లి యింట్లో ఉంటూ 'పుస్సీ' ఆ యింటిని మలినం చేస్తున్నదని తిట్టింది. 'పుస్సీ'కి అప్పుడే 'వాస్యా' సంగతి తెలియవచ్చింది....ఇంకా ఈవిధంగా యెన్నెన్నో తిట్టిపోసింది 'ఓల్గా'. అలాంటి అక్కతో ఇంకేంముఖంపెట్టుకు మాట్లాడగలదు ?....

'ఓల్గా' ఇల్లు దగ్గర్లోనే ఉన్నది. ఇంటిముందు నిలబడి 'పుస్సీ' తీవ్రంగా ఆలోచిస్తున్నది. ఏముఖంపెట్టుకొని యింట్లోకి పోవటం ? తలుపుకొట్టి పిలవాలా ? కాని ఇంతకూ 'ఓల్గా' ముఖం ముందు యెలా నిలవటం ? మొన్ననే అంత అల్లరిచేసి తిట్టిపోసింది ! మళ్ళీ ఆ పరిస్థితికి నిలవలేననుకున్నది 'పుస్సీ'. 'కర్ట్' యేమిచేసినాసరే 'ఓల్గా' కళ్ళ ముందు మళ్ళీ పడలేననుకున్నది. చటాలున తిరిగివెళ్ళిపోతున్నది. కాని కొంతమారంపోయి మళ్ళీ ఆగింది. అబ్బ ! ఏంచచ్చేది. 'ఓలెనా'ను

చంపినట్టు 'ఓల్గా'ను చంపేసినా పీడాపోయేది. తన కెందుకొచ్చిన బాధయిది ?....

'ఓల్గా' ఇంటి తలుపు తెరుచుకుంటున్నది. ఎవరావచ్చేది ?.... పుస్సీ హృదయం వేగంగా కొట్టుకోసాగింది. 'ఓల్గా' యేనా ?....కాదు, కాదు, — ఇంకెవరో.... ఆఁ! 'ఫెడోసియా' యేనా ?.... ఇక్కడి కెందు కొచ్చింది ?....

'ఫెడోసియా' బయటకివచ్చిచూచి లోపలివారికి ఆత్రంగా యేదో కేకపెట్టి చెప్పింది. అందరూ గబగబ బయటికివచ్చి, వెలుగుకి చేతులు అడ్డంపెట్టుకొని యేదో చూస్తున్నారు. 'పుస్సీ' అటు మళ్ళేటప్పటికి యెవరో బారులుతీరి వస్తుండటం కనుపించింది. ఆ బారులుతీరి వస్తున్న వారికి రెండుప్రక్కలా విచ్చుకత్తులు తళతళ లాడుతున్నాయి....

"జర్మన్లేనా వచ్చేది ?...." ఎవరో ప్రశ్నవేశారు.

"ఇక్కడ ఉన్నవాళ్లు చాలకనా ?"

"ఇంకా యేం తినిపోదామనో !...."

"కాదు, కాదు! జర్మన్లుకాదు.... సరిగ్గాచూడండి...." అని గుంపులోంచి ఐన్యూచికా ఉద్రేకంతో అరిచింది.

"నీకు పిచ్చా, యేమి ? వాళ్లుగాక యింకెవరవుతారు ?"

"అయినా మన సైనికులు పట్టపగలు ఈవిధంగా వస్తారా ?...."

"అమ్మో! వాళ్ళ టోపీలకు నక్షత్రాలు ఉన్నాయే!" — అని 'గ్రీషా' తల్లి చెయ్యిపుచ్చుకు ఊపాడు.

"నిజంగానా! నీకు కనిపిస్తున్నాయా"

మంచుమీద ప్రతిఫలించుతున్న కాంతికి కళ్లు జిగేలుమంటున్నాయి. అయినా ఆ వచ్చేదెవరో తెలిసికోటానికి, అందరూ తమ కళ్ళు ఇంతింత లేసి చేసుకొని పరీక్షగా చూస్తున్నారు.

"జర్మన్లా? మనవాళ్ళా?"

"ఆచ్చే, మనవాళ్ళయితే ఇక్కడి జర్మన్లు ఇట్లా చేతులు ముడుచుకు కూర్చుంటారా—చూడండి, యెవరూ తుపాకులు పేల్చను గూడా పేల్చటంలేదు....."

"'గ్రీషా' మాటనిజమే! అదుగో ఆ టోపీలు మనవల్లేనే కనబడు తున్నాయి...." అన్నాడు 'అలెగ్జాండర్'

"మనవాళ్లేనా?"

" అవును....మనవాళ్ళే! కాని సంతోషించవలసిన సమయంకాదు. అదుగో, చూడండి అటు...."

అందరి ముఖాలలో విచార ఛాయలు క్రమ్ముకున్నాయి. అతి కష్టంతో కొందరు యెర్రసైనికులు నడుచుకుంటూ వస్తున్నారు. వారికి రెండుప్రక్కలా సాయుధులయిన జర్మను సైనికులు కాపలా కాస్తూ నడుస్తున్నారు.

" మనవాళ్ళే....కాని ఖైదీలు.... "

అప్పటికప్పుడే ప్రజలందరూ వీధుల్లోకి చేరుకున్నారు. భయంతో నోళ్లువెళ్ళబట్టి ఆ వచ్చే సైనికులవైపు చూడసాగారు. ఎర్రసైనికులు ఆయాసంతో నడుస్తుండటం కనిపిస్తున్నది. వేగిరం నడువమని జర్మను సైనికులు కేకలు పెడుతున్నారు.

" అయ్యో దేవుడా! దెబ్బలు తిన్నవారుగూడా ఉన్నారు! "

" వాళ్ళ బూట్లు కూడా గుంజుకున్నారు!....కాళ్లపగిలి ఎట్లా నెత్తుర్లు కారుతున్నాయో !! ...."

గుమిగూడుతున్న ప్రజల మీద హూంకరించాడు ఒక జర్మను సైనికుడు. కాని యెవ్వరూ అతనిని లక్ష్యపెట్టలేదు. అందరి చూపులు తూలిపోతూ నడిచివస్తున్న యెర్రసైనికులమీద నిలచిపోయినై.

" అయ్యో, దేవుడా! "

ఆ యెర్రసైనికుల బారు గ్రామాన్ని చేరుకున్నది. వెల వెల బోతూ బాధ గోచరిస్తున్న వారి ముఖాలు స్పష్టంగా కనబడుతున్నాయి. అంతలో ఒక యెర్రసైనికుడు తూలి ప్రక్కకు పడిపోయాడు.

" ఏయ్, సరిగ్గానడువ్! " అని కాపలా సైనికుడు గర్జించాడు. ఎర్రసైనికుడు లేచి నడువటానికి ప్రయత్నిస్తున్నాడేగాని మళ్ళీ తూలిపో తున్నాడు. ఖైదీలలో ఒకడు ఆ సైనికునికి చేయూతనిచ్చి నడిపించ బోయాడు. జర్మను సైనికుడు తుపాకి మడమతో టపీమని అతనిచేతి మీద మోదాడు. విరిగిన కొమ్మలాగ ఆ సైనికుని చేయి వేళ్ళాడ వేసుకొని నడువసాగాడు.

" అయ్యో, తండ్రి ! "

అతిప్రయాసతో కాళ్ళీడ్చుకుంటూ పోతున్నారు. చలికివిచ్చిపోయిన వారి కాళ్ళనుండి రక్తం స్రవించిమంచుమీద మరకలు కడుతున్నది. మాటి

మాటికి తూలిపోతూ, జర్మను సైనికులు తుపాకి మడమలతో మోదే దెబ్బలు భరింపలేక మళ్ళీలేచి తూలుతూ నడుస్తున్నారు.

అందరితోపాటు 'పుస్సీ' కూడా అక్కడ నిలబడి బాధతోక్రుంగి, కృశించిపోతూ నడుస్తున్న ఆ సైనికులను తనకు సహజమైన వికారపు చిరునవ్వుతో చూడసాగింది.

"చాలించిక నీ యికిలింపు!"—అని ఒక కంఠం కటువుగా పలికింది. 'పుస్సీ' తిరిగి చూచేటప్పటికి పెదిమలు బిగించి, కనుబొమలు ముకుళించి కోపంతో పిడికిళ్లు బిగిస్తూ 'ఓల్గా' ప్రత్యక్షమయింది. సుద్ద లాంటి 'పుస్సీ' తెల్లనిముఖమూ, రంగువేసిన ఆ పెదిమలూ, గాలికి ఊగిసలాడే లోలకులు చూచి 'ఓల్గా' సహించలేక పోతున్నది.

"చాలించు, నీ యికిలింపు!"

'పుస్సీ' ఒక అడుగు వెనక్కివేసింది. నిప్పుల్లా మెరుస్తున్న కళ్ళతో 'ఓల్గా' తన మీదికి ఉరుకుతుందనిపించింది.

"నే నేమన్నాను?"—అని గాభరాపడ్డది.

"ఏమీ అన్లేదూ?"—అంటూ 'ఓల్గా' పుస్సీ చెంపమీద ఫెడేలున వేసింది. ఇక అక్కడ నిలబడటానికి ధైర్యం చాలక 'పుస్సీ' చర చరా వెళ్ళిపోయింది.

ఎర్రసైనికుల బారు ప్రజలను సమీపించింది. జాలిగొలిపే చూపులతో ప్రజలను చూడసాగారు.

"రొట్టె...." అన్నాడు ఒక ఖైదీ. కాపలాకాస్తూ నడుస్తున్న జర్మనుసైనికుడు అతని తలమీద తుపాకి మడమ ప్రయోగించాడు. అయినా ఊరుకోక ప్రక్కనున్న ఖైదీ అందుకున్నాడు.

"రొట్టె....వారం రోజులబట్టి యేమీలేదు...."

బైటనిల్చుని చూస్తున్న స్త్రీలందరు ఒక్కసారిగా లోపలికి పరుగెత్తారు. వణుకుతున్న చేతులతో, రహస్యంగా దాచి ఉంచిన రొట్టెలన్నీ వెతికారు.

'బన్యూచికా' తనబిడ్డల కోసం అతిరహస్యంగా దాచి ఉంచిన రొట్టెముక్క పుచ్చుకొని, జర్మను కాపలా సైనికులమాటే మరిచిపోయి ఎర్రసైనికులవైపు పరుగెత్తింది.

"దూరం పో!" అని కాపలా సైనికుడు అరిచాడు. కాని ఆమెకు ఆమాటలు వినబడనేలేదు. కాపలా సైనికుని తొలగించుకొని ముందుకి ఉరికి ఒక యెర్రసైనికుని చేతిలో రొట్టె ముక్క పెట్టబోయింది.

"దూరం పో!"—అని జర్మను సైనికుడు కేక వేస్తూ తుపాకి మడమతో బలంగా ఒక దెబ్బవేశాడు. 'బన్యూచికా' నేలకి ఒరిగి పోయింది. ఆమె చేతిలోంచి రాలిన రొట్టెను జర్మను సైనికుడు కాలితో రోడ్డు ప్రక్కకు తన్నేశాడు. ఒక ఖైదీ దానికొరకు ముందుకి ఉరికాడు. తుపాకి పేలింది....మరుక్షణంలో ఆ ఎర్రసైనికుడు నేలకి ఒరిగిపోయాడు.

స్పృహతప్పి పడిపోయిన 'బన్యూచికా' ని యెవ్వరూ చూడనన్నా చూడలేదు. ఎవరంతట వారు తాము తెచ్చిన రొట్టెముక్కలు ఎర్రసైనికులకు యివ్వటానికి ముందుకి ఉరుకుతున్నారు.

ఇంతలో జర్మను సార్జెంటు సైనికకార్యాలయంనుంచి తన సైనికులతో తయారయ్యాడు.

"పోండి, ఇక్కడ్నుంచి" అని ఒక గావు కేకపెట్టాడు.

జర్మను సైనికులు తమ తుపాకి మడమతో స్త్రీల నందర్నీ తరిమి వేయటానికి ప్రయత్నింపసాగారు. కాని స్త్రీలు తమ మోచేతులతో దెబ్బలు ఆపుకుంటూ, ఖైదీలమధ్యకి రొట్టెముక్కలు విసురుతున్నారు. ఒక ఎర్రసైనికుడు రొట్టెముక్కకోసం వంగేడు. జర్మను సైనికుడు తుపాకి పేల్చేసరికి క్రిందపడిపోయాడు.

"కామ్రేడ్స్! లాభంలేదు. అనవసరంగా మీప్రాణాలు పోగొట్టుకోకండి. ఈ నీచులు మమ్మల్నెట్లాగూ తిననివ్వరు. ఎందుకు ప్రాణాలు పోగొట్టుకుంటారు తల్లుల్లారా".... అని ఒక ఖైదీ యెలుగెత్తి దీనంగా అరిచాడు.

ఇకనేమీ లాభంలేదనుకున్నారు స్త్రీలు. రొట్టెముక్కలు అందుకోటానికి ప్రయత్నించిన ఇద్దరు యెర్రసైనికులూ రోడ్డు ప్రక్కన చచ్చి పడివున్నారు. తుపాకిమడమ దెబ్బతిన్న 'బన్యూచికా' అమితాయాసంతో లేవటానికి ప్రయత్నిస్తున్నది. ఏమిచేయటానికీ తోచక స్త్రీలందరూ చేతిలో రొట్టెముక్కలు పట్టుకుని విచారవదనాలతో యెర్రసైనికులవైపు చూస్తూ నిలబడిపోయారు.

"సాషా!"

'మాల్యూచికా' కొడుకు ముందుకివచ్చి నిలబడ్డాడు.

"ఇక మనం యిక్కడ యేమిచేసిగూడా లాభం ఉండదు. తక్కిన పిల్లల్ని వెంటవేసుకుని పరుగెత్తుకెళ్ళి అక్కడి రోడ్డు మలుపులో జర్మన్ల కండ్లబడకుండా ఈ రొట్టెముక్కలు పడేసిరండి. జర్మన్లు పసికట్టకుండా పడేసిరావాలిసుమా.... అక్కడైనా మన సైనికులు ఇన్ని రొట్టెముక్కలు అందుకోగలుగుతారు...." అని 'మాల్యూచికా' తన కొడుక్కి చెప్పింది.

ఏదో పెద్ద గాలివచ్చి కొట్టుకుపోయినట్టుగా, మరుక్షణంలో వీధిలోని పిల్లలందరూ అంతర్ధానమయ్యారు. స్త్రీలందరూ తమ ఇండ్లగుమ్మాల దగ్గరికి చేరుకుని, తలకు కట్టుకున్న గుడ్డలకొనలు మునిపళ్ళతో కొరుక్కుంటూ కండ్లవెంట నీరు పెట్టుకున్నారు....

"ఎట్లాగున్నది?" — అని 'ఫ్రోస్యా' 'బన్యూచికా' ను ఆదరంతో పరామర్శచేసింది. ఒకగ్లాసుతోనీళ్ళు తెచ్చిపెట్టింది. ఇంత మంచుతీసి ఆమె కణతలమీద రుద్దింది. 'బన్యూచికా' లేచి కూర్చుని చేతులతో ముఖం కప్పుకున్నది.

"ఏం? బాధగా వుందా?"

"అబ్బే, యేమీలేదు....యేమీలేదు, ఫ్రోస్యా...."

"ఫరవాలేదు....కొద్దిసేపు పడుకుంటే నెమ్మదిస్తుందిలే. బెంగ పడకు."

"పిచ్చిదానా, నన్నుగురించికాదు భయపడటం యేదో కొద్ది దెబ్బ తగిలినంత మాత్రాన నేను భయపడుతానా?.... ఫ్రోస్యా. ఇటువిను. యుద్ధరంగంలో పనిచేస్తున్న మా ఆయన యెప్పుడైనా ప్రమాదంవల్ల ఇలాంటి బాధల్లో చిక్కుకునేకంటే, ఒక బాంబుముక్క తగిలి చచ్చి పోతేనే మేలుకదా అని ఆలోచిస్తున్నాను. ఈ యమబాధలు పడేకంటే అదేనయంకదూ? ...." అని 'ఫ్రోస్యా' చెవిలో నెమ్మదిగా తన హృదయంలో చెలరేగిన ఉద్రేకాన్నంతటినీ ఆమాటల్లో ఇమిడ్చిచెప్పింది.

"శాంతించు....శాంతించు"

'ఏమంటావు? ఈ బాధలకంటే ప్రాణత్యాగం చేసుకుంటే మంచిదికదూ!'

"సరే, సరే....లోపలికి పద....ఈ చలిలోవుంటే బండబారి చచ్చి పోతావు. రా, నే సహాయం చేస్తాను."

'బన్యూచికా' ప్రయాసతోలేచి 'ఫ్రోస్యా' ను ఆనుకుని నెమ్మదిగా యింటికి చేరుకున్నది. 'గ్రీషా' తల్లినిచూచి బిక్కమొగంవేశాడు.

పెద్దగా మూల్గుతూ ప్రక్కమీద పడిపోయింది 'బన్యూచికా.' అమితంగా బాధపడుతున్నది. కాని ఆమె మనస్సు మాత్రం ఇంకేదో విషయంమీద లగ్నమయి ఉన్నది.

"'గ్రీషా', యిటురా నాయనా!"

కొడుకు తల్లికి సమీపంలోకి వెళ్ళి నిల్చున్నాడు.

"గ్రీషా! నేను చెప్పేది శ్రద్ధగావిను నాయనా"

"ఏమిటో చెప్పు; వింటాను."

"ఎప్పుడైనా జర్మన్ల చేతిలో చిక్కేకంటే చావేమేలని తెలుసుకో"

"నీకు పిచ్చాయేం? పసివాడితో అవేం మాటలు?"—అని 'ఫ్రోస్యా' 'బన్యూచికా'ను మందలించింది.

'గ్రీషా' భయపడి యేడవటం ప్రారంభించాడు.

"చూశావా పిల్లాడెట్లా యేడుస్తున్నాడో. అయినా ఈ మాటలన్నీ వాడికెందుకు. వాడుపెరిగి పెద్ద అయ్యేలోగా ఈ జర్మన్లెవ్వరూ ఇక్కడుండరు."

"అవును. ఈ నీచుల్లో ఒక్కడుగూడా లేకుండా నాశనమైతేగాని ప్రపంచానికి తిరిగి శాంతి కలుగదుసుమా!" అంటూ 'బన్యూచికా' కడుపు అదుముకుంటూ మూల్గింది.

"అబ్బ! ఈ దెబ్బ నన్ను చాలాకాలంవరకు మంచాన్ని పట్టించేటట్టున్నది."

"సరే, ఊరుకో; తగ్గిపోతుందిలే....నేను మంచినీళ్ళు తెచ్చిపెడతాను"

'ఫ్రోస్యా' మంచినీళ్ళు తెచ్చియిచ్చింది. నీళ్ళల్లో గుడ్డ తడిపి 'బన్యూచికా' దెబ్బమీద వేసింది. ఇంతవరకు యేదో ధ్యాసలోఉన్న 'బన్యూచికా'కు తన కొడుకు యేడుస్తుండడం హఠాత్తుగా కనుపించింది.

"ఎందుకలా యేడుస్తున్నావు? చూశావా 'ఫ్రోస్యా' వాళ్ళ తండ్రికిమల్లే వీడుకూడా యెంతటి జాలి గుండెవాడో! అంతా వాళ్ళ తండ్రే."

"వాడిసంగతి యెత్తబోకమ్మా. పసివాడ్ని పట్టుకుని భయపెట్టేస్తున్నావు, అనవసరంగా....వాళ్ళతండ్రికి వచ్చిన లోటేమిటి?"

"అబ్బే యేమీలేదు. ఏదైనాజరిగితే, నే నిందాక అనుకున్నట్టు చేస్తారో లేదోనని...."

"ఆయనసంగతి ఆయనకు తెలియదా యేం –"

"అదికాదు. ఇక్కడున్నప్పుడు ఇతర్లు అన్నీచెప్పి మందలిస్తుంటే గాని యేదీ చేసేవాడుకాదు. ఇప్పుడక్కడ ఆయనకు యేదైనా చెప్పేవా రెవరా అని...."

"సరే లేవమ్మా....అతనిప్పుడు సైన్యంలోఉన్నాడుగద. అధికారులిచ్చే ఆజ్ఞలను పాలిస్తుంటాడు" – అని పలుకుతూ, 'ఫ్రోస్యా' 'బన్యూచికా' కడుపుమీద దెబ్బతగిలినచోట తడిగుడ్డ వేసింది.

"అవును, అవును" అన్నది 'బన్యూచికా'

"'గ్రీషా', ఇలారా ; నీ చేతులు కడుగుతాను - చూడు, యెంత మైలగా ఉన్నాయో....ఎందుకేడుస్తున్నావు ...మీ అమ్మచూడు ఎంత దెబ్బ తగిలినా యేడవటంలేదు—"

'గ్రీషా' ముక్కులో వ్రేలుపెట్టి తిప్పుకుంటూ తల్లిముఖంవైపు తదేకదృష్టితో చూస్తున్నాడు.

"ఛీ, ఛీ, ఆ వేలు తీసెయ్యి. ఎర్రసైనికుడి కొడుకు ఇలాంటి పన్లు చేస్తాడా ?...." అంటూ 'బన్యూచికా' ఒక మూల్గుమూలిగి 'ఫ్రోస్యా' నుద్దేశించి మళ్ళీ అన్నది. "....అయ్యో! ఒక్కరికైనా యింత రొట్టె ముక్క దొరకలేదు....పాపం! అంతా చచ్చిపోతారు....చూడు! మన దేశంలోనే ; ఒక్కరిమైనా వాళ్ళకు సహాయం చేయలేకపోయాం....ఇంత రొట్టెముక్క యివ్వలేకపోయాం.... మనదేశంలోనే మనం సహాయం చేయలేకపోయాము. ఎక్కడికి తీసుకుపోతున్నారో వాళ్ళను...."

"'రుడీ' లో ఒక జైలు ఉన్నదిగా ; అక్కడికే కాబోలు"

"'రుడీ' దాకా యేం పోతారు, ఇక్కడే నిలవలేని స్థితిలోఉంటే ? 'రుడీ' ఇంకా యెంతదూరం ఉన్నదో తెలుసునా ? అక్కడివరకూ నడవలేరు సరిగదా, మధ్యలోనే జర్మన్లు ఇందాకటి యిద్దరు సైనికుల్ని చంపినట్టు చంపిపారేస్తారు."

"మనపిల్లలు రొట్టెలతో రోడ్డు మలుపుకి పరుగెత్తారులే అక్కడ పడేస్తే, ఒక వేళ మనవాళ్లు జర్మన్లు కంటబడకుండా తీసుకోగలగవచ్చు"

" ఏంచేస్తారో మనపిల్లలు! అదీగాక మన సైనికులు ముందునడుస్తున్నారు.... ఆ వెనక జర్మను సైనికులు. మనవాళ్ళు ఆ రొట్టెముక్కల్ని చూస్తారో లేదో?...."

" ఆభయం నీకేమీవద్దు. మనపిల్లలు సామాన్యులుకారు. సాధించుకు వస్తారులే...." అని 'ఫ్రోస్యా' 'బన్యూచికా'కి ధైర్యం చెప్పింది.

మౌనంగా తల ఊపింది. 'బన్యూచికా' శరీరం నీరసించిపోయి. నిద్రముంచుకు వచ్చేస్తున్నది. కాని ఆమె కళ్ళముందు ఆ దృశ్యం—ఎర్ర సైనికుడు రొట్టెకోసం ఒక్క గంతువేసి పరుగెత్తిన దృశ్యం—కదులుతున్నది.

" అబ్బా! "

" ఏమిటి? బాధా? "— అని 'ఫ్రోస్యా' అడిగింది.

" లేదు.... నిద్రపోవాలనిపిస్తున్నది "

" చక్కగా నిద్రపో.... బాధకూడా తగ్గుతుంది "

'బన్యూచికా' కళ్లు మూసుకున్నది. కాని ఇంకా ఆ దృశ్యం—పాలిపోయిన ముఖంతో, వెర్రి ఆశతో రొట్టెముక్క కోసం పరుగెత్తుతున్న ఆసైనికుని ముఖం—ఆమె కళ్ళకు కనుపిస్తూనే ఉన్నది. మృత్యుముఖంలో తూలిపోతూ నడుస్తున్న ఆ ఖైదీలను, చిన్న రొట్టెముక్క కోసం వెర్రిగాపరుగెత్తుతున్న 'ఆ' సైనికుని పాలిపోయిన ముఖము, తన జీవితంలో యెన్నటికీ మరువలేననుకున్నది 'బన్యూచికా'

* * *

పిల్లలంతా రొట్టెలు పుచ్చుకొని ఉరకలు పెడుతున్నారు. గ్రామం దాటేవరకు త్రోవబాగానే ఉన్నది. ఆ తర్వాత మంచు ఎక్కువైపోయింది. చుట్టుపట్ల ప్రదేశమంతా యేమీ తెలియకుండా మంచుతో కప్పుకు పోయి ఉన్నది. 'ఓస్కాచెకోర్' భుజాలవరకు మంచులో దిగబడిపోయాడు.

" సాషా! సాషా! "

" నోరుముయ్యి! జర్మన్లు వింటారు. నువ్వు చాలాచిన్నవాడివి.... వెళ్ళిపో! "

" ఇందులోంచి పైకి రాలేకుండా ఉన్నాను "

" ఎలాగో నువ్వే తంటాలుపడు. నేరాటానికి వీల్లేదు. పదండి.... పదండి "— అని 'సాషా' తక్కిన పిల్లల్ని హెచ్చరించుకుంటూ వెళ్ళిపోతున్నాడు.

ఆ ప్రదేశమంతా మిట్టపల్లాలతో కూడుకొని ఉన్నది. కాని అవేమీ కనబడకుండా మంచు నిండుగా కప్పుకుపోయి ఉన్నది. ఎక్కడ యేమున్నదీ తెలియటంలేదు. నడుస్తూ నడుస్తూనే పిల్లలు పల్లం ఉన్న చోట్ల మంచులోకి దిగబడిపోతున్నారు. గట్టిపడిన మంచు పై భాగంమీద నడుస్తూ, నడుస్తూ హఠాత్తుగా లోపలికి క్రుంగిపోతుండేవారు. చేతుల సహాయంతో ముందుకి పోదామంటే, రెండు చేతుల్లోను రొట్టెముక్కలు! మంచు ముక్కలు గాజుపెంకుల్లాగ కాళ్ళకు గుచ్చుకుంటున్నాయి. పిల్లలు ఒక్కొక్కరే వెనుకకు దిగబడిపోయారు. చివరికి 'సాషా', 'సావ్కా లోకుట్' లు మాత్రం ప్రయాసపడుతూ ముందుకి పోతూనే ఉన్నారు.

"తొందరగా! తొందరగా!" — అని 'సాషా' రొప్పుతూ పరుగెత్తుతున్నాడు. శరీరమంతా చెమటలుకారుతున్నాయి. బురదమీద నడుస్తున్నట్టు కాళ్ళు జారిపోతున్నాయి. ఎన్నోసార్లు క్రిందపడిపోయి చేతులు మోపుకుని మళ్ళీ లేవసాగాడు. గాజుముక్కలాంటి మంచు ముక్కలు గుచ్చుకొని చేతులు రక్తం కారుతున్నాయి! అదృష్టవశాత్తు, జర్మన్లు రాకమునుపు తాను బడికి వెళ్ళేటప్పుడు పుస్తకాలు వేసుకుంటూ వచ్చిన సంచి వెంట పట్టుకొచ్చాడు. అదిప్పుడు చాలా ఉపయోగపడ్డది. రొట్టె ముక్కలతో సంచి భుజానికి తగిలించుకొని, చేతుల సహాయంతో ముందుకి పోతున్నాడు. అతనివెనుకనే 'సావ్కా' నాలిక బయటికి వెళ్ళబెట్టి పరుగెత్తుతున్నాడు. 'సాషా' నడిచిన తోవనే జాగ్రత్తగా పోతున్నాడు. లేకపోతే బలహీనుడైన 'సావ్కా' యేనాడో వెనుకబడిపోయేవాడు.

ఆ మంచు బయలు అంతులేనట్టే కనబడుతున్నది. ఎండాకాలంలో పచ్చనిగడ్డితో నిండి పశువులు మేస్తూఉండే ఈ బయలు, అటునించి, ఇటు ఇట్టే దాటవచ్చు. నడక వచ్చింది మొదలు ఇదే బయలులో ఆడుకునే అలవాటుగల ఆ పిల్లలకు ఆ ప్రాంతమంతా చక్కగా తెలుసు. కాని ఇప్పుడది కొత్తగాను, అపరిచితంగాను కనబడుతున్నది. ఆటలాడుకుంటూ దూకిన గుంటలు, ఎక్కిన దిబ్బలు, అన్నీ మంచుతో కప్పుకుపోయి ఉన్నాయి. ఇప్పుడు ఎంత ప్రయత్నించినా ఆ ప్రదేశపు రహస్యాలు తెలియటంలేదు. ఆ యిద్దరు పిల్లలు పడిపోతు, మంచులో భుజాలవరకు కూరుకుపోతూ ప్రయాసపడి ముందుకి పోతున్నారు. ఎప్పటికీ ఆ దారి తరుగుతున్నట్టే కనబడటంలేదు.

"తొందరగా! "—అని నోట్లోకి పోయినమంచుని ఉమ్మేతూ, 'సాషా' అన్నాడు.

భుజానికి తగిలించుకున్న రొట్టెల సంచి మంచులో తడిసిపోయి అంతకంతకూ బరువెక్కి పోతున్నది. తడిసిపోయిన గుడ్డలు శరీరానికి కరుచుకొని, ఆపైన పీడే చల్లనిగాలికి శరీరం బండబారి పోతున్నది. ఆ అలసటలో కళ్ళముందు యేమీ కనుపించటంలేదు. ఎర్రగాను నల్లగాను యేవో వలయాకారంలో కళ్ళముందు రీలగా కదులుతున్నాయి. కణతల్లో రక్తం సమ్మెటలతో మోదినట్టుగా కొట్టుకుంటున్నది. ఏక్షణాన ఆ రక్త నాళాలు బ్రద్దలై పోయి రక్తం మంచుమీదికి పొలిగిపోతుందో అని పిస్తున్నది.

"తొందరగా! తొందరగా!!"—అని 'సాషా' మళ్ళీ మూలిగేట ప్పటికి 'సావ్కా' కొరడాతో కొట్టినట్టు ఇంకా వేగంగా ఉరకలు వేయ సాగాడు. కాని 'సాషా' కి ఆస్థితిలో తనవెంట యెవ్వరు ఉన్నదిగూడా తెలియటం లేదు. తనకు తెలియకుండానే యేక్షణాన క్రిందపడి పోతానో అన్న భయంతో ఆవిధంగా తనలో తాను గొణుగుకుంటున్నాడు.

'సావ్కా' చాలావెనుకబడి పోయాడు. కాని యేమైనా సరే, ఆ రొట్టెలు రోడ్డుమలుపులో పడేసి రావాలని 'సాషా' పట్టుదల. ఆఖైదీ లకు రొట్టె అందించే మార్గం యిదితప్పితే వేరులేదు. తాను ఆ పనిలో యేమాత్రం విఫలుడైనా సరే ఆ ఖైదీలు వందలకు వందలుగా ఎర్రసైని కులు ఇంతరొట్టె ముక్కకుగాని, ఒక్క నీరుచుక్కకుగాని, నోచుకోక మల మల మాడిచస్తున్న 'రుడీ' జైలులోకి—మృత్యుద్వారంలోకి-తోలు కొనిపోబడతారు! ఆ మృత్యుద్వారానికీ, ఎర్రసైనికులకీ, తాను—'సాషా' అడ్డునిలవాలి!!....తన సంచిలో ఉన్న నాలుగు ముక్కలు వారి ప్రాణా లురక్షించకలవని అతని ఆశ!!

ఆ ఒక్క దిబ్బదాటిపోతే అదేరోడ్డు. అంతకంతకూ శక్తి సన్న గిల్లిపోవటం గుర్తించి 'తొందరగా, తొందరగా' పోవాలని అవస్థపడు తున్నాడు, తలదిమ్మెత్తి పోతున్నది. 'తొందరగా,తొందరగా' పోవాలి. హఠాత్తుగా ఒకపల్లంలో తల్లక్రిందులుగా పడిపోయాడు. గబ గబమంచు దులుపుకుని కాళ్ల చేతులతో ప్రాకుకుంటూ దిబ్బపైకి చేరుకున్నాడు. అదుగో, రోడ్డు!....

అవును, రోడ్డు కనబడుతున్నది. జర్మను సైనికులు కాపలాతో ఎర్రసైనికులను తోలుకుపోతున్నారు. 'సాషా' కి అదంతా ఒక కలలాగ ఉన్నది. తనకు అగుపడుతున్నది నమ్మదలుచుకోలేదు; నమ్మలేకుండా ఉన్నాడు. కాని అది నిజంగానే తన కళ్ళముందు జరుగుతున్నది! దిబ్బ మీదికి యేవిధంగానైతే కాళ్లు, చేతులమీద ప్రాకుకుంటూవచ్చాడో, అలానే ఆ కటికమంచులో ఉండిపోయాడు. ఖైదీలు దాటిపోతున్నారు. మోపయిన దెబ్బలతో నున్నవారు త్రాగినవాళ్ళలాగ తూలిపోతూ నడుస్తున్నారు. జర్మను సైనికులు వారిమీద పొలికేకలు పెడుతున్నారు. ఒక ఖైదీ క్రిందపడి లేవలేకపోతున్నాడు. తుపాకి మడమల దెబ్బలతోను, తిట్లతోను లేచి తూలిపోతూ నడుస్తున్నాడు. ఈ విధంగా ఖైదీలు పోతున్నారు.... పోతున్నారు. ఇంత శ్రమా వృథా! 'సాషా' ఆలశ్యమైపోయాడు— రెండు, మూడు నిముషాల్లో! ఖైదీలకు ముందుఅంతా శూన్యం— రొట్టె ముక్కలతో తాను వెనుకబడి పోయాడు. ఇక యెర్ర సైనికులకు రొట్టె అందే ఆశలేదు— తాను రెండు నిముషాలు ఆలశ్యమైనందువల్ల—తాను అసమర్థుడైపోయినందువల్ల!.... అన్న 'మిష్కా' జ్ఞాపకానికి వచ్చాడు. అవును, 'మిష్కా' అయితే యెంతో సమర్థతతో నెరవేర్చేవాడు. సమయానికి చేరుకునేవాడు....ఇక జర్మన్లు ఆ ఖైదీలనందర్నీ 'రుడీ' జైల్లోకితోలుతారు. అంతా ఆకలికి, చలికిచచ్చిపోతారు.... కేవలం, తాను, 'సాషా'....

'సాషా' మంచుమీద తలఆన్చి యేడుస్తున్నాడు. కండ్లవెంట నీరు జలజలా రాలిపోతున్నవి, తడిచిపోయిన గుడ్డలు శరీరానికి చల్లగా అంటుకుంటున్నాయి. ఒళ్ళంతా బండబారి పోతున్నది. కాని అక్కడి నుంచి కదలటానికి యిష్టంలేదు. కదలలేదుకూడాను. ఖైదీలు వెళ్ళిపోయారు.... కేవలం తాను రెండునిముషాలు ఆలశ్యమైనందువల్లనే!....

చలి — భయంకరమైన చలిగా ఉన్నది. ఆ చలిలో తూలిపోతూ నడుస్తున్న యెర్రసైనికులను తలుచుకొని 'సాషా' వలవల యేడ్చాడు. తన అన్న 'మిష్కా'ని గెరిల్లాదళంలో ఉన్న తన తండ్రిని తలుచుకొని దుఃఖించాడు. తన అపజయం తలుచుకుంటుంటే అన్నిటికంటే యెక్కువగా దుఃఖం కలుగుతున్నది.....

చలి అంతకంతకూ యెక్కువై పోతున్నది. కాని 'సాషా' లెక్కచేయటంలేదు. అక్కడినుంచి కదల బుద్ధికావటంలేదు.

"'సాషా', లెగు! లెగు!...."

'సాషా' ఉలిక్కిపడి ముఖం మంచులోకి ఇంకా అదుము కున్నాడు.

"లే నాయనా లే!.... చాలా చలిగా ఉంది ఏడవకు. నీవు చేయగలిగిందేదో చేశావు...."

'మాల్యూచికా' కొడుకు ప్రక్కన కూర్చుని ప్రేమతో తల నిమిరింది.

"చూడు, నీగుడ్డలన్నీ తడిముద్దలై పోయినాయి. ఇక్కడికి నే వచ్చేటప్పటికి యెంత బ్రహ్మాండమైపోయింది! — నా గుడ్డలు గూడా తడిసిపోయినాయి. పద, పోదాము...."

అతని ముఖం తనవైపు తిప్పుకొని కండ్లలోకి చూచింది. ఏడ్చి, ఏడ్చి అతని కళ్ళు వాచిపోయినవి.

"మనమేమిచేస్తాము తండ్రీ.... యెంతచేసినాగూడా లాభం లేక పోయింది." అని విచారంతో అన్నది.

"చాలా ఆలశ్యమైపోయింది...." అని వెక్కుతూ అన్నాడు 'సాషా'.

"అవును నాయనా! కాని యేంచేస్తాము? దారి సరిగ్గాలేదు. అందులోను అమితమైన మంచు, గాలి. నాలాంటిదాన్ని రావటమే కష్టమై పోయింది. పద, ఇంటికి పోదాము —" అంటూ చేతులు పట్టుకుని లేవ నెత్తింది. ఇష్టంలేకపోయినా అతడు లేవక తప్పిందికాదు.

"అసలివ్వాళ మనం పొరపాటుచేశాము. అందరం అట్లా వీధుల్లో తొక్కళ్లాడకుండా ముందే యిక్కడికివచ్చి రొట్టెముక్కలు పడేసి ఉంచితే బాగుండేది. కాని ఇలా జరుగుతుందని యెవరికి తెలుసు.... ఈసారి సమయంపడితే జాగ్రత్తపడాలి...."

తలవంచుకొని తల్లి పక్కనే నడుస్తున్నాడు 'సాషా'.

"ముక్కున ప్రాణాలు పెట్టుకొని ఇంటికివచ్చిపడ్డాడు 'సావ్కా'. 'సాషా' యేడీ అని అడిగాను. నువ్వు మంచులో పడిపోయిఉన్నావని చెప్పాడు. ఆమాటవింటూనే అన్నీ వదిలేసి పరుగెత్తుకు వచ్చాను. ఏడవకు.... ఏంచేస్తాములే.... మంచు యిట్లావుంటే...."

తనంతట తాను నడవటానికే 'మాల్యూచికా' కి కష్టంగా ఉన్నది. కొడుకుని మాట్లాడించుకొంటూ తీసుకుపోతున్నది — "నా వెనుకాతలే నడుచుకుంటూ రా. అది సులభంగా వుంటుంది...."

'సాషా' ఇందాకా అక్కడికి పోతున్నప్పుడు మంచులోపడ్డ దారి వెంటనే మళ్ళీ తిరిగివస్తున్నారు. దారి సరిగ్గానే కనబడుతున్నప్పటికి 'సాషా' నడువలేకుండా ఉన్నాడు. బూట్లు ఒక్కొక్కటే వందిపౌన్లు బరువు ఉన్నట్టనుపిస్తున్నది. కాళ్ళు. చేతులు ఉక్కువాటిలాగ మహా భారంగా ఉన్నాయి. శరీరమంతా పోటుపొడుస్తున్నది.

నడుస్తూ నడుస్తూ 'సాషా' తూలిపోయాడు. తల్లి పట్టుకుని ఆపింది.

"ఏం ? ఎట్లాగున్నది బాబూ ?"

"ఏంలేదు — ఏంలేదు —" అని గొణిగాడేగాని కళ్ళు గిర్రున తిరిగిపోతున్నాయి. ప్రపంచమంతా తల్లక్రిందులై పోతున్నట్లున్నది.

'మాల్యూచికా' వంగి కొడుకుని చేతుల్లోకి తీసుకున్నది.

"వద్దు....వద్దమ్మ...." అని నిరాకరింపబోయాడు. కాని అంత లోనే మగత నిద్రలో పడిపోయాడు. కొడుకు ముఖంమీద కనబడే చిరు నవ్వు చూచి తాను గూడా నవ్వుకున్నది 'మాల్యూచికా'

"ఏమిటది?.... ఏమిజరిగింది?" అని కట్టెలమోపు మోసుకు వస్తున్న 'పెర్ఫిలిఖా' గాభరా పడుతూ అడిగింది.

"ఆచ్చే. యేమీలేదు. ఈమంచులో ఆ యెత్తుపల్లాల్లో పరుగెత్తే టప్పటికి అలసి పోయాడు."

"సమయానికి అందుకున్నాడా?"

"ఉఁహుఁ....అందుకోలేక పోయాడు. అసలు పెద్దవాళ్లు చేరుకో టమే బ్రహ్మాండమై పోతున్నప్పుడు పసివాడికి యేమిసాధ్యమవుతుంది ?"

ఇద్దరూ మాట్లాడుకుంటూ 'మాల్యూచికా' ఇంటికి చేరుకున్నారు.

"కొద్దిగా తలుపుతీసి పెట్టమ్మా....చేతిలో పిల్లాడున్నాడు...."

'పెర్ఫిలిఖా' తలుపు తెరిచింది.

"అమ్మా! అన్నయ్యకేమయ్యిందే ?" - అని చిన్న బిడ్డ 'జినా' యేడ్వసాగింది.

"ఏంలేదు—ఏంలేదు. అల్లరి చెయ్యకు. నిద్రపోతున్నాడు....లేచి పోతాడు...."

"నిద్ర పోతున్నాడా!" — అని పిల్లలు ఆశ్చర్యంగా అడిగారు. 'సాషా' ని ప్రక్కమీద పరుండబెట్టి, తడిగుడ్డలు విప్పేసి, ఒళ్ళంతా తుడుస్తుంటే పిల్లలు తల్లిచుట్టూ చేరి చూస్తున్నారు.

"నువ్వెక్కడికి కెళ్ళావమ్మా. నీగుడ్డలుగూడా తడిసిపోయినాయి"- అని 'సోన్యా' అడిగాడు.

"ఆరిపోతాయిలెండి.... ఈ సంచి అవతలపెట్టండి...."

"ఏమున్నాయమ్మా, సంచిలో?"

"రొట్టెలు....బయటికి తియ్యండి"

"తడిసి పోయినాయి—"

"ఫరవాలేదు తినెయ్యండి"

"తిననా?"—అని 'జినా' ఆకలి ద్యోతకమయ్యే చూపులతో అడిగింది.

"తినండి. 'సోన్యా'. అందరికీ పంచిపెట్టునాయనా 'సాషా' కి కొద్దిగా ఉంచండి. లేచినాక తింటాడు."

"అమ్మా. నీకో?"

"నాకవసరంలేదు తల్లీ....ఆకలి వెయ్యటంలేదు...."

ఆత్రంతో రొట్టె ముక్కలు తింటున్న పిల్లలవైపు చూడసాగింది. చివరికి ఆ రొట్టెముక్కలు ఖైదీలకు అందలేకపోయినాయే అని వాపోయింది. 'సాషా' యెంత ప్రయాసపడ్డా లాభంలేకపోయింది....

'సాషా' అమాయికంగా నిద్రపోతున్నాడు. మళ్ళీ అతని బుగ్గలు యెప్పటిలాంటి రంగుకి తేరాయి.

పిల్లల్నందర్నీ చూస్తుంటే 'మిష్కా' జ్ఞాపకానికొచ్చాడు.

'మాల్యూచికా' కి హృదయంలో బల్లెపుపోటు, తగిలినట్టయింది. అయ్యో! ఇంకెక్కడి 'మిష్కా'!....

'మిష్కా' చనిపోయాక యెన్ని ఘోరాలు జరిగాయి! ........ పాలిపోయిన ముఖాలతో తూలిపోతూ నడుస్తున్న ఖైదీలు ఆమె కళ్ళ ముందు కనబడసాగారు. ఆకలితో ఆ యిద్దరు యెర్రసైనికులు వెర్రిగా రొట్టెముక్కలకోసం పరుగెత్తుతూ జర్మను సైనికుల తుపాకి దెబ్బలకు గురిఅయి రోడ్డుప్రక్కన దొర్లిపోతున్న దృశ్యం ఆమె కండ్లల్లో మెదల సాగింది.

'మాల్యూచికా' రెండుచేతులతోను కళ్లుమూసుకున్నది. ఏరోజు కారోజు కష్టాలు అధికమైపోతున్నాయి. ఏక్షణాన యేమిఘోరం జరుగుతుందో తెలియటంలేదు.... తన భర్త 'ప్లాటన్' యెక్కడున్నాడో? ఎప్పటికైనా తనకు మళ్ళీ కనబడతాడా? అసలు బ్రతికి ఉన్నాడోలేదో? 'ఓలెనా', 'లివాన్యుక్'ల లాగ యేమంచుక్రింద యెక్కడ పడున్నాడో!.... జర్మన్లు వచ్చి ఒక నెల ఇంకా తిరగనప్పటికి ఒక యుగం, ఒక జీవితం గడిచినట్టుగా, అనేక సంవత్సరాలు, అనేక కష్టాలు దొర్లిపోతున్నట్టుగా ఉన్నది. పూర్వపు రోజుల్లో ఆ పొలాలు, ఆ కోతలు, కళ్ళాలతో నెలలు సంవత్సరాలుగూడా నిముషాల్లో గడిచిపోయినట్టుగా ఉండేది. కాని ఇప్పుడు - ఈ నెల - తన జీవితంలోని ఇతర కాలమంతటిలోగూడ లేనటువంటి కష్టాలతోను, దుఃఖంతోను హృదయంలోని గాయాలతోను, తన జీవితంలో యెన్నటికీ మరుపుకి రానటువంటిదైపోయింది....

'సాషా' హఠాత్తుగా మేల్కొన్నాడు. తాను ఇంట్లో ఉండటం చూచుకుని ఆశ్చర్యపోయాడు. తాను స్పృహతప్పి పడిపోవటము, తల్లి యింటికి యెత్తుకొనిరావటము అతనికి గుర్తేలేదు. ఇంటి కప్పువైపు చూచాడు. వాళ్ళ యిల్లే! చెల్లెలు 'జినా' యేదో మాట్లాడుతున్నది. తల్లి ఒకమూల కూర్చుని యేదో ఆలోచిస్తున్నది. 'సాషా' తన కాళ్ళను కప్పుకున్న గొంగడిలో మెమ్మదిగా చాచుకున్నాడు. కాలివేళ్లు నొప్పి పెట్టసాగాయి.

"ఏమిటమ్మా, ఆలోచిస్తున్నావు?" - అని అడిగాడు.

'మాల్యూచికా' చటాలున ప్రక్కకు తిరిగింది.

"లేచావా?"

"ఆఁ ఇక నిద్రపోను."

"అప్పుడే పక్కమీదినుంచి లేవకు. శరీరం చాలా అలసిపోయి ఉన్నది."

గొంగడి సరిగ్గాకప్పి అతని ప్రశ్న అప్పుడే విన్నదానిలాగ యిలా అన్నది.

"మనవాళ్ళు యెప్పుడువస్తారాఅని ఆలోచిస్తున్నాను"

కళ్ళుపెద్దవిచేసి తల్లివైపు చూచాడు 'సాషా'.

"ఇక్కడికి, మన ఊరికేనా?"

"అవును. మనఊరికే"

"'రుడీ'కి గూడానా?" అని ఇంకా ఆశతో అడిగాడు.

"అవును. 'రుడీ'కి గూడా....అన్నిచోట్లకి వస్తారు. జర్మన్లు యెక్కడెక్కడయితేచేరి ప్రజల్ని నానాహింసలు పెడుతున్నారో అన్ని చోట్లకు——

"నాన్నగూడా యింటికివస్తాడా, అమ్మ?"

"అవును.... గెరిల్లాలతోపాటు మీ నాన్నగూడా తిరిగివస్తారు."

"మళ్ళీఅంతా మునుపటికిమల్లే అవుతుందా?"

"మునుపటికిమల్లే .... కాకపోతే అంతకంటే సుఖంగాకూడా ఉంటాము."

ఆమె మాట్లాడటం మానివేసి, మళ్ళీ మునుపటివిధంగా అంతా సౌఖ్యవంతం కావటం సాధ్యమేనా అని ఆలోచించసాగింది.... మళ్ళీ యింటిచుట్టూ చక్కని తోట పెరుగుతుంది. వన్నెవన్నెల పువ్వులు పూస్తాయి. కిలకిలలాడుతూ పిల్లలు బడికి పరుగెడుతారు. రొట్టె, పాలు మొదలైనవన్నీ కావలసినన్ని సాయంత్రప్పూట గ్రామస్తులందరూ క్లబ్బుకిచేరి పత్రికలు చదువు కుంటుంటారు....

జర్మన్లు యెన్నిచేసినా, యెన్నికష్టాలు కలిగించినా మళ్ళీ యివన్నీ తప్పక చేకూరుతాయి. నిజమే। 'మిష్కా' మళ్ళీ బడికి పరుగెత్తక పోవచ్చు: 'లివాన్యుక్' మళ్ళీ పొలాల్లో ఆనందంతో పాటలు పాడక పోవచ్చు; తిరిగి 'ఓలెనా' ట్రాక్టరు నడుపక పోవచ్చు. కాని జీవితం మళ్ళీ యెప్పటివిధంగా గంతులువేసుకుంటూ పురోభివృద్ధికి పోకమానదు। ఒక సంవత్సరాన్ని మించి మరొక సంవత్సరం పంటలు పండుతాయి: ఆవులు పాల నిస్తాయి: పిల్లలు చదువులకు పట్టణాలకి పోతారు. ఇవన్నీ జరుగకమానవు— తాను యెన్ని ప్రమాదాలు వచ్చినా, చలనం లేకుండా ధైర్యంగా నిలిచిఉంటే— ఇవన్నీ జరిగితీరుతాయి....

సూర్యుడు అస్తమిస్తున్నాడు. బంగారు వన్నెకాంతితో ఇల్లంతా నిండిపోయింది. అంతకంతకు చీకటి చిక్కబడిపోయింది, మంచులాంటి తెల్లదనంతోను, చల్లదనంతోను చంద్రుడు నెమ్మది నెమ్మదిగా ఆకాశంలోకి వచ్చి చేరుకున్నాడు.

గ్రామమంతా అశాంతితో కూడుకొన్న భయంకరమైన నిద్రలో మునిగి పోయింది.

'సాషా' తన పక్కలో ఒత్తిగిలి యేదో కలవరించటం ప్రారంభించాడు.

'మాల్యూచికా' లేచి కొడుకు దగ్గరికి వెళ్ళింది.

"నాయనా, 'సాషా'....!"

"ఏమిటి?" అని 'సాషా' ఉలిక్కిపడి లేచాడు.

"ఏమిటో కలవరిస్తున్నావు....చెడ్డకల పడ్డట్టుంది—"

'సాషా' తల్లివైపు చూచాడేగానీ ఆమె అన్నమాటలు యేమిటో తెలియలేదు. మళ్ళీ నిద్రలో మునిగిపోయాడు. కాని అంతలోనే మళ్ళీ యేదో భయంతో కలవరించటం ప్రారంభించాడు.

* * *

జర్మన్లు బంధించిన అయిగురుదురు ఖైదీలలో 'గ్రోఖాచ్' తప్ప అందరూ మేలుకొనే ఉన్నారు. 'మలాషా' ఇంకా ద్వేషాగ్నిలో మండిపోతూ, గంభీరంగా ఆలోచిస్తూనే ఉన్నది. మరొక రోజుగడిచిపోయింది! కాని యేమీ మార్పులేదు. దాహంతో గొంతు ఆరిపోతున్నది. కాని ఆమె కళ్ళముందు 'ఆ' రోజు కనిపిస్తూనే ఉన్నది....గ్రామంలో యేదోజరుగుతున్నది. ప్రజలు జీవిస్తున్నారు—చస్తున్నారు. పగటివేళ యేవో తుపాకి గుండ్ల శబ్దాలువినుపించాయి సాధారణంగా జర్మన్లు తమ గుండ్లను వృధా చెయ్యరు. ఎవరో చస్తున్నారన్నమాట! అందరూ చస్తున్నారు. కానితాను-'మలాషా'- మాత్రం తన గర్భంలో జర్మను శిశువుని, జర్మను పెంటను, పెంచుకొంటూ జీవిస్తున్నది....

'యోదోకిమ్' తాత దీర్ఘంగా ఒక నిట్టూర్పు విడిచాడు.

"ఏం? నిద్రరావటంలేదూ?"-అని 'చెకోరికా' అడిగింది.

"నిద్ర యెట్లా వస్తుంది? నీకు మాత్రం నిద్రవస్తున్నదా చెప్పు?"

"అదికాదు....ఇందాక వీధిలో వినబడ్డ తుపాకి కాల్పులు యెవరి మీద కాల్చివుంటారా అని ఆలోచిస్తున్నాను....దగ్గరలోనే కాల్చినట్టు వినబడినవికదూ?"

"దగ్గరో, దూరమో చెప్పటం కష్టం. ఇక్కడ ఉంటే యేవీసరిగ్గా తెలియదు. చర్చికంటే దగ్గర్లో మాత్రం అయి ఉండదనుకుంటాను."

"ఏమో, యేం చెప్పగలం?"

"మనం బయటపడ్డాక తెలుస్తుందిగా"—అని 'ఓల్గా' నెమ్మదిగా అన్నది.

" అదీ నిజమేలే– "

వాళ్ళంతా విముక్తిపొంది మళ్ళీ బయటికి పోతామని యితరుల నోటివెంట వినాలని ' ఓల్గా ' కుతూహలం. లేదు....తాము తప్పకవిముక్తి పొంది స్వేచ్ఛగా వుండే గ్రామస్థులతో మళ్ళీ స్వేచ్ఛగా తిరగ గలమని ఆమె వెర్రి నమ్మకం....ఒక నిట్టూర్పు విడిచింది.

" తాతయ్యా, నిద్రయెలాగూ రావటంలేదు. కాలం గడవటానికి యేదైనా ఒక కథ చెప్పరాదూ ?...."

" ఏం కథ చెప్పను ?....ఏమో .... కథ చెప్పబుద్ధి పుట్టటంలేదు " అన్నాడు ' యోదోకిమ్ ' తాత.

" పోనీ, యేదైనా పాటపాడు " అని ' ఓల్గా ' మళ్ళీ అడిగింది.

" ఏమిటి ? పాడటం ? ఇక్కడ ? "

" ఫరవాలేదు. మెల్లిగాపాడుమా....వాళ్ళకేమీ వినబడదులే...."

' యోదోకిమ్ ' తాత తల ఊపుతూ అన్నాడు ;

" సరే పాడతాను....కాని నాకు కొత్తపాటలేమీరావు. మా తాత యీ పాట పాడుతుండేవాడు. అది నాకుగూడా కంఠతావచ్చింది. చాలా పాతపాటలే...."

ముసలితనంతో వణుకుతున్న కంఠంతో ఇలా ప్రారంభించాడు.

" అవనిలో నెల్లెడా
అన్యాయమేగూడె
న్యాయంబు నెలకొల్ప
లేలెండీ, రారండీ...."

" ఉఁహుఁ....ఈ విధంగా పాడలేను. పూర్వం పాట చక్కని వాయిద్యాలతో పాడేవారు...."

" ఫరవాలేదు బాగానే వుంటుంది పాడు తాతయ్యా "

" కరుణింపుమో ప్రభూ !
దీవింపుమయ్యా !
న్యాయంబు నెలకొల్ప
పోరాడు వీరుల...."

" ఓ ప్రభూ ! న్యాయం కోసం, ధర్మంకోసం పోరాడుతున్నవారిని దీవించు– " అని ' చెకోరికా ' తనలోతాను అనుకున్నది.

పూర్వకాలంలో 'ఉక్రేనియను' ప్రజలు బానిస జీవితాలు గడుపుతూ, యుగయుగాలుగా కన్నీటికాల్వల దాటివచ్చినప్పుడు ఈ విషాద గీతిక ఉద్భవమయింది. సర్వమానవ స్వాతంత్ర్యాన్ని కలిగించి, అన్ని దేశాలను నిత్యకళ్యాణం, పచ్చతోరణంగా చేసిన సోవియటు ప్రభుత్వం వచ్చినతరువాత ఈ మాటలందరూ మరచిపోయారు. కాని నాజీపిశాచం ప్రళయతాండవ మాడుతున్న యీనాడు ప్రజలకు మళ్లీ ఆ విషాదగీతిక వినబడసాగింది. యుగయుగాల వెనుక కనబడిన నూతనత్వమే మళ్ళీ కనబడసాగింది.

"కరుణింపుమో ప్రభూ!
దీవింపుమయ్య —
న్యాయంబు నెలకొల్ప
పోరాడువీరుల...."

'యొడోకిమ్' తాత కంఠం కంపిస్తూ ఆగిపోయింది. నిద్ర కమ్ముకొని తలలు ఒరిగి పోయాయి.



# 9

నిద్రపోతున్న 'ఫెడోసియా' ఉలిక్కిపడిలేచి కూర్చున్నది. ఎవరో ఆమెను ఊపి మేల్కొల్పినట్టయింది. హృదయం దడదడ కొట్టుకొన సాగింది. గాభరాపడుతూ చుట్టూ చూచుకున్నది.

ఎవరు లేపారు? ఎప్పుడు నిద్ర ముంచుకొచ్చేసింది? అసలు నిద్ర రానే రాదనుకున్నది. అటువంటిది యెలా నిద్ర ముంచుకువచ్చేసింది? కాని యెవరు లేపినట్టు? ఎట్లా మెలకువ వచ్చేసింది!....

పోనీ యేదైనా శబ్దంవల్ల మెలకువ వచ్చిందంటే అదీలేదు. అంతా నిశ్శబ్దంగావుంది. చివరికి రోజూ వినబడే 'కర్ట్' గురక అయినా వినుపించటంలేదు. 'కర్ట్' ఇంకా యింటికి తిరిగి రానేలేదు. అయినా తనంతట తనకు మెలకువరాలేదు కూడాను. తప్పకుండా యేమిటో, యెదో ఆమెను మేల్కొలిపి ఉంటుంది. అందుకే ఆమె హృదయం అలా దడదడ కొట్టుకొంటున్నది.

ఆమె మళ్ళీ పడుకొనలేదు. జాగ్రత్తగా వింటున్నది. ఇంటిలోను; బయటాకూడా అంతా నిశ్శబ్దంగా ఉన్నది. సాయంకాలానికే గాలి జోరు తగ్గిపోయింది. రాత్రి ప్రశాంతంగావుంది చంద్రుడు ఆకాశంలో నెమ్మదిగా ప్రయాణం సాగిస్తున్నాడు. అతనిచుట్టూ ఒక వలయాకారం యేర్పడింది. కిటికీగుండా చంద్రుని చల్లని వెలుగులోపలికి పడుతున్నది.

హఠాత్తుగా కిటికీ అవతల యేదో అలికిడయింది. ఏదో చిన్న మూల్గి, బలవంతంగా గొంతు నొక్కినట్టు వినుపించింది. 'ఫెడోసియా' చటాలున లేచి రిక్తపాదాలతోనే నడవలోకి పరుగెత్తింది. తలుపు గొళ్ళెం మీద చెయ్యివేసి చూచేటప్పటికి అది తగిలించిలేదు. 'కర్ట్' ఇంకా యింటికి రాలేదన్నమాట.... రాత్రుళ్ళు యింటికి తిరిగివచ్చినప్పుడు తలుపు జాగ్రత్తగా బిగించుకుంటాడు....

నెమ్మదిగా తలుపు తెరిచింది. ఏవో నీడలు కదులుతూ కనుపించినై.

"ఎవరది ?"

అని యెవరో ఆమెను ప్రశ్నించారు. తక్షణం ఆమె గుర్తుపట్టేసింది. గుండె దడదడ కొట్టుకుంటుంటే రెండు చేతులతోను హృదయం గట్టిగా అదుముకున్నది.

"నేనే.... వాడింకా యింటికి చేరుకోలేదు.... నెమ్మదిగారండి" అని ఆమె నెమ్మదిగా అన్నది.

నడవలోకి చేరుకున్నారు. మొన్నటి ఎర్రసైనికుని ముఖం ఆమె గుర్తుపట్టింది.

"ఇంకా వాడు రాలేదు. సైనిక కార్యాలయంలో ఉండవచ్చు."

"అయితే యిక్కడి కెందుకు ? సైనిక కార్యాలయం దగ్గరికే పోదాం పదండి।"

"ఒక్కనిముషం ఉండండి....అది ఇక్కడే ఉన్నది—" అని తన లోని ఉద్రేకాన్ని అణుచుకుంటూ నెమ్మదిగా అన్నది 'ఫెడోసియా'

"అదంటే?"—వెళ్ళిపోవటానికి ఆత్రం కనబరుస్తూ కమాండరు అడిగేడు.

"వాడిముండ—"

"దానిపని రేపు చూడొచ్చులే—ఆ జర్మను దాని పనిరేపు...."

"అబ్బే, జర్మనుది కాదు. మనదేశపుదేను." అన్నది 'ఫెడోసియా'

"అలాగునా? ఏదీ, యెక్కడున్నది ?"

"ఆగదిలో నిద్రపోతున్నది."

"ఒకసారి చూద్దాము....ఏదైనా వెలుగు చూపించగలవా?"

"అమ్మో, కాపలా సైనికుడు కనిపెట్టెయ్యడూ।"

"ఎక్కడి కాపలా సైనికుడు....వాడిపని అప్పుడే పూర్తిచేశాం"

"అలాగైతే దీపం వెలిగిస్తాను"

అగ్గిపెట్టెకోసం వణుకుతున్న చేతులతో చీకట్లో వెతకసాగింది. వచ్చేశారు।....చివరికి మనవాళ్ళు వచ్చేశారు....

అందులో ఒక సైనికుడు ఆమెకు అగ్గిపెట్టె అందిచ్చాడు. దీపం వెలిగించి వత్తి యెక్కిచ్చింది.

"మనవాళ్ళను అయిదుగుర్ని జామీనుగా తీసుకెళ్ళి సైనిక కార్యాలయంలో ఖైదుచేశారు।

"ఇక భయం లేదమ్మా....మనవాళ్లు అప్పుడే సైనిక కార్యాలయం దగ్గిరికిగూడా చేరుకొన్నారు. ఆఖైదీలను విడిపించేస్తారు. గల్లంతులేకుండా యీ కెప్టెన్‌ని పూర్తి చేసిపారేద్దామని ఇక్కడికి వచ్చాము."

"ఉఁహూఁ వాడింకా తిరిగి యింటికి రాలేదు. అక్కడేపని మీద ఉండి వుంటాడు" అని చెపుతూ 'పుస్సీ' పడుకున్నగది తలుపు నెమ్మదిగా తెరిచింది. ఎర్రసైనికులు జాగ్రత్తగా మునివేళ్ళమీద నడుచుకుంటూ లోపలికి వెళ్ళారు. 'పుస్సీ' మీద వెలుగుపడేటట్టు 'ఫెడోసియా' దీపం పైకి యెత్తింది.

'పుస్సీ' లేచి, ఆలోపలకి వచ్చినది 'కర్ట్' అనుకుని విభ్రమత్తతోనే యేదో గొణిగింది. కాని జవాబురాలేదు. ప్రక్కకు తిరిగి, ముఖం మీదపడి ఉన్న జుత్తు తొలిగించుకొని చూచింది.

ఎర్రసైనికుల్లో ఒకడు 'ఫెడోసియా' చేతిలోంచి దీపం హఠాత్తుగా గుంజుకుని ముందుకి ఉరికి యిలా అరిచాడు.

"ఎవర్తెయిది?"

"జర్మను కెప్టెన్ పట్నంనుంచి తెచ్చుకున్న ముండ" అని 'ఫెడోసియా' అతనికి తెలియజేసింది.

'పుస్సీ' విభ్రాంతపోయి ఆ సైనికుణ్ణి చూడసాగింది. తొడుక్కున్న సిల్కుగౌను ఒక ప్రక్కకు తొలిగిపోయి ఆమె వక్షం బయటికి కనుపిస్తున్నది. భయంతో మంచం కొనకు పిచ్చుక పిల్లలాగ ముడుచుకుపోయింది. ఆ యెర్ర సైనికుడు కంపించిపోతున్నాడు. దీపపుకాంతిలో ఎర్రరంగువేసుకున్న 'పుస్సీ' గోళ్ళు, తళతళలాడే పళ్లు మెరుస్తున్నాయి.

"సిర్యోషా!"

ఆమె కంఠంవిని ఎర్రసైనికుడు తేరుకున్నాడు. శరీరమంతా వణకసాగింది. తనను కాపాడుకోటాని కన్నట్టు బలహీనంగా, సన్నగాఉన్న తనచేతిని అడ్డం పెట్టుకున్నది 'పుస్సీ'. రంగువేసిన గోళ్ళు యెర్రగా మెరుస్తున్నాయి. ఆమె గుండ్రని కళ్లు భయంతో నిండిపోయినై. జారిపోయిన సిల్కు గౌనులోంచి వక్షం అసహ్యంగా బయటికి కనుపిస్తున్నది.

బయటినుంచి తుపాకి శబ్దం వినుపించింది.

"సైనిక కార్యాలయందగ్గరే...." అన్నది 'ఫెడోసియా'.

ఇంకా కొన్ని తుపాకి గుండ్లశబ్దాలు అనేక వైపులనుంచి వినవచ్చినాయి.

'సిర్యోషా' తనచేతిలోకి పిస్తోలు తీసుకున్నాడు.

పరిచితమైన 'పుస్సీ' కండ్లల్లోకి రెప్పవాల్చకుండా చూచాడు. గుండుపేలింది. 'పుస్సీ' ఉలిక్కిపడింది. నోరు వెళ్ళబెట్టేసింది. కోరల లాంటి పళ్లు ధగధగ మెరుస్తున్నాయి. గుడ్లు యింతింతలు చేసింది. అలానే నిలిచిపోయినై.

"పదండి! సైనికకార్యాలయానికి" - అని 'సిర్యోషా' ఆజ్ఞ నివ్వటమే తరువాయిగా సైనికులందరూ బయటికి ఉరికారు.

సంఘర్షణ ప్రారంభమయింది. జర్మన్ల ఫిరంగులను స్వాధీనం చేసుకోటానికి నియోగింపబడ్డ సైనికభాగంలోని ఒక యెర్రసైనికుడు యిందాకిటి మొదటిగుండు పేల్చాడు.

జర్మను కెప్టెన్‌ని తుదముట్టించటానికి 'సిర్యోషా' కొంతమంది సైనికులతో వస్తుండగా, మరికొంతమంది జర్మను ఫిరంగులను స్వాధీనం చేసుకోటానికి అతి రహస్యంగా ప్రాకుకుంటూ వెళ్ళసాగారు. తెల్లని దుస్తుల సహాయంతో ఆ మంచులో కనబడకుండా ఫిరంగులదళం ఉన్న చోటికి చేరుకున్నారు. సార్జెంటు 'సెర్‌డ్యుక్' ఆదళాన్ని నడుపుతున్నాడు. తెల్లనిమంచు వాతావరణంలో ఫిరంగులు నల్లగా నోళ్ళు తెరచుకుంటూ కనబడుతున్నవి. ఆ సమీపంలో ముగ్గురు జర్మను సైనికులు ఒక దగ్గర కూర్చుని నెమ్మదిగా యేదో మాట్లాడుకుంటున్నారు. గస్తీ సైనికుడు ఫిరంగులముందు అటూ, ఇటూ తిరుగుతున్నాడు.

'సెర్‌డ్యుక్' ఊపిరి బిగబట్టుకుని కాచుకు కూర్చున్నాడు. గస్తీ సైనికుడు ఆ సమీపం వరకు వచ్చి వెనక్కి తిరిగాడు. అతని వీపు, ఆ పెనుతుపాకిలోని విప్పుకత్తి మసకగా కనుపిస్తున్నాయి. 'సెర్‌డ్యుక్' నెమ్మదిగా అటు కదిలి వాడిమీదికి లంఘించాడు. ఇద్దరూ మంచుమీదికి దొర్లిపోయారు. గస్తీ సైనికుడు కేక పెట్టేలోగా, 'సెర్‌డ్యుక్' అతని గొంతు నొక్కేశాడు. కాని తమ తోడిసైనికుడు కనబడకపోవటం తక్కిన జర్మనుసైనికులకు అనుమానం కలిగించింది.

"ఓయ్, హేన్స్!"— అని వారిలో ఒకడు గాభరాపడి కేక వేశాడు. అదేసమయంలో ఒక యెర్రసైనికుడు అజాగ్రత్తగా ఒక యెండు కట్టెపుల్లమీద కాలువేశాడు. శబ్దమయింది. అది విని జర్మను సైనికులు తుపాకులు తీస్తుండటం చూచి, ఆ యెర్రసైనికుడు తత్తరపడిపోయి, తనకు సమీపంలో ఉన్న ఒక జర్మను సైనికుడిమీదికి తుపాకి పేల్చాడు.

తక్షణం వాడు క్రింద కూలిపోయాడు. ఎర్రసైనికులకే ఆశ్చర్యం కలిగే టట్టు. మరుక్షణంలో తక్కినయిద్దరు జర్మనుసైనికులు నేలకుకూలటమూ, ఫిరంగులు యెర్రసైనికుల వశంకావటమూ జరిగిపోయింది. ఇంతలోనే జర్మనుకార్యాలయం వైపునుంచి వారివైపు తుపాకులు పేలసాగినై.

"పదండి, త్వరగా!"—అని 'సెర్‌డ్యుక్' అరిచేడు. అంత లోనే తమముందు నీడలు పరుగెత్తుకు రావటం కనుపించింది.

ఎర్రసైనికులు కొద్దిగానే ఉన్నారని గ్రహించి జర్మన్లు తుపాకులు పేల్చుకుంటూ ముందుకి ఉరికి వస్తున్నారు. 'సెర్‌డ్యుక్' క్రిందపడి పోయాడు. కుడికాలు బ్రహ్మాండంగా నొప్పిపెట్టింది.

"ఏం జరిగింది?"

"ఏం లేదులెండి .... ఇక కాల్చండి!"

ఒక జర్మనుసైనికుడు కూలిపోయాడు. ఐనా అంతటితో తక్కిన వాళ్ళు ఆగిపోలేదు. తెరిపిలేకుండా తుపాకులు కాలుస్తున్నారు.

"భూమ్మీద పడుకొని కాల్చండి!"

ఎర్రసైనికులు ఫిరంగుల వెనుక నక్కారు. తెల్లని మంచువాతా వరణంలో నల్లగా అగుపడుతున్న జర్మన్లను గుర్తుపట్టి కాల్చటం సులువై పోయింది. 'సెర్‌డ్యుక్' జాగ్రత్తగా గురిపెట్టి కాల్చుతున్నాడు. మందు గుండు సామాను వృథాచేయగూడదని అతని పట్టుదల. అతని నుదురు, ముక్కు, బుగ్గలు చల్లబడి పోయినాయి. తిరిగి తుపాకిలో తోటాలు నింపుకుంటూ ప్రక్కకి చూచుకునేటప్పటికి కాళ్ళదగ్గర మంచులో నల్లటి మడుగు కనబడ్డది.

"కాల్చండి! ఒక్కుమ్మడిగా — జోరుగా కాల్చండి!"

ఏమిటీ తన కాళ్ళ దగ్గర ఉన్నమడుగు? లాగూ అంతా తడిచి పోయింది. అలాంటి మంచులో గూడా మీద యెవరో నీళ్ళు దిమ్మరించి నట్టు యీ మడుగేమిటని ఆశ్చర్యం వేసింది.

జర్మన్లు రోడ్డు కటువైపు ఉన్న కందకంలో చేరి యేకధాటిగాకాలు స్తున్నారు 'సెర్‌డ్యుక్' తలకొద్దిగా పైకెత్తి చుట్టూ కలియజూచాడు. కందకంలోంచి, ఫిరంగుల దగ్గరికి, ఫిరంగుల దగ్గర్నుంచి కందకంలోకి రివ్వున పోతున్న ఆ తుపాకి కాల్పులకు యెడతెరిపి లేకుండావుంది. ఈ లోగా గ్రామమంతటా తుపాకి కాల్పులు మిన్నుముట్టేలా అందుకున్నాయి. ఏది యెట్లా పరిణమించేది తెలియటంలేదు. కాని తనమొక్క, తనతో

పాటు ఉన్న ఆ అయిదుగురు సైనికులయొక్క అవసరం యితరచోట్ల యెంతయినా ఉంటుందని ' సెర్‌డ్యుక్ ' నిశ్చయించుకున్నాడు.

" కామ్రేడ్స్! ఇట్లా కాల్చుతూ కూర్చుంటే లాభంలేదు. ముందుకి ఉరుకుదాం పదండి! దేశమాతకోసం! స్టాలినుకోసం!! ముందుకి ఉరుకుదాం పదండి —"

ఒక్కుమ్మడిగా అందరూ ముందుకి ఉరికారు. ముందుకు వంగి విచ్చుకత్తులతో కందకంవైపుకి తుపాకి గుండ్లవర్షంలో పరుగెత్తుతున్నారు. నాలుగు అంగల్లో కందకంలోని జర్మన్లమీద దూకేరు. కందకంలోని తుపాకుల శబ్దం ఆగిపోయింది.... మరుక్షణంలో జర్మనుసైనికుల శవాలు దొర్లాడ సాగినాయి.

" ఇక నెక్కడికిపోదాము ?"—అని ఒక యెర్రసైనికుడు రొప్పుకుంటూ ప్రశ్నించాడు.

కాని ' సెర్‌డ్యుక్ ' నుంచి జవాబురాలేదు. అందరూ ఆశ్చర్యంతో వెనక్కి తిరిగి చూచారు.

" కామ్రేడ్, సెర్‌డ్యుక్! ఎక్కడున్నావు ?"

" ఏదో ప్రమాదం జరిగింది " అని ' సెర్‌డ్యుక్ ' ప్రాణమిత్రుడు ' అలెగ్జి ' భయపడ్డాడు.

" మనతోపాటు వచ్చాడా ?"

" పిచ్చా యేం నీకు ? మనతోపాటు పరుగెత్తుకొస్తేను "

" మరి యేమైనట్టు? "

" ఇదుగో, యిక్కడున్నాడు! " అని ' వన్యా ' కేకపెట్టాడు.

' అలెగ్జి ' అటువురికాడు.

' సెర్‌డ్యుక్ ' ఫిరంగులున్న స్థలానికి, కందకానికీ మధ్యపడిపోయి ఉన్నాడు. తుపాకి యింకా పిడికిట్లోనే వున్నది.

" ఏంజరిగింది? " అని ' వన్యా ' నెమ్మదిగా అడిగేడు.

' అలెగ్జి ' మాట్లాడకుండా నేలవైపు చూడసాగాడు. కొద్దిదూరంలో ఒక రక్తపుమడుగు, అక్కడినుంచి ' సెర్‌డ్యుక్ ' పడివున్న చోటువరకు రక్తపుచారమంచుమీద చంద్రుని కాంతిలో కనబడుతున్నాయి.

" దెబ్బ యెక్కడ తగిలిందో ? "

'అలెగ్జి' ఇంకామౌనంతోనే 'సెర్ద్యుక్' కాలివైపుచూపించాడు కుడికాలు వికృతంగా విరిగిపోయి కనుపిస్తున్నది. దానిచుట్టూ నల్లని మడుగు యేర్పడ్డది.

"కాలు పూర్తిగా విరిగిపోయింది...."

"చూడండి! అప్పటికీ ఇంతదూరంవరకు పరుగెత్తుకువచ్చాడు!!"

"ఇక నాలస్యంచేసి లాభంలేదు. పదండి: సైనికకార్యాలయం దగ్గర పరిస్థితులు విషమిస్తున్నట్టున్నాయి."

అందరూ ముందుకి ఉరికారు. ఈసారి 'అలెగ్జి' నాయకత్వం వహించాడు. చలిబాధ శరీరంమీద కత్తివేట్లు వేస్తున్నట్టుగా ఉన్నది. ఊపిరి పీల్చటంగూడా బాధగా ఉన్నది.

* * * *

మొదటి తుపాకిగుండు మ్రోగినప్పుడు 'కర్ట్' సైనిక కార్యాలయం లోపల నిద్రపోతూవున్నాడు. కేంద్ర సైనిక కార్యాలయంనుంచి యేక్షణంలో టెలిఫోనులో పిలుస్తారోనన్న భయంచేత ఇంటికైనా పోకుండా అక్కడే పడకవేశాడు. పూర్తి దుస్తులతోనే కంబళి కప్పుకొని నిద్రపోతున్నారు. గదికి అటువైపు సార్జెంటు పడుకుని గాఢంగా నిద్ర చేస్తున్నాడు. ప్రక్కగదిలో సైనికులు దొరికిన చోటల్లా పడుకొని గుర కలుపెట్టి నిద్రపోతున్నారు. చాలాసేపటివరకు 'కర్ట్' టెలిఫోను పిలుపు కోసం కాచుకుని కూర్చున్నాడు. చివరికి నిద్రపట్టింది. ఆతర్వాత తుపాకి దెబ్బవిని మెలకువ వచ్చింది.

'వెధవలెవరో గ్రామస్థులు బయటతిరిగారు గాబోలు' అనుకున్నాడు. అలాతిరుగుతుంటే తన సైనికులు వాళ్ళను కాల్చి చంపిఉంటారని అతడు ఉద్దేశపడ్డాడు. తన ఆజ్ఞలను లెక్కచేయకుండా గ్రామస్తులిలా తిరుగుతున్నారని కోపంకూడా వచ్చింది.

కాని అంతలోనే మరొకకాల్పు, ఆతర్వాత ఇంకొకకాల్పు, యీ విధంగా వినబడసాగినాయి. 'కర్ట్' ఉలిక్కిపడి లేచాడు.

"'సాసి'! లెగు!"

సార్జెంటు 'సాసి' అప్పటికే లేచిపోయాడు. కొందరు సైనికులు లోపలికి పరుగెత్తుకుంటూ వచ్చారు.

"బోల్షివిక్‌లు గ్రామంలోకి వచ్చేశారు!"

"తలుపులు బిగించెయ్యండి! దీపం ఆర్పెయ్యండి!" - అని 'కర్ట్' తక్షణం ఆజ్ఞాపించాడు. తలుపులు బిగించటానికి సైనికులు ఉరికారు.

టెలీఫోను ఉన్నగది ఆ యింట్లోకల్లా పెద్దది, ఆత్మరక్షణకు అనుకూలమైనది. ఈ విధంగా తాను ఆత్మరక్షణ చేసుకోవలసి వస్తుందని 'కర్ట్' అనుకోనప్పటికీ, యథావిధిగా ఆత్మరక్షణకు అవసరమైన యేర్పాట్లన్నీ చేసుకునే ఉన్నాడు. పెద్దదిగానూ, బలంగానూ ఉన్న తలుపులకు యినుపపట్టీలుగూడా వేయించాడు. గోడలకు క్రింది భాగంలో కన్నాలు వేయించి ఉంచాడు. పురాతనపు కట్టడ మవడంచేత ఆభాగం చాలా దిట్టంగా ఉన్నది. సైనికులు పడుకునే భాగము, ఖైదీలను ఉంచినభాగము ఈ మధ్య కట్టించినవి. ఈ యిల్లు గ్రామ సోవియటు కార్యాలయంగా ఉంటున్నప్పుడు యీ క్రొత్తగాకట్టిన భాగాన్ని "రెడ్ కార్నర్" (ఎర్ర మూల) అని పిలుస్తూ ఉండేవారు. ఇక్కడే గ్రంథాలయం ఉంటుండేది. ఈ భాగం సర్వసాధారణంగాఉన్నది. కాని టెలీఫోను గదిమాత్రం దిట్టంగా ఒక కోటలాగ ఉన్నది.

"గోడల కన్నాలు తెరువండి"

సైనికులు గబగబ గోడలకన్నాలను తెరిచి, ఇసుక బస్తాలను అమర్చారు. కన్నాలగుండా చల్లనిగాలి వీస్తున్నది. బోర్లపడుకుని కన్నాల గుండా తుపాకులు పేల్చటం ప్రారంభించారు.

"కేంద్ర కార్యాలయానికి టెలీఫోను చెయ్యండి! త్వరగా!" — అని 'కర్ట్' యింకొక ఆజ్ఞనిచ్చాడు.

ఇందాక బయటనుంచి పరుగెత్తుకుంటూవచ్చిన కాపలా సైనికులలో ఒకణ్ణి ప్రశ్నించాడు.

"గెరిల్లా దళమేనా?"

"కాదు - ఎర్రసైనికులు"

"చాలామంది ఉన్నారా?"

"ఏమో, తెలియదండీ! అన్నివైపులనుంచీ కాల్పులు జరుగుతున్నాయి. చుట్టూ ముట్టడించి ఉండవచ్చు"

"కేంద్రకార్యాలయానికి తెలియపర్చారాలేదా?"—అని 'కర్ట్' మండిపడుతున్నాడు.

"లేదండీ - టెలీఫోను చెడిపోయింది"

'కర్ట్' కోపంతో టేబిలుదగ్గరికి ఉరికి టెలిఫోను రిసీవరు 'సాసి' చేతిలోంచి గుంజుకొని నోరు చించుకుంటూ కేకలు వెయ్యటం ప్రారంభించాడు. కాని యేమీ లాభంలేకపోయింది. జవాబు రావటంలేదు.

"గాడిదకొడుకులు - తీగలు తెంపేసినట్టున్నారు" — అంటూ రిసీవరు అవతలికి విసిరేశాడు.

"ఇది లేకపోతే మానెలె.... అది లేకుండానే గడుపుదాం"

వీధుల్లోంచి కాల్పులు తీవ్రంగా సాగుతున్నాయి. తుపాకిగుండ్లు గోడలకు తగులుతున్న చప్పుడు వినుపిస్తున్నది. ప్రక్కగదిలోంచి, తుపాకిమడమలతో తలుపుమీద బాదుతున్న శబ్దం వినవస్తున్నది, కాని తలుపు కదలటంలేదు.

"బాదండి—మీయిష్టం వచ్చినట్టు బాదండి" అని 'కర్ట్' గొణిగాడు. తలుపులు చాలా దిట్టమైనవని అతని ధైర్యం—

* * * *

సైనిక కార్యాలయంపై దాడి లెఫ్టినెంటు 'షెలావ్' నాయకత్వంలో సాగుతున్నది. మొదటి ద్వారం పగులగొట్టుకొని సైనిక కార్యాలయపు భవనంలోకి అడుగుపెట్టేలోగా, ఇంవాక ఫిరంగులు వశపరుచుకున్న సైనికులు పరుగెత్తుకుంటూ వచ్చారు.

"'సెర్డ్యుక్' యేడీ?"

"చచ్చిపోయాడు—ఫిరంగులు వశపర్చుకున్నాము."

మొదటి గదిలో చిందరవందరగా పడివున్న సామాన్లు తప్ప జర్మనుసైనికుల జాడ యేమీ కనుపించలేదు.

"పిరికి పందలు—ఆగదిలో దాక్కున్నారు"

"ఇంకెక్కడికి తప్పించుకు పోగలరు—"

గోడలలోని కన్నాలగుండా, యెర్రసైనికులు వశపర్చుకున్న గదిలోకి జర్మన్లు తుపాకులు పేల్చసాగారు.

"బయటికి పదండి! అక్కడినుంచే వీళ్ళపనిపడదాము!"

బయటికి పోయి ఇంటిని చుట్టుముట్టడించారు. కాని యిల్లు చాలా దిట్టంగా కోటలా ఉన్నదన్న విషయం త్వరలోనే గ్రహించారు. తుపాకిగుండ్లు తగిలి చినచిన్న పెళ్ళలు ఊడటం తప్ప భవనం దుర్భేద్యంగా ఉన్నది. గోడల కన్నాలలోంచి తుపాకి గుండ్లు యేకధాటిగా ప్రవహిస్తున్నాయి.

"ఇష్టంవచ్చినట్టు కాల్చేస్తున్నారు"—అన్నాడు 'షెలావ్'

"ఆత్మరక్షణకి బాగా తయారైనట్టున్నది, కామ్రేడ్"

గ్రామమంతటా తుపాకుల కాల్పులు ప్రతిధ్వనిస్తున్నాయి. ఒక్కొక్క యెర్రసైనిక భాగమే తమ నియమిత స్థానాల్లో పోరాటం సాగిస్తున్నాయి. ముట్టడింపబడ్డ సైనిక కార్యాలయంనుంచి వచ్చేకాల్పులు మాత్రం అన్నిచోట్లకంటే తీవ్రంగా ఉన్నాయి.

"కామ్రేడ్స్! ప్రొద్దు పొడిచేలోగా పని పూర్తయిపోవాలి. లేకపోతే యీలోగా వీరి సహాయానికి మరికొంత సైన్యం రావచ్చును—మన శ్రమంతా వ్యర్థమైపోతుంది...."

ఏ అడ్డు దొరికితే దానిని ఉపయోగించుకొని, తుపాకి మూతులు దూర్చి కాలుస్తున్న సైనిక కార్యాలయపు గోడలలోని కన్నాల్లోకి గురి చూచి కాల్చ నారంభించారు. కాని యేమీ లాభంలేకుండా ఉన్నది. ఎదుటి నుంచి వస్తున్న గుండ్లవర్షం ఒక్క నిముషమైనా ఆగటంలేదు.

*  *  *  *

'లివాన్యుక్' యింటిలో నిద్రపోతున్న జర్మన్లపైకి అకస్మాత్తుగా యెర్రసైనికులు ఉరికారు. ఆ గలాభాకి జర్మన్లు ఉలిక్కిపడుతూ లేచి తుపాకులకోసం వెతుకుతున్నారు.

"నేలకి కరిచిపెట్టుకు పడుకో!"- నిర్ఘాంతపోయి చూస్తున్న 'లివాన్యుక్' నుద్దేశించి ఒక యెర్రసైనికుడు కేకవేశాడు. 'లివాన్యుక్' తన చిన్న కొడుకుతోపాటు మంచంకిందికి నక్కింది. కాని యేమి జరుగుతున్నదో ఆమె గ్రహించేలోగా మళ్ళీ అంతా నిశ్శబ్దమైపోయింది. మంచం క్రిందినుంచివచ్చి చూసుకునే సరికి జర్మను సైనికులు నేలమీద చచ్చిపడి ఉండటమూ, యెర్రసైనికులు మాయం కావటమూ కనిపించింది.

"నాయనా, 'వాస్యా' ఇటొచ్చి సాయంచెయ్యి; ఈ పీనుగల్ని అవతల పారేద్దాము." అని ఇంకా వణుకుతూనే అన్నది. ఇద్దరూ కలిసి ఆ పీనుగల్ని బయటికి ఈడ్చివేయసాగారు. ఆయాసపడుతూ, రెండుకాళ్లూ పట్టుకొని శవాలను ఈడ్చుతున్నారు. 'వాస్యా' పన్నెండేళ్ళ బాలుడు. 'లివాన్యుక్'కి నెలలు నిండినగర్భం.

"నెమ్మదిగా....ఎందుకంత తొందర?"- కొడుకుతో అన్నది.

కాని 'వాస్యా'కి నిజంగానే తొందరగావుంది. ఇందాకనే యెర్ర సైనికులతోపాటు వీధుల్లోకి ఉరకాలనుకున్నాడు. కాని యీలోగా యీ

పీనుగల్ని యీడ్చేపని తగులుకున్నది. వీధుల్లో పరుగెడుతూ అంతా చూడాల్సిన సమయంలో, ఈ పీనుగల్ని యీడ్చుకుంటూ కూర్చోవడ మేమిటి ? అక్కడికిపోతే తనకుగూడా ఒక తుపాకి యిస్తారేమో ? ఏమో, యివ్వవచ్చుగూడా....

ఇంతకాలమూ ఆవహించిఉన్న భయంకర నిశ్శబ్దం, తుపాకి కాల్పులతో మటుమాయమైపోయింది. మునుపటి విధంగాకాక ప్రజలందరూ నిర్భయంగా వీధుల్లో ఉరుకులాడుతున్నారు.

"కామ్రేడ్స్! ఒక్క జర్మనువాడైనా తప్పించుకు పోకుండా చూడాలి. జాగ్రత్త" - అని యెర్రసైనికులు భాగాలు విడిపోయి గ్రామం లోకి వస్తున్న సమయంలో వాళ్ళ 'కమాండర్' అన్నాడు. తమ విజయ మంతా దానిమీదనే ఆధారపడి వుందని ఎర్రసైనికులకు తెలుసు.

ఒకొక్కస్థలంలో ఉన్న జర్మన్లు ఒక్కొక్కవిధంగా ప్రవర్తించారు. కొందరు యిండ్లలోచేరి ఆత్మరక్షణ చేసుకొనసాగారు మరికొందరు. యిండ్లల్లోంచి బయటికి ఉరికివచ్చి, దొరికినమాటునల్లా ఉపయోగించుకొని, తుపాకులు తీవ్రంగా కాల్చనారంభించారు.

"మాకు అడ్డు తగలకండి! ప్రక్కకుతొలగండి!" అని 'సిర్యోషా' స్త్రీలను ఆదిలించాడు. నేల యీనినట్టుగా స్త్రీలందరూ వీధుల్లో గుంపులు గుంపులుగా తిరగనారంభించారు.

"కామ్రేడ్స్! నాయింట్లో ఆరుగురు జర్మన్లున్నారు. తొందరగా రండి!" అని 'పెల్ చారికా' ఉద్రేకంతో ఒక యెర్రసైనికుని చెయ్యి పట్టుకొని చెప్పింది.

"ఎక్కడది ?"

"ఇక్కడే....నాతోరండి చూపిస్తాను...." అని అమిత ఉత్సాహంతో అన్నది.

ఎర్రసైనికులు కొందరు ఆమెవెంట వెళ్ళారు. కాని అప్పటికే జర్మనుసైనికులు, యింతకుముందే గోడలలోవేసి ఉంచిన కన్నాలలోంచి తుపాకులు పెట్టి పేల్చసాగారు. ఎర్రసైనికులు గూడా అటు తుపాకులు పేల్చనారంభించారు.

ఎర్రసైనికులతోపాటు 'పెల్చారికా' గూడా భూమిమీద పడుకుని చూడసాగింది. ఆమెకు సమీపంలో ఉన్న ఒక యెర్రసైనికుడు చేతితో గుండె అదుముకుని మూల్గుతూ పడిపోయాడు.

"కామ్రేడ్స్! ఇట్లా లాభంలేదు. అనవసరంగా అందరూ చచ్చి పోవలసివస్తుంది. ఇంటికి నిప్పు అంటించెయ్యండి. వదిలి పోతుంది!"

"ఇల్లునీదేనా?"

"అవును నాదే! తగలబెట్టెయ్యండి!"

"లోపల యింకెవ్వరూ లేరా?"

'పెల్ చారికా' పిడికిలి బిగిస్తూ అన్నది.

"పెద్ద పిల్లలంతా పారిపోయారు పసిబిడ్డ......పసిబిడ్డ మాత్రం ఉయ్యాలతో ఉండి పోయింది"

"మరి తగుల బెట్టటం యెట్లా?....నీకు పిచ్చెక్కిందాయేం?

"ఫరవాలేదు ...ఫరవాలేదు నాబిడ్డకోసం మీరందరూ చావటానికి వీల్లేదు....సంశయించకండి....నేచెబుతున్నాగా? తగుల బెట్టెయ్యండి"

"ఏమిటమ్మా! బిడ్డతోపాటే తగులబెట్టెయ్యమంటావా?"

"తగులబెట్టెయ్యండి! నేను ఒప్పుకున్నతర్వాత మీ కేం భయం? తగుల బెట్టెయ్యండి."

ఇంకొక యెర్రసైనికుడు చేతికి దెబ్బతగలగా కట్టు కట్టు కుంటు న్నాడు. కట్టులోంచి రక్తం చిమ్ముతున్నది.

ఎర్రసైనికులు 'పెల్‌చారికా' మాటలు వినుపించుకోకుండానే తుపాకులు పేలుస్తున్నారు. కాని ఆమెమాత్రం ఆ మాట వదలటంలేదు.

"ఇక నువ్వు యిక్కడ్నుంచి తప్పుకోవమ్మా. అనవసరంగా నువ్వుకూడా చచ్చిపోతావు. ఇటు కాలుస్తున్నారు గమనించటంలేదూ?"

"ఏడిశారు....ముసిలిముండను నన్నేంచంపుతారు...."

ఒక కన్నంలోంచి వచ్చే తుపాకిగుండ్ల ధార ఆగిపోయింది.

"అదుగో! చూచావా? సరిగ్గాగురి చూచి కాల్చినట్టయితే అంతా సక్రమంగానే జరిగిపోతుంది."

"పోనీ, యిల్లు తగలబెట్టదలుచుకోకపోతే, పైకెక్కి కప్పులోంచి దిగితేనో?"

"నిజమే; అది బాగుంది. ఎటునుంచి దిగాలో చూపెట్టగల వమ్మా!"

కొందరు వెనుకనే ఉండిపోయి, మునపటికంటే రెండింతలు బలంతోటి తుపాకులు పేలుస్తున్నారు. తక్కినవాళ్ళు 'పెల్‌చారికా' వెంట వెళ్ళారు. కొద్దిసేపట్లో జర్మన్లను ముఖాముఖిగా యెదుర్కొన్నారు.

'పెల్‌చారికా' తలుపుతెరిచి కేకవేసింది.

"ఇక కాల్చకండి!"

బయటనున్నవారుకూడా లోపలికి ఉరికారు. జర్మన్లలో ఒకడు తుపాకిదెబ్బకు గురి అయి చచ్చిపోయాడు. తక్కినవాళ్ళు ఎర్రసైనికుల పిచ్చుకత్తులకు యెర అయి ప్రాణాలు విడిచారు.

"'సిర్యోషా' చూశావా వీడ్ని సరిగ్గా తలకు గురిపెట్టికాల్చాను" అని ఒక యెర్రసైనికుడు విజయగర్వంతో ఉప్పొంగిపోతున్నాడు.

'పెల్‌చారికా' ఉయ్యాలదగ్గరికి పరుగెత్తింది.

"బిడ్డనుచంపేశారు!"—ఆమె రుద్ధకంఠంతో అన్నది.

పసిబిడ్డ రక్తపు మడుగులో పడివున్నది. తల పగులగొట్టబడ్డది.

"భయపడి యేడ్చి వుంటుంది....పశువులు తల పగులగొట్టి చంపేశారు...."

'పెల్‌చారికా' తనబిడ్డ శవం చేతుల్లోకి తీసుకొని నిర్జీవమైన చూపులతో చూస్తూ, గంభీరంగా అన్నది.

"చూశారా? ఈ బిడ్డకోసం యిల్లు తగులబెట్టమన్నారు....అందుకొరకు అనవసరంగా యిద్దరు సైనికులు గాయపడవలసివచ్చింది."

"ఊరుకో, అమ్మా....ఊరుకో...."

"ఉహుఁ. నేను దుఃఖపడను. కాని నాకుగూడా ఒక తుపాకి యివ్వాలి...."

గ్రామంలో తుపాకి కాల్పులు తగ్గుతూ వచ్చినై. సైనిక కార్యాలయందగ్గర తప్ప తక్కినచోట్ల పోరాటం ముగిసిపోయింది. అప్పుడే చంద్రుడు ఆకాశంలోంచితప్పుకుంటున్నాడు. తెలతెలవార నారంభించింది. ప్రపంచమంతా నీలిరంగు ముద్దలాగ కనుపిస్తున్నది. ఆ నీలి వాతావరణంలో సైనిక కార్యాలందగ్గర పేలుతున్న తుపాకులు కక్కేమంటలు మాత్రం యెర్రగా అగుపడుతున్నాయి.

"కామ్రేడ్స్! ఇట్లా లాభంలేదు. కిటికీలు అంత బలంగా ఉండక పోవచ్చు. వాటిమీద ఒక చేతిబాంబు విసిరితే తీరిపోతుంది!"

"కాని అట్లా తెరిపిలేకుండా కాలుస్తుంటే, కిటికీదగ్గరకి చేరుకునేదెట్లా?"

నిజంగానే తుపాకిగుండ్లు వర్షధారలాగ యెడతెరిపిలేకుండా వస్తున్నాయి. ఆ గుండ్లవర్షంలో మంచు మేఘాల్లాగ పైకి లేస్తున్నది.

"తెల్లవారేటట్టున్నది" అన్నాడు 'షెలావ్.' ఆకాశంవంక చూస్తూ ఆకాశంలో అప్పుడే అరుణఛాయ సన్నసన్నగా అగుపడసాగింది. పోరాటం తాను అంచనా వేసుకున్నదానికంటే యెక్కువకాలం తీసుకుంటున్నది. తెల్లవారిపోతే జర్మన్లకు సహాయంకూడా రావచ్చును చీకటి సమయంలో యెన్నివిషయాలైనా మరుగుపర్చి ఉంచవచ్చు. తెల్లవారిందంటే, తక్కువగా ఉన్న యెర్రసైనికులగుట్టు బయిటపడిపోయి జర్మన్లకు ధైర్యం కలుగుతుంది. కేంద్రకార్యాలయంవారు యేమాత్రం శ్రద్ధవహించినా టెలీఫోను తీగలు తెగిపోయి ఉన్నట్టు గ్రహించగలరు. ఆ తర్వాత పరిస్థితులన్నీ తారుమారై పోగలవు—

"సరే, యేం చేద్దామంటారు కామ్రేడ్స్?"

"చేతి బాంబు విసిరితేగాని మనం యేమీ చెయ్యలేము."

"అయితే ప్రయత్నిద్దాము" - అని 'సిర్యోషా' అన్నాడు.

"కాని ప్రయత్నించేదెట్లా?"

"నేను ప్రయత్నిస్తాను...."

'సిర్యోషా' రెండవవైపుకి తిరిగివెళ్ళాడు. గోడకు కన్నాలులేని వైపు ప్రాకుకుంటూ వెళుతున్నాడు. తుపాకి గుండ్లు అతనికి తగులుతాయన్న భయంతో యెర్రసైనికులు కాల్చటం ఆపేశారు.

"ఏమిటీ, అతనిఉద్దేశం?" - అని తనలోతాను అనుకున్నాడు 'షలావ్' భయపడుతూ. 'సిర్యోషా' అతి జాగ్రత్తగా ప్రాకుకుంటూ పోతున్నాడు.

తెలతెలవారుతున్న వెలుగులో గోడ కన్నంలోంచి ఒక మెషిన్ గన్ ఇటూ, అటూ కదులుకుంటూ గుండ్లవర్షం కురిపిస్తున్నది.

'సిర్యోషా' ఒక్క గంతువేసి ముందుకి ఉరికాడు. ఎర్ర సైనికులు అతడు యేమిచేస్తున్నాడో అర్థం చేసుకునే లోగానే, యెదుటినుంచి వస్తున్న గుండ్లవర్షానికి, యెర్రసైనికులకు మధ్య పరుగెత్తి చేతిబాంబుల కట్టనొకదానిని కిటికీమీదికి జోరుగా విసిరాడు. గలగలమన్న శబ్దము, ఆ తర్వాత బ్రహ్మాండమైన ప్రేలుడు కలిగి పొగతో మేఘాలు యేర్పడ్డాయి. పెద్దమంటలేచింది. కిటికీముందున్న 'సిర్యోషా', గాలిలోకి యెగిరి, కొంతసేపటికి భూమిమీద పడ్డాడు. భగభగ మండుతున్న ఆ మంట వెలుగులో, అతనిశరీరం నల్లగా అగుపడుతున్నది. కొన్ని క్షణాలు కాళ్ళు చేతులు కొట్టుకొని ప్రాణాలు విడిచాడు.

"పదండి, ముందుకి!" - అని షెలావ్ ఆజ్ఞనిచ్చాడు.

కిటికీపైపుకి ఉరికారు. మెషిన్‌గన్ ఒక మూలపడిఉన్నది. దాని నిండా రక్తం! దానిని ఉపయోగిస్తూ ఉండిన సైనికులు చచ్చిపడిఉన్నారు. చేతిబాంబులు వాటిపని అవి చేసినాయి.

"పదండి - పదండి!"

కిటికీ అద్దాలపెంకులు గీసుకుంటున్న సంగతి గుర్తించనయినా గుర్తించకుండా, చేతిబాంబులవల్ల యేర్పడ్డ సందుల్లోంచి లోపలికిదూకారు. మంటలు పైకి లేస్తూనే వున్నాయి.

"మన మనుష్యులు లోపలఉన్నారు!" - అని 'మాల్యూచికా' యెలుగెత్తి కేకవేసింది.

సైనిక కార్యాలయంలో ఉన్న అయిదుగురు ఖైదీలసంగతి అప్పుడు అందరికీ గుర్తొచ్చింది.

ఆ అయిదుగురు ఖైదీలు చీకటిగదిలో ఆత్రంతో యెదురుచూస్తూ కూర్చున్నారు. వారికి నిద్ర పట్టకపోవటంచేత మొట్టమొదటి తుపాకికాల్పు గూడా విన్నారు. కాని దడదడ కొట్టుకునే వారి గుండెచప్పుడుకూడా వినబడే ఆ నిశీథంలో అదిగూడా తమ గుండెచప్పుడే అనిపించింది వారికి. ఒకక్షణం నిరీక్షించారు. మళ్లీ ఒకకాల్పు వినబడింది. సర్వసాధారణంగా వినబడే గస్తీసైనికుని తుపాకిమోతగూడా కాదది.

"మనవాళ్ళు వచ్చేశారు!" అని చెకోరికా ఉద్రేకంతో అన్నది.

"అవును, మనవాళ్ళే!"— 'ఓల్గా' ఉత్సాహపడింది.

'మలాషా' లో మాత్రం యేలాంటి చలనమూ కలగలేదు. మునుపటి పధంగానే నిశీథంలోకి అర్థంలేని చూపులు చూచుకుంటూ కూర్చున్నది.

"చర్చిదగ్గర...." అన్నాడు 'యూడోకిమ్' తాత

"ఫిరంగుల దగ్గరేకదూ...."

గోడప్రక్కనే ఒక తుపాకి కాల్పు వినబడింది. 'ఓల్గా' భయంతో కేకపెట్టింది.

బోనులో చిక్కుకున్నట్లున్నది వారి పరిస్థితి. ఆ చీకట్లో యేమీ కనబడటంలేదు. బయటినుంచి తుపాకి ప్రేలుడు శబ్దాలు, ప్రజల సందడి వినబడుతున్నాయి. కాని యేమి జరుగుతున్నదీ వారికి తెలియటంలేదు.

ఎఱ్ఱసైనికులువచ్చి విడిపించేలోగా జర్మన్లు తమను తుద ముట్టిస్తా రనుకున్నాడు 'గ్రోఖాచ్.' కాని స్త్రీలు భయపడతారని పైకి అనలేదు. బయట జరుగుతున్న గందరగోళం ఉద్రేకపూరితుడై వింటున్నాడు. తుపాకి దెబ్బల ధాటికి యేదో తలుపు పడిపోవటము, ఆ తర్వాత ప్రక్క గదిలో కాళ్ళచప్పుడు వినుపించాయి. తలుపుమీదపడి దబదబ కొడుతూ 'గ్రోఖాచ్' అరవటం ప్రారంభించాడు.

"ఓయ్! ఎవరక్కడ? మమ్మల్ని విడిపించండి - మమ్మల్ని విడి పించండి!"

కాని బయటి గందరగోళంలో అతనికేకలు యెవరికీ వినబడలేదు.

"రండి! మీరుకూడారండి. లేకపోతే మనమాటే మరిచిపోతారు; ఇంకెంతసేపు యిక్కడుండగలం...."

'ఓల్గా' ఒక్కగొంతులోవెళ్ళి తలుపుమీదబాదటం ప్రారంభించింది 'చెకోరికా' కూడా ఆమెతో కలిసింది.

"ఎవరక్కడ? మమ్మల్ని విడిపించండి!"

బయటి తుపాకి కాల్పులు, కేకలు మొదలైన గలభాలో వారి కేకలు యెవ్వరికీ వినుపించటంలేదు.

"గట్టిగా బాదాలర్రా! గట్టిగాబాదాలి. లేకుంటే వాళ్ళకసలు విన బడదు"

"ఏమిటిది? మనసుగురించి గ్రామస్థులెవ్వరూ చెప్పలేదా యేం? మనసంగతి అసలుకే మరిచిపోయారా యేం?

తలుపుమీద విరామంలేకుండా బాదుతున్నారు. ఇంతలో మళ్ళీ ప్రక్కగదిలో కాళ్ళచప్పుడు వినుపించింది. కాని యెఱ్ఱసైనికులు బయటికి వెళ్ళిపోతున్న చప్పుడది! కొంతసేపటి వరకు అంతా నిశ్శబ్దం. ఖైదీలకు వాళ్ళ పాదాలక్రింద పెద్ద అఘాతం తెరుచుకున్నట్లయింది! విముక్తి పొంద గలమన్న ఆశ మటుమాయమై పోయింది!!

"ఏమిటిది? మనవాళ్ళు పారిపోతున్నారా యేం?" అని ఆశ్చర్య పోతున్నాడు యొడోకిమ్ తాత.

'ఓల్గా' యేడుస్తున్నది.

"నోరుముయ్యి! యేడవటానికి సిగ్గులేదూ?.... 'యొడోకిమ్' తాతా, నువ్వింత ముసలివాడి వయ్యావుగాని నీకు బుద్ధిలేదు. అటుప్రక్క నుంచి దాడిసాగిస్తున్నట్టు తెలియటంలేదా?"

ఎవ్వరూ మాట్లాడలేదు. రెండవప్రక్కనుంచి తుపాకులు తీవ్రంగా వినుపిస్తున్నాయి.

"ప్రక్కవీధిలోంచి రావటానికి ప్రయత్నిస్తున్నారు."

"ఆ మ్రోగేది యెవరి మెషిన్‌గన్ అయివుంటుంది?"

"జర్మన్లది....అఁహాఁ ఇప్పుడు మ్రోగేది మనవాళ్ళదే....వినబడటంలేదూ?"

అందరూ ఒకచోట చేరి వింటున్నారు. 'మలాషా' మాత్రం తన స్థలంనుంచి కదలకుండా, అక్కడ జరుగుతున్నవేవీ తనకు సంబంధించినవి కానట్టు కూర్చున్నది.

"ఓ ప్రభూ! ఏం చేస్తావో?" — అని 'యోదోకిమ్' తాత నిట్టూర్చాడు.

"ఏమిటి? నీవూ, నీ ప్రార్థనాను?" — 'గ్రోఖాచ్' అతనివైపు తీవ్రంగా చూస్తూ అన్నాడు.

"అతనికి యిష్టముంటే ప్రార్థన చేసుకుంటాడు. దానికి ఆటంకపర్చటానికి నీ వెవ్వరు?" అని 'చెకోరికా' 'యోదోకిమ్' తాత తరపున పలికింది.

'యోదోకిమ్' తాత తలుపుదగ్గర మోకరిల్లి వణుకుతున్న కంఠంతో ప్రార్థిస్తున్నాడు—

"ఓ ప్రభూ! ఈ ప్రమాదంనుంచి మమ్మ రక్షించు!!"

గ్రోఖాచ్ అది వింటూ భుజాలు యెగువేశాడు. బయట తుపాకి కాల్పులు జోరుగా సాగుతున్నాయి. హఠాత్తుగా ఒక బ్రహ్మాండమైన ప్రేలుడు వినుపించింది.

"ఓ - ఓ - ఓ -" అని 'ఓల్గా' కేకలు పెట్టింది.

బయట యెవరివో మాటలు వినబడసాగినాయి. అంత కంతకూ యెక్కువైనవి. ఎవరో ఒక స్త్రీ అరుస్తున్నది. మరుక్షణంలో తుపాకి మడమలతో తలుపుమీద మోదటం ప్రారంభించారు.

"తలుపుదగ్గర్నుంచి తొలగండి!" అని 'గ్రోఖాచ్' అరిచాడు.

వెనుకకి తగ్గారు. పెద్ద శబ్దంతో తలుపు కొట్టుకొనివచ్చేసింది. ప్రక్కగదిలో తగలబడుతున్న కాంతి లోపలికి వచ్చి అంతా పట్టపగలుగ చేసేసింది. 'మాల్యూచికా' రొప్పుకుంటూ లోపలికి ఉరికింది.

"మనవాళ్ళు వచ్చేశారు. రండి!....నీ పిల్లలు నాదగ్గరే ఉన్నారు. భయపడకు"—అని 'చెకోరికా'తో యేడ్పు, సంతోషము కలిసిన స్వరంతో చెబుతున్నది.

"ఎందు కంత గోల? నెమ్మదిగా పోదాంపదండి" అని గ్రోఖావ్ ఆమెను మందలించాడు.

'మలాషా' యెవ్వరితోను మాట్లాడకుండా బయటికి ఉరికింది. ఒక యెర్రసైనిక యువకుడు గుమ్మంమీద కూర్చొని తన గాయాలకి కట్లు కట్టుకుంటున్నాడు. అతని ప్రక్కనున్న తుపాకి చటాలున అందుకున్నది 'మలాషా'.

"ఆఁ! అది యిటిచ్చెయ్యి-" అంటూ 'మలాషా' దగ్గరి తుపాకి గుంజుకోబోయాడు ఆ యెర్రసైనికుడు. కాని రక్తపుజోతులై మెరుస్తున్న ఆమె కళ్ళు చూడగానే ఆగిపోయాడు.

"పిచ్చిది!"

"ఫరవాలేదు. ఆ తుపాకి తీసుకోనీ....చచ్చిన జర్మన్లవి యింకా దొరుకుతాయిలే...." అన్నాడు 'గ్రోఖావ్' మధ్య కల్పించుకుని.

ఇంటివెనుకనుంచి కేకలు చెలరేగినై.

"తప్పించుకుపోయాడు! జర్మను కమాండరు తప్పించుకుపోతున్నాడు!"

* * * *

కెప్టెన్ కర్ట్ పొగలో ఉక్కిరిబిక్కిరి కాసాగాడు. గది అంతా చీకటిమయంగావుంది. ద్వారాలన్నీ పూర్తిగా బిగించి వేయబడ్డాయి. అందువల్ల తుపాకి కాల్పులవల్ల కలుగుతున్న పొగగదిఅంతా చుట్టివేస్తున్నది.

గాయపడ్డ ఒక జర్మను సైనికుడు పెడబొబ్బలు పెడుతున్నాడు. వాడిముఖంలోకి తుపాకితో కాల్చాలన్నంత కోపం వచ్చింది 'కర్ట్'కి. కాని తన మెషిన్‌గన్‌వి ఒక్క క్షణమైనా వదలటానికి అవకాశంలేదు. గాయపడ్డవారంతా గదినిండా చిందరవందరగా పడివున్నారు. ప్రాణాలతో బయటపడలేదనిమాత్రం 'కర్ట్'కి తెలుసు. ముట్టడికి అవకాశమే లేదనుకుంటున్న సమయంలో యిది జరగటం చాలా ఆశ్చర్యకరంగా ఉన్నది. కేంద్రకార్యాలయం వారికి, ఆహారపదార్థాలు కావాలన్న ఆదుర్దాయేగాని, రక్షణమాట మాత్రం అవసరంలేదు. లేకుంటే రోడ్లు సరిగ్గా కాపలా

కాయించుకోలేరూ ? గెరిల్లాలంటే గడగడ వణుకుతారు. పైగా యెంతో జాగ్రత్తతో ఉన్నట్టు అగుపడుతారు. తీరాచూస్తే తమచుట్టూ యేమి జరుగుతున్నదిగూడా తెలియదు. బోల్షివిక్ల కీలకస్థానా లెక్కడున్నదీ తెలియదు.

కెప్టెన్ కర్ట్ కి యేమీతోచటంలేదు. వచ్చిన వార్తలప్రకారం యుద్ధరంగం యెంతోదూరంలో వుండిఉండాలి. కాని యిప్పుడు హఠాత్తుగా సైనిక కార్యాలయం ముట్టడింప బడ్డది! పోనీ గెరిల్లావళాలాంటే అదీ కాదు .... యెర్రసైన్యమేవచ్చి ముట్టడించింది!!.... వెధవలికి, కేంద్ర కార్యాలయంవాళ్ళకి ధాన్యం కావాలట! ఇక తింటారులే....

గాయపడ్డ సైనికుడు ఇంకా యెక్కువగా గూండ్రిస్తున్నాడు — తుపాకిగుండు సరిగ్గా శరీరంలోంచి దూసుకుపోయింది. ఇక్కడ జరుగుతున్నది పై వారి కెవ్వరికీ తెలియటంలేనేలేదా? శబ్దంతో చెవులు చిల్లుపడి పోతున్నాయి. తల బ్రద్దలై పోయేటట్టున్నది. ఎంతకాలం యీ విధంగా సాగించగలం? టెలీఫోనుతీగలు తెంపబడ్డాయి. ఇతర్ల సహాయం అర్థించటానికి అవకాశమేలేదు. గ్రామంలోని ఇతరచోట్ల తుపాకికాల్పులు తగ్గిపోయినాయి. క్రమేపి, సైనిక కార్యాలయందగ్గర అధికంకాజొచ్చాయి. తన సైన్యమంతా నాశనమైపోయిందనీ, సైనిక కార్యాలయమే యింతవరకైనా నిలిచి పోరాడుతున్నదనీ 'కర్ట్' గ్రహించాడు.

హఠాత్తుగా ఒక బ్రహ్మాండమైన ప్రేలుడు ప్రేలి భూమినంతా దద్దరిల్లజేసింది. ఆ విసురు 'కర్ట్'ని ఒక గోడకు గుద్దేసింది. కేకలు వినుపించాయి. కిటికీ ముక్కముక్కలై పోయింది. చేతిబాంబులు కిటికీ మీదికి వేసినట్టు గ్రహించుకున్నాడు. చుట్టూ మంటలు లేచినాయి. భుజం చాలా బాధపెట్టసాగింది. మాంసపుముద్దలు, తెగిపోయిన కాళ్లు, చేతులు నేలమీద అంతా పడివున్నాయి. లేదు! ఇక నిక్కడ యేమిచేయటానికి వీల్లేదు. ప్రక్కనున్న చిన్నగదిలోకి ఉరికాడు. ఆగదికి ఒకటే కన్నం వేసి ఉంచారు. అక్కడ కొంత నయంగావుంది. ఒక సైనికుడు మెషిన్ గన్ని పేలుస్తున్నాడు. కాని బయటినుంచి వచ్చే తుపాకిగుండ్లుమాత్రం ఆగిపోయినై, అటువైపునుంచి యెర్రసైనికులు తప్పుకున్నట్టున్నారు. 'కర్ట్' తలుపు హఠాత్తుగా తీసి, అటు యెవరైనా ఉండి తుపాకితో కాల్చుతారేమోననైనా లెక్కచేయకుండా మంచులోకి దూకాడు. మంచు మీద ప్రతిఫలించే వెలుగుకి కళ్ళు జిగేలుమన్నాయి. అతని వెనుక,

అడుగులచప్పుడు. కేకలు వినబడసాగినై. యెర్రసైనికులు అప్పుడే సైనిక కార్యాలయంలోకి చేరుకున్నారన్నమాట. కొద్దిదూరంలోవున్న ఇంకొక యింటికి 'కర్ట్' ఉరకబోయాడు.

కాని హఠాత్తుగా 'మలాషా' వచ్చి అతని దారికి అడ్డుపడ్డది. భయంకరమైన రూపంతో, చేతిలో తుపాకి పుచ్చుకుని నిల్చున్నది. నిప్పు కణాల్లాగ ప్రకాసిస్తున్నాయి కళ్లు. ముంగురులు ముఖంమీదికి వాలినై. తనలో కల బలమంతా కేంద్రీకరించుకొని తుపాకియెత్తింది 'మలాషా', 'కర్ట్' తక్షణం తనచేతిలోని పిస్తోలు పేల్చాడు. ఆ గుండు ఆమెకు తాకేలోగా 'మలాషా' యెత్తిన తుపాకి వచ్చి 'కర్ట్' తలను పగుల గొట్టింది. పెద్ద కేకపెట్టి క్రింద పడిపోయాడు. ముక్కు, నుదురు చిత్తు చిత్తు అయిపోయి రక్తం చిమ్ముతున్నది. తన రక్తంలో తానే ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. కండ్లల్లోకి, గొంతుకలోకి పోతున్నది. ఊపిరి పీల్చటానికి అవస్థపడుతున్నాడు.

రెండడుగులు అవతల 'మలాషా' పడివుంది. తుపాకిదెబ్బతో పాటు, 'కర్ట్' తల 'ఫక్కు' మనటంగూడా విన్నది. శరీరంలోంచి దూసుకుపోయిన తుపాకిగుండు ఆమెకు బాధయేమీ కలిగించలేదు. ఎక్కడైతే అవసరమో అక్కడనుంచే దూసుకుపోయిందాగుండు. లేదు! బాధలేదు - సంతోషమే! ఆమె పెదవులమీద చిరునవ్వు చిందులాడింది. గత నెలరోజులుగా ఆవరించివున్న జరాభారమంతా మటుమాయమై పోయింది. నవయౌవనంతో తొణికిసలాడుతూవుండే మునుపటి 'మలాషా' మంచులో పడివున్నది. పిడికిటిలో తుపాకి యింకా వున్నది. ఆమెస్మృతి తెలతెలవారుతున్న ఆ కాంతిలో యెక్కడికో-యెక్కడికో తేలిపోతున్నది.

అనునుకాంతి ఇంద్రధనుస్సును మళ్ళీ మేలుకొల్పింది. దానిఛాయ రాత్రికూడా కనబడుతునే ఉన్నది. ఇప్పుడు సూర్యకాంతి మళ్ళీ దానిలో జీవం పోసింది. వన్నెవన్నెల వెలుగులతో ప్రకాశిస్తున్నది.

'మలాషా' కళ్ళు ఆ కాంతిపుంజంమీద నిలచిపోయినై. రక్తంతో పాటు ఆమె ప్రాణం గూడా ప్రవహించిపోతున్నది. శరీరమంతా బండ బారిపోసాగింది. కాని ఆకాశవీధిలో కనబడుతున్న ఆ రాజబాట - వన్నె వన్నెల ఇంద్రధనుస్సు - చూసుకొని ఆమె మనస్సు తృప్తిగావున్నది. తాను కాంతిమయమైన రాజబాటగుండా, ప్రయాణంచేస్తున్నది. గ్రామంలో

కల్లా అందమైనపిల్ల, సమిష్టి వ్యవహాయక్షేత్రంలో కల్లా చురుకైనపిల్ల, మధురమైన పైరులలో విహరించినపిల్ల వెళ్ళిపోతున్నది........

మంచు, తుఫానులు యిక లేవు. సువాసనలు వెదజల్లే గడ్డి ఆమె పడక. ఎక్కడనో గలగలమంటూ జీవనది ప్రవహిస్తున్నది. బాలబాలికలు కిలకిల నవ్వుకుంటున్నారు....ఇంద్రధనుస్సుకోసం ఆమెకళ్లు వెతికినై. కాని ఇంద్రధనుస్సు లేదు....వసంతకాలం....ఐవన్ పకపక నవ్వుతూ తన కళ్ళల్లోకి చూస్తున్నాడు....అదుగో, అతని ముద్దుగొల్పే నేత్రాలు.... మళ్ళీ ఆ దృశ్యమంతా చీకటిలో మునిగిపోయింది....ఏది ? ఇందాకటి ఆ ఇంద్రధనుస్సు ఏదీ ?.... 'మలాషా' కళ్లు వెతికినాయి ఆ ఇంద్రధనుస్సు కొరకు.... ఆ వన్నెవన్నెల కాంతులతో కండ్లు నింపుకోవాలని....

మోచేతులమీద లేవటానికి ప్రయాసపడ్డది దుర్భరమైన బాధ గర్భంలో కలిగి, నేలమీద పడిపోయింది. చచ్చిపోతున్నానని తెలుసు.... ఇంద్రధనుస్సుని అందుకోటానికి - ఆ రాజబాటను అందుకోటానికి చేతులు చాచింది. చీకటిలో చేతులు తడుములాడుతున్నాయి. ఆమె నీలవుగుడ్లు ఆకాశంలోకి చూస్తూనే ఉన్నాయి. సగం తెరిచివున్న నోటిలోపళ్లు తళతళ మెరుస్తున్నాయి. పెదవులమీది చిరునవ్వు అట్లానే నిలచిపోయింది.

* * *

గ్రామమంతా సందడిగావుంది. స్త్రీలందరూ, మూలమూలలా దాగి ఉన్న జర్మన్లను వెతికి పట్టుకువస్తున్నారు. 'పెర్ఫిలిఖా' దొడ్లోఒకడు పట్టుబడ్డాడు. వాడు తుపాకి ఒకమూల పారేసి, దొడ్డితలుపు తెరిచివుంటే లోపలికి పరుగెత్తుకెళ్ళి గడ్డివాములో ఒకమూల దాక్కున్నాడు. మంచులో పడ్డ వాడి అడుగుజాడతో ఉనికి బయటపడ్డది. 'పెఫ్లీఖా' యెర్ర సైనికుల సహాయంకొరకు కూర్చోలేదు. 'గ్రోఖాచ్' కూతుళ్ళ నిద్దర్నీ సహాయంగా తీసుకుని, పలుగులు, పారలు పుచ్చుకొని గడ్డివాము దగ్గరికి జాగ్రత్తగా వెళ్ళింది.

"ఒరే ! జర్మనువాడా ! బయటికిరా.... 'ఫ్రోస్యా' చూచావా వాడు గడ్డిలో యెట్లా నక్కి కూర్చున్నాడో ? "

"ఉండండి.... నేను పలుగుతో పొడుస్తాను "

"గోడవైపునుంచి వెళ్ళు....లేకుంటే వెధవ కాల్చగలడు "

ఆ జర్మనువాడికి వారి మాటల్లో ఒక్కముక్కయినా అర్థంకావటం లేదు. అయినా. పలుగుతోటి పొడవటానికి ప్రయత్నిస్తున్నారని మాత్రం

గ్రహించాడు. గడ్డివాములోంచి దుడుపురుంటూ బయటపడ్డాడు. చినిగిపోయిన మిలటరీ దుస్తులు శరీరంనుంచి వ్రేళ్ళాడుతున్నాయి. ఎక్కడ సంపాదించాడో — ఒక గౌను తలకు చుట్టుకున్నాడు.

"వహవ్వా! మొగాడు యెట్లాగున్నాడో చూడండి!.... ఒరే, నడువరా....నడువ్...."

జర్మను సైనికుడు గాభరాపడుతూ గబగబ నడిచాడు. గుమ్మం తగిలి క్రిందపడ్డాడు.

"చూడండి!.... యెట్లా పారాడుతున్నాడో!.... 'ఫ్రోస్యా', గడ్డివాము దగ్గరకి వెళ్ళి చూచిరా.... వీడి తుపాకి అక్కడున్నదేమో.... మనకు పనికి వస్తుంది...."

'ఫ్రోస్యా' వెళ్ళి గడ్డివాములో అంతా వెతికింది

"ఇక్కడలేదు....ఇంకెక్కడో పారేసివుంటాడు."

"వీరాగ్రేసరుడు యెట్లాగున్నాడో చూశారా?.... వాడి పాదరక్షలు యెంత అద్భుతంగా వున్నవో చూడండి!" — అన్నది 'పెర్ఫిలిఖా.'

బూట్లకి బదులు వాడుకాళ్ళకు గుడ్డలు చుట్టుకున్నాడు.

"పాపం! కాళ్లు బండబారి పోయినట్టున్నాయి.... అందుకే అలా పారాడుతున్నాడు."

"అవును మరి: వాడిని యిక్కడికెవరు రమ్మన్నారు? వాడి దేశంలో వాడు హాయిగా కూర్చోకపోయాడూ?.... పరాయి దేశాలు తేరగా వున్నాయని వచ్చిపడితే యేమవుతుంది...."

వీధిలోని ప్రజలందరూ వారిచుట్టు చేరారు.

"వీడెక్కడ దొరికాడు?"

"పెర్ఫిలిఖాకి ఒక వింతజంతువు దొరికిందే!"

"సరే-సరే....ఖైదీకి కాపలాకాస్తున్నానని తెలియదూ?....మీమీ యిళ్ళకుపోయి చూసుకోండి ఇట్లా యెంతమంది దాక్కొని ఉన్నారో.... వెళ్ళండి. ఒక్కడుగూడా మిగలకుండా చెయ్యాలి"

"అవును- 'పెర్ఫిలిఖా' మాట వాస్తవం. పదండి పోయి వెతుకుదాము" అన్నాడు కుంటి 'అలెగ్జాండర్'.

అందరూ పలుగులు, పారలు, గొడ్డళ్ళు మొదలైనవి పుచ్చుకుని వచ్చేశారు.

"అందరం కలిసి వెళదాము!"

"ఎంతమందివుంటే అంత సరదాగా వుంటుంది!"

"ఓహ్! జర్మను వాడిని తొక్కేస్తానేమోనని 'లెన్కా' భయ పడుతున్నది...."

"అలా అనుకుంటున్నారా? అవసరమైతే నోరెత్తకుండా అణిగి చచ్చేటట్టు తొక్కేస్తాను. నాకు భయమనుకుంటున్నారేం?"

"సరె-సరె, మాటలకంటే పనియెక్కువ చెయ్యాలి మనం — పదండి" అంటూ అలెగ్జాండర్ అందరినీ హెచ్చరించాడు.

అందరూ కలిసి యింటింటికి బయలుదేరారు. ప్రతి దొడ్డి, గడ్డి వాము, గొడ్లశాల వెతుకుతున్నారు. పిల్లలు కేరింతలు పెడుతూ తిరుగుతున్నారు. 'సాషా' రొప్పుకుంటూ వచ్చి అన్నాడు- "మా దొడ్లో ఒక జర్మనువాడు దాక్కొని వున్నాడు."

ఒకరిని తోసుకుంటూ, ఒకరు 'సాషా' యింటివైపు పరుగెత్తారు. భయంతో నిలువునా వణికిపోతున్న ఒక జర్మనువాడిని బయటికి లాక్కొచ్చారు. జర్మన్లకోసం అంతా వెతుకుతున్న యెర్రసైనికులు, ఆ స్త్రీలను చూచి మందహాసం చేశారు. కాని గ్రామం నలుమూలలు బాగా తెలిసిన ఆ స్త్రీలు యెర్రసైనికులకంటేగూడా యెక్కువమంది ఖైదీలను పట్టుకున్నారు.

"మీ రెక్కువమంది ఖైదీలను పట్టుకున్నారా, మేమా?" అని స్త్రీలు యెర్రసైనికుల్ని గర్వంతో అడిగారు.

"మీరే యెక్కువమందిని పట్టుకున్నారు"- అని యెర్రసైనికులు స్త్రీల ఉత్సాహంచూచి నవ్వారు.

"జర్మను కెప్టెన్ యేడీ? వాడు పారిపోయి వుండడే...." అని 'ఫెలాప్' అడిగాడు.

చచ్చి పడిఉన్న జర్మన్లనందర్నీ పరిశీలించారు. సాధారణ సైనికులుతప్ప కెప్టెన్ కనబడలేదు.

"కెప్టెన్ యెక్కడున్నదీ కనుక్కోవాలి!"

కాని కెప్టెన్ 'కర్ట్' ధాన్యపుకొట్టు వెనుక పడివున్నాడు. తల పగిలింది. ఒక కన్ను చిదిగిపోయింది. రెండవకన్ను అనంతాకాశంలోకి చూస్తున్నది. తలలో బాధ దుస్సహంగా గొడ్డళ్లపెట్టి మోదినట్టుగావుంది. రక్తం ధారలుకట్టి ప్రవహిస్తున్నది. చిదిగినకన్ను భగ్గున మండుతున్నది. గొంతుకలోకి రక్తం జారుతున్నది. ఎడతెరిపిలేకుండా ప్రవహిస్తున్న ఆ

రక్తం గుటకలు మింగుతూ ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. మళ్ళీ మళ్ళీ గుటకలు మింగుతున్నాడు. అలా మింగకపోతే ఆ ప్రవహించే రక్తంలో మునిగిపోతా ననిపిస్తుంది. గొంతు నొప్పిపెడుతున్నది. ఇక మింగలేక పోతున్నాడు. ఒళ్ళంతా నొప్పితో చుట్టివేసేస్తున్నది. తన నెవరైనా చూచి సహాయం చేయకపోతే అలానే. మంచులో బిందబారిపోయి చచ్చి పోవటం తప్పదనుకున్నాడు. భయంతో శరీరం వణికిపోయింది. ఎవరు రక్షిస్తారు తనని ? ఎవరున్నారు ? తాను నానాయాతనలు పెట్టిన ఈ ప్రజలు ? త్వరగా ప్రాణాలు పోకపోతే, ఈ రైతు స్త్రీల గడ్డపారలకు గురికావలసి వస్తుందేమో ! బోల్షివిక్‌ల చేతుల్లో పడవలసివస్తుందేమో ! ! అంతా నిశ్శబ్దం - తుపాకిమోతలులేవు. అతడు మోసపోలేదు. తన సైన్యం నాశనమైపోయింది. విరోధులు గెలిచారు. హృదయంలో యేదో పోటు పొడిచినట్టు బాధ పెట్టింది. తాను - తాను - కెప్టెన్ 'కర్ట్' —ఇంత అవమానకరంగా ఓడింపబడ్డాడు ! - ఎలా జరిగింది ?....

తన ప్రశ్నకు జవాబు అడుగుతున్నట్టు, మిగిలిన ఒక్క కన్నుతోను వినీల ఆకాశంలోకి చూడసాగాడు. భూమ్యాకాశాలను కలుపుతూ, బ్రహ్మాండమైన అర్ధచంద్రాకారంలో వన్నెవన్నెల ఇంద్రధనుస్సు ప్రకాశిస్తున్నది. చెదిరిపోతున్న 'కర్ట్' మనస్సుకి ఆ ఇంద్రధనుస్సు యింతకు ముందుచూచినట్టు గుర్తొచ్చింది. అవును ; గాలి దుమారం వచ్చేముందు దానిని చూచాడు. అప్పుడా రైతు స్త్రీ యేమన్నది ?.... ఇంద్రధనుస్సు శుభశకునమట....

'కర్ట్' పెద్దగా మూల్గాడు. ఇంద్రధనుస్సు అతనినిచూచినవ్వింది. శుభశకునమే కాని తనకు గాదు. ఇంద్రధనుస్సు ఆహ్లాదకరంగా ప్రకాశిస్తున్నది. కాని అతనిదృష్టి కగుపడటంలేదు - అంతా చీకటి....



196

# 10

చనిపోయిన వారినందర్నీ 'చర్చి' దగ్గర సమాధిచేశారు. ఇంత కాలమూ మంచులో దొర్లాడిన శవాలకుగూడా ఆనాడు సమాధి చేయబడే అదృష్టం కలిగింది.

తనకొడుకు శవాన్ని తేవటానికి 'ఫెదోసియా' సహాయంచేసింది. బండబారి, శిలలాగ మారిపోయిఉన్న 'వాస్యా' ముఖంలోకి చూస్తూ, అతనిజుత్తు నిమిరింది. 'వాస్యా' సమాధిలేకుండా యింతకాలం ఉన్నా నష్టం లేదనుకున్నది. తక్కిన యెర్రసైనిక సోదరులతోపాటు, యెర్ర సైనికులచేతిలో సమాధి చేయబడే భాగ్యం కలుగుతున్నది.

నది వొడ్డునుంచి బండిలో తీసుకువస్తుంటే కొడుకు శవం మళ్ళీ మంచులో పడిపోతుందేమోనన్న భయంతో జాగ్రత్తగా బండి ప్రక్కనే నడుచుకుంటూ వచ్చింది. తన కొడుకుతోపాటు ఇంతకాలమూ మంచులో పడివున్న పరాయివాళ్ళ శవాలను గూడా మాతృప్రేమతో నెమ్మదిగా అమర్చింది.

"ఈ కన్యగూడా సైనికయోధుడిలాగ విరోధులతో పోరాడుతూ ప్రాణాలువిడిచింది. కాబట్టి సైనికులతోపాటే సమాధిచేద్దాము." అన్నాడు 'షెలావ్,' 'మలాషా' శవాన్నుద్దేశించి.

"కన్యకాదు. వివాహితురాలే - భర్త యెర్రసైనికుడు." అన్నది 'మాల్యూచికా' మంచులోపడివున్న 'మలాషా' వివాహానికి పూర్వం యేవిధంగానైతే యౌవనంతో తొణికిసలాడుతూవుండేదో అదేవిధంగా వున్నది.

"చాలా అందమైనది -" అని ఒక యెర్రసైనికుడు విచారంతో అన్నాడు.

అవును. గ్రామంలోకల్లా అందమైన పిల్ల 'మలాషా' ఆమె పెద్ద కనురెప్పలు బుగ్గలమీద నీడలను కల్పిస్తున్నాయి. పొడుగైనకేశాలు

ముఖం చుట్టు అలల్లాగ అమరినాయి. విశాలమైన నుదుటిమీద తీర్చి దిద్ది నట్టున్నాయి కనుబొమలు. పెదవులమీద చిరునవ్వు చిందులాడుతున్నది.

నెలరోజులబట్టి ఉరికంబంనుంచి వ్రేళ్ళాడుతున్న 'లివాన్యుక్' శవాన్ని క్రిందికిదించారు. అప్పటికే ప్రసవవేదన పడుతున్న అతని తల్లి, అందరూ వద్దంటున్నాగూడా వినకుండా వారితో కలిసి పనిచేయసాగింది. బండబారిపోయి నెలరోజులపాటు గాలిలో వ్రేళ్ళాడిన తనకొడుకు శవాన్ని మృదువుగా చేతుల్లోకి తీసుకున్నది.

"జాగ్రత్త....జాగ్రత్తగా దించండి"—తన కొడుకు శవానికి యెక్కడ దెబ్బ తగులుతుందోనని భయపడుతున్నట్టు అన్నది.

ఒక పెద్ద సమాధితోడి అందరినీ - 'సిర్యోషా' 'నెక్‌డ్యుక్.' 'మలాషా' - మొదలైన వీరుల నందర్నీ అందులో వరుసగా ఉంచారు. వారంతా గాఢనిద్రలో ఉన్నట్టు కనుపిస్తున్నాయా శవాలన్నీ. 'షెలావ్' ఆ వీరులను స్మరిస్తూ ఉద్రేకంతో మాట్లాడాడు. అతని గంభీరవాక్కులు ఆ ప్రదేశమంతా ప్రతిధ్వనిస్తూ, ఇంద్రధనుస్సులో కలిసిపోతున్నాయి.

గ్రామస్థులందరు - స్త్రీలు, పిల్లలు, ముసలివాళ్లు - సమాధిచుట్టు నిలబడి చనిపోయిన యెర్రసైనికులను, వారితోపాటున్న 'మలాషా' ను చూస్తూ వింటున్నారు. ఎవ్వరూ విలపించటంలేదు. విచార వదనాలతో తలమీది టోపీలు తీశారు. 'ఫెడోసియా' తన ఒక్కగాను ఒక్క కొడుకును భూదేవి కర్పిస్తున్నది. ముసలి 'షారిఖా' తన ముద్దుబిడ్డ 'మలాషా' ను మాతృభూమి కౌగిట్లోకి పంపుతున్నది. ఇతరులు అనేక మందికూడా వున్నారు. కాని వారందరికిగూడా తమ పుత్రులను, భర్తలను సోదరులను సమాధిచేస్తున్నట్టుగా ఉన్నది.

ఆనాడు, అక్కడ సమాధిఅవుతున్న వీరులకంటె ప్రియతమమైన వారు, సన్నిహితులు, వేరెవ్వరూలేరు వారికి. వారు యెర్రసైన్యానికి - తమ సైన్యానికి - చెందినవారు!

"దేశమాత ఈ వీరుల నెప్పటికీ మరువదు!" అని 'షెలావ్' ఉద్రేకంతో అన్నాడు.

అవును! దేశమాతే కాదు, దేశస్థులుగూడా ఆ త్యాగమూర్తులను యెప్పటికీ మరువలేరు. వారిని సమాధిచేసిన ఆ దినంకూడా వారి స్మృతి పథంలో యెన్నటికీ నిలిచివుంటుంది. మొదటినాడు గ్రామాన్ని రక్షిస్తూ

ప్రాణాలు విడిచిన వారిని. నేడు గ్రామాన్ని విముక్తిచేస్తూ చనిపోయిన వారిని ఆ సమాధి యేకంచేస్తున్నది.

గ్రామస్థుల ముఖాలలో గంభీరఛాయలు కనుపిస్తున్నాయి. ఇది యుద్ధం. రక్తపాతంతోను, అగ్నితోను గ్రామానికి తన ముద్రవేసింది. కాని యెట్టి భయంకర పరిస్థితులలోగూడా సన్నగిల్లని ప్రజల నమ్మకము, ధైర్యము అచంచలములు. తమ సమయం రాకతప్పదని నమ్మారు. తమకు విజయం కలిగి తీరుతుందని నమ్మారు....

'షెలావ్' పిడికెడు మట్టితీసి గోతిలోవేశాడు. అతనితోపాటు అందరూ తమ దోసిళ్ళతో తమ ఆత్మబంధువులైన ఆ వీరులమీద, మట్టి వేశారు.

"నువ్వుకూడా వెయ్యితల్లీ!" అని ఒక తల్లి తనబిడ్డతో అన్నది. ఆ పిల్ల తన చిట్టిచేతులతో యింతమట్టితీసి ఆ యోధులమీద వేసింది. తర్వాత యెర్రసైనికులు పారలతో మట్టి నింపేశారు, గోతినిండా. చివరికి ఆ యోధులు తమ స్వతంత్ర మాతృదేశంలో సమాధి అవుతున్నారుగదా అని అందరూ సంతృప్తిపడ్డారు.

"ఈ స్థలంలో పూలతోట వేద్దాము" అన్నది 'మాల్యూచికా'

అందరూ ఆనందంతో ఒప్పుకున్నారు.

నెమ్మదిగా యెవరిత్రోవను వారు పోసాగారు. వారి ముఖాలలో విచారంలేదు. విజయచ్ఛాయలు ద్యోతకమవుతున్నాయి. ఆ చనిపోయినవారు తమ మాతృదేశంకోసం ప్రాణాలు అర్పించారు. ఈ విధంగా చరిత్రలో యెన్నోసార్లు, ఈ భూమిమీద పుట్టి పెరిగినవారు, ఈ భూమిని రక్షించటానికి తమ ప్రాణాలను బలిచేయవలసి వచ్చింది. అది సర్వసాధారణమైన విషయమే!

కొద్దిసేపట్లో గ్రామమంతా కోలాహలంగా కళకళలాడసాగింది, స్త్రీలందరు యెర్రసైనికులకు అతిధి సత్కారము చేయాలని పట్టుపట్టారు. వారిని ఆహ్వానించి విందులు జరుప నిశ్చయించుకున్నారు.

గ్రామం తరఫున కొందరు ప్రతినిధులు 'షలావ్' దగ్గరికి వెళ్ళారు.

"కామ్రేడ్, 'షెలావ్' మా దొక మనవి. మా అతిథులైన మీకు విందుచేయాలని మా కందరికీ కుతూహలంగావుంది. కాని ఆహార పదార్థాలు....

షెలావ్ నవ్వాడు.

"ఐతే నేనేం చేసేది ?"

"మొత్తంమీద ఆహారపదార్థాలు వున్నాయి. కాని కొంతసహాయం అవసరం. జర్మన్లు ఈ ప్రాంతాలకు వస్తారనగానే అన్నీ భూమిలో పాతి పెట్టి దాచేశాము. మీరు కొద్దిగా సహాయం యిప్పిస్తే అన్నీ త్రవ్వు కుంటాము.

"సరే; సహాయం చేస్తాము .... ఎవరు వెళ్తారయ్యా సహాయం చెయ్యటానికి" అని 'షెలావ్' తన సైనికులను అడిగాడు.

అనేకమంది ముందుకి వచ్చారు. స్త్రీలు వారిని చాతీవరకు దిగబడే మంచులో పొలాల్లోకి తోడుకు వెళ్ళారు.

"ఇదుగో యీ పొదదగ్గర !"

"అబ్బే, కాదు .... అదుగో, అక్కడమ్మా !"

"చాల్లే, మహాతెలిసినట్టు చెబుతున్నావు. ఇక్కడేగా పాతింది—

ఈ విధంగా అందరూ సందడి పడుతున్నారు. 'అలెగ్జాండర్' ఆనందానికి మేరలేకుండావుంది.

"ఇవ్వాళ గొఱ్ఱెనుకోసి వండుదాము" అన్నాడు యెర్రసైనికులతో

"మరి నీ దగ్గర ఉన్నదే ఒకటిగా ?"

"అవును ఒకటే....ఇంతకుముందు చాలా వుండేవి. కాని జర్మన్లు అన్నింటిని తినేశారు. ఇదొక్కటే మిగిలింది."

"మిగిలిన ఆ ఒక్కగొఱ్ఱెనూ మేము తినేస్తేయెట్లా ? అలా యెప్ప టికీ జరుగదు.

"మీ రట్లాఅంటే నా మనసుకి కష్టంగా వుంటుంది. ఏ మాత్రం ఆటంక పెట్టబోకండి .... ఇంతకంటే యే మివ్వగలను ?.... నా మనస్సు కష్టపెట్టకండి" అని అలెగ్జాండర్ ప్రాధేయపడసాగాడు.

స్త్రీలు భూమిలోదాచిన ఆహారపదార్థాలన్నీ త్రవ్వి పైకితీశారు. ఆవులు యింకా మిగిలివున్నవారు గాయపడ్డ సైనికులకోసం గబగబ పాలు పితకనారంభించారు.

గాయాలు తగిలినవారిని గ్రామ సోవియటు కార్యాలయంలోని రెండు గదులలో ఉంచారు. ప్రథమ చికిత్స నేర్చుకున్న 'ఫ్రోస్యా' అంద రికీ కట్లుకడుతూ ఊపిరాడకుండా పనిచేస్తున్నది. తక్కిన యువతులందరు కిటికీల దగ్గర నిలబడి అది చూస్తూ ఈర్ష్యపడుతున్నారు.

"ఏం కావాలిమీకు ?" అని నవ్వుతూ ఒక డాక్టరు ఆ యువతులను అడిగాడు. రాత్రి సైనిక కార్యాలయంమీద జరిగిన పోరాటంలో పాల్గొన్నాడీ డాక్టరు. ఇప్పుడు గాయపడ్డ వారికి వైద్యం చేస్తున్నాడు.

"మీకు హాస్పటల్‌లో సహాయం చేద్దామని వచ్చాము"

"సహాయం అక్కరలేదు. అవసరంపడ్డ యిద్దరు యువతుల్ని తీసుకున్నాము. కట్లు కట్టటానికి మా స్వంత మనుషులే వున్నారు."

"పోనీ,....ఇల్లంతా చెత్తగావుంది....తుడవమంటారా ?"—అని ఒక యువతి అడిగింది.

"నిజమే....శుభ్రం చేయండి"

ఒక్కక్షణంలో ఆ యువతులందరూ పాతగుడ్డలు పుచ్చుకుని పరుగెత్తుకువచ్చారు.

"ఏమిటి ! ఇంతమందా, యిల్లు తుడవటానికి ?"

గాయపడ్డవారు లేచిపోతారన్న భయంతో గుసగుస లాడుకుంటూ పేచీలు పడ్డారు. చివరికి నేలను భాగాలుగా పంచుకుని, యెవరిభాగం వారు తుడుచుకొనసాగారు.

"అదుగో, వాళ్ళకు కప్పిన దుప్పట్లు తొలిగిపోతున్నాయి. కనబడటంలేదూ ?" అని గాయపడ్డవారికి కప్పిన దుప్పట్లు జారిపోతుంటే చూచి 'ప్సిచికా' 'ఫ్రోస్యా'ను కసరుకున్నది.

"జారిపోతున్నవని చూస్తూ కేక లేసేబదులు తిరిగి కప్పరాదూ ?" అన్నది 'ఫ్రోస్యా', గాయాలు కడిగిననీళ్ళు బయట పారబోయటానికి వెళుతూ.

'ప్సిచికా' వెళ్ళి జారిపోతున్న దుప్పట్లను తిరిగి జాగ్రత్తగా కప్పి అక్కడే ఖండిపోయింది.

"అక్కడేంచేస్తున్నావు ?"—అన్నాడు డాక్టరామెను గమనించి.

"దుప్పట్లు మాటిమాటికిజారిపోతున్నాయి. తిరిగి కప్పుతున్నాను" అంటూ వెళ్ళి యింకొక సైనికుడి తలక్రింద తలగడ సర్దుతున్నది.

"సరే, నీకంత సర్దాగావుంటె చెయ్యి. ఎవరొద్దనగలరు"—

నిజంగానే ఆమెకు చాలా సర్దాగావుంది. ఆమెకేకాదు. అందరు యువతులకీ అట్లానేవుంది. గాయపడ్డ యెర్రసైనికులను పరిచర్యలు చేయటానికి అందరూ ఉత్సాహపడుతున్నారు.

గ్రోఖాచ్ కూతురు 'లిడా' మునివ్రేళ్ళమీద నడుచుకుంటూ నిశ్శబ్దంగా లోపలికి వచ్చింది.

"ఏమిటి? నువ్వుగూడా సహాయం చేయటానికేనా"? అని డాక్టర్ అడిగాడు.

కాదన్నట్లు ఆమె తల ఊపింది.

"ఉఁహుఁ.... ఒక స్త్రీ ప్రసవవేదనపడుతున్నది.... మీరు డాక్టర్లు.... కొద్దిగా రాగలిగితే...." అన్నది నెమ్మదిగా.

"కాని...." డాక్టర్ దేనికో సందేహిస్తున్నాడు.

"ఫరవాలేదు రండి. చాలా ప్రమాదస్థితిలోవుంది. పొద్దుట చచ్చిన జర్మన్లను ఈడ్చివేయటానికి సహాయంచేసింది.... అప్పటినుంచి నొప్పులు మొదలైనాయి...."

"సరే, వస్తాను - ఒక నూతన పౌరుడు పుట్టబోతున్నాడు. నేను సహాయం చేయటానికి వెళ్ళాలి. ఇంతలో మీరు చూచుకుంటూఉండండి" అని అక్కడివారికి చెప్పి 'లిడా' వెంట బయలుదేరాడు.

'లిడా' అతనిని గబగబా 'లివాన్స్యక్' యింటికి తీసుకుపోతున్నది. డాక్టరు చేతికి తొడుక్కోటానికి యేమీలేక చలికి, ఒకదానికొకటివేసి రుద్దు కుంటున్నాడు.

"ఇలాంటి చలిలో మీరు చేతులకి 'గ్లోవ్'లు తొడుక్కోవలసింది"

"గ్లోవ్‌లు వుండేవి. కాని రాత్రి పోరాటంలో యెక్కడో జారిపోయినాయి"

'లిడా' అతనివైపు సిగ్గుతో ఒక చూపుచూచి తనచేతులకున్న గ్లోవ్‌లు లాగేసి అతని కివ్వబోయింది.

"వద్దు, వద్దు.... మరి నీకో?" - అన్నాడు డాక్టర్.

"నాకు వేరే ఒకజత వుంది. జాగ్రత్తగా దాచి ఉంచుకున్నాను, జర్మన్ల కండ్లబడకుండా. అయినా మీరు డాక్టర్లు.... చేతుల విషయం చాలా శ్రద్ధగావుండాలి...."

ఆమె పెదవులు కంపించడం డాక్టర్‌కి కనుపించింది. కండ్లల్లో నీళ్లు తిరగటమే తరువాయి.

"సరే, నువ్వంత పట్టుబడితే తప్పక తీసుకుంటాను" అని నవ్వాడు.

'లివాన్యుక్' యింటి నడవలో స్త్రీలందరు గుమిగూడారు. డాక్టర్‌నిచూచి ప్రక్కకు తొలిగారు. అప్పుడే అతడు అందరికీ పరిచయమై పోయాడు.

"అప్పుడే కన్నది -" అన్నది ఒకామె.

"ఐతే యికనేనెందుకూ ?"

"అలాకాదు. ఆమె నొకసారి చూడాలి. చాలా అవస్థపడ్డది. బహు నీరసంగా వుందికూడాను"

"అత్తయ్యా. నీకోసం డాక్టర్‌ని తీసుకొచ్చాను" అని 'లిడా' బాలెంతరాలికి తెలియజేసింది.

"ఈ మాత్రం దానికి డాక్టర్‌గార్నెందుకు తీసుకొచ్చావ్ ?....పోనీ బిడ్డను చూస్తారేమో చూడనివ్వు...."

డాక్టర్ ఉయ్యాలదగ్గరికి వెళ్ళిచూచాడు.

"మగబిడ్డేనా ?"

"అవును, కొడుకే....ఒక్కతే కూతురునాకు....తక్కిన వారంతా మగపిల్లలే...."

"అందంగా వున్నాడు....యేం పేరు పెడతావు ?"

"ఆ విషయమే ఇందాక అనుకుంటున్నాము. వాడిఅన్న 'మిట్యా' పేరుపెట్టాలని వుందినాకు. కాని వాడిపేరు పెడితే వాడిలాగే వీడుగూడా దురదృష్టవంతుడౌతాడేమో నంటున్నారు వాళ్ళంతా...."

"వీళ్ళ అన్న యేడీ ?"

"జర్మన్లు ఉరితీసేశారుకాదూ....నెలరోజులబట్టి ఉరికంబంనుంచి వ్రేళ్ళాడుతునే వున్నాడు. ప్రొద్దుటేకదూ, సమాధిచేసింది." అని డాక్టర్‌కి అంతా తెలియజేసింది.

డాక్టర్ ముఖంలో విచారం కనబడుతున్నది.

"అలానా ? ఆపిల్లవాడు నీకొడుకేనని యింతవరకు తెలియదు."

"అవును ! నాకొడుకే....ఇంకా పదహారేళ్ళయినా నిండలేదు. గెరిల్లాదళంలో చేరటానికి వెళుతుంటే జర్మన్లు పట్టుకుని ఉరితీసేశారు.... వాడిపేరే ఇప్పుడు పుట్టినవాడికి పెడదామని వుంది. కాని వీళ్ళందరూ ఆ పేరొద్దంటున్నారు...."

"మనకు విజయం కలిగిననాడు పుట్టాడుకదూ .... అందుకని 'విజయుడు' అని పిలిస్తే బాగుంటుంది." అన్నాడు డాక్టర్.

"విజయుడు!....బాగానేవుంది....ఏమంటావు 'లిడా'?"

"డాక్టర్‌గారు పెట్టినపేరు చాలాబాగుంది."

"ఇంకా సందేహమేమిటి ... అదే బాగుంది. డాక్టర్‌గారు, కూర్చోండి."

"ధన్యవాదాలు. కాని కూర్చోటానికి సమయంకాదు. దెబ్బలు తిన్నవారిని చూడటానికి పోవాలి."

"ఉహుం....అలా వెల్లకాదు. గాయపడ్డవారి కందరికీ కట్లు కట్టే శారుగా....కూర్చోండి. అందరూ యెర్రసైనికులకు ఆతిథ్యం ఇస్తున్నారు. కాని నేను యీ అవస్థలో వుండిపోయాను....'లిడా'! ఆ బీరువాలో 'ఓడ్కా' వుంది. డాక్టరుగారికి తెచ్చియివ్వు...."

"అబ్బే, యెందుకూ అనవసరంగా...."

"వైద్యంచేయటం తెలిస్తే తెలియవచ్చు మీకు. కాని మా స్త్రీల హృదయాలసంగతి తెలియదు....మీరు పుచ్చుకోకపోతే నా హృదయం చాలా బాధపడుతుంది."

డాక్టర్ మారుమాటాడలేకపోయాడు. 'లిడా' గ్లాసునిండా ఓడ్కా పోసి యిచ్చింది.

"నీకొడుకు అదృష్టవంతుడవుతాడు. ఇవ్వాళటిలాగానే జీవితంలో యెల్లప్పుడూ విజయాలు పొందాలని దీవిస్తున్నాను...." అని దీవిస్తూ డాక్టర్ 'ఓడ్కా' పుచ్చుకున్నాడు.

డాక్టరు చాలా అలసిపోయి వున్నాడు. ఎన్నోరోజులనుంచి నిద్ర లేదు. 'ఓడ్కా' పుచ్చుకునే టప్పటికి హాయిమనిపించింది. కుర్చీమీద అలా కూర్చునివుంటే యుద్ధరంగానికి యెంతోదూరంలో తన యింట్లో కూర్చుని వున్నట్టనిపించింది. 'లిడా' అతనివైపుచూచి మందహాసం చేస్తున్నది. ఈ యుద్ధం ప్రారంభమయినది మొదలు తాను అనుభవిస్తూ వచ్చిన కష్టాలన్నీ వట్టి కల అనిపించింది.

"లిడా, ఆ ఫొటో తీసుకురా....డాక్టర్‌గారు చూస్తారు"

మాసిపోయిన ఆ ఫొటో పుచ్చుకుని డాక్టర్ చూడసాగాడు. చిరునవ్వు నవ్వుతూ అమాయికంగా కనిపిస్తున్నది ఒక బాలుని ముఖం.

"నిన్న ఉరికంబంనుంచి వ్రేళ్ళాడుతున్నప్పుడు చూచినట్టయితే, యేమీ పోలికవుండదు. కాని బ్రతికున్నప్పుడు యిలానే వుండేవాడు...." అని ఆమె డాక్టర్‌గారికి నెమ్మదిగా చెప్పసాగింది.

ఆమెను చూస్తుంటే డాక్టర్‌కి తన తల్లి జ్ఞాపకానికి వచ్చింది. తల్లిని విడిచివస్తున్నప్పుడు విచారంతో ఆమెచూచినచూపు గుర్తుకొచ్చింది. గాయపడ్డవారిని, ఆ రక్తపాతాన్నిచూచి అనేకరాత్రులు అతనిహృదయం పడ్డబాధ మళ్ళీ గుర్తుకొస్తున్నది. ఇంతవరకూ అతని హృదయంయొక్క ఆ బలహీనత పోలేదు. పైగా రోజురోజుకి యెక్కువవుతున్నది.

పసిబిడ్డ ప్రక్కన పడుకున్న 'లివాన్యుక్' తల్లిని చూచాడు. ఆమె ముఖం యెంతో ప్రశాంతంగావుంది. నెలరోజులపాటు కొడుకు ఉరికంబంనుంచి గాలిదుమారంలో వ్రేళ్ళాడుతుంటే చూస్తూ గడిపింది. నెలరోజులు తన బిడ్డలతోపాటు తిండికిలేక మలమల మాడిపోతూ గడిపింది. నిండు చూలాలై కూడా తనకొడుకుని ఉరికంబంనుంచిదింపి సమాధి వరకు మోసుకువచ్చింది. ఇప్పుడు యింటికివచ్చి దుర్భర ప్రసవవేదనపడి బిడ్డనుకన్నది. అయినా అవన్నీ జరగనట్టే, తనతో ప్రశాంతంగా మాట్లాడుతూ, జర్మన్ల కండ్లబడకుండా అతి జాగ్రత్తగా దాచుకున్న ఆ కొద్ది 'ఓడ్కా'ను తాగమని బలవంతం చేస్తున్నది.

పొరుగునవున్న స్త్రీ లందరు వచ్చి డాక్టర్‌చుట్టూ కూర్చున్నారు. వారినందరినీ క్రీగంట చూచాడు. వాళ్ళందరు జర్మను నరకంలో నివసించారు. వారి భర్తలు, పుత్రులు యుద్ధరంగంలోఉన్నారు. కాని వాళ్లు బ్రతికున్నారో, లేదో తెలియదు. ఆ స్త్రీలకు. జర్మన్లు తెచ్చిన కరువుని, గాలిదుమారాన్ని అనుభవించారు. జర్మన్లు తుపాకి మడమలతో పొడిచిన గాయాలు ఇంకా అనేకమందికి మాననేలేదు. ఇవన్నీ యెరుగున్నవారికి తప్ప, యితరుల కెవ్వరికీ వారి ముఖాలలో ఆ ఛాయలేమీ అగుపడవు. వారిముఖాల్లో ప్రశాంతము, హృదయకుహరాల్లోంచి ప్రవహిస్తున్న గాంభీర్యము ద్యోతకమవుతున్నవి।

'రైతుస్త్రీలు!' అనుకున్నాడు, తనలో తాను. ఆ మాటల్లో యేదో కొత్తఅర్థం స్ఫురించింది.

"ఓడ్కా ఇంకా వుంటే 'లివాన్యుక్' జ్ఞాపకార్థం అందరమూ తాగుదుము"—అన్నది 'లివాన్యుక్' తల్లి ప్రశాంతంగా.

"అవసరంలేదు. అది లేకపోయినా 'లివాన్యుక్'ని మేము యెల్లప్పుడూ జ్ఞాపకం పెట్టుకునేవుంటాము....అవునా, కాదా?" అని తక్కిన స్త్రీలవైపు చూచింది 'పెర్ఫిలిఖా.'

"అవును—తప్పక గుర్తుంటాడు, అందరికీ"

"ఇప్పుడు అతని స్థానాన్ని 'విజయుడు' తీసుకుంటాడు. వాళ్ళ అన్నలాగే పెరిగి పెద్దవాడై అవసరమైతే మాతృభూమికి ప్రాణాలను గూడా అర్పిస్తాడు!"

ఓడ్కా డాక్టర్ మనస్సుని మత్తుతో నింపేసింది. ఆ స్త్రీలతో స్నేహభావంతో, ఆత్మీయతతో యేదో మాట్లాడాలనిపించింది. ఉరికంబం మీద నశించిపోయిన ఆ బాలుని, అతనిని ఉరికంబంనుంచి దించి తెచ్చి సమాధిచేసిన ఆ తల్లిని తలుచుకుంటుంటే అతని హృదయం కృంగిపోతున్నది.

'మత్తులోవున్నావు' అని తనని తాను సంబోధించుకున్నాడు. కాని అతని కండ్లల్లో నీళ్లు తిరగక తప్పలేదు.

"ఏమిటి, అలా వున్నారు?" అని ఆదుర్దాతో అడిగింది 'లిడా'

"మనస్సు ఖేదపడుతున్నది."—తన్ను తాను సంబాళించుకోటానికి ప్రయత్నిస్తూ నసిగాడు

'లివాన్యుక్' తల్లి అతని వైపు తన ప్రకాశవంతమైన కండ్లతో చూచింది.

"ఖేదపడవలసిన అవసరంలేదు. విచారించవలసిన సమయం కాదిది. 'లివాన్యుక్' పోయాడని విచారించటానికి బదులు, విజయుడు పుట్టాడని సంతోషపడవలసిన సమయం. మనప్రజలు బలంగా ఈమాతృభూమిలో నాటుకుపోయివున్నారు. ఒక చెట్టు నరికితే యింకొక మొక్క అదేసమయంలో మర్నాడు లేస్తుంది.... 'లివాన్యుక్,' ఇంకా యెందరో నసించిపోయారు. కాని మన మాతృభూమి యిక్కడేవుంది. మనప్రజలూ యిక్కడే వుంటారు. మన సైనికులు వచ్చేలోగా ఒక్కరైనా మిగలకుండా మమ్మల్నందర్నీ జర్మన్లు హతమార్చేస్తారని అనేకసార్లు అనుకున్నాము మేము. కాని మిమ్మల్ని చూడటానికి యింకా బ్రతికివున్నాము మేము....ప్రజలు ఎన్నయినా భరించగలరు....ప్రజాశక్తికి ఎదురులేదు.... జర్మన్లు తమ తలకు మించినపనికి ప్రయత్నించారు—"

డాక్టర్ కండ్లముందునుంచి తెర తొలిగిపోయింది. అతని మనస్సుని చీకాకుపరుస్తూ బాధపెట్టిన సమస్యలకు ఆ రైతుస్త్రీలు యెంతో సులభంగా, వారికి సహజమైన పద్ధతిలో సమాధానమిచ్చారు! తనను చూచుకుంటే తనకే సిగ్గువేసింది.

" అవును—మీ రన్నది ముమ్మాటికీ నిజం! "

" నువ్వింకా చాలా చిన్నవాడివి. కష్టాలు పడి యెరుగవు. అందు వల్లనే నీకు అట్లా అనుపిస్తుంది. కొంతకాలాని కిదంతాపోతుంది. అప్పుడు యెటువంటి మనఃక్లేశమూ లేకుండా రక్తపాతం చూడగలుగుతావు. మనస్సు యేమాత్రమూ బాధపడకుండా క్షతగాత్రులకు వైద్యం చేయ గలుగుతావు...."

ఈ మాటలు వింటుండేటప్పటికి హాస్పటల్‌లో గాయపడి వున్న వారిసంగతి స్పృహకొచ్చింది. చటాలున లేచి బయలుదేరాడు.

గ్రామమంతా ఆనందగీతాలతో ప్రతిధ్వనిస్తున్నది. చలికిగూడా లెక్కచేయకుండా యువతులు పాటలు పాడుతూ తిరుగుతున్నారు. యువ కులు తమ గొంతులెత్తి ఆ పాటలకు సృతికలుపుతున్నారు. చీకటికోణంలో పడిఉన్న యీ నెలరోజులవిలువ ఆ నాడు తీసుకుంటున్నారా అనిపిస్తుంది.

సంగీతంలో ఓలలాడటం గ్రామస్థులకు అనాదినుంచి పరిపాటి. గానంతో పగలు నాహ్వానించి, గానంతో సాగనంపేవారు. పొలాలు దున్న టానికి, విత్తునాటటానికి, కోతలు కొయ్యటానికి గానం తోడ్పడేది. పిల్లలు పాటలతో గొడ్లను కాస్తుంటారు. వివాహ సమయంలో గానం - చావు తోడుకపోవటానికి గానం! యుగయుగాలనాటి పాతపాటలు - నవ యుగపు కొత్తపాటలు వారిజీవితాలలో అనేకం. జీవితంతో పాటలు, - పాటలతో జీవితం పెనవేసుకు పోయున్నాయి....

నెలరోజులు మూగవారై వున్నారు. ఈ నెలరోజులు ఒక గీతమైనా వారి పెదవులుదాటి రాలేదు. ఇండ్లు, వీధులు, అన్నీ మూగనోముపట్టినవి!

కాని యిప్పుడు మళ్ళీ పాడుకునే అవకాశం కలిగింది. తమ మనస్సులను చూరగొన్న జానపదాలను గొంతెత్తి ఆకాశమంతా ప్రతి ధ్వనించేటట్లు పాడుతున్నారు బాలికలు, పాటతర్వాతపాట - ఎటుచూచినా పాటలే ప్రతిధ్వనిస్తున్నాయి.

కుంటి అలెగ్జాండర్ 'గ్రామసోవియట్', బోర్డును తగిలిస్తున్నాడు. పిల్లలంతా సంతోషంతో చుట్టుచేరి తలలెత్తి చూస్తున్నారు. యుద్ధచిహ్నా లైనవన్నీ తొలగించివేస్తున్నారు. జర్మన్లు గోడలకువేసిన కన్నాలన్నీ పూడ్చేస్తున్నారు. ఇసుకబస్తాలు బయటపారేశారు. స్త్రీ లందరుచేరి నేల మీదపున్న జర్మన్ల రక్తం శుభ్రంగా తుడిచివేయసాగారు.

"ఏమీ వుండకూడదు. సాయంత్రంకల్లా వాళ్ళచిహ్నమైన దేదీలేకుండా చెయ్యాలి" అని ఒక స్త్రీ అన్నది. అందరూ సమ్మతించి తలలూపారు.

గ్రామస్థులందరూ దానినే ఆశిస్తున్నారు చీకటితో కూడుకున్న జర్మన్లయొక్క ఆ ముప్పై రోజుల పరిపాలనకు సంబంధించిన చిహ్నమేదీ మర్నాటికి లేకుండా చేయాలని వారికుతూహలం. ఎవరో వెళ్ళి 'చర్చి' దగ్గిర ఉరికంబాన్ని కూలద్రోశారు. జర్మన్లు నివసించి అసహ్యంచేసిన ఇండ్లకన్నింటికీ అప్పుడే సున్నంవేసేస్తున్నారు. పంటల నూర్పుకాలంలో వున్నంత సందడిగా వున్నారందరు.

"ఏమీ వుండకూడదు. వాళ్ళకు సంబంధించిన దేమీవుండకూడదు" అంటూ స్త్రీలు పనిచేస్తున్నారు.

"వాళ్ళకు సంబంధించింది యేమీ ఉండకూడదు!" అని మారు పలుకుతూ పిల్లలు పూర్వపు సైనిక కార్యాలయంచుట్టూ తిరిగి జర్మన్ల గుడ్డ పేలికలు, ఖాళీ తోటాలు మొదలైనవి ఏరితీసి పారేస్తున్నారు

ఎర్ర సైనికులు ఛాతీవరకు ఉన్న మంచులో దిగి టెలీఫోను తీగలు వేశారు. 'షెలాప్' టెలీఫోనులో యితరప్రాంతాలతో సంబంధం కలిగించుకుంటున్నాడు. స్కూలు భవనంలో జర్మను ఖైదీల విచారణ సాగుతున్నది. ఆ విచారణలో పాల్గొనాలని గ్రామస్థులకెంతో కుతూహలంగావుంది. కాని అది సైన్యానికి సంబంధించిన విషయమని తెలుసుకొని జోక్యం కలిగించుకోలేదు.

"ఇంకా ఆ వెధవల్ని ప్రశ్నలు వేయటంకూడా దేనికి? వరుసగా నిలబెట్టి కాల్చేయక-" అని 'పెర్పిలిఖా' గొణిగింది.

"నీకు తెలియదు ఊరుకో .... ఆ వెధవలదగ్గర్నుంచి తెలుసుకోగలిగిదంతా తెలుసుకోవాలా లేదా?"

"ఐతే ముందు తెలుసుకొని ఆ తర్వాతనైనా ఆ పని చెయ్యాలి"

"ఏమిటీ! యుద్ధఖైదీలను చంపటమా? ఎక్కడైనావుందీ ఆ మాట".

'పెర్పిలిఖా' త్రోకతొక్కిన త్రాచల్లే లేచింది.

"యుద్ధ ఖైదీలేమిటి? యుద్ధ ఖైదీలట! మనవాళ్ళను ఖైదీలుగా పట్టుకున్నప్పుడు వాళ్లేంచేశారో మరిచి పోయావా? నాకు వదిల్తే బ్రతికుండగానే చర్మంవొలుస్తాను. సలసలకాగే నీళ్ళల్లోవేసి ఉడకబెడతాను....

కాని మనం అలాంటి పాతకపు పన్లు చేయము. మర్యాదస్తులం కాబట్టి వాళ్ళనుగూడా మర్యాదగా చూస్తాము....అంతే...."

"వాళ్ళేమీచేసినా మనకది అనవసరం. యుద్ధనిబంధనలప్రకారం యుద్ధఖైదీలను చంపరాదు...." అని 'పెల్‌చారికా' అన్నది.

"యుద్ధ నిబంధనలట! నీవూ, నీ యుద్ధనిబంధనలూబాగున్నాయి! ఈ రోజుల్లో యెక్కడ పాటిస్తున్నారో చెప్పు? పూర్వం ఎప్పుడో వుండి వుండవచ్చు. కాని యిప్పుడు కాదు. పిల్లల్నీ, స్త్రీలను చంపటమేనా యుద్ధ నిబంధనలంటే?"

'పెల్‌చారికా' దీర్ఘంగా నిట్టూర్చింది.

"నువ్వు నాకు చెప్పాలా? నా విషయంలో యేమిచేశారో నీ వెరుగున్నదేగా...."

"అందుకే నేను నీ మాటలు విని ఆశ్చర్య పడుతున్నాను. యుద్ధం చేసేవాళ్ళకి యుద్ధనిబంధనలు పాటిస్తాయి. కాని ఈ వెధవలు చేసేదికూడా యుద్ధమేనా? వర్థిల్లి బందిపోటు ముండాకొడుకులు...."

'పెల్‌చారికా' జవాబు చెప్పలేదు. అందరి విధంగానే ఆమె హృదయంలోగూడా ద్వేషం ప్రబలివున్నది. కాని జర్మన్లు చేసినట్టే తాము కూడా చేయటం సిగ్గుచేటని తలుస్తున్నది.

"మూర్ఖోచ్చబెట్టి బాగా మేపండి! దుక్కల్లాగ బలిపించి యుద్ధమై పోగానే చెక్కు చెదరకుండా యిండ్లకు పంపించండి...." అని 'పెర్ఫి లిఖా' కోపం పట్టలేక గొణిగింది.

"ఆ సంగతులన్నీ మనకెందుకు?....ఎవరు చూచుకోవాలో వాళ్ళు చూచుకుంటారు. మధ్య మనకెందుకు—" అన్నాడు స్త్రీల కీచులాటలో కల్పించుకొని, 'అలెగ్జాండర్'

"నేనుమాత్రం యేమన్నాను గనుక...."

"ఏమీ అనకుండావుంటే చాలు"—అని కుంటుకుంటూ 'అలెగ్జాం డర్' వెళ్ళిపోయాడు. స్కూలుబోర్డుతగిలించటానికి, పూర్వం ఉన్నంత అందంగా వుండకపోవచ్చు యీబోర్డు. కాని జర్మన్ల పరిపాలన చిహ్నా లేమీ లేకుండా చేయటానికి అదికూడా ఒక ముఖ్యావసరం.

కిలకిలమంటూ మహదానందంగా వున్న ఆ వాతావరణంలో హఠాత్తుగా యేదో ప్రేలుడుశబ్దం వినవచ్చింది. గానం ఆగిపోయింది. వీధుల్లో ఆడుకుంటున్న పిల్లలు రాళ్ళయి నిలచిపోయారు.

"ఏమిటది ?"

చెవులు చిల్లులుపడిపోయే శబ్దం మళ్ళీ వినుపించింది.

"ఫిరంగి కాల్పులు!"

"'ఓల్గా' గ్రామంలో...."

"జలిన్‌ట్సీ గ్రామంలో...."

"మన ఫిరంగులమోతేనా ?"

అందరూ జాగ్రత్తగా వినసాగారు ఫిరంగిశబ్దాలు మారుమ్రోగుతున్నాయి. కొంతసేపటివరకు యెవ్వరూ నోరు మెదపలేదు.

"మళ్ళీ యేమిటిది ?"

"పోరాటం సాగుతున్నది...."

"మన తుపాకులే వినబడుతున్నాయి. మన తుపాకులే...."

"తుపాకులగురించిన ఈ నేర్పు నీ కెప్పుడు అబ్బింది ?"

"మన సైన్యం యెక్కడైయితే వుందో అటునుంచేకదా తుపాకులు వినుపిస్తున్నాయి...."

గ్రామస్థులు యెర్రసైనికుల ముఖాలకేసి చూచారు. అవి ప్రశాంతంగా వున్నాయి. అందులో ఒక సైనికు డన్నాడు "అవును; మన తుపాకులే. ఇక మన యుద్ధరంగాన్ని విస్తరించాలి."

"ఏమిటి ?"

"ఈ ప్రాంతంలో మేము జర్మన్లను హతమార్చాము. కాని తక్కిన ప్రాంతా లెన్నిట్లోనో యింకా వున్నారు. వాళ్ళ నందర్ని నలువైపులనుంచి తరిమికొట్టాలి."

"నేను మొదట్లోనే చెప్పలేదూ .... అన్ని వైపులనుంచి తరుముకొస్తున్నారని ?"

"నువ్వు అలాంటిదేమీ చెప్పనేలేదుగా, అత్తయ్యా"

"నేను చెప్పలేదూ ? నువ్వు వినకపోతే చెప్పనట్టేనా ? జర్మన్లను నలువైపులనుంచి తరుముకొస్తున్నారని అప్పుడే చెప్పాను...."

"ఇకచూడండి జర్మన్లు ఏవిధంగా పలాయనమంత్రం పఠిస్తారో!"

"ఇటునుంచే పారిపోతారా ? - 'ఓల్గా' ముఖకళవళికలు అప్పుడే మారిపోయినై.

"వస్తే యేం ? రానివ్వు .... ఇక్కడమనం పని పట్టొచ్చు" — నడుంమీద దర్జాగా చేతులు వేసుకుని నిలబడి 'ఫెర్పొలిఖా' అన్నది.

"పారిపోయేవారు యెట్లానూ పారిపోతున్నారు. ఇదేదారిని పారి పోవాలా? ఇంకా మనను పట్టుకు పీడించాలా?"

"ఇంతకూవాళ్లు బ్రతికి యిటువచ్చినప్పటి మాటగద...."

అందరూ చెవులు నిక్కపొడుచుకొని వింటున్నారు. ఫిరంగులు గాలిలో ప్రతిధ్వనిస్తున్నాయి. జర్మన్ల నాశనంకొరకు యుద్ధరంగం విస్తరించుకు పోతున్నది.

'షెలావ్' స్కూలుభవనంలో జర్మను ఖైదీలను ప్రశ్నలు వేస్తున్నాడు. ఆ వెచ్చని గదిలోకూడా జర్మన్లు భయంతో వణికిపోతున్నారు. చిక్కిపోయి, చినిగిపోయిన దుస్తులతో, శరీరమంతా దుర్గంధ పూరితమైన దెబ్బలతో ఉన్నారు. వంటినిండా చీడపేన్ల కుడుతుంటే 'షెలావ్' మీదినుంచి దృష్టి మరల్చకుండా గోక్కుంటున్నారు. కెప్టెన్ 'కర్ట్' సైన్యంలోనివారు అయిదుగురు మాత్రం బ్రతికున్నారు.

"మనతోపాటు యుద్ధరంగంలో వీళ్ళెందుకు? వెనక్కి పంపించేద్దాము" అని 'షెలావ్' నిశ్చయించాడు.

"వెనక్కి పంపటమా! ఇక్కడే కాల్చి పారెయ్యక...." అన్నాడు ఒక యెర్రసైనికుడు.

"చాల్లే, ఊరుకో!"

"వీళ్ళతోపాటు సైనికుల్ని కాపలా పంపటంగూడా అనవసరం. మన ప్రజలకు అప్పజెప్పితే వాళ్లే తరుముకు వెళతారు...."

"పోయి సార్జెంటుని పిలుచుకురా!" అని అక్కడితో ఆ సంభాషణకు అడ్డువేశాడు 'షెలావ్'.

స్వచ్ఛమైన గాలి పీల్చుకోటానికి నడవలోకి వెళ్ళాడు. పూర్తిగా ఒక గంటసేపు ఖైదీలతో ఆ గదిలో ఉన్నాడు. తన శరీరంనిండాకూడా చీడపేళ్ళు ప్రాకుతున్నట్లు గుడ్డలన్నీ ఛండాలపు వాసన కొడుతున్నట్టూ అనిపించింది.

తనివిదీరా స్వచ్ఛమైన గాలి పీల్చుకున్నాడు. సూర్యుడు బంగారు ఛాయతో ప్రకాశిస్తున్నాడు. గ్రామమంతా గానంతో ప్రతిధ్వనిస్తున్నది. ప్రశాంతమైన అడవిలోవీచేగాలి నాదంలాగ, కొండకోనల్లో ప్రవహించే జీవనది గలగలలాగ హృదయానికి హాయిగొల్పుతున్నదా గానం. గ్రామ ప్రజల హృదయాల్లో తొణికిసలాడుతున్న ఆనందం ఆ గానంలో ప్రతిధ్వనిస్తున్నది.

ఎర్రసైనికులు కాపలాతో జర్మనుఖైదీలను బయటికితీసుకువచ్చారు. నెమ్మదిగా వారిచుట్టూ జనంచేరారు. స్త్రీలు వారివైపు చూచే చూపులకు భయపడిపోతూ వణికి పోసాగారు. ముఖాలు నేలకు వంచుకున్నారు.

"తీసుకు పోతున్నారా వాళ్ళను ?" అని 'పెర్ఫిలిఖా' తీవ్రంగా అడిగింది.

"మన కేంద్ర సైనిక కార్యాలయానికి పంపించేస్తున్నాను." అని 'షెలావ్' బదులు చెప్పాడు.

"ఇదుగో! వీడే 'లివాన్యుక్' ని ఉరితీసింది" అని 'పెల్ చారికా' ఉద్రేకంతో అన్నది.

స్త్రీలందరు ముందుకి ఉరికారు.

"ఏడీ ? యేడీవాడు ?"

"అదుగో ఆ యెర్రజుత్తువాడు. పొడుగ్గా వాడూను గుర్తుకిరావటం లేదూ ?"—అని 'పెల్ చారికా' మళ్ళీ అరిచింది.

"అవును—వాడే!"

జర్మను ఖైదీలను యింకా దగ్గరగా చుట్టవేశారు ఆ స్త్రీలు. ఎర్ర జుత్తు జర్మను ఖైదీ భయంతో తక్కిన ఖైదీల వెనక్కి చేరాడు.

"చూడండి! ఎట్లా దాక్కుంటున్నాడో ? కామ్రేడ్ షెలావ్, వీడే ఆ బాలుడిని ఉరితీసింది."

కాపలా సైనికులు యేమీ తోచక చూస్తున్నారు.

"ఏంచేస్తున్నారమ్మా మీరు! .... ఆగండి! వెనక్కి తగ్గండి" అని 'షెలావ్' కోపంతో ఒక కేకవేశాడు.

"కామ్రేడ్ కమాండర్! వాడు ప్రాణాలతో యిక్కడ్నుంచి వెళ్ళిపోవటం చూచి మేము భరించలేము. వాడిపని యిక్కడే మేము పూర్తిచేసెయ్యాలి" అని 'పెర్ఫిలిఖా' యింకా తన పట్టుదల వీడటం లేదు.

ఎర్రజుత్తు జర్మనువాడు యిదంతా గ్రహించి గాబోలు వడవడ వణికిపోతున్నాడు.

"ఇక్కడ ఆజ్ఞాపించవలసినవాడిని నేను కాని నువ్వుకాదు." అని 'షెలావ్' గంభీరంగా పలికాడు.

'ఫెదోసియా' అందరి మధ్యనుంచి త్రోసుకొని వచ్చింది. గుంపు వైపు తిరిగి తీవ్రంగా అన్నది.

"మీరు అనవసరమైన వాటిలో జోక్యం కలుగుజేసుకోటం మాను తారాలేదా? అందరినీ తెగనరకటమేనా మీరు కోరేది? ఇప్పటికి చచ్చిన వాళ్లు చాలరూ? మీకంటే తెలివిగలవాళ్లు లేరనేనా మీ ఉద్దేశం?"

'పెర్పిలిఖా' కొంచెం వెనక్కితగ్గి 'ఫెదోసియా' వైపు తీక్షణంగా చూడసాగింది.

"వాడిని చంపెయ్యాలనేనా మీ ఉద్దేశం? మనను పెట్టిన హింసలకు, వాడికి రెండు నిముషాల్లో ప్రాణంపోయే అదృష్టం కలిగిద్దామనేనా మీ రనటం? లేదు - లేదు! అలా యెన్నటికీ జరిగటానికి వీల్లేదు. వాడు యింకా బ్రతికేవుండాలి. మనకు, మన దేశానికి వాడు పెట్టిన హింసలకు వాడిదేశంగతి యేమవుతుందో వాడి కండ్లారా చూడాలి. వారుచేసిన ప్రతి నీచకార్యానికి వాళ్ళదేశం యేమి ప్రతిఫలం అనుభవిస్తుందో చూచితీరాలి!"

"ఫెదోసియా చెప్పింది నిజం!" అన్నది 'షెల్‌చారికా.'

"ముమ్మాటికీ నిజం! అలానే జరగాలి" అని తక్కినవారి కంఠాయి మారుమ్రోగాయి.

"నే నొకమాట చెబుతాను విను 'పెర్పిలిఖా'. ఇప్పుడు చచ్చిపోయిన జర్మన్లు యెంతయినా అదృష్టవంతులు. ఈ నాడు ప్రాణాలతో దాటిపోతున్న ఆ జర్మనువాడు తమ సైన్యం పూర్తిగా ఓడిపోయి, తిండికి మలమలమాడుతూ పారిపోతుంటే చూస్తాడు. ఎక్కడబడితే అక్కడ గ్రామస్థులు తమ సైనికులను చంపటానికి గొడ్డళ్ళతోను, గునపాలతోను, మీదికి ఉరుకుతుంటే కళ్ళారాచూస్తాడు. చివరికి గుక్కెడు మంచి నీళ్ళయినా యిచ్చేవారు లేకుండా వాళ్ళసైనికులు చస్తుంటే చూస్తాడు. వారి గ్రామాలు, వారి పట్టణాలు మనవాటిలాగానే కూలిపోతుంటే చూచి అనుభవించనివ్వండి. అలాంటికష్టాలు తెచ్చిపెట్టినందుకు వాడి భార్య, వాడి పిల్లలు వాడికి శాపనార్థాలు పెట్టనివ్వండి. అలాకాకుండా సులభమైన చావును బహూకరిద్దామనుకుంటున్నారా? నువ్వు ముసలిదాని వైనప్పటికీ ఆలోచనలేదు, 'పెర్పిలిఖా'. చావు చాలా సులభం. కాని వాడు బ్రతికివుండాలి - వంద సంవత్సరాలు బ్రతికివుండాలి! చివరికి చావు ప్రసాదించమని వాడు వేడుకునేటట్టు చేయాలి. కాని మృత్యువుగూడా వాడిని అంటటానికి భయపడి పారిపోయేటట్టు చెయ్యాలి!...."

'ఫెదోసియా' గుక్క తిప్పుకోలేక ఆగింది. హృదయంమీద చెయ్యివేసి అదుముకున్నది.

"ఫెదోసియా చెప్పింది అద్భుతంగావుంది' అంటూ స్త్రీలందరు ప్రక్కకు తొలిగిపోయారు.

ఇద్దరు యెర్రసైనికులు ఖైదీలను తీసుకుపోసాగారు. 'పెర్ఫిలిఖా' చేష్టలుడిగి వారు పోతుంటే చూస్తున్నది.

"హ - ఎంతో మహా చేసేసేవాళ్ళలాగ లేచారు. ఇంతేనా...." అని చేతులు తిప్పుకుంటూ చీదరించుకున్నది.

"ఫెదోసియా ఇంతసేపూ చెప్పింది అర్థంకాలేదూ ?"

"నిజంగానే 'ఫెదోసియా' మాటలు నాకు అర్థంకాలేదు. ఆ జర్మను మృగాన్ని చేతులారా చంపితేగాని నాకు తృప్తికలుగదు -" అంటూ కొద్దిసేపు జాగ్రత్తగావిని మళ్ళా ఇట్లాఅన్నది - "ఫిరంగిమోతలు ఆగిపోయి నట్టున్నాయి వినండి"

అందరూ శ్రద్ధగావిన్నారు.

"అవును - ఆగిపోయినై ఈ గలభాలో మనందాన్ని గమనించనే లేదు."

"ఏం జరిగుంటుందో ? పోరాటం ఆగిపోయినట్టా, లేక యింకే మైనా జరిగుంటుందా ? ఎవరినడిగితే తెలుస్తుంది ?"

"మన కమాండర్‌కి తప్పకుండా తెలుస్తుంది"

ఈ విధంగా తుపాకులు హఠాత్తుగా ఆగిపోవటంచూచి షెలావ్ కూడా గాభరాపడుతున్నాడు. మాటిమాటికి టెలీఫోనుదగ్గరికివచ్చి చూస్తు న్నాడు. టెలిఫోనుదగ్గర ఒకసైనికుడు రిసీవరు పుచ్చుకుని కూర్చున్నాడు.

"మళ్ళీ పిలిచిచూడు - జవాబురావటంలేదా ?"

"లేదు !"

"తీగ లెక్కడైనా తెగిపోయినవేమో .... ఎవరినన్నా తీగలవెంట వెళ్ళమను. ఈ లోగా నువ్వు జాగ్రత్తగా ప్రయత్నిస్తుండు"

చివరికి టెలిఫోను పలికింది. యెర్రసైనికుడు కాగితంమీద గబగబ యేదో గీకాడు.

"ఏం జరిగింది ?"

"మనవాళ్ళు 'ఓఖెబి' 'జలన్‌ట్సీ' గ్రామాలు పట్టుకున్నారట !"

షెలావ్ బయటికివెళ్ళాడు. 'పెర్ఫిలిఖా' మొదటగా కనుపించింది ఆమెతో అన్నాడు -

"ఓఖెబి, జలన్‌ట్సీ గ్రామాలు మన వశమైనాయి"

ఆమె సంతోషం పట్టలేకపోయింది.

"అందుకేనా తుపాకికాల్పులు ఆగిపోయినై."

"అందుకే -"

'పెర్పిలిఖా' 'నటల్కాను' కలుసుకోటానికి ఆనందంతో వీధి వెంట పరుగెత్తింది.

"నటల్కా! విన్నావా? ఓఖెటి. జలన్ట్సీ మన వశమై పోయినాయి! కామ్రేడ్ షెలాప్ నాకు స్వయంగా చెప్పారు .... టెలిఫోను రావటంతోటే బయటికివచ్చి నాతో చెప్పారు...."

"మనవశమై పోయినవన్నమాట!"

"మొట్టమొదటే చెప్పలేదూ నేను? తుపాకికాల్పులు యెప్పుడైతే ఆగిపోయినయో అప్పుడే మన వశమై పోయినవన్నమాట"

"ఏమో? యెవరుగెలుస్తారో యెట్లా చెప్పగలంముందు?"

"తెలియకేం? చుట్టూ ముట్టడించాక జర్మన్లు ఇంకేం చెయ్యగలరు? ఎప్పుడైతే ముట్టడింపబడ్డారో అప్పుడేవాళ్ళపని అయిపోయిందన్నమాట"-

"సైనిక వ్యవహారాలు బాగా తెలుసుసుమా, నీకు!"

టెలిఫోను ఒకటే మ్రోగటం మ్రోగుతున్నది. షెలాప్ రిసీవరు పుచ్చుకుని - "ఎక్కడికి? యే దిశకు?" - అని గట్టిగా అడుగుతున్నాడు.

గ్రామంలోని ప్రజలందరు నిముషంలో అక్కడికి చేరుకున్నారు. ఎర్రసైనికులందరు అప్పుడే తయారవుతున్నారు.

"ఎక్కడికి బయలుదేరుతున్నారు? ఎక్కడికి?" - అని స్త్రీలందరు ఆశ్చర్యంతో అడిగారు.

"ఆజ్ఞలు వచ్చినై. వెళ్ళిపోతున్నాము"

"ఎక్కడికి?"

"పడమటికి"

స్త్రీలందరు నిరుత్సాహపడి పోయారు. ఆ విధంగా జరుగుతుందని కలలోనైనా అనుకోలేదు. 'ఫెడోసియా' వారి దగ్గరికి వచ్చి అన్నది:

"ఇదేమిటి? విందుకోసం వంటలన్నీ తయారుచేసి ఉంచాము. అదీగాక యింతవరకు మీరు భోజనాలైనా చేయలేదు...."

"పరవాలేదమ్మా. ఇప్పుడు మాకేమీ ఆకలిగాలేదు. ముందుకి పొమ్మని ఆజ్ఞలువచ్చినై. వెళ్ళిపోకతప్పదు. మరొక సైనికభాగం మీరక్షణకోసం వస్తున్నది. మీరు వండినవి వాళ్ళు తింటారులెండి...."

"అయ్యో. ఇంకొక్క రోజైనా ఉండకపోతిరే!" అని ఒక స్త్రీ నిట్టూర్పువిడిచింది.

"పరవాలేదు. మీరుచూపించినదయకు ధన్యవాదా లర్పిస్తున్నాము. మళ్ళీ మా వెనకవచ్చేవారు మీ రక్షణకోసం యిక్కడేవుంటారు. మేము మాత్రం వెళ్ళిపోక తప్పదు....జర్మన్లను తరిమెయ్యాలి."

"ఆ మాటనిజమేలేండి" - అని స్త్రీలు నిట్టూర్చారు. ఎర్రసైనికులు బారులు తీర్చుకొని నిలుస్తుంటే గ్రామస్థులందరూ వారిని సాగనంపటానికి చేరుకున్నారు. కొందరు కండ్లనీళ్ళు పెట్టుకుంటున్నారు.

షెలావ్ గబగబా బయటికి వచ్చాడు. ఎర్రసైనికులందరూ బారులు తీర్చి సిద్ధంగా నిల్చున్నారు.

"పదండి - ముందుకి"

"ఇకమేము వుంటాము సురక్షితంగా తిరిగిరండి. జర్మన్లను ఒక్కడుగూడా లేకుండా తరిమివెయ్యండి" అని గ్రామస్థులు కేకలువేశారు.

ఎర్రసైనికులు ముందుకి సాగిపోతున్నారు. పిల్లలందరు వారి ప్రక్కనే పరుగెత్తుతున్నారు. స్త్రీలందరూ వారిని సాగనంపటానికి వెళుతున్నారు.

ఎర్రసైనికులు ప్రజలతోపాటు నెమ్మదిగా నడుచుకుంటూ గంటస్తంభంవరకు వచ్చి ఆగారు.

ఎటుచూచినా మంచుతోనిండిపోయివున్న బయలు ముందు కనిపిస్తున్నది. జర్మన్లు తగులబెట్టిన 'లివనెవ్కా' గ్రామందగ్గర నెమ్మదిగా పొగలులేస్తూ కనబడుతున్నవి.

గంటస్తంభం దగ్గరినుంచి 'షెలావ్' ఒకసారి పడమటిదిశకు చూచాడు. జర్మన్ల పాదాలక్రింద నలిగిపోతున్న ఉక్రేనియన్ బయళ్లు - తెల్లనిమంచుతొ కప్పబడివున్న విశాలమైన బయళ్లు - కనబడుతున్నాయి. జర్మన్ల యినుపబూట్లక్రింద నలిగిపోయి, రక్తసిక్తమయి, మారణహోమంలో మండిపోతూ సంకెళ్ళలో ఉండికూడా యెదురులేని శక్తితో, అంతులేని ధైర్యంతో పోరాడుతున్నది 'ఉక్రేనియను' దేశం?

తర్వాత ఆకాశంలోకి చూచాడు. వన్నెవన్నెల ఇంద్రధనుస్సు భూమ్యాకాశాలను కలుపుతూ, తూర్పునుంచి పడమటికి విస్తరిస్తూ జ్వాజ్వల్యమానంగా ప్రకాశిస్తున్నది.

షెలావ్ తన సైనికులవైపు తిరిగాడు.

"పదండి ముందుకి ! - పదండి !"

సైనికులు క్రమబద్ధమైన అడుగలతో ముందుకి పోతున్నారు. గ్రామస్థులు వెనుక దిగబడిపోయారు. ఎవ్వరూ మాట్లాడలేదు. ఇంద్ర ధనుస్సు వెలుగుతో, మంచుబయళ్ళలో సాగిపోతున్నారు.

దూరంలో కాలిపోతున్న 'లివనెవ్‌కా' గ్రామానికి, జర్మన్ల మొరటు పాదాలక్రింద క్రుంగిపోతున్న తదితర గ్రామాలవైపుకి వెళ్ళిపోతున్నారు. జర్మన్ల భయంకర పాలనలో ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి అయిపోతూగూడా లొంగక పోరాడుతున్న 'ఉక్రేనియన్' భూతలంమీద సాగిపోతున్నారు.

గ్రామస్థులు మౌనముద్రితులయ్యారు. ఎర్రసైన్యం ఆ అనంతమైన మంచుబయళ్ళలో, ఇంద్రధనుస్సు తోరణంకింద చూపుమేర దూరం పోయే వరకు, కండ్లు నొప్పులుపెట్టి నీళ్లు వచ్చేటంతవరకు అలానేచూస్తూ విలబడి పోయారు.



|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA1O4B162 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 219 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |